శ్రీమతంగముని విరచిత

# బృహద్దేశీ

(అను ప్రాచీన సంగీతశాస్త్రగ్రంథము)

ప్రతిపదార్థ, తాత్పర్య సహితము

Sri Matangamuni virachita

# BRIHADDESI

(Ancient Musical Treatise With Word For Word Translation and Paraphrase)

సంగీత కళాప్రపూర్ణ, గాంధర్వవిద్యావాచస్పతి, గానకళాధర,
గాంధర్వవిద్యాభూషణ, సంగీత లక్ష్యలక్షణకోవిద

**ఆచార్య ద్వారం భావనారాయణరావు**

Sangita Kalaprapurna, Gandharva Vidya Vachaspati,
Ganakaladhara, Gandharva Vidyabhushana,
Sangita Lakshya Lakshana Kovida

**Prof Dwaram Bhavanarayana Rao**

ప్రథమముద్రణ : 1000 ప్రతులు
2001, వృషనామ సంవత్సరము




మూల్యము : రూ. 300
US $ 30

ప్రతులకు :

1. శ్రీమతి ద్వారం వెంకట వరదమ్మాభావనారాయణ రావు,
ఫ్లాట్ నెం. 17, గజిటెడ్ ఆఫీసర్స్ కాలనీ,
ఇసుకతోట విశాఖపట్నం - 530022
Tel : 0891- 543465

2. శ్రీ నేమాని వెంకటరమణ
'శ్రీనిలయం', 16/9, మునిరెడ్డి కాలనీ
శ్రీపద్మావతి నగర్, తిరుపతి (వెస్ట్) - 517502
Tel : 08574- 42627 & 41079




ప్రకాశకులు :

శ్రీ ద్వారం పబ్లికేషన్స్, విశాఖపట్నం

ముద్రణ :

శ్రీ లక్ష్మీ గణపతి బైండింగ్ వర్క్స్,
Main Road, KOVVUR - 534350,
Phone . 08813-31575, Fax : 08813-32354




ఈ గ్రంథము శ్రీతిరుమల తిరుపతి దేవస్థానముల వారి
ఆర్థిక సహాయముతో ప్రచురింపబడినది



సద్గురు పూజ్యశ్రీ శివానందమూర్తి గారికి
వినమ్రతాపూర్వక ప్రణామాలు



Sangita Kalanidhi, Padmasri, Sangita Ratnakara, Kalaprapurna

**Prof. Dwaram Venkataswamy Naidu Garu**

**&**

**Smt. Dwaram Jaggayyamma Garu**

**నాదరూప దైవసమానులైన మా నాన్నగారికి**

**ప్రేమైకమూర్తి మా అమ్మకు నిరంతర ప్రణామాలు**



గ్రంథకర్త శ్రీ ద్వారం భావనారాయణరావు గారు
వారి శ్రీమతి ద్వారం వెంకట వరదమ్మ

# FOREWORD

In my Foreword to Prof. Dwaram Bhava Narayana Rao's Telugu translation of the Chaturdandi Prakasika of Venkatamakhi I wrote " the translation bears testimony not only to Prof. Rao's knowledge of music but also to his understanding of the Sanskrit, language considering the fact that Venkatamakhi's style is terse and scientific. The world of music must be grateful to him for his salfless service and should benefit by his painstaking research ".

Prof. Rao's Telugu Chaturdandi Prakasika was published in June this year but the noble soul departed for his heavenly abode the very next month It is, therefore, with a heavy heart that I am writing this Foreword to his Telugu translation of the Brihaddesi of Matanga. Prof, Rao appears to have translated into Telugu several other Sanskrit treatises without even the members of his family knowing the magnificent service he was rendering to the art of music. This, again, was another characteristic trait of Prof. Rao's nature.

The Natya Sastra of Bharata and the Brihaddesi of Matanga are two major works available from the ancient period. Of these, the Brihaddesi is a work dealing solely with the theory of music. It is an authoritative work which highlights many aspects of music omitted by Bharata although the Brihaddesi is considered to be a successor to the Natya Sastra.

Matanga has tried to follow Bharata in many respects and himself claims to have thrown light on ragas and allied aspects of music. The term 'raga' has been mentioned for the first time in this work. He refers only to two gramas viz. Shadja and Madhyama gramas. But he gives much importance to the raga which, he says, centres on sweet distilled sound dressed in appropriate svaras and embellishments. The oft-quoted sloka "Yosau dhvani viseshastu" is from the Brihaddesi .

It was perhaps the Almight's will that such treatises should be translated into Telugu by Prof. Rao before he shed his mortal coil. Although he is no longer with us, the translation has been made available to the music world which should benefit by it with a sense of gratitude to its author.

*Sangita Kala Acharya*
T. S. PARTHASARATHY
Fellow, Sangeet Natak Academi
& Emeritus Fellow,
Department of Culture, Government of India

వాచస్పతి, పండితరాజ, సాహిత్యవిశారద
డా॥ ఎస్.సి. నరసింహాచార్య, ఎమ్.ఎ. (బి.ఓ.ఎల్.)
భారతరాష్ట్రపతి అవార్డుగ్రహీత
9, టి.టి.డి జూనియర్ ఆఫీసర్స్‌క్వార్టర్స్
తిరుపతి - 517501

శ్రీః

# సంస్తవము

చతుష్షష్టి కళలలో ఉత్తమోత్తమమై, దేవనరతిర్యగ్జడములకు స్పందనానందము కలిగించేది సంగీతకళ. నాదము పరబ్రహ్మస్వరూపము. నాదము రెండుతెరగులు - అనాహతము, ఆహతము అని. అనాహతనాదము యోగిజనైకగమ్యము. ఆహతనాదము గానమునకు మూలము. ఇది శృతి స్వరగ్రామమూర్ఛనాదులద్వారమున రక్తిప్రదము; జనరంజకము. భారతీయకళలకన్నిటికిని వేదమూలకత్వము విద్వత్సమ్మతము. 'సామవేదాదిదం గీతం సంజగ్రాహ పితామహః' అని సంగీతరత్నాకరము బ్రహ్మదేవుడు సంగీతము సామవేదము నుండి గ్రహించినట్లు తెలిపినది. కాగ వేదమువలె సంగీతమనాది; అపరిచ్ఛేద్యము వర్ణాత్మకనాదజన్యము సాహిత్యము. స్వరాత్మకనాదజన్యము గానము. ఈ రెండును సన్నియోగశిష్టములు. అనగ రెండును ఒకదానినొకటి విడిచియుండలేనిజంట కాబట్టే వాగధిష్ఠాత్రియైన సరస్వతికి ఈ రెండును రెండు స్తనములవంటివి. ఈ పోలికను ఉన్న రూపమునే గ్రహింపరాదు. దాని తాత్పర్యము తెలియవలెను. పయోధరములే పిల్లలకు జీవనప్రదములు. అట్లే సంగీతసాహిత్యములు లేనిచో జీవాత్మలు పెంపొందవు. వీని అవినాభావబంధమును గుర్తించి మాఘమహాకవి ఈ రెంటిని ఒక గాటకట్టి వర్ణించినాడు.

'వర్ణైః కతిపయైరేవగ్రథితస్య స్వరైరివఅనంతావాఙ్మయస్యాహోగేయ స్యేవవిచిత్రతా' ఇందు సంగీతముపమానము. సాహిత్యముపమేయము. ఉపమానముత్కృష్టగుణకము. ఉపమేయము న్యూనగుణకము. అట్లుచేసి రెంటియొక్క అనంతపారత్వముగ్గడించినాడు. ఏబదియక్షరములే మూలముగా గలది సాహిత్యముకాగా ఏడేస్వరములు మూలముగా గలది సంగీతము. అల్పసంఖ్యాక వర్ణమునుండియేం పుట్టిన భాష అపారవాఙ్మయముగా వెల్లివిరిసినది. ఏడే స్వరములతో అనంతరాగసాగరముప్పొంగినది. ఇట్లగుట సంగీతము శ్రేష్ఠతరమైనది. ఈ రెండు శ్లోకములు పరికింపుడు -

'సంగీతమథసాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏకమాపాతమధురమన్యదాలోచనామృతమ్'

'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణీ
సాహిత్యరసమాధుర్యం శంకరో వేత్తివానవా'

ఈ రెండు పద్యములు సంగీతప్రాశస్త్యమునకు రెండు పట్టుకొమ్మలు. ఈ శ్లోకములకు పైపైన తోచెడి భావముతో తృప్తిపడరాదు. కొంచెము తరచిచూచెదము గాక ! శ్రీ వాణీదేవి యొక్క ఒకస్తనము (సంగీతాత్మకము) అపాతమధురము. మరియొకటి (సాహిత్యాత్మకము) ఆలోనామృతము. అనగ సంగీతమాపాతమధురమా ? సాహిత్యమాలోచనామృతమా ? ఇట్లే గ్రహించుచో సంగీతము 'చౌకబారు' అగుచున్నది. అది సరికాదు. 'సంగీతమాపాతమధురమపి' అనవలెను. సాహిత్యము ఆలోచించిననే మధురము. సంగీతమట్లుగాక లోతుకు దిగవలసిన పనిలేకయే మాధుర్యమును కురియును. శాస్త్రపులోతుపాతులు తెలియని పామరుని కూడ అలరింపగలదు. సాహిత్యమట్లుగాక సహృదయులై భావనచేయగలవానికే అమృతప్రాయమగుచున్నది.

సంగీతము ఆపాతమధురమే యనరాదు. సాహిత్యానుభవము వ్యుత్పత్త్యాది సాపేక్షము. సంగీతము చెవులున్నచాలు, ఆస్వాదనకదిచాలును. సంగీతమాస్వాదించువానికి శాస్త్రజ్ఞానము కూడనున్నచో, స్వరగ్రామమూర్ఛనావిశేషాదులెరిగి, శతగుణితమాధుర్యము చుబ్బనచూరగా గ్రోలగలడు. 'శిశుర్వేత్తి' అను శ్లోకమును బాగుగ గమనింపగలరు. చంటిపాపగానమాస్వాదింపగలదు. కమ్మని జోలపాట విని నెమ్మదిగ నిద్రింపగలదు. ఇది అనుభవసిద్ధమే. శ్రీకృష్ణునివేణుగానమాధుర్యమును చెవియొగ్గివిని గోవులు పరవశించుట తెలియుచున్నాము. వేటగాళ్లు పిల్లనగ్రోవియూది లేళ్ళను తమయొద్దకు రప్పించుకొని పరవశములను చేసి పట్టుకొనుట యెరుగుదుము. 'నాద రీఝు తరదేతమృగ' (హిందీ) అన్నట్లు మధురగానమునకు లోబడి హరిణములు తమ దేహములనే అప్పనచేయుచున్నవి. నాగస్వరము ఊదితే నాగులకు నిద్రఅనుపాట మనకు ఉండనేఉన్నది. ఘోరవిషసర్పములు కూడ గానమాధుర్యమునకు లోబడినవే. 'మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద !' అనుచు నారాయణుడే, తన గానప్రియత్వమును చాటి చెప్పుకొనినాడు. 'రాల్గరగించు విమల గాంధర్వమను పలుకుబడి తెలిసినదే. 'మ్యూజికల్ థెరపి' అనగ సంగీతముతో చికిత్స సుసాధ్యమమని చెప్పుచున్నారు. చెట్లకు కూడ పాట వినిపించి సత్ఫలితమును సాధించుచున్నారు. గానము వినని అరటితోటకంటె గానముగ్ధమైన అరటితోట అధికమైన దిగుబడి యిచ్చినట్లు పత్రికలలో చదివినాము. ఫోటోలతో బాటు చూచినాము. కావున చేతనాచేతన సృష్టియంతయు సంగీతప్రభావమునకు లోనైనదే.

'సంగీతరసమాధుర్యం శంకరోవేత్తివానవా' దీని భావమేమి తిరుమలేశా? శంకరుడు సర్వజ్ఞుడు. సర్వజ్ఞనామధేయము శర్వునకే (శివునకే) చెల్లు. అట్టి పరమేశ్వరునకు కూడ సాహిత్యరసమాధుర్యము తెలియునో తెలియదో యనుమాటకు శివునియెడకూడ లోటు చూపుట తాత్పర్యము

కాదు. సర్వజ్ఞునకు కూడ సాహిత్యరసమాధుర్యము తెలియునో తెలియదో కాని, జ్ఞానమంతగాలేని శిశుపశునాగములు గానమునకు పరవశించుట నిక్కువము అని గానమహి సూచించుటే వచన తాత్పర్యము. అట్లగుటకు సంగీతమందలి షడ్జాది స్వరమాధుర్యమే కారణము. 'స్వతో రంజయతి శ్రోత్రమతిస్వరః' అను స్వరనిష్ఠరంజకత్వమిట స్మరణీయము. 'స్వతః' అను శబ్దములోని 'స్వ'వర్ణముతోడను రంజయతి 'ర'వర్ణముతోడను స్వరశబ్దము ఎబ్రివియేషన్ పద్ధతిలో నిష్పన్నమైనది. అబాలగోపాలము, ఆ తిర్యగ్జడము అందరిని అన్నిటిని సుధాబిందువులు చిలికించి ఆనందింపజేయగల మహామహిమ సంగీతములోనున్నది. కావుననే షేక్స్పియర్ అను ఆంగ్లనాటక రచయిత 'సంగీతమెవ్వనిని స్పందింపజేయదో అట్టిమనుజుడు కృతఘ్నుడు, క్రూరుడునై కడకు నిరయపతితుడును కాగలడ'నినారు. అనగ యట్టి పాషాణకఠిన హృదయునైనను సంగీతము, లోబరచుకొనుననునదే ఆ కవిహృదయము.

ఇంతవరకు గానమహిమను మనము గమనించినాము. అట్టి మధురాతిమధురమైన మహిమోన్నతమైన సంగీతమునకు సంబంధించిన శాస్త్రగ్రంథములు అనాది సంస్కృతభాషయందెన్నియో గలవు. సంస్కృతభాష తెలియనివారికవి దుర్బోధములు. అది ఆంధ్రసంగీత విద్వాంసులకు పెద్ద కొదవే. అట్టి లోటును తీర్చి, తెలుగుభాషలో ఆ సంగీతగ్రంథములను అనువదింపపూనుకొనుట కడు శ్లాఘ్యము. ఈ భాషాంతరీకరణము శాస్త్రమర్మజిజ్ఞాసువులకు మహోపకారము. అట్టి తర్జుమాకు పూనుకొనినవారు సంగీత శాస్త్రరహస్యమును అనుభవపూర్వకముగ తెలిసినవారైనచో - బంగారుకు తావియబ్బినట్లే.

అనువాదమహాయజ్ఞము చేయపూనుకొనినవారు సంగీతకళామర్మజ్ఞులైన పేరెన్నికగన్న సంగీతకళాప్రపూర్ణ, సంగీత లక్ష్య, లక్షణకోవిద, గాంధర్వవిద్యావాచస్పతి, గానకళాధర, గాంధర్వవిద్యాభూషణ

ఆచార్య శ్రీ ద్వారం భావనారాయణరావుగారు, - వీరు అన్ని విధముల దీనికి తగినవారు. వీరి జనకులు ప్రఖ్యాత సంగీతవిద్వాంసులు, వాయులీన విద్యాపారంగతులు, సంగీతకళానిధి, పద్మశ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారు. ద్వారం వారి వంశము సంగీతదివ్యసౌధమహాద్వారము. ఈ వంశము వారందరును సంగీతప్రియులు సంగీతమర్మజ్ఞులైన పండితప్రకాండులు. శ్రీద్వారం భావనారాయణరావుగారు సంగీతకళాప్రపూర్ణులు. వీరు కళాప్రావీణ్య ప్రదర్శనతో నిలువక ఉపాధ్యాయులై, కళాశాలాధ్యక్షులై, ఉన్నతోన్నత పదవులధిరోహించి ఎందరెందరికో సంగీతవిద్యకరపి వారినందు ప్రవీణులను జేయుటలో సిద్ధహస్తులైరి. వీరి ధర్మపత్నీమతల్లిక, పుత్త్రపుత్త్రికాదులును సంగీతోపాసకులే, విద్యాధురీణులే. వీరి పుత్త్రీరత్నము డా॥ శ్రీమతి ద్వారం (నేమాని)లక్ష్మీదేవి తన శ్రీవారు నేమాని వెంకటరమణగారితో వచ్చి ముద్రిత చతుర్దండీప్రకాశికా గ్రంథము, దత్తిలగ్రంథములను నాకొసగి అట్లే ముద్రితమగుచున్న బృహద్దేశి, సంగీతసమయసారములను ప్రూఫుదశలోనున్నవానిని ఇచ్చిచూచి ఆశీర్వదింపుడని అడకువతోనడిగిరి. నాకు తెలిసినది చాలస్వల్పము. వారిమాటతోసి రాజనలేక స్థాలీపులాకన్యాయముగ చదివి చూచితిని. అనువాదకుల కడక కడు శ్లాఘ్యము. కళామర్మజ్ఞులగుటచే మిగుల మెలకువతో చక్కగా ఆంధ్రీకరించి, మహోపకృతి కావించిరి భావనారాయణరావుగారు.

ముద్రితగ్రంథము పేరు చతుర్దండీప్రకాశిక. రచయిత విద్వద్వతంసులు. సుగృహీతనామధేయులు శ్రీవేంకటమఖి. గ్రంథము ఉచ్చకోటికి చెందినది. తగినవారిచేత తెనుగు అనువాదమును సంతరించుకొనినది. ఆ కోశము దశప్రకరణి అయినను, అందున్న నాలుగు ప్రకరణములు అలాప, ఠాయ, గీత, ప్రబంధ సంజ్ఞములు వానికి

ప్రాధాన్యము చూపదలచి కాబోలు ఆ గ్రంథము 'చతుర్దండీప్రకాశిక' యని నామకరణము చేయబడినది. ఇందులో నాల్గవది మేళప్రకరణము. ఇది అతిముఖ్యము. ఇందు రచయిత డెబ్బదిరెండు (72) మేళకర్తలను వింగడించి చూపినారు. ఇందలి ప్రప్రథమమగు మేళకర్తల విశిష్టస్వరూప, నిరూపణ నిరుమానము. ఈ యంశము సంగీతప్రపంచమున నాటికీ నేటికీ స్థిరముగా నెలవుకొనియున్నది. సంగీతజగత్తులో ఆ గ్రంథమునకు విశిష్టస్థానము దక్కుటకు హేతువు అందులోని అంశము నిశితనిరూపణే. అట్టి ఉత్కృష్టగ్రంథమును శ్రీద్వారం భావనారాయణరావుగారు సులభశైలిలో తెలుగులోనికి అనువదించుట ఆంధ్ర సంగీతవిద్వాంసుల విశిష్టసుకృతఫలము. వారు అంతటితో నిలువక దత్తిలమునకును, బృహద్దేశికిని, సంగీతసమయసారమునకును ఆంధ్రభాషాంతరీకరణము చేసినారు. ఆంధ్రమున సంగీతశాస్త్రగ్రంథముల లోటును తీర్పసంకల్పించుట మిగుల మోదావహము. ఈ అనువాదగ్రంథము ముద్రించి ప్రకటించుచున్నారు. ఇందు వారి సహధర్మచారిణి శ్రీమతి ద్వారం వెంకటవరదమ్మగారు, వారి తనయులు, తనయలు, ఇంకను వారి బంధుగులును సడలని పూనికతో లక్షలకొలది రూప్యములు వెచ్చించి ముద్రింపగడంగుట మహాపవిత్రమైన కైంకర్యము. ఇది లోకమునకు లోకులకు మహోపకృతి. శ్రీరావుగారి కుటుంబసభ్యులందరును సకల్పితకృత్యమును నెరవేర్చి కృతకృత్యులై, ఇంకను పెక్కుగ్రంథములను ప్రచురించి, సంగీతలోకమునకు మహోపకారమొనర్తురుగాక ! వీరికి కావలసిన శక్తియుక్తులును, ఆయురారోగ్యాదిభాగ్యములనన్నిటిని ప్రసాదించి అభిలషితాధికదానరతుడైన వృషగిరీశ్వరుడైన శ్రీనివాసుడు సర్వకాల సర్వావస్థలయందును బాసటయై నిలిచి బ్రోచుగాక !

నరసింహాచార్య

I recall with pride and warmth my association with Late Professor Dwaram Bhavanarayana garu. As days go by I discover more and more about his involvement with and commitment to the Sangitasastra. It was only two years ago that he published and released his translation of Venkatmakhi's Chaturdandiprakasika. Then, in 2000, came Dattilam as a posthumous publication. And now we have the Brihaddesi of Matanga.

Brihaddesi is the earliest available text of the Desi tradition, as different from Dattilam and Natyasastra which belonged to Marga. Although it reveals a great awareness of the Marga tradition, citing Dattila and Bharata profusely, it brings to light, for the first time, the aspects of Raga And Prabandha. The work first edited by Sri Sambasiva Sastri and published in 1928 has in the last ten years seen two translations, one in English by Dr. Premalata Sharma and Anil Behari Beohar and the other in Kannada by Dr. R. Sathyanarayana. Now by making available this work in Telugu language, Professor Dwaram Bhavanarayanagaru has opened out this new area of Desi Sangita to many a scholar and student. Once again the family of Bhava Narayanagaru needs to be commended for its sustained dedicated Effort in publishing his creations.

*N. Ramanathan*
Chairperson, School of Fine and Performing Arts
Professor & Head, Department of Indian Music
University of Madras, Chennai - 600 005.

# కృతజ్ఞతాంజలి



జగద్విఖ్యాత వయోలిన్ విద్వాంసులు సంగీత కళానిధి, పద్మశ్రీ, కళాప్రపూర్ణ, బిరుదాంకితులు, పూజ్యులు శ్రీ మా మామగారైన డా॥ ద్వారం వేంకటస్వామినాయుడుగారి పుత్రుడిగా జన్మించి, శిష్యుడిగా లక్ష్య లక్షణ సంగీత శిక్షణను పొంది, సంగీతం యొక్క సమగ్రస్వరూపాన్ని, మాధుర్యమహిమను యథాశక్తి గ్రహించి, సంగీతరంగానికి తనదైన సేవలనందించి, నాదబ్రహ్మైక్యం చెందిన నా పతిదేవులు ఆచార్య ద్వారం భావనారాయణరావుగారు జగమెరిగిన విద్వాంసులు. వారు చదువుకున్న, తెలుసుకొన్న విషయాలను, సంగీతరంగంలో ప్రముఖంగా పేర్కొనబడుతున్న సంగీతగ్రంథాలను ప్రతిపదార్థ, తాత్పర్యసహితంగా తెలుగులో ప్రకటించాలని, అవి నేటి సంగీతలోకానికి, భావితరాల వారికి కూడ ఎంతో ఉపయుక్తంగా వుంటాయని నాతో చెబుతుండేవారు. అలా రూపుదిద్దుకున్న గ్రంథాల్లో ప్రథమంగా 'చతుర్దండీ ప్రకాశికా' ను 1999 డిసెంబరు నెలలో మద్రాసు మ్యూజిక్ అకాడమీ, 2000 జూన్ నెలలో విశాఖలోని విశాఖ మ్యూజిక్ మరియు డాన్స్ అకాడమీ, విశాఖపట్నంలో ఆవిష్కరణగావించడం, యావత్సంగీతలోకం వారికి అభినందనలను అందించడం కళాభిమానులందరికీ విదితమే.

అదే కోవలో సుమారు 2 దశాబ్దాలకాలం కృషిచేసి, మరిన్ని గ్రంథాలను సిద్ధంచేసి. ఆచార్య భావనారాయణరావుగారు నాదబ్రహ్మలో లీనమైనారు. వాటినన్నింటిని ప్రకటించి సంగీతలోకానికి అందించడమే వారి భార్యగా, శిష్యురాలిగా వారి కందించే నిజమైన నివాళి అనే ఉద్దేశ్యంతో గ్రంథాలన్నింటిని ప్రకటించ పూనుకున్నాను. ఈయజ్ఞంలో భాగంగా. శ్రీభావనారాయణరావుగారి రచనల్లో దత్తిలముని విరచిత 'దత్తిలం' గ్రంథానువాదాన్ని, సద్గురు శ్రీ శివానందమూర్తిగారి దివ్యాశీస్సులతో ప్రచురించగా, మదరాసులోని సుప్రసిద్ధ సాంస్కృతిక సంస్థ "రచన" ఆధ్వర్యంలో ఈ గ్రంథాన్ని పద్మవిభూషణ్ శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు, లోకమాన్య కళాబంధువులైన శ్రీ పి.వి.

రమణయ్యరాజాగారు, ప్రసిద్ధకవిపండితులైన శ్రీ బి.ఎస్.ఆర్. కృష్ణగారు, సంగీత సాహిత్య కోవిదులు శ్రీ పప్పువేణుగోపాలరావుగార్లు ఆవిష్కరించడం జరిగింది.

తదుపరి ప్రచురణగా శ్రీ మతంగముని రచించిన బృహద్దేశి గ్రంథాన్ని సద్గురు పూజ్యశ్రీ శివానందమూర్తిగారి దివ్యాశీస్సులతో ప్రచురించ పూనుకున్నాను.

ఈ గ్రంథాన్ని ప్రచురించడానికి శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్థికసహాయాన్ని అందించినందుకు ముమ్ముందుగా శ్రీ అలమేలుమంగాసమేత శ్రీవేంకటేశ్వరస్వామివారికి సాష్టాంగ ప్రణామాలు సమర్పించుకొంటున్నాను.

మాశ్రీవారు భావనారాయణరావుగారికి చిన్ననాటినుండి వ్యక్తిగతంగా అతిసన్నిహితులై ఆయన యొక్క కళాజీవితానికి ఎంతో స్ఫూర్తినిచ్చి అన్ని రకాలయిన సహకారాన్ని అందించిన, అందిస్తున్న కళాబంధువులు శ్రీ పి.వి. రమణయ్యరాజాగారికి మనఃపూర్వక కృతజ్ఞతలు.

మాకు అత్యంత సన్నిహితులు, ఆదినుండి మాకుటుంబంలో ఒకరై, అవసరమైన సూచనలు, సలహాలు అందివ్వడమే కాకుండా, సంగీతరచనాసంబంధిత విషయాలన్నింటిలో మా ఇద్దరికీ నిరంతరం చేదోడువాదోడుగా వున్న సోదరులు సంగీత, సాహిత్యకోవిదులు చి॥ పప్పువేణుగోపాలరావుగారికి ఆశీఃపూర్వక ధన్యవాదాలు.

'శ్రీ బావగారు' వ్రాసిన సంగీత గ్రంథాలనన్నింటినీ ప్రకటించాలనే దృఢసంకల్పంతో ఎనలేని కృషి సలుపుతున్న నా ద్వితీయ సోదరుడు చి॥ గుమ్ములూరి మణిభూషణప్రసాద్, మరదలు చి॥ సౌ॥ రామసుబ్బలక్ష్మికి మనఃపూర్వక ఆశీర్వచనాలు.

ఒక గ్రంథాన్ని ప్రకటించడం ఎంతటి వ్యయప్రయాసలతో కూడుకున్నదో సంగీతలోకానికి తెలియనిదికాదు.

ఆచార్య భావనారాయణగారి సంగీతలక్ష్యలక్షణ విద్యాసంపదకు, ఆయన బహుముఖప్రజ్ఞకు ఎంతో ఆనందించి నిరంతరం వారిని గ్రంథ ప్రచురణకు ప్రోత్సహించిన పెద్దలలో ఆచార్య క్రీ.శే. డా॥ సి.హెచ్.

వెంకటేశ్వర్లు (ముంబై) ముఖ్యులు. వారికి, వారి కుటుంబసభ్యులందరికి ఈ ప్రచురణకు సహాయమందించినందులకుగాను మనఃపూర్వక నమస్కారాలు తెలియజేసుకొంటున్నాను.

ఇదేవిధంగా ఈ ప్రచురణకు సహాయ సహకారాలందించిన మా మరిదిగారైన ఆచార్య డా॥ వి. రామారావుగారికి, వారిసతీమణి, నా సోదరి చి॥ సౌ॥ వి.వి.పి. తులసి (ముంబై)కి ఆశీఃపూర్వక ధన్యవాదాలు.

గ్రంథప్రచురణగురించి తెలిసినవెంటనే ఎంతోపెద్దమనసుతో చేయూతనిచ్చిన శ్రీమతి రాజ్యలక్ష్మిగారు, ఆచార్య డా॥ పాపారావు (ముంబై)గార్లకు కృతజ్ఞతాంజలి.

సంగీతాభిమానులు ఆచార్య శ్రీకొప్పాక వెంకటేశ్వరరావుగారు (ముంబై) బృహద్దేశి, సంగీతసమయసారం గ్రంథాల ప్రచురణకు గొప్పసహాయం అందించారు. వారికి నమోవాక్కాలు తెలియజేసుకొంటున్నాను.

ఈ పుస్తకరచనను ఆమూలాగ్రం పరిశీలించి, 'ముందుమాట' ను వ్రాసి ఆశీరభినందనలు తెలిపిన శాస్త్రీయ సంగీత, నృత్య కళాభిజ్ఞులు, సంగీత కళాచార్య శ్రీమాన్ టి.యస్. పార్థసారథిగారికి నా ప్రణామాలు.

సుప్రసిద్ధ సాహితీవేత్తలు, సంస్కృత, ప్రాకృత, బ్రాహ్మీభాషల్లో కవిపండితులైన శ్రీమాన్ ఎన్.సి నరసింహాచార్యులవారు ఆశీర్వదించి పంపిన 'సంస్తవా'నికి కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు.

"విద్యావినయసంపన్నులు", మద్రాసు విశ్వవిద్యాలయ సంగీత శాఖాధ్యక్షులు ఐన ప్రొఫెసర్ డా॥ ఎన్. రామనాథన్ గారు తమ అమూల్యమైన అభిప్రాయంతో ఈ గ్రంథానికి వన్నెకూర్చారు. వారికి నమోవాకాలు.

ఈ గ్రంథరచనల్లో భాషాపరమైన సహకారం అందించిన కుమారి పెనుమర్తి లక్ష్మీనరసమ్మ (పి.ఒ.ఎల్., సంస్కృత విద్యాప్రవీణ, సంస్కృతోపన్యాసకురాలు, యలమంచిలి) కు నా ఆశీఃపూర్వక ధన్యవాదాలు.

అమితమైన ఆదరాభిమానాలతో ఆచార్య ద్వారం భావనారాయణరావుగారు రచించిన ప్రతిగ్రంథాన్ని పరిశీలనాదృష్టితో సానుకూలపరుస్తున్న డా॥ శ్రీ జానమద్ది రామకృష్ణ (అసోసియేట్ ప్రొఫెసర్, రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం, తిరుపతి, గారికి సహృదయ సాధువాదాలనర్పించుకుంటున్నాను.

భారతదేశపు సనాతన సంప్రదాయ విలువలను, కళలను, సంస్కృతి సంబంధిత తదితర తత్సంబంధిత విశేషాలను ప్రోత్సహిస్తూ, పూర్వవైభవాన్ని పునరుజ్జీవనం చేయాలనే సద్గురు శ్రీ శివానందమూర్తిగారి సత్సంకల్పంతో ఆశీర్వదించటం

మా అదృష్టంగా భావించుకొంటున్నాను. సద్గురు శ్రీ శివానందమూర్తిగారికి సాష్టాంగప్రణామాలు సమర్పించుకొంటున్నాను. ట్రస్ట్‌వారికి ధన్యవాదాలనర్పించుకొంటున్నాను.

ఈ గ్రంథాన్ని లేజర్ టైప్ సెట్టింగ్ చేసిన కుమారి జయగారికి, శ్రీ అన్నపూర్ణాగ్రాఫిక్స్ (తిరుపతి) అధినేత శ్రీ శర్మగారికి, అతిస్వల్పవ్యవధిలో, అత్యంత సుందరంగా అచ్చువేసిన శ్రీ లక్ష్మీగణపతి బైండింగ్ వర్క్స్ (కొవ్వూరు) యాజమాన్యం శ్రీమన్నం నాగభూషణరావు సోదరులకు హృదయపూర్వక కృతజ్ఞతాంజలి.

మా చిరంజీవులు (అల్లుళ్లు) నేమాని వెంకటరమణ, శీలంశెట్టి ప్రభాకర్, (కుమార్తెలు) డా॥ (ద్వారం) నేమాని వెంకటజగ్గయ్యమ్మలక్ష్మి, (ద్వారం) శీలంశెట్టి వెంకటశారదాపద్మశ్రీ, (కుమారులు) (ద్వారం)అనంత వెంకటస్వామి, ద్వారం వెంకట కృష్ణగణేశత్యాగరాజ్, ద్వారం శ్రీనివాసపవన్‌కుమార్, (కోడళ్ళు) ద్వారం (బత్తుల) మణిశ్రీ, ద్వారం (కందుల)నాగమణి, (మనుమలు) శీలంశెట్టి సునీల్, నేమాని అనిల్ కైవల్య, ద్వారం మెహర్‌భావన, శీలంశెట్టి తేజ్‌భావన్, ద్వారం సాయీశ్వర్, ద్వారం వరదనారాయణీప్రియభావన లను ఆ నాదపరమేశ్వరుడు సదాకాపాడాలని ప్రార్థిస్తూ ప్రేమైక ఆశీస్సులను అందజేస్తున్నాను.

**భవదీయురాలు**

**ద్వారం వేంకట వరదమ్మా భావనారాయణరావు**

శ్రీ మతంగముని ప్రణీతమగు

# బృహద్దేశీ

## దేశ్యుత్పత్తి ప్రకరణమ్

**నానావిధేషు దేశేషు జంతూనాం సుఖదో భవేత్ ।**
**తతః ప్రభృతి లోకానాం నరేంద్రాణాం యదృచ్ఛయా ॥** 1

**ప్రతిపదార్థము :** నానావిధేషు దేశేషు = అనేక దేశములందు; జంతూనాం = జంతువులకు; లోకానాం = లోకములకు (ప్రజలకు); నరేంద్రాణాం = ప్రభువులకు; యదృచ్ఛయా = స్వేచ్ఛగా; (ధ్వనిః = ధ్వని); సుఖదః = సుఖమును కల్గించునదిగా; భవేత్ = ఆయెను; తతః ప్రభృతి = అదిమొదలుకొని

**తాత్పర్యము :** అనేక దేశములందు జంతువులకు, లోకములకు మరియు ప్రభువులకు స్వేచ్ఛగా ధ్వని సుఖమును కల్గించునదయ్యేను. అదిమొదలుకొని

**దేశే దేశే ప్రవృత్తోఽసౌ ధ్వనిర్దేశీతి సంజ్ఞితః ।**
**మతంగస్య వచః శ్రుత్వా నారదో మునిరబ్రవీత్ ॥** 2

**ప్రతిపదార్థము :** దేశే దేశే = ప్రతిదేశమునందును; ప్రవృత్తః = ప్రవర్తించినదై; అసౌధ్వనిః= ఈ ధ్వని; దేశీతి = దేశియని; సంజ్ఞితః = పిలువబడినది; మతంగస్యఏతత్ వచః = మతంగమహర్షి యొక్క ఈ మాటను; శ్రుత్వా = విని; నారదః మునిః అబ్రవీత్ = నారదమహర్షి ఇట్లు పలికెను

**తాత్పర్యము** : ప్రతిదేశమునందును ప్రవర్తించినదై ఈధ్వని దేశియని పిలువబడినది. మతంగమహర్షి యొక్క ఈ మాటను విని నారదమహర్షి ఇట్లు పలికెను.

**నను ధ్వనేస్తు దేశీత్వం కథ జాతం మహామునే ! ।**
**అమూర్తత్వాచ్చ తేషాం హి ఇతి మే వక్తుమర్హసి ॥** 3

**ప్రతిపదార్థము** : తేషాం (ధ్వనీనాం) = ఆధ్వనులకు; అమూర్తత్వాత్ = అమూర్తత్వమువలన; నను మహామునే ! = ఓ మహర్షీ ! ధ్వనేః = ధ్వనికి; దేశీత్వం కథం జాతం = దేశీత్వమెట్లు కల్గినది ? ఇతి = ఈవిషయమును; మే = నాకు; వక్తుం అర్హసి = చెప్పుటకు తగియున్నావు

**తాత్పర్యము** : ఓమహర్షీ ! ధ్వనులు అమూర్తములు కదా ! మరి వాటికి దేశీత్వమెట్లుకల్గినది ? ఈవిషయమును నాకు చెప్పుటకు తగియున్నావు.

**యథానుభూత దేశాచ్చ ధ్వనేః స్థానానుగాదపి ।**
**తతో బిందుస్తతో నాదస్తతో మాత్రాస్త్వ నుక్రమాత్ ॥** 4

**ప్రతిపదార్థము** : యథానుభూతదేశాత్ = అనుభవింపబడినదేశము వలన; (దేశానుభూతి వల్లను); యథాస్థానానుగాదపి = స్థానానుగమనమువలనను; తతః బిందుః = తరువాత బిందువు; తతః = అటుతరువాత; నాదః = నాదము; తతస్తుః = తరువాత; మాత్రాః = మాత్రలు; అనుక్రమాత్ = క్రమానుసరణముగా; (భవంతి = అగుచున్నవి)

**తాత్పర్యము** : అనుభవింపబడిన దేశము వలన, (దేశానుభూతివల్లను) స్థానానుగమనము వలనను తరువాత బిందువు, అటుతరువాత నాదము, తరువాత మాత్రలు క్రమానుసరణముగా అగుచున్నవి.

**వర్ణాస్తు మాత్రకోద్భూతా మాత్రకా ద్వివిధా మతాః ।**
**స్వరవ్యంజనరూపేణ జగజ్జ్యోతిరిహోచ్యతే ॥** 5

**ప్రతిపదార్థము** : వర్ణాః = వర్ణములు; మాత్రకోద్భూతాః = మాత్రలనుండి పుట్టినవి; మాత్రకాః = మాత్రలు; ద్వివిధాః మతాః = రెండు విధములు; స్వరవ్యంజన

రూపేణ = స్వరము మరియు వ్యంజనము అనునట్లుగ; జగత్ జ్యోతిః = పరమేశ్వరుడు; ఇహ = ఇక్కడ; ఉచ్యతే = చెప్పబడెను

**తాత్పర్యము** : వర్ణములు మాత్రలనుండి పుట్టినవి. మాత్రలు రెండువిధములు. స్వరము, వ్యంజనము అనునట్లుగరూపముగా పరమేశ్వరుడు ఇక్కడ చెప్పబడెను

**స్వ (ర్యు,ర్య) తే దేశభాషాయాం ఆదిక్షాంతం యథావిధి ।**
**తేన స్వరాః సమాఖ్యాతాః అన్యే షడ్జాదయః స్వరాః ॥ 6**

**ప్రతిపదార్థము** : దేశభాషాయాం = దేశీయ భాషయందు; ఆది క్షాంతం = అమొదలు క్షకారము వరకు;యథావిధి = యథాశాస్త్రముగా; స్వర్యతే = పలుకబడుచున్నవో; (స్వర్యుతే = స్వరయుక్తములగు చున్నవో;) తేన = అందుచే; స్వరాః = స్వరములుగా; సమాఖ్యాతాః = పిలువబడినవి; అన్యే = మిగిలినవి (వేరైనవి); షడ్జాదయః స్వరాః = షడ్జాదిస్వరములు

**తాత్పర్యము** : దేశీయ భాషయందు అ మొదలు క్షకారము వరకు యథాశాస్త్రముగా పలుకబడుచున్నవో స్వరయుక్తములగుచున్నవో అందుచే స్వరములుగా పిలువబడినవి. మిగిలినవి (వేరైనవి) షడ్జాదిస్వరములు.

**వ్యంజనత్వం తు సర్వేషాం కాదివర్గేషు సంస్థితమ్ ।**
**శక్త్యభివ్యక్తిమాత్రేణ వ్యంజనం శివతాం గతమ్ ॥ 7**

**ప్రతిపదార్థము** : కాదివర్గేషు = కవర్గాదులందు; సర్వేషాం = అన్నిటికిని; వ్యంజనత్వం సంస్థితం = వ్యంజనత్వమున్నది; శక్త్యభివ్యక్తి మాత్రేణ = శక్తిని స్పష్టీకరించినమాత్రముచే; వ్యంజనం = వ్యంజనము; శివతాం గతం = శివత్వమును (దైవత్వమును శుభమును కల్గించునది గాన మంగళ ప్రదత్వమును) పొందినది

**తాత్పర్యము** : కవర్గాదులందు అన్నిటికిని వ్యంజనత్వమున్నది. శక్తిని స్పష్టీకరించిన మాత్రముచే వ్యంజనము శివత్వమును (దైవత్వమును, శుభమును కల్గించునది గాన మంగళప్రదత్వమును) పొందినది.

**పదవాక్యస్వరూపేణ వాక్యార్థవహనేన యత్ ।**
**వర్ణయంతి జగత్ సర్వం తేన వర్ణాః ప్రకీర్తితాః ॥ 8**

**ప్రతిపదార్థము** : పదవాక్యస్వరూపేణ = పదవాక్య రూపముచేతను; వాక్యార్థవహానేన = వ్యాక్యార్థమును వహించుటచేతను; యత్ = ఏ కారణముచే; జగత్ సర్వం = లోకమునంతను; వర్ణయంతి = వర్ణించుచున్నవో; తేన = అందుచేత; తే = అవి; వర్ణాః ప్రకీర్తితాః = వర్ణములుగా చెప్పబడుచున్నవి

**తాత్పర్యము** : పదవాక్యరూపముచేతను, వాక్యార్థమును వహించుటచేతను ఏకారణముచే లోకమునంతను వర్ణించుచున్నవో అందుచేత అవి వర్ణములుగా చెప్పబడుచున్నవి.

**వర్ణపూర్వకమేతద్ధి పదం జ్ఞేయం సదా బుధైః ।**
**పదైస్తు నిర్మితం వాక్యం క్రియాకారకసంయుతమ్ ॥ 9**

**ప్రతిపదార్థము** : సదా = ఎల్లప్పుడు; బుధైః = పండితులచే; ఏతత్ పదం = ఈ పదము; వర్ణపూర్వకం హి = వర్ణ పూర్వకమైనదిగనే (వర్ణసముదాయముగనే); జ్ఞేయం = తెలియదగినది; క్రియాకారక సంయుతం = క్రియాకారకములతో కూడిన; వాక్యం = వాక్యము; పదైస్తు = పదములచేత మాత్రమే; నిర్మితం = తయారుచేయబడినది

**తాత్పర్యము** : ఎల్లపుడు పండితులచే ఈపదము వర్ణపూర్వకమైనదిగనే (వర్ణసముదాయముగనే) తెలియదగినది. క్రియాకారకములతో కూడిన వాక్యము పదములచేత మాత్రమే తయారుచేయబడునది.

**తతో వాక్యాన్మహావాక్యం వేదాః సాంగా హ్యనుక్రమాత్ ।**
**వ్యక్తాస్తే ధ్వనితః సర్వే తతో గాంధర్వ సంభవః ॥ 10**

**ప్రతిపదార్థము** : తతః = పిమ్మట; వాక్యాత్ = సామాన్యవాక్యమునుండి; మహావాక్యం= మహావాక్యమును; అనుక్రమాత్ = వరుసగా; సాంగాః వేదాః = అంగములతో కూడిన (షట్శాస్త్ర యుతములైన) వేదములు; తే సర్వే = అవిఅన్నియు; ధ్వనితః వ్యక్తాః = ధ్వనినుండి స్పష్టములైనవి; తతః = తరువాత; గాంధర్వ సంభవః = గాంధర్వము జనించినది

**తాత్పర్యము** : పిమ్మట సామాన్యవాక్యమునుండి మహావాక్యమును వరుసగా అంగములతో కూడిన (షట్ శాస్త్రయుతములైన) వేదములు అవిఅన్నియు ధ్వనినుండి స్పష్టములైనవి. తరువాత గాంధర్వము జనించినది.

**ధ్వని ర్యోనిః పరా జ్ఞేయా ధ్వనిః సర్వస్య కారణమ్ ।**
**ఆక్రాంతం ధ్వనినా సర్వం జగత్ స్థావరజంగమమ్ ॥ 11**

**ప్రతిపదార్థము** : ధ్వనిః = ధ్వని; పరా = ఉత్కృష్టమైన; యోనిః = జనకస్థానముగా; జ్ఞేయా = తెలియదగినది; ధ్వనిః= శబ్దము; సర్వస్య = సమస్తమునకు; కారణం= కారణమైనది; సర్వం = సమస్తమైన; స్థావరజంగమం = స్థిరచరాత్మకమైన; జగత్= లోకము; ధ్వనినా = ధ్వనిచేత; ఆక్రాంతం = ఆక్రమింపబడినది

**తాత్పర్యము** : ధ్వని ఉత్కృష్టమైన జనస్థానముగా తెలియదగినది. శబ్దము సమస్తమునకు కారణమైనది. సమస్తమైన స్థిరచరాత్మకమైన లోకము ధ్వనిచేత ఆక్రమింపబడినది.

**ధ్వనిస్తు ద్వివిధః ప్రోక్తో వ్యక్త్యావ్యక్త విభాగతః ।**
**వర్ణోపలంభనాద్వ్యక్తో దేశీ ముఖముపాగతః ॥ 12**

**ప్రతిపదార్థము** : వ్యక్తా వ్యక్తవిభాగతః = వ్యక్త, అవ్యక్త విభాగముచేతను; ధ్వని= ధ్వని; ద్వివిధః ప్రోక్తః = రెండు విధములుగా చెప్పబడుచున్నది; వర్ణోపలంభనాత్= వర్ణములచే వర్ణింపబడుటవలన; వ్యక్తః = వ్యక్తమను ధ్వని విభాగము; దేశీముఖం ఉపాగతః = దేశీత్వమును పొందుచున్నది

**తాత్పర్యము** : వ్యక్త, అవ్యక్త విభాగము చేతను ధ్వని రెండు విధములుగా చెప్పబడుచున్నది. వర్ణములచే వర్ణింపబడుట వలన వ్యక్తమును ధ్వనివిభాగము దేశీత్వమును పొందుచున్నది.

**ఇతి దేశ్యుత్పత్తి ప్రకరణమ్ ।**
(అని దేశీధ్వన్యుత్పత్తి విభాగము)

* * *

**అబలాబాలగోపాలైః క్షితిపాలైర్నిజేచ్ఛయా ।**
**గీయతే సానురాగేణ స్వదేశే దేశిరుచ్యతే ॥ 13**

**ప్రతిపదార్థము** : నిజేచ్ఛయా = స్వేచ్ఛగా; అబలాబాలగోపాలైః = స్త్రీలచేతను, బాలురచేతను, గోపాలుర చేతను; (ఆబాలగోపాలము) క్షితిపాలైః =

ప్రభువులచేతను; సానురాగేణ = ఆదరముగా; స్వదేశే = తమదేశమందు; గీయతే = గానము చేయబడినచో; తత్ = అధ్వని; దేశిః ఉచ్యతే = దేశియని చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : స్వేచ్ఛగా స్త్రీలచేతను, బాలురచేతను, గోపాలురచేతను (ఆబాలగోపాలము) ప్రభులచేతను ఆదరముగా తమ దేశమందు గానము చేయబడినచో అధ్వని దేశీయని చెప్పబడుచున్నది.

**నిబద్ధశ్చాని బద్ధశ్చ మార్గోయం ద్వివిధోమతః ।**
**ఆప్లాపాదినిబంధోయః స చ మార్గః ప్రకీర్తితః ॥** **14**

**ప్రతిపదార్థము** : నిబద్ధః = నిబద్ధమని; అనిబద్ధశ్చ = అనిబద్ధమని; అయంమార్గ= ఈమార్గము (ధ్వని); ద్వివిధః మతః = రెండు విధములు; ఆప్లాపాదినిబంధ= ఆప్లాపాదినిబంధము; యః = ఏదియో; సః = అది; మార్గః ప్రకీర్తితః = మార్గ ధ్వనిగా చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : నిబద్ధమని అనిబద్ధమని ఈమార్గము (ధ్వని) రెండు విధములు. ఆప్లాపాదినిబంధము ఏదియో అది మార్గధ్వనిగా చెప్పబడుచున్నది

**ఏవం ప్రకారో దేశీ యః జ్ఞాతవ్యోగీతకోవిదైః ।**
**ఏవమేతన్మయా ప్రోక్తం దేశ్యా ఉత్పత్తి లక్షణమ్ ॥** **15**

**ప్రతిపదార్థము** : యః = ఏధ్వని; ఏవం ప్రకారః = ఈవిధమైనదియగునో; సః= అది; దేశీ = దేశీయని; గీతకోవిదైః = సంగీతజ్ఞులచే; జ్ఞాతవ్యః = తెలియదగినది; ఏవం = ఇట్లు; దేశ్యాః = దేశియొక్క; ఏతత్ ఉత్పత్తి లక్షణం = ఈఉత్పత్తి లక్షణము; మయా = నాచే; ప్రోక్తం = చెప్పబడినది

**తాత్పర్యము** : ఏధ్వని ఈవిధమైనదియగునో అది దేశీయని సంగీతజ్ఞులచే తెలియదగినది. ఇట్లు దేశియొక్క ఈఉత్పత్తి లక్షణము నాచే చెప్పబడినది.

**ఇతి దేశ్యుత్పత్తిలక్షణమ్**



ఇదానీం సంప్రవక్ష్యామి నాదలక్షణముత్తమమ్ ।
న నాదేన వినా గీతం న నాదేన వినా స్వరాః ॥ 16

**ప్రతిపదార్థము** : ఇదానీం = ఇప్పుడు; ఉత్తమం నాదలక్షణం = యోగ్యమైన నాదలక్షణమును; సంప్రవక్ష్యామి = చెప్పుచున్నాను; నాదేన వినా = నాదములేనిదే; గీతం న = గీతములేదు; నాదేన వినా స్వరాః న = నాదములేనిదే స్వరములు లేవు

**తాత్పర్యము** : ఇప్పుడు యోగ్యమైన నాదలక్షణమును చెప్పుచున్నాను. నాదములేనిదే గీతములేదు, నాదములేనిదే స్వరములు లేవు.

న నాదేన వినా నృత్తం తస్మాన్నాదాత్మకం జగత్ ।
నాదరూపః స్మృతో బ్రహ్మ నాదరూపో జనార్దనః ॥ 17

**ప్రతిపదార్థము** : నాదేన వినా = నాదములేనిదే; నృత్తంన = నృత్యములేదు; తస్మాత్= అందువలన; జగత్ = లోకము; నాదాత్మకం = నాదరూపమైనది; బ్రహ్మ= బ్రహ్మ; నాదరూపః స్మృతః = నాదరూపునిగా చెప్పబడుచున్నాడు; జనార్దనః = విష్ణువు; నాదరూపః = నాదస్వరూపుడు

**తాత్పర్యము** : నాదములేనిదే నృత్యములేదు అందువలన లోకము నాదరూపమైనది. బ్రహ్మ నాదరూపునిగా చెప్పబడుచున్నాడు. విష్ణువు నాదస్వరూపుడు.

నాదరూపా పరాశక్తిర్నాదరూపో మహేశ్వరః ।
యదుక్తం బ్రహ్మణః స్థానం బ్రహ్మగ్రంథిశ్చ యః స్మృతః ॥ 18

తన్మధ్యే సంస్థితః ప్రాణః ప్రాణాద్వహ్ని సముద్గమః ।
వహ్నిమారుతసంయోగాన్నాదః సముపజాయతే ॥ 19

**ప్రతిపదార్థము**: పరాశక్తిః= పరమేశ్వరి; నాదరూపా=నాదస్వరూపము గలది; మహేశ్వర = శంకరుడు; నాదరూపః = నాదస్వరూపుడు; యత్ బ్రహ్మణః స్థానం ఉక్తం = ఏది బ్రహ్మకు స్థానముగా చెప్పబడినదో; యః = ఏది; బ్రహ్మగ్రంథిః స్మృతః = బ్రహ్మగ్రంథిగా తలచబడుచున్నదో; తన్మధ్యే = దానిమధ్యన; ప్రాణః =

ప్రాణము; సంస్థితః= ఉన్నది; ప్రాణాత్= ప్రాణమునుండి; వహ్ని సముద్గమః= అగ్ని (తేజము) జన్యమైనది; వహ్నిమారుతసంయోగాత్ = అగ్ని వాయువులకలయిక వలన; నాదః సముపజాయతే = నాదము పుట్టుచున్నది

**తాత్పర్యము** : పరమేశ్వరినాదస్వరూపము గలది. శంకరుడు నాదస్వరూపుడు. ఏది బ్రహ్మకు స్థానముగా చెప్పబడినదో దానిమధ్యన ప్రాణము ఉన్నది. ప్రాణమునుండి అగ్ని (తేజము) జన్యమైనది. అగ్నివాయువు కలయికలవలన నాదము పుట్టుచున్నది.

**నాదాదుత్పద్యతే బిందుః నాదాత్ సర్వంచ వాఙ్మయమ్ ।**
**ఇతికేచిత్ ।**
**కందస్థానసముత్థోహి స చ పంచవిధో భవేత్ ॥ 20**

**ప్రతిపదార్థము** : నాదాత్ = నాదమునుండి; బిందుః ఉత్పద్యతే = బిందువు పుట్టుచున్నది; సర్వం వాఙ్మయం చ = పదజాలమంతయును; నాదాత్ = నాదమునుండి; ఉత్పద్యతే ఇతి = పుట్టుచున్నదని; కేచిత్ = కొందరు (చెప్పుచున్నారు) కందస్థానసముత్థం = మూలస్థాన జనితమైన; సః = ఆ నాదము; పంచవిధః భవేత్ = 5 విధములగును

**తాత్పర్యము** : నాదమునుండి బిందువు పుట్టుచున్నది పదజాలమంతయును నాదమునుండి పుట్టుచున్నదని కొందరు (చెప్పుచున్నారు.) మూలస్థానజనితమైన ఆనాదము 5 విధములగును.

**సూక్ష్మశ్చైవాతి సూక్ష్మశ్చ సమీరః సంచరన్నధః ।**
**ఊర్ధ్వం చ కురుతే సర్వాం నాదపద్ధతిముద్ధతామ్ ॥ 21**

**ప్రతిపదార్థము** : సూక్ష్మః = సూక్ష్మము; అతి సూక్ష్మశ్చ = మిక్కిలి సూక్ష్మమును అగు; సమీరః = వాయువు; అధః సంచరన్ = క్రిందుగా ప్రసారమగుచు; సర్వాం= అంతను; ఊర్ధ్వం కురుతే = ఉచ్చస్థానముగా చేయును; ఉద్ధతాం నాదపద్ధతించ= ఉద్ధతమైనదిగను, నాదపద్ధతి పంచ విధములగుచున్నవి; ఇతి అన్యే వదంతి = అని మరికొందరు చెప్పుచున్నారు

**తాత్పర్యము** : సూక్ష్మము, మిక్కిలి సూక్ష్మమును అగు వాయువు క్రిందుగా

ప్రసారమగుచు అంతను ఉచ్చస్థానముగాచేయుచు ఉద్ధతమైనదిగను నాదపద్ధతి పంచ విధములగుచున్నవి, అని మరికొందరు చెప్పుచున్నారు.

నకారః ప్రాణ ఇత్యాహుః దకారశ్చానలో మతః ।
నాదస్య ద్విపదార్థోఽ యం సమీచీనో మయోదితః ॥ 22

**ప్రతిపదార్థము** : నకారః = నకారము; ప్రాణ ఇతి = ప్రాణమని; ఆహుః = చెప్పుచున్నారు; దకారః = దకారము; అనలః మతః = అగ్ని యని చెప్పబడినది; నాదస్య = నాదమునకు; సమీచీనః = యోగ్యమైన; అయం ద్విపదార్థః = ఈ పదార్థ ద్వయము; మయా = నాచేత; ఉదితః = చెప్పబడినది

**తాత్పర్యము** : నకారము ప్రాణమని చెప్పుచున్నారు. దకారము అగ్నియని చెప్పబడినది. నాదమునకు యోగ్యమైన ఈ పదార్ధద్వయము నాచేత చెప్పబడినది.

నాదోఽ యం నదతేర్ధాతోః స చ పంచవిధో భవేత్ ।
సూక్ష్మశ్చైవాతిసూక్ష్మశ్చవ్యక్తోఽ వ్యక్తశ్చ కృత్రిమః ॥ 23

**ప్రతిపదార్థము**: అయం నాదః= ఈనాదమనే శబ్దము; నదతేః ధాతోః ఉత్పన్నః= నదధాతువునుండి పుట్టినది; సః పంచవిధః స్మృతః = అది ఐదువిధములుగా చెప్పబడినది; సూక్ష్మః = సూక్ష్మము; అతి సూక్ష్మః = అతిసూక్ష్మము; వ్యక్తః = వ్యక్తము; అవ్యక్తః = అవ్యక్తము; కృత్రిమశ్చ = కృత్రిమమును

**తాత్పర్యము** : ఈనాదమనే శబ్దము నదధాతువునుండి పుట్టినది. అది ఐదువిధములుగా చెప్పబడినది. సూక్ష్మము, అతిసూక్ష్మము, వ్యక్తము, అవ్యక్తము, కృత్రిమమును.

సూక్ష్మో నాదో గుహావాసీ హృదయే చాతిసూక్ష్మకః ।
కంఠమధ్యే స్థితో వ్యక్తః అవ్యక్త స్తాలుదేశకే ॥ 24

**ప్రతిపదార్థము** : సూక్ష్మః నాదః = సూక్ష్మనాదము; గుహావాసీ = గుహ యందుండునది; అతిసూక్ష్మకః హృదయే వర్తతే = అతిసూక్ష్మనాదము హృదయమందున్నది; వ్యక్తః = వ్యక్తనాదము; కంఠమధ్యే స్థితః =

కంఠమధ్యమందున్నది; అవ్యక్తః = అవ్యక్తనాదము; తాలుదేశకే వర్తతే = తాలుప్రదేశమునకలదు

**తాత్పర్యము** : సూక్ష్మనాదము గుహయందుండునది, అతిసూక్ష్మనాదము హృదయమందున్నది. వ్యక్తనాదము కంఠమధ్యమందున్నది, అవ్యక్తనాదము తాలు ప్రదేశమునకలదు

**కృత్రిమో ముఖదేశే తు జ్ఞేయః పంచవిధో బుధైః ।**
**ఇతి తావన్మయా ప్రోక్తా నాదోత్పత్తిర్మనోహరా ॥** 25

**ప్రతిపదార్థము** : కృత్రిమః = కృత్రిమనాదము; ముఖదేశే వర్తతే = ముఖ ప్రదేశమున కలదు; ఇతి = అని బుధైః = పండితులచే; పంచవిధః = ఐదువిధములుగ; జ్ఞేయః = తెలియదగినది; ఇతి తావత్ = ఇంత మాత్రముగా; మనోహరా = అందమైన; నాదోత్పత్తిః = నాదోత్పత్తి; మయా = నాచే; ప్రోక్తా= చెప్పబడినది

**తాత్పర్యము** : కృత్రిమనాదము ముఖప్రదేశమున కలదని పండితులచే ఐదువిధములుగ తెలియదగినది ఇంతమాత్రముగా అందమైన నాదోత్పత్తి నాచే చెప్పబడినది.

**ఇతి నాదోత్పత్తిః**

* * *

**ఇదానీం తు ప్రవక్ష్యామి శ్రుతీనాంచ వినిశ్చయమ్ ।**
**శ్రు శ్రవణే చాస్య ధాతోః క్తి ప్రత్యయసముద్భవః ॥** 26

**ప్రతిపదార్థము** : ఇదానీం = ఇప్పుడు; శ్రుతీనాం = శ్రుతుల యొక్క; వినిశ్చయః= నిర్ణయము; ప్రవక్ష్యామి = చెప్పుదును; శ్రు శ్రవణే = శ్రు శ్రవణము; అస్యదాతోః= శ్రు అను ధాతువునకు; క్తి ప్రత్యయసముద్భవః = క్తిఅను ప్రత్యయము కలుపగా పుట్టినది; శ్రుతి శబ్దః ప్రసాధ్యోయం శబ్దజ్ఞైః భావసాధనః అయం శ్రుతిశబ్దః = ఈశ్రుతిశబ్దము, భావసాధనః = భావసాధనముగా; శబ్దజ్ఞైః = వ్యాకరణ శాస్త్రజ్ఞులచే; ప్రసాధ్యః = సాధింపదగినది;

శ్రూయంతే ఇతి శ్రుతయః = వినబడుచున్నవి గాన శ్రుతులైనవి; సాచ ఏకా అనేకావా = అది ఏకములేదా అనేకము; తత్ర ఏకా ఏవ = శ్రుతి ఒకటే; తత్ యధా = అది ఎట్లనగా?; తత్ర ఆదౌ తావత్ ఇహ అగ్ని పవన సంయోగాత్= వాటిలో అగ్నివాయువుల కలయిక వలన; పురుష ప్రయత్న ప్రేరితః = పురుష ప్రయత్నముచే ప్రేరేపింపబడి; నాభేః ఊర్ధ్వం = బొడ్డునకు పైగా; ఊర్ధ్వాకారదేశం= ఊర్ధ్వాకార ప్రదేశమును; అక్రామత్ = అక్రమించుచు; ధూమవత్= పొగవలె; సోపానపద క్రమేణ = మెట్లమార్గము రీతిగా; పవనేచ్ఛయా = వాయుప్రసార పద్ధతిగా; అన్యేపునః = మరికొంతమంది; ద్విప్రకారాః శ్రుతీః మన్యంతే = రెండు విధములైన శ్రుతులు అని తలచుచున్నారు; కథం; = ఎట్లు; స్వర అంతరవిభాతగాత్ = స్వర, అంతర భేదమువలన; తథా చ విశ్వావసుః = అట్లే విశ్వావసువు

**తాత్పర్యము :** ఇప్పుడు శ్రుతులయొక్క నిర్ణయము చెప్పుదును. శ్రుశ్రవణము శ్రు అను ధాతువు(నకు) నుండి క్తి అను ప్రత్యయముకలుపగా దానినుండి పుట్టినది ఈ శ్రుతి శబ్దము భావసాదనముగా వ్యాకరణ శాస్త్రజ్ఞులచే ప్రసాధ్యమైనది. వినబడుచున్నవిగాని శ్రుతులైనవి. అది ఏకము అనేకముగాని ఒకటికనుకనే శ్రుతియని (చెప్పబడినది) అది ఎట్లనగా? వాటిలో వాయువుల కలయిక వలన పురుష ప్రయత్నముచే ప్రేరేపింపబడి బొడ్డునకు పైగా ఊర్ధ్వాకారప్రదేశమును ఆక్రమించుచు పొగవలె మెట్లమార్గమురీతిగా వాయుప్రసార పద్ధతిగా మరికొంతమంది రెండు విధములైన శ్రుతులు అని తలచుచున్నారు. ఎట్లు? స్వర, అంతర భేదమువలన అట్లే విశ్వావసువు.

**శ్రవణేంద్రియగ్రాహ్యత్వాత్ ధ్వనిరేవ శ్రుతిర్భవేత్ ।**
**సాచైకాపి ద్విధా జ్ఞేయా స్వరాంతర విభాగతః ॥**

**ప్రతిపదార్ధము :** శ్రవణేంద్రియ గ్రాహ్యత్వాత్ = శ్రోత్రగ్రహణమువలన; ధ్వనిరేవ= ధ్వనియే; శ్రుతిర్భవేత్ = శ్రుతియగును; సా చ = ఆశ్రుతి; ఏకాపి= ఒక్కటైనను; స్వరాంతరవిభాగతః = స్వరఅంతర విభాగమువలన; ద్విధా జ్ఞేయా= రెండు విధములుగా తెలియదగినది

**తాత్పర్యము :** శ్రోత్రగ్రహణమువలన ధ్వనియే శ్రుతియగును ఆశ్రుతి

ఒక్కటైనను స్వరఅంతర విభాగము వలన రెండు విధములుగా తెలియదగినది.

**నియతశ్రుతి సంస్థానాత్ గీయంతే సప్తగీతిషు ।**
**తస్మాత్ స్వరగతా జ్ఞేయాః శ్రుతయః శ్రుతివేదిభిః ॥**

**ప్రతిపదార్థము :** నియతశ్రుతిసంస్థానాత్ = నిశ్చితమైన శ్రుతి యుండుటవలన; సప్తగీతిషు గీయంతే = ఏడు స్వరములయందును గానము చేయబడుచున్నవి; తస్మాత్= అందువలన; శ్రుతివేదిభిః = శ్రుతి వేత్తలచే; స్వరగతాః శ్రుతయః జ్ఞేయాః= స్వరగతములగు శ్రుతులు తెలియదగినవి

**తాత్పర్యము :** నిశ్చితమైన శ్రుతి యుండుటవలన ఏడు స్వరములయందును గానము చేయబడుచున్నవి. అందువలన శ్రుతివేత్తలచే శ్రుతులు స్వరగతములగు శ్రుతులు తెలియదగినవి.

**అంతః శ్రుతివివర్తిన్యో హ్యంతరశ్రుతయో మతాః ।**
**ఏతాసామపి వైశ్వర్యం క్రియాగ్రామవిభాగతః ॥**

**ప్రతిపదార్థము :** అంతః శ్రుతి వివర్తిన్యః = అంతః శ్రుతులుగా పరిణమించినవియై; అంతః శ్రుతయః మతాః = అంతః శ్రుతులుగా ఇష్టమగుచున్నవి; ఏతాసాం అపి = ఈ అంతః శ్రుతులకు కూడ; క్రియాగ్రామవిభాగతః = క్రియా, గ్రామ విభాగముగా; ఐశ్వర్యం = విభవము

కేచిత్ = కొందరు; స్థానత్రయయోగాత్ = స్థాన త్రయయోగము వలన; త్రివిధాం శ్రుతిం ప్రతిపద్యంతే = శ్రుతిని ముప్పిధమైనదిగా ప్రతిపాదించిరి; అపరే తు = మరికొందరు; ఇంద్రియవైగుణ్యాత్ = ఇంద్రియ విగుణత వలన; శ్రుతిం = శ్రుతిని; త్రివిధాం మన్యంతే = మూడు విధములైనదిగా తలచుచున్నారు; ఇంద్రియ వైగుణ్యంచ త్రివిధం = ఇంద్రియ వైగుణ్యము మూడు విధములైనది; సహజం దోషజం అభిఘాతజం చ ఇతి = సహజము, దోషజము, అభిఘాతజమని; అపరే తు = మరికొందరు; వాతపిత్తకఫ సన్నిపాతభేదభిన్నాం చతుర్విధాం శ్రుతిం ప్రతిపేదిరే = వాత, పిత్త, కఫ, సన్నిపాత భేదములచే నాల్గువిధములుగా శ్రుతిని ప్రతిపాదించిరి; తథా చాహ చతురః= ఆనాల్గింటిన చెప్పుచున్నాడు

**తాత్పర్యము** : అంతఃశ్రుతులుగా పరిణమించినవియై అంతఃశ్రుతులుగా ఇష్టమగుచున్నవి. ఈఅంతః శ్రుతులకు కూడ క్రియా, గ్రామ, విభాగముగా విభవము. కొందరు స్థానత్రయయోగము వలన శ్రుతిని ముివ్విధమైనదిగా ప్రతిపాదించిరి. మరికొందరు ఇంద్రియ విగుణతవలన శ్రుతిని మూడు విధములైనదిగా తలచుచున్నారు. ఇంద్రియ వైగుణ్యము మూడు విధములైనది. సహజము, దోషజము, అభిఘీతజమని. మరికొందరు వాత, పిత్త, కఫ, సన్నిపాత భేదములచే నాల్గు విధములుగా శ్రుతిని ప్రతిపాదించిరి. ఆనాల్గింటిని చెప్పుచున్నాడు.

> **ఉచ్చైస్తరో ధ్వనీ రూక్షో విజ్ఞేయో వాతజో బుధైః ।**
> **గంభీరో ఘన (నీ ? శీ)లశ్చ జ్ఞాతవ్యః పిత్తజో ధ్వనిః ॥**
>
> **స్నిగ్ధశ్చ సుకుమారశ్చ మధురః కఫజోధ్వనిః ।**
> **త్రయాణాం గుణసంయుక్తో విజ్ఞేయః సన్నిపాతజః ॥**
> **అపరేతు ....... న్నాదయో నవధా శ్రుతిం ప్రతిపద్యన్తే ॥** 27

**ప్రతిపదార్థము** : ఉచ్చైస్తరః = తారస్థాయి నొందినదియు; రూక్షః = రూక్షమైనదియు అయిన; ధ్వనిః = ధ్వని; వాతజః విజ్ఞేయః = వాయు జనితముగా తెలియదగినది; గంభీరః = గంభీరమైనట్టియు; ఘనశీలః = ఘనశీలమైన; ధ్వనిః = ధ్వని; పిత్తజః జ్ఞాతవ్యః = పిత్త జనితముగా తెలియవలెను; స్నిగ్ధః = స్నిగ్ధము; సుకుమారః = సకుమారము; మధురః = మధురమును అయిన; ధ్వనిః = ధ్వని; కఫజః = ధ్వనికఫజనితము; త్రయాణాం గుణ సంయుక్తః = ఈ మూడింటి గుణములు కలది; సన్నిపాతజః విజ్ఞేయః = సన్నిపాతోద్భవముగా తెలియవలెను; అపరే - - - - న్నాదయః = మరికొందరు; శ్రుతిం నవధా ప్రతిపద్యంతే = శ్రుతిని తొమ్మిది విధములుగా ప్రతిపాదించుచున్నారు; తథాహి - అదియుక్తమేగదా ! (ఎట్లనగా)

**తాత్పర్యము** : తారస్థాయి నొందినదియు రూక్షమైనదియు అయిన ధ్వని వాయుజనితముగా తెలియదగినది. గంభీరమైనట్టియు ఘనశీలమైన ధ్వని పిత్తజనితముగా తెలియవలెను. స్నిగ్ధము సుకుమారము మధురమును అయిన ధ్వని కఫజనితము. ఈ మూడింటి గుణములు కలది సన్నిపాతోద్భవముగా

తెలియవలెను. మరికొందరు శ్రుతిని తొమ్మిదివిధములుగా ప్రతిపాదించు చున్నారు. అదియుక్తమే గదా (ఎట్లనగా)

**ద్విశ్రుతిస్త్రిశ్రుతిశ్చైవ చతుఃశ్రుతిక ఏవ చ ।**
**స్వర ప్రయోగఃకర్తవ్యో వంశే ఛిద్రగతో బుధైః ॥** 28

**ప్రతిపదార్థము:** బుధైః = పండితులచే; ద్విశ్రుతిః, త్రిశ్రుతిః, చతుఃశ్రుతికః ఏవ= ద్వి,త్రి,చతుఃశ్రుతులనే; వంశే = వేణువునందు చేయదగినది; ఛిద్రగతః = ఛిద్రగతమైన; స్వరప్రయోగః కర్తవ్యః = స్వరప్రయోగము (ఉపయోగించి); భరతేనాప్యుక్తం = భరతునిచేతనుకూడ చెప్పబడినది

**తాత్పర్యము :** పండితులచే ద్వి, త్రి, చతుఃశ్రుతులనే వేణువునందుఛిద్రగతమైన స్వరప్రయోగము చేయదగినది.

భరతే ఏనాప్యుక్తమ్ = భరతునిచేతనుకూడ చెప్పబడినది

**ద్వికత్రికచతుష్కాస్తు జ్ఞేయా వంశగతాః స్వరాః ।**
**ఇతి తావన్మయా ప్రోక్తా సవంశశ్రుతయో నవ ॥**

**ప్రతిపదార్థము :** ద్వికః త్రిక = ద్వి, త్రి, చతుష్కాః = చతుఃశ్రుతియు కలవి; వంశగతాః స్వరాః విజ్ఞేయాః = వంశగతములైన స్వరములుగా తెలియనగును; ఇతితావత్ = ఇట్లని; మయా = నాచే; సవంశ శ్రుతయః = వంశసహిత శ్రుతులు; నవ = తొమ్మిది; ప్రోక్తాః = చెప్పబడినవి

**తాత్పర్యము :** ద్విశ్రుతి, త్రిశ్రుతి, చతుఃశ్రుతియు కలవి, వంశగతములైన స్వరములుగా తెలియనగును. నాచే వంశసహిత శ్రుతులు తొమ్మిది చెప్పబడినవి.

తత్ర కేచిత్ మీమాంసామాంసలితధియధియః ధీరా ద్వావింశతి - శ్రుతీర్మన్యంతే । కిచనపునః (షట్) షష్టిభేద భిన్నాః శ్రుతయ ఇతి మన్యంతే । అన్యేపునః ఆనంత్యం వర్ణయంతిశ్రుతీనామ్ ।

**ప్రతిపదార్థము :** కొందరు మీమాంస చేతను అందమైన బుద్ధికల ధీరులు 22 శ్రుతులుగా తలచుచున్నారు. మరికొందరు (60)భేదములనుచున్నారు.

మరికొందరు శ్రుతులనంతములను చున్నారు. యధా చాహకోహలః = కోహలుడిట్లు చెప్పుచున్నాడు;

**ద్వావింశతిం కేచిదుదాహరంతి (శ్రుతీః) శ్రుతిజ్ఞానవిచారదక్షాః ।**
**షట్ షష్టి భిన్నాః ఖలు కేచిదాసామానంత్యమేవ ప్రతిపాదయన్తి ॥**

**ప్రతిపదార్థము** : కేచిత్ = కొందరు; శ్రుతీః ద్వావింశతిం ఉదాహరంతి = 22 శ్రుతులను చెప్పుచున్నారు; కేచిత్ = కొందరు షట్ షష్టిభిన్నాః = 66గను; కేచిత్ = కొందరు; ఆనంత్యమేవ = అనంతముగను; ప్రతిపాదయంతి = ప్రతిపాదించుచున్నారు

ననుశ్రుతేః కింమానం? ఉచ్యతే ! (ఓయి!) శ్రుతికి ప్రమాణము (లెక్క) ఏది? (ఏమి) ? చెప్పబడుచున్నది. పంచమస్య శ్రుత్యుత్కర్షా పకర్షాభ్యాం మార్దవాదయతత్వాద్వా = యదంతరం తత్ ప్రమాణంశ్రుతేరితి = పంచమమునకు శ్రుతి ఉత్కర్ష అపకర్షలచే (హెచ్చు తగ్గులచే) మార్దవమువలన గాని, దీర్ఘత్వమువలన గాని; ఏఅంతరముగలదో అదిశ్రుతికి ప్రమాణమగునని, ఇదానీం ద్వావింశతి ప్రకారతాయా నిదర్శనం యథా = ఇప్పుడు 22 శ్రుతుల ప్రకారమునకు నిదర్శనము ఎట్లనగా; ద్వేవేణీ తుల్యప్రమాణే తంత్ర్యుపపాదనం దండమూర్ఛనాసమే కృత్వా షడ్జగ్రామాశ్రితే కార్యే = సమాన ప్రమాణముగల రెండు వేణులు తంత్రీ ఉపపాదనము దండమూర్ఛనా సమములుగాచేసి షడ్జగ్రామా శ్రితములుగా చేయవలెను. తయోః అన్యతరస్యాం మధ్యమగ్రామికీం శ్రుతిం కృత్వా పంచమస్య అపకర్షాత్ తామేవ శ్రుతిం పంచమవశాత్ షడ్జగ్రామకీంకుర్యాత్ = ఆరెండు వేణులలో ఒకదాని యందు మధ్యమగ్రామ సంబంధశ్రుతిని చేసి పంచమాపకర్షణ వలన ఆశ్రుతినే పంచమవశముగా; షడ్జగ్రామసంబంధిగా చేయవలెను; ఏవం శ్రుత్యపకృష్టా భవతి = ఇట్లు శ్రుత్యపకృష్టమగుచున్నది; ఉచ్చనీచమాత్రప్రతీతేః = ఉచ్చనీచమాత్రమైన ప్రతీతి వలన; పరం విశేషలాభోనాస్తి = అంతకంటె ఎక్కువ లాభము లేదు; పునరపి తద్వదేవ అపకర్షయేత్ = మరలకూడ అట్లే అపకర్షణముచేయవలెను; యథాగాంధార నిషాదౌ కర్తారౌ పునరన్యతరస్యాం స్థిరవీణాయాం ధైవతర్షభౌ కర్మతామాపన్నౌ ప్రవేక్ష్య(త ద్విశ్రుత్యేభ్యః సికలాత్) పునరపి తద్వదేవాప

కృష్టాయాం చలవీణాయాం ధైవతర్షభౌ ఇతరస్యాం పంచమషడ్జౌ ప్రవేక్ష్య తత్ త్రిశ్రుత్యధి కత్వాత్ పునరపి తద్వదేవ అపకృష్టాయాః పంచమమధ్యమ షడ్జాఇతి= ఎట్లనగా, గాంధారనిషాదములు కర్తలు. మరల దానిలోనొకటి స్థిరవీణయందు ధైవతరిషభములు కర్మత్వము పొందినవిగా చూచి (అది ద్విశ్రుతికంటె అధికమగుటవలన) మరల; దానివలె అపకర్షణమందుచేయగా, చలవీణయందు, ధైవతరిషభములు ఒకదానియందు పంచమషడ్జములు ప్రవేశపెట్టి అది త్రిశ్రుత్యధికమగుటవలన మరల దానివలెనే అపకృష్టముకాగా పంచమ మధ్యమ షడ్జములని. అస్యాం మధ్యమగాంధారనిషాదాః ప్రవిశంతి చతుఃశ్రుత్యధికత్వాత్= ఇందు మధ్యమ గాంధారనిషాదములు, చతుఃశ్రుత్యధికతవలన ప్రవేశించు చున్నవి. ఏవం అనేన దర్శనేన ద్వావింశతి శ్రుతయో భవంతి = ఇట్లు ఈవిధముగా చూపుటచే 22 శ్రుతులగు చున్నవి. ఏవం మధ్యమ- గామే ద్రష్టవ్యం= ఇట్లు మధ్యమ గ్రామమందును చూడవలెను.

(పట్టిక అపెండిక్స్ ఎ. చివరిపేజిలలో చూడుడు.)

చలవీణాయాః ప్రథమాపకర్షే శ్రుతిలాభోనాస్తి = చలవీణయొక్క ప్రథమాపకర్షణమందు శ్రుతిలాభము లేదు, ద్వితీయే చతుః శ్రుతిలాభః = ద్వితీయాపకర్షణమందు చతుః శ్రుతిలాభము; (చతుర్థే ద్వాదశ శ్రుతిలాభః= చతుర్థాపకర్షణ మందు ద్వాదశ శ్రుతి లాభము. ఏవం ద్వావింశతిభేద భిన్నాః శ్రుతయః త్రిషుస్థానేషు ప్రత్యేకావాద్వావింశతిప్రకార తయాశ్రుతిలాభః ?) = ఇట్లు 22 శ్రుతులు మూడు స్థానములందు ప్రత్యేకముగా గాని 22 విధములుగాగాని శ్రుతిలాభము? తృతీయే షట్ శ్రుతి లాభః = తృతీయాపకర్షణ మందు షట్ శ్రుతిలాభము; చతుర్థే ద్వాదశశ్రుతి లాభః = చతుర్థాపకర్షణము నందు ద్వాదశ శ్రుతిలాభము. ఏవం ద్వావింశతి భేదబిన్నాః శ్రుతయః దర్శితాః= ఇట్లు ద్వావింశతి శ్రుతి భేదములు చూపబడినవి; ఇదానీం షట్ షష్టి భేదభిన్నాః శ్రుతయః కథ్యంతే = 66 భేదములైన శ్రుతులు చెప్పబడుచున్నవి.

మందమధ్యమతారేషు ఉరః కంఠశిరస్సు త్రిషు స్థానేషు ప్రత్యేకం ద్వావింశతి ప్రకారతయా భిద్యమానేషు శ్రుతయో హి షట్ షష్టిభేదభిన్నా భవంతి ఇతి కేచిత్ మన్యంతే = మంద్ర మధ్యమ తార స్వరములందు, ఉరః కంఠ శిరస్సుల మూడు స్థానములందు ప్రత్యేకముగా ఇరువదిరెండువిధములుగా

ఛేదింపబడినవై శ్రుతులు 66 భేదములగుచున్నవని కొందరనుచున్నారు. అధునా శ్రుతీనాం ఆనంత్యం దర్శయామః = ఇప్పుడు శ్రుతుల అనంతత్వమును చూపుచున్నాము.

**ఆనంత్యం తు శ్రుతీనాం తు దర్శయంతి విపశ్చితః ।**
**యథాధ్వని విశేషాణాం ఆనంత్యం గగనోదరే ॥** 29

**ఉచ్చండ పవనోద్వేగ జలరాశిసముద్భవాః ।**
**(కి) యంతః ప్రతిపద్యంతే న తరంగ పరంపరాః ॥** 30
**ఇతి శ్రుతీనాం ఆనంత్యం దర్శితమ్ ॥**

**ప్రతిపదార్థము** : గగనోదరే ధ్వనివిశేషాణాం ఆనంత్యం యథా = ఆకాశోదర మందు అనంతమైన ధ్వని విశేషములవలె; శ్రుతీనాం ఆనంత్యం = అనంత శ్రుతులను, విపశ్చితః దర్శయంతి = పండితులు చూపుచున్నారు; ఉచ్చండ పవనోద్వేగ జలరాశిసముద్భవాః = భయంకరమైన వాయువు యొక్క ఉద్వేగము వలన జలరాశి (సముద్రము)నుండి పుట్టిన; తరంగపరంపరాః = అలల (వరుసలు) సముదాయములు; కియంతః న ప్రతిపద్యంతే = ఎన్నికుదురుటలేదు ! (అట్లే శ్రుతుల ఆనంత్యమును అనిభావము); ఇతిశ్రుతీనాం ఆనంత్యం దర్శితం = అని శ్రుతుల అనంతత్వము చూపబడినది; ఇదానీం శ్రుతీనాం తాదాత్మ్యాది వికల్పః కథ్యతే = ఇప్పుడు శ్రుతుల యొక్క తాదాత్మ్యాది వికల్పము చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : ఆకాశోదరమందు అనంతమైన ధ్వనివిశేషములవె అనంత శ్రుతులను పండితులు చూపుచున్నారు. భయంకరమైన వాయువుయొక్క ఉద్వేగము వలన జలరాశి (సముద్రము)నుండి పుట్టిన అలల (వరుసలు) సముదాయములు ఎన్నికుదురుటలేదు ! (అట్లే శ్రుతుల ఆనంత్యము అనిభావము) అని శ్రుతుల అనంతత్వము చూపబడినది. ఇప్పుడు శ్రుతుల యొక్క తాదాత్మ్యాది వికల్పము చెప్పబడుచున్నది.

**తాదాత్మ్యం చ వివర్తత్వం కార్యత్వం పరిణామితా ।**
**అభివ్యంజకతా చాపి శ్రుతీనాం పరికథ్యతే ॥** 31

**ప్రతిపదార్థము** : తాదాత్మ్యము, వివర్తత్వము, కార్యత్వము పరిణామత్వము అభివ్యంజకత్వమును; శ్రుతీనాం = శ్రుతులకు; పరికథ్యతే = చెప్పబడుచున్నది; ఇదానీం ఏతదేవ వివృణోతి = ఇప్పుడు దీనినే వివరించుచున్నాడు

**తాత్పర్యము** : తాదాత్మ్యము, వివర్తత్వము, కార్యత్వము, పరిణామత్వము, అభివ్యంజకత్వమును శ్రుతులకు చెప్పబడుచున్నది. ఇప్పుడు దీనినే వివరించుచున్నాడు.

**విశేష స్పర్శ శూన్యత్వాచ్ఛ్రవణేంద్రియ గ్రాహ్యతా ।**
**స్వరశ్రుత్యోస్తు తాదాత్మ్యం జాతివ్యక్త్యోరివానయోః ॥** 32

**ప్రతిపదార్థము** : విశేషస్పర్శశూన్యత్వాత్ = విశేషమైన స్పర్శరాహిత్యమువలన; శ్రవణేంద్రియగ్రాహ్యతా = శ్రవణేంద్రియగ్రహణత్వముండును; జాతివ్యక్త్యోః = జాతివ్యక్తులకువలె; స్వరశ్రుత్యోః = స్వరశ్రుతులను; అనయోః= ఈరెండింటికి; తాదాత్మ్యం = తాదాత్మ్యము

**తాత్పర్యము** : విశేషమైన స్పర్శరాహిత్యము వలన శ్రవణేంద్రియ గ్రహణత్వ ముండును స్వరశ్రుతులకు జాతివ్యక్తులకు ఈరెండింటికి తాదాత్మ్యము.

**నరాణాంచ ముఖం యద్వత్ దర్పణే తు వివర్తితమ్ ।**
**ప్రతిభాతి స్వరస్తద్వత్ శ్రుతిష్వేవ వివర్తితః ॥** 33

**ప్రతిపదార్థము** : దర్పణే = అద్దమందు; నరాణాం ముఖం = మనుష్యుల ముఖము; వివర్తితం యద్వత్ = వివర్తితమైన విధముగా; స్వరః = స్వరము; శ్రుతిషు ఏవ = శ్రుతులయందే; వివర్తితః ప్రతిభాతి = వివర్తితమై భాసించుచున్నది

**తాత్పర్యము** : అద్దమందు మనుష్యులముఖము వివర్తితమైన విధముగా స్వరము శ్రుతులయందే వివర్తితమై భాసించుచున్నది.

**శ్రుతీనాం శ్రుతికార్యత్వమతి కేచిద్వదంతి హి ।**
**మృత్పిండ దండ కార్యత్వం ఘటస్యేహ యథా భవేత్ ॥** 34

**ప్రతిపదార్థము** : ఇహ = ఇక్కడ; ఘటస్య = ఘటమునకు; మృత్పిండదండ కార్యత్వం యథాభవేత్ తథా = మట్టిముద్ద మరియు దండముచే ఎట్లు ఉత్పత్తి

కల్గునో ఆవిధముగా; శ్రుతీనాం శ్రుతికార్యత్వం = శ్రుతులకు శ్రుతికార్యత్వము; కేచిత్ వదంతి = కొందరు చెప్పుచున్నారు

**తాత్పర్యము** : ఘటమునకు మట్టిముద్ద మరియు దండముచే ఎట్లు ఉత్పత్తి కల్గునో ఆవిధముగా శ్రుతులకు శ్రుతికార్యత్వము కొందరు చెప్పుచున్నారు.

**శ్రుతయః స్వరరూపేణ పరీణమతి నసంశయః ।**
**పరిణమేత (?) యథాక్షీరం దధిరూపేణ సర్వథా ॥** 35

**ప్రతిపదార్థము** : సర్వథా = అన్నివిధముల; క్షీరం = పాలు; యథా = ఏవిధముగా; దధిరూపేణ పరిణమేత = పెరుగురూపముగా మారునో; తథా =అట్లే; శ్రుతయః= శ్రుతులు; స్వరరూపేణ = స్వరరూపముగా; పరీణమతి = మారుచున్నవి; న సంశయః = నిస్సందేహము

**తాత్పర్యము** : అన్నివిధముల పాలు ఏవిధముగా పెరుగురూపముగా మారునో అట్లే శ్రుతులు స్వరరూపముగా మారుచున్నవి నిస్సందేహము.

**షడ్జాదయః స్వరాః సప్త వ్యజ్యంతే శ్రుతిభిః సదా ।**
**అంధకార స్థితా యద్వత్ ప్రదీపేన ఘటాదయః ॥** 36

**ప్రతిపదార్థము** : అంధకార స్థితాః ఘటాదయః ప్రదీపేన యద్వత్ = చీకటిలో నున్న ఘటాదుల దీపముచేతను వలె; షడ్జాదయః సప్తస్వరాః = షడ్జాది సప్తస్వరములు; సదా = ఎల్లప్పుడు; శ్రుతిభిః వ్యజ్యంతే = శ్రుతులచేత వ్యక్తమగుచున్నవి

**తాత్పర్యము** : చీకటిలో నున్న ఘటాదులు దీపముచేతను వలె షడ్జాది సప్తస్వరములు ఎల్లప్పుడు శ్రుతులచేత వ్యక్తమగుచున్నవి.

**ఇతి తావన్మయాప్రోక్తం శ్రుతీనాం చవికల్పనమ్ ।**
**ఇదానీం సంప్రవక్ష్యామి వికల్పస్య చ దూషణమ్ ॥** 37

**ప్రతిపదార్థము** : ఇతి = ఈవిధముగా; శ్రుతీనాం వికల్పనం = శ్రుతులవికల్పనము; మయాప్రోక్తం = నాచే చెప్పబడినది; ఇదానీం = ఇప్పుడు; వికల్పస్య ధూషణం ప్రవక్ష్యామి = వికల్పదూషణమును చెప్పుదును

**తాత్పర్యము** : ఈవిధముగా శ్రుతుల వికల్పనము నాచే చెప్పబడినది ఇప్పుడు వికల్పదూషణమును చెప్పుదును.

భేదః స్వరలక్షణానాం (?) సామాన్యేనాన్యవస్తువత్ సిద్ధః ।
తద్విశేషైః శూన్యం భవతి నభః పుష్పసంకాశమ్ ॥ 38

నానాబుద్ధి ప్రసాద్యత్వాత్ స్వరశ్రుత్యోస్తు భిన్నతా ।
ఆశ్రయాశ్రయి భేదాచ్చ తాదాత్మ్యం నైవ సిధ్యతి ॥ 39

యదభాణి వివర్తత్వం శ్రుతీనాం తదసంగతమ్ ।
వివర్తత్వే స్వరాణాం హి భ్రాంతిజ్ఞానం ప్రసజ్యతే ॥ 40

కార్యకారణభావస్తు స్వర శ్రుత్యోర్నసంభవేత్ ।
శ్రుతీనామిహ సద్భావే ప్రమాణం నైవ విద్యతే ॥ 41

**ప్రతిపదార్థము** : స్వరలక్షణానాం భేదః = స్వరలక్షణముల భేదము; సామాన్యేన అన్యవస్తువత్ సిద్ధః = సామాన్యముగా వేరువస్తువువలె సిద్ధము; తత్ = అది; నభః పుష్ప సంకాశం = ఆకాశ పుష్ప తుల్యముగా; విశేషైః శూన్యం భవతి = విశేషముల చే శూన్యమగును; నానాబుద్ధి ప్రసాధ్యత్వాత్ = అనేక బుద్ధిసాధ్యతవలన; స్వరశ్రుత్యోః భిన్నతా = స్వర శ్రుతులకు భేదము వలన కూడ; తాదాత్మ్యం నైవసిధ్యతి = తాదాత్మ్యము సిద్ధించదు; శ్రుతీనాం వివర్తత్వం యత్ అభాణి తత్ అసంగతమ్ = శ్రుతుల వివర్తత్వమేది భాసించునో అదియును అసంగతమగును; స్వరాణాం వివర్తత్వే = స్వర వివర్తనమందు; భ్రాంతి జ్ఞానం ప్రసజ్యతే = భ్రాంతి జ్ఞానము సంభవించును; స్వర శ్రుత్యోః కార్యకారణ భావః న సంభవేత్ = స్వర శ్రుతులకు కార్యకారణ భావము సంభవించదు; ఇహ=ఇక్కడ; శ్రుతీనాం సద్భావే =శ్రుతుల సద్భావమందు; ప్రమాణం = ప్రమాణము; నైవ విద్యతే = ఉండనే ఉండదు

**తాత్పర్యము** : స్వరలక్షణముల భేదము సామాన్యముగా వేరువస్తువువలె సిద్ధము. అది ఆకాశపుష్పతుల్యముగా విశేషములచే శూన్యమగును. అనేక బుద్ధిసాధ్యత వలన స్వర శ్రుతులకు భిన్నత్వము ఆశ్రయఆశ్రయి భేదము వలనకూడ తాదాత్మ్యము సిద్ధించదు. శ్రుతుల వివర్తత్వమేది భాసించునో అదియును

అసంగతమగును. స్వర వివర్తనమందు భ్రాంతిజ్ఞానము సంభవించును. స్వరశ్రుతులకు కార్యకారణభావము సంభవించదు. ఇక్కడ శ్రుతుల సద్భావమందు ప్రమాణము ఉండనేఉండదు.

> అర్థాపత్త్యా యదివా వ్యాప్తి గ్రహణపూర్వకప్రమాణబలాత్ । (?)
> సిద్ధస్వర జనకానాం గగన గుణానాం స్వరోభేదః సత్యమ్ ॥ 42
>
> కార్యకారణ భేదోస్తి యద్యపిస్ఫుటమేవహి ।
> తథాపి కారణత్వం చ శ్రుతీనాం నైవ సంభవేత్ ॥ 43
>
> కార్యేషు విద్యమానేషు తు మృత్పిండో నోపలభ్యతే ।
> పరిణామోభివ్యక్తస్తు న్యాయ్యః పక్షః సతాం మతః ॥ 44
>
> ఇతి తావన్మయాప్రోక్తం తాదాత్మ్యాది వికల్పనమ్ ॥ 45

ప్రతిపదార్థము : అర్థాపత్త్యా = అర్థాపత్తిచేతను; యదివా = లేక; వ్యాప్తి గ్రహణ పూర్వక ప్రమాణ బలాత్ = వ్యాప్తి గ్రహణ ప్రమాణ బలము వలన; సిద్ధస్వర జనకానాం = సిద్ధ స్వర జనకములైన; గగన గుణానాం = గగనగుణములకు; స్వరః భేదః = స్వరము భేదము; సత్యం = యథార్థము; యద్యపికారకారణ భేదః అస్తి = వాస్తవమున కార్యకారణ భేదముకలదు; తత్ = అది; స్ఫుటమేవ= స్పష్టమైనదియే; తథాపి = అయినప్పటికి; కారణత్వం = కారణత్వము; శ్రుతీనాం= శ్రుతులకు; నైవ సంభవేత్ = కుదరదు; ఘటాదౌ భిద్యమానే = ఘటాదులు బద్ధలుకాగా; మృత్పిండః నోపలభ్యతే= మృత్పిండము లభ్యముకాదు; (అట్లే) పరిణామః అభివ్యక్తః = పరిణామము వ్యక్తమగును; న్యాయ్యః పక్షః = న్యాయముతో కూడినపక్షము; సతాంమతః = సజ్జనుల మతము; ఇతి = ఈవిధముగా; తాదాత్మ్యాదివికల్పనం తావత్ = తాదాత్మ్యాది వికల్పనము; మయా ప్రోక్తం = నాచేత చెప్పబడినది

నను శ్రుతీనాం ద్వావింశతి ప్రకారతా యత్ తదప్యసంగతం = శ్రుతుల 22 విధములను నదేదికలదో అదికూడ అసంగతమైనదియే; శ్రుతీనాం శ్రుత్యవయవానాం చానులంభాత్ తదుక్తం = శ్రుతులయొక్క, శ్రుత్యవయవములయొక్క ఉపలంభమువలన, అది చెప్పబడినది

**తాత్పర్యము** : అర్థాపత్తిచేతను లేక వ్యాప్తి గ్రహణ ప్రమాణ బలము వలన సిద్ధస్వర జనకములైన గగనగుణములకు స్వరము భేదము యదార్థము ఏకార్యకారణ భేదముకలదో అది స్పష్టమైనదియే అయినప్పటికి కారణత్వము శ్రుతులకు కుదరదు. ఘటాదులు బద్ధలు కాగా మృత్పిండములభ్యముకాదు. (అట్లే) పరిణామము వ్యక్తమగును. న్యాయపక్షము సజ్జనుల మతము ఈవిధముగా తాదాత్మ్యాది వికల్పనము నాచేత చెప్పబడినది.శ్రుతుల 22 విధములను నదేదికలదో అదికూడ అసంగతమైనదియే. శ్రుతులయొక్క, శ్రుత్యవయవములయొక్క ఉపలంభమువలన అది చెప్పబడినది

**కథం ప్రతీతిశ్చ భవేదముష్యా నాదౌ నభోద్యాకులితశ్రుతిత్వాత్ ।**
**భవేదలక్ష్యావయవా శ్రుతిస్తు+ + +నైవా వయవీ ప్రతీతా (?) ॥ 46**

**ప్రతిపదార్థము** : ఆదౌ = మొదట; నభోద్యాకులిత శ్రుతిత్వాత్ = ఆకాశాకులిత మైన శ్రుతిత్వమువలన; అముష్యాః = దీనియొక్క; ప్రతీతిః కథం భవేత్ = ఎట్లు ప్రతీతియగును? ; అలక్ష్యావయవాశ్రుతిః భవేత్ = శ్రుతి గుర్తింపబడని అవయవములుకలది (కూడ) యగును; నైవ అవయవీ ప్రతీతా = అవయవిగా ప్రసిద్ధముగాదు (కనబడదు)

**తాత్పర్యము** : మొదట ఆకాశకులితమైన శ్రుతిత్వమువలన వీటినిగూర్చి ఎట్లు ప్రతీతియగును? శ్రుతిగుర్తింపబడని అవయవములు కలది (కూడ) యగును. అవయవిగా ప్రసిద్ధముగాదు (కనబడదు)

**తాసాం భవతీతాః స్యుః కియత్యోమాత్రకాః ప్రతి ।**
**యది ద్వావింశతిస్తాసాం వ్యాపారః కః క్రమోత్క్రమాత్ ॥ 47**

**ప్రతిపదార్థము** : తాసాం = వాటికి; మాత్రకాః ప్రతి = మాత్రకములగూర్చి; కియత్యః = ఎన్ని (ఎంత); భవతీతాః స్యుః = అసాధారణ ములైనవగును; యది ద్వావింశతిః = 22అయినచో; క్రమోత్క్రమాత్ =క్రమ ఉత్క్రమము వలన; కః వ్యాపారః = ఏదికార్యము

**తాత్పర్యము** : వాటికి మాత్రకములగూర్చి ఎన్ని (ఎంత) అసాధారణములైన వగును 22అయినచో క్రమ ఉత్క్రమమువలన ఏదికార్యము.

**శ్రుతీనాం యద్యనంత్యంచ న నివార్యం ప్రసజ్యతే ।**
**ఏకత్వం వా భవేత్తస్యాం మాత్రకాణామ సంశయమ్ ॥ 48**

**ప్రతిపదార్థము :** శ్రుతీనాం = శ్రుతులకు; యదిఅనంత్యం = అనంతత్వమైన యెడల; నివార్యం నప్రసజయతే = హద్దు పనికిరాదు; (నివారణ) తస్యాం = దానియందు; మాత్రకాణాం = మాత్రకములు; ఏకత్వం వా = ఏకత్వముగాని; భవేత్ = అగును; అసంశయం = నిస్సందేహముగా

**తాత్పర్యము :** శ్రుతులకు అనంతత్వమైన యెడల హద్దుపనికిరాదు (నివారణ) దానియందు మాత్రకములు ఏకత్వముగాని అగును నిస్సందేహముగా.

**మాత్రకాఏవ నో సంతి కథం తాసాం వికల్పనమ్ ।**
**సతి ధర్మిణీ ధర్మాణాం సత్తే త్యాహుర్మనీషిణః ॥ 49**

**ప్రతిపదార్థము :** మాత్రకాః ఏవ న సంతి = మాత్రకములేనిచో; తాసాం = వాటికి; వికల్పనం కథం = వికల్పనమెట్లగును?; ధర్మిణి సతి = ధర్మియుండగా; ధర్మాణాం సత్తా ఇతి ఆహుః = ధర్మములుండుట యగునని పెద్దలు చెప్పుదురు

**తాత్పర్యము :** మాత్రకములేలేనిచో వాటికి వికల్పనమెట్లగును? ధర్మియుండగా ధర్మములుండుట యగునని పెద్దలు చెప్పుదురు.

**+ + + ++ధర్మాణః సంతోప్యాహుర్మనీషిణః ।**
**సత్వాసత్వే సదా గుణదోషాణాం గుణౌ తుయదా ॥ 50**

**వినైవ కారణం తాస్తాః స్వరాణాం కారణం యది ।**
**భవేయుః శ్రుతయస్తాసామాది ర్నేష్యేత కారణమ్ ॥ 51**

**కించ ప్రమాణగమ్యత్వే సమేఽ పి యది మాత్రకాః ।**
**నిహ్నోతవ్యాతదా రక్షా శ్రుతీనా మపిదుర్లభా ॥ 52**

**ప్రతిపదార్థము :** + + + + +ధర్మాణః = ధర్మములు; సంతోపి = ఉన్నప్పటికి; మనీషిణః ఆహుః = పండితులు చెప్పుచున్నారు; సదా = గుణదోషాణాం సత్వాసత్వే = గుణదోషముల సత్వాసత్వమందు; గుణౌ = గుణమందు; యదా = ఎప్పుడు; వినైవకారణం = కారణములేకనే; స్వరాణాంకారణం యది=

స్వరముల కారణమున్నయెడల; తాస్తాః శ్రుతయః భవేయుః = ఆయాశ్రుతులగును; తాసాం = వాటికి; ఆదిః కారణం న ఇష్యతే = ఆదికారణమసమ్మతము; కించ= మరియు; ప్రమాణగమ్యత్వే = ప్రమాణముచే గమ్యమానము కాగా; మాత్రకాః యది సమేపి = మాత్రకలు అన్ని; నిహ్నోతవ్యాః= కప్పిపుచ్చదగినవి; తదా = అప్పుడు; శ్రుతీనాం అపిరక్షాదుర్లభా = శ్రుతులకు కూడ రక్షదుర్లభము; అత్ర ఉచ్యతే = ఇచ్చట (ఈవిషయమై) చెప్పబడుచున్నది

**తాత్పర్యము :** ధర్మములు ఉన్నప్పటిక పండితులుచెప్పుచున్నారు గుణదోషముల సత్వాసత్వమందు గుణమందు ఎప్పుడు కారణములేకనే స్వరముల కారణమున్నయెడల ఆయాశ్రుతులగును. వాటికి ఆదికారణము సమ్మతము మరియు ప్రమానము గమ్యమానముకాగా అన్ని మాత్రకలు కప్పిపుచ్చదగినవి. అప్పుడు శ్రుతులకు కూడ రక్షదుర్లభము ఇచ్చట (ఈవిషయమై) చెప్పబడుచున్నది.

> **అర్థాపత్త్యానుమానేన ప్రత్యక్ష జ్ఞానతోపివా ।**
> **గృహ్యంతే శ్రుతయస్తావత్ స్వరాభివ్యక్తి హేతవః ॥** 53

**ప్రతిపదార్థము :** అర్థాపత్త్యా = అర్థాపత్తిచేతను; అనుమానేన = అనుమానము చేతను, ప్రత్యక్షజ్ఞానతః = ప్రత్యక్షముగాగాని (ఈమూడు ప్రమాణములచేతను) స్వరాభివ్యక్తి హేతవః శ్రుతయః గృహ్యంతే = స్వరమును వ్యక్తీకరించుటకు (స్పష్టముచేయుటకు) కారణములైన శ్రుతులు గ్రహింపబడుచున్నవి

ఏతదేవ స్పష్టీకరణార్థ ప్రస్తారేణ దర్శయామి = దీనినే (ఇదియే) స్పష్టీకరించుటకు ప్రస్తారముచేత చూపుచున్నాను; తత్రకేచిత్ దండప్రస్తారేణ దర్శయంతి = ద్వావింశతయః (?) శ్రుతయో రేఖాణాం ఇతి = అందుకొందరు దండ ప్రస్తారముచే రేఖలద్వారా 22శ్రుతులను చూపుచున్నారు; అన్యేతు వీణా ప్రస్తార్యం ఆహుః= మరికొందరు వీణాప్రస్తార్యమును చెప్పుచున్నారు; వయం పునః మండల ప్రస్తారం బ్రూమః = మేము మాత్రము (మతంగముని) మండల ప్రస్తారమును చెప్పుచున్నాము; తథాహి = అదియుక్తమేగదా !; (ఉపపాదనా ప్రకారమేమనగా) తిర్యగూర్ధ్వంచ పంచషడ్రేఖా ఇత్యేకాదశ = అడ్డగను నిలువుగను 5,6 గీతలు గీయుటచే 11 అగును; ఉభయో ద్వావింశతిః = రెండింటి

యందు 22 అగును; ఏవం గ్రామద్వయే-పృపయోగిన్యః శ్రుతయ ఇతి దర్శితాః = ఇట్లు రెండుగ్రామములందును శ్రుతులు ఉపయోగ పడునని చూపబడినవి; తద్యథా = అదిఎట్లనగా

**తాత్పర్యము** : అర్థాపత్తిచేతను అనుమానము చేతను ప్రత్యక్షముగాగాని (ఈమూడు ప్రమాణములచేతను) స్వరమును వ్యక్తీకరించుటకు (స్పష్టముచేయుటకు) కారణములైన శ్రుతులు గ్రహింపబడుచున్నవి. దీనినే (ఇదియే) స్పష్టీకరించుటకు ప్రస్తారముచేత చూపుచున్నాము. అందుకొందరు దండ ప్రస్తారముచే రేఖలద్వారా 22శ్రుతులను చూపుచున్నారు. మేము మాత్రము (మతంగముని) మండల ప్రస్తారమును చెప్పుచున్నాము. అదియుక్తమేగదా! (ఉపపాదనాప్రకారమేమనగా) అడ్డుగను నిలువుగను 5,6 గీతలు గీయుటచే 11 అగును. ఇట్లు రెండు గ్రామములందును శ్రుతులు ఉపయోగపడునని చూపబడినవి అదిఎట్లనగా -

**త్రిశ్రుతిరితి క్రమ్యాదౌ? దేయః షడ్జశ్చతుః శ్రుతిః ।**
**తదూర్ధ్వం ద్వేశ్రుతీ త్యక్త్వా తృతీయ ఋషభో మతః ॥ 54**

**తతశ్చైకాంశ్రుతిం త్యక్త్వా గాంధారో ద్విశ్రుతిః స్మృతః ।**
**తదను త్రిశ్రుతీస్త్యక్త్వా కర్తవ్యో మధ్యమ స్వరః ॥ 55**

**తదూర్ధ్వం పంచమః కార్యః పరిత్యజ్య శ్రుతిత్రయమ్ ।**
**శ్రుతిద్వయం పరిత్యజ్య కర్తవ్యో ధైవతస్తతః ॥ 56**

**ఏకాం శ్రుతిం పరిత్యజ్య నిషాదస్తదనంతరమ్ ।**
**షడ్జగ్రామసముద్భూత ఉక్తోసౌ శ్రుతిమండలః ॥ 57**

**ప్రతిపదార్థము** : క్రమ్యాదౌ శ్రుతిః ఇతి = క్రమ్యాదియందు త్రిశ్రుతియని; షడ్జంచతుఃశ్రుతి = షడ్జము చతుః శ్రుతికరము; తదూర్ధ్వం = దానిపైని; ద్వేశ్రుతీత్యక్త్వా = రెండు శ్రుతులువిడిచి; తృతీయః ఋషభః మతః = తృతీయ (ము) రిషభము సమ్మతము; తతః = తరువాత; ఏకాంశ్రుతి త్యక్త్వా = ఒక శ్రుతిని విడిచి = గాంధారః ద్విశ్రుతిః స్మృతః = గాంధారముద్విశ్రుతికము చెప్పబడినది; తదను = తరువాత; త్రిశ్రుతీః త్యక్త్వా = మూడు శ్రుతులను

విడిచి; మధ్యమస్వరః కర్తవ్యః = మధ్యమ స్వరముచేయదగినది; తదూర్ధ్వం = దానిపైని; శ్రుతిత్రయం పరిత్యజ్య = మూడు శ్రుతులను విడిచి; పంచమః కార్యః = పంచమముచేయదగినది; శ్రుతిద్వయం పరిత్యజ్య = రెండు శ్రుతులు విడిచి; తతః = తరువాత; ధైవతః కర్తవ్యః = ధైవతము చేయదగినది; తదనంతరం ఏకాశ్రుతిం పరిత్యజ్య = తరువాత ఒక శ్రుతిని విడిచి; నిషాదః కార్యః = నిషాదము చేయవలెను; షడ్జగ్రామసముద్భూతః = షడ్జగ్రామజనితమైన; శ్రుతిమండలః అసౌ ఉక్తః = ఈశ్రుతిమండలము చెప్పబడినది

**తాత్పర్యము** : క్రమ్యాదియందు త్రిశ్రుతియని షడ్జము చతుఃశ్రుతికరము దానిపైని రెండు శ్రుతులు విడిచి తృతీయ (ము) రిషభముసమ్మతము. తరువాత ఒక శ్రుతిని విడిచి గాంధారము ద్విశ్రుతికముచెప్పబడినది తరువాత మూడు శ్రుతులను విడిచి మధ్యమస్వరము చేయదగినది. దానిపైని మూడు శ్రుతులను విడిచి పంచమముచేయదగినది. రెండు శ్రుతులు విడిచి తరువాత ధైవతము చేయుదగినది. తరువాత ఒక శ్రుతిని విడిచి నిషాదముచేయువలెను. షడ్జగ్రామజనితమైన ఈశ్రుతిమండలము చెప్పబడినది.

తద్యథా షడ్జగ్రామే శృతిమండలమ్ :-

(పట్టిక అపెండిక్స్ బి. చివరిపేజీలలో చూడుడు.)

షడ్జగ్రామమందలి శ్రుతిమండలమేవిధమనగా :-

**ఇదానీం సంప్రవక్ష్యామి మధ్యమ శ్రుతిమండలమ్ ।**
**జ్ఞేయస్త్రిస్రోహ్యతి క్రమ్యమధ్యమో యం చతుః శ్రుతిః ॥**

**శ్రుతిద్వయమతిక్రమ్య తృతీయః పంచమో భవేత్ ।**
**తతస్త్రిస్రో హ్యతి క్రమ్య చతుర్థోధైవతో భవేత్ ॥**

**జ్ఞేయస్త్వేకామతి క్రమ్య నిషాదస్తు ద్వితీయకః ।**
**శ్రుతిత్రయమతిక్రమ్య తతః షడ్జశ్చతుర్థకః ॥**

**ఋషభస్తు ద్వయం త్యక్త్వా తృతీయః పరతో భవేత్ ।**
**శ్రుతిమేకామతిక్రమ్య గాంధారః స్యాద్వితీయకః ॥**

**ప్రతిపదార్థము** : ఇదానీం = ఇప్పుడు; మధ్యమ శ్రుతిమండలం సంప్రవక్ష్యామి=

మధ్యమ శ్రుతిమండలమును చెప్పుచున్నాను; తిస్రః అతిక్రమ్య = మూడు శ్రుతులను దాటి; అయం మధ్యమః చతుః శ్రుతిః జ్ఞేయః = ఈమధ్యమము చతుశ్రుతికము తెలియదగినది; శ్రుతిద్వయం అతి క్రమ్య = రెండు శ్రుతులను దాటి; తృతీయః పంచమః భవేత్ = మూడవది (త్రిశ్రుతికము) పంచమమగును; తతః తిస్రః అతిక్రమ్య = తరువాత మూడు శ్రుతులను దాటి; చతుర్థః ధైవతః భవేత్ = నాల్గవది ధైవతమగును; ఏకాం అతిక్రమ్య = ఒక శ్రుతిని దాటి; ద్వితీయకః నిషాదః జ్ఞేయః = రెండవది నిషాదమగును; శ్రుతిత్రయం అతిక్రమ్య= మూడు శ్రుతులను దాటి; తతః చతుర్థకః షడ్జః = తరువాత షడ్జము నాల్గవది యగును; ద్వయం త్యక్త్వా = రెండు శ్రుతులను విడిచి; పరతః = తరువాత; తృతీయః ఋషభః భవేత్ = మూడవది రిషభమగును; ఏకాంశ్రుతిం అతిక్రమ్య = ఒకశ్రుతిని దాటి; ద్వితీయకః గాంధారః స్యాత్ = రెండవది గాంధారమగును;

(పట్టిక అపెండిక్స్ సి. చివరి పేజీలలో చూడుడు)

భరతస్తుపునఋషభాదిశ్రుతిమండలం దర్శయతి = భరతుడును రిషభాదిశ్రుతిమండలమును చూపుచున్నాడు; కిమత్ర కారణం = ఇందుకు కారణమేమి?; ఉచ్యతే = చెప్పబడుచున్నది; గ్రామద్వయేపి అంతర్మూర్ఛనా ప్రతిపాదనార్థం = గ్రామద్వయమందును అంతర్మూర్ఛనను ప్రతిపాదించుట కొఱకు; యద్వా గ్రామద్వయేపి షడ్జమధ్యపరౌ గ్రామణ్యౌ భవతః = లేక గ్రామద్వయమందు షడ్జమధ్యపరములైన గ్రామములగుచున్నవి; అన్యస్వరాః = మిగిలిన స్వరములు; తదగ్రేసరాః ఇతి = వాటికి ముందుండుననుటయే

**తాత్పర్యము :** ఇప్పుడు మధ్యమశ్రుతిమండలమును చెప్పుచున్నాను. మూడు శ్రుతులను దాటి ఈమధ్యమము చతుఃశ్రుతికముగ తెలియదగినది. రెండు శ్రుతులను దాటి మూడవది (త్రిశ్రుతికము) పంచమమగును. తరువాత మూడు శ్రుతులను దాటి, నాల్గవది ధైవతమగును. ఒక శ్రుతిని దాటి రెండవది నిషాదమగును. మూడు శ్రుతులను దాటి తరువాత షడ్జమునాల్గవది యగును. రెండు శ్రుతులను విడిచి తరువాత మూడవది రిషభమగును. ఒక శ్రుతిని దాటి రెండవది గాంధారమగును. భరతుడును రిషబాదిశ్రుతిమండలమును చూపుచున్నాడు. ఇందుకుకారణమేమి? చెప్పబడుచున్నది. గ్రామద్వయమందును అంతర్మూర్ఛనను ప్రతిపాదించుట కొఱకు లేక గ్రామద్వయమందు

షడ్జమధ్యపరములైన గ్రామములగుచున్నవి. మిగిలిన స్వరములు వాటికి ముందుండుననుటయే.

**ఇతి తావన్మయాప్రోక్తాః శ్రుతయో గ్రామసంశ్రితాః ॥**

**ప్రతిపదార్థము** : ఈవిధముగా; గ్రామసంశ్రితాః శ్రుతయః = గ్రామాశ్రితములైన శ్రుతులు; మయా ప్రోక్తాః = నాచేత చెప్పబడినవి

**తాత్పర్యము** : ఈవిదముగా గ్రామాశ్రితములైన శ్రుతులు నాచేత చెప్పబడినవి.

**ఇతి శ్రుతిప్రకరణమ్**

* * *

**ఇదానీం సంప్రవక్ష్యామి స్వరాణాం చ వినిశ్చయమ్ ॥**

**ప్రతిపదార్థము** : ఇదానీం = ఇప్పుడు; స్వరాణాం వినిశ్చయం ప్రవక్ష్యామి = స్వరనిర్ణయము చెప్పుదును

**తాత్పర్యము** : ఇప్పుడు స్వరనిర్ణయము చెప్పుదును.

**తత్రాదౌ స్వర శబ్దస్య వ్యుత్పత్తిరిహ కథ్యతే ।**
**రాజృదీప్తావితిధాతోః స్వశబ్దపూర్వకస్యచ ॥** 63
**స్వయం యో రాజతే యస్మాత్ తస్మాదేష స్వరః స్మృతః ॥**

**ప్రతిపదార్థము** : తత్ర = అందు, ఆదౌ = మొదట; స్వరశబ్దవ్యుత్పత్తిః = స్వరశబ్దమునకు వ్యుత్పత్తి; ఇహ = ఇక్కడ; కథ్యతే = చెప్పబడుచున్నది; స్వశబ్దపూర్వకస్య = స్వశబ్దపూర్వకమైన; రాజృదీప్తౌ ఇతి ధాతోః = రాజృదీప్తౌ అనుధాతుము (యొక్క)నుండి; స్వయం = స్వయముగా; యస్మాత్ = దేనివలన; యః = ఏది; రాజతే = ప్రకాశించునో; తస్మాత్ = అందువలన; ఏష= ఇది; స్వరః స్మృతః = స్వరముగా చెప్పబడినది

ననుస్వరః ఇతికిం ? = స్వరమనగానేమి ?; ఉచ్యతే = చెప్పబడు చున్నది; రాగజనకోధ్వనిః స్వర ఇతి = రాగజనకమైనధ్వని స్వరమని; తథాచాహ కోహలః = అట్లే కోహలుడనుచున్నాడు

**తాత్పర్యము** : అందు మొదట స్వరశబ్దమునకు వ్యుత్పత్తి ఇక్కడ చెప్పబడు

చున్నది. స్వశబ్దపూర్వకమైన రాజృదీప్తౌ అనుధాతుము(యొక్క) నుండి స్వయముగా దేనివలన ఏది ప్రకాశించునో అందువలన ఇది స్వరముగా చెప్పబడుచున్నది. రాగజనకమైనధ్వని స్వరమని అట్లే కోహలుడనుచున్నాడు.

**ఆత్మేచ్ఛయా మహితలాత్ వాయురుద్యన్ని ధార్యతే ।**
**నాడీభిత్తౌ తథాకాశే ధ్వనిరక్తః స్వరః స్మృతః ॥**

**ప్రతిపదార్థము** : ఆత్మేచ్ఛయా = స్వేచ్ఛగా; మహితలాత్ = భూభాగము నుండి; వాయుః = వాయువు; ఉద్యన్ = పైకిలేచి; నిధార్యతే = ధరింపబడునో; నాడీభిత్తౌ = నాడీభిత్తియందు; తథా = అట్లే ; ఆకాశే = ఆకాశమందు; ధ్వనిరక్తః= ధ్వనిరంజకమై; స్వరః స్మృతః = స్వరముగా చెప్పబడినది

ననుస్వర ఏవ స్యాదేకోఽ నేకోవా వ్యాపకోఽ వ్యాపకోవా నిత్యోఽ నిత్యోవా స్యాత్ = స్వరము ఏకమా అనేకమా? వ్యాపకమా? అవ్యాపకమా? నిత్యమా? అనిత్యమా? అత్రోచ్యతే = ఇక్కడ చెప్పబడుచున్నది; ఏకోఽ నేకో వ్యాపకో నిత్యశ్చేతి = ఏకము, అనేకము, నిత్యము, అనిత్యము అని; తత్ర నిష్కలరూపేణైకః స్వరః = అందు నిష్కలరూపముగా ఏకస్వరము; షడ్జాదిరూపేణానేకస్వరః = షడ్జము మొదలుగ అనేక స్వరము; తథాచాహ కోహలః = కోహలుడట్లే చెప్పెను

**తాత్పర్యము** : స్వేచ్ఛగా భూభాగమునుండి వాయువు పైకిలేచి ధరింపబడునో నాడీభిత్తియందు అట్లే ఆకాశమందు ధ్వని రంజకమై స్వరముగా చెప్పబడినది.స్వరము ఏకమా? అనేకమా? వ్యాపకమా? అవ్యాపకమా? నిత్యమా? అనిత్యమా? ఇక్కడచెప్పబడుచున్నది, ఏకము, అనేకము, నిత్యము, అనిత్యము అని. అందు నిష్కలరూపముగా ఏకస్వరము షడ్జాదిరూపముగ అనేక స్వరము. కోహలుడట్లే చెప్పెను.

**జాతిభాషాది సంయోగాదనంతః కీర్తితః స్వరః ।**
**నాదైర్వ్యక్తస్తాలమితి కృతౌ యోజ్యో రసేష్వపి ॥**

**ప్రతిపదార్థము** : జాతిభాషాది సంయోగాత్ = జాతిభాషాదుల సంబంధము వలన; స్వరః = స్వరము; అనంతః కీర్తితః = అనంతమని చెప్పబడినది;నాదైః

యుక్తః = నాదములతో కూడినది; తాలమితి = తాలమని; కృతౌ = గ్రంథమందును; రసేషు అపి = రసములందును కూడ; యోజ్యః = కూర్చదగినది; ఇతి =అని; నిత్యః అవినాశీ = నాశములేనిది నిత్యస్వరము; వ్యాపకః స్వరగతః = అంతటనుండునది వ్యాపకస్వరము; తథాచాహకోహల

**తాత్పర్యము** : జాతిభాషాదుల సంబంధమువలన స్వరము అనంతమని చెప్పబడినది. నాదములతో కూడినది తాలమని, గ్రంథమందును, రసములందును కూర్చదగినది, నాశములేనిది నిత్యస్వరము. అంతటనుండునది వ్యాపకస్వరము.

**ఊర్ధ్వ నాడీప్రయత్నేన స్వరభిత్తి నిఘట్టనాత్ ।**
**మూర్ఛితో ధ్వనిరామూర్ధ్నః స్వరోఽసౌ వ్యాపకః పరః ॥**

**ప్రతిపదార్థము** : ఊర్ధ్వనాడీ ప్రయత్నేన = ఊర్ధ్వ నాడీప్రయత్నముచే; సర్వభిత్తి నిఘట్టనాత్ = సమస్త భిత్తుల (గోడల) ఘట్టనమువలన; ఆమూర్ధ్నః = శిరః పర్యంతము; మూర్ఛితః = మూర్ఛితమైన; అసౌ ధ్వనిః= ఈధ్వని; పరః = ఉత్కృష్టమైన; వ్యాపకః స్వరః = వ్యాపక స్వరమగుచున్నది

నను షడ్జాదీనాం కథం స్వరత్వం ? వ్యంజనత్వాత్ = ఓయీ షడ్జాదులకు ఎట్లు స్వరత్వము (సిద్ధించినది)? వ్యంజనత్వమువలన; యదివ్యంజనానాం స్వరత్వమభిధీయతే = వ్యంజనములకు స్వరత్వము చెప్పబడిన యెడల; తదానీం = అప్పుడు; కాదీనామేవాస్తు స్వరత్వం = కాదులకు కూడ స్వరత్వము సిద్ధించుగాక !; (ఇదిపూర్వపక్షము) అత్రోచ్యతే = ఇక్కడ చెప్పబడుచున్నది; అసాధారణ త్వాత్ షడ్జాదీనా మేవస్వరత్వం నకాదీనాం ఇతి = అసాధారణత వలన షడ్జాదులకే స్వరత్వము; కమొదలుగు వాటికి స్వరత్వములేదని; నను షడ్జాదీనాం అసాధారణత్వం కథం = షడ్జాదులక సాధారణత్వమెట్లు? ఆప్తోపదేశాత్ షడ్జాదీనాం అసాధారణ త్వం = ఆప్తుల ఉపదేశమువలన షడ్జాదులకు అసాధారణత్వము

**తాత్పర్యము:** ఊర్ధ్వ నాడీప్రయత్నముచే సమస్తభిత్తుల (గోడల) ఘట్టనమువలన మూర్ఛితమైన ఈధ్వని ఉత్కృష్టమైన వ్యాపక స్వరమగుచున్నది. ఓయీ షడాదులకు ఎట్లు స్వరత్వము (సిద్ధించినది?) వ్యంజనత్వము వలన

వ్యంజనములకు స్వరత్వము చెప్పబడిన యెడల అప్పుడు కాదులకు కూడ స్వరత్వము సిద్ధించుగాక ! (ఇదిపూర్వపక్షము) ఇక్కడ చెప్పబడుచున్నది. అసాధారణత వలన. షడ్జాదులకే స్వరత్వము కమొదలగు వాటికి స్వరత్వమెట్లు? ఆప్తుల ఉపదేశమువలన షడ్జాదులకు అసాధారణత్వము.

**తథాచాహకోహలః - మహేశ్వరః -**

**షడ్జం వదతి మయూర ఋషభం చాతకో వదేత్ ।**
**అజా వదంతి గాంధారం క్రౌంచో వదతి మధ్యమమ్ ॥**

**పుష్పసాధారణే కాలే కోకిలః పంచమం వదేత్ ।**
**ప్రావృట్కాలే తు సంప్రాప్తే ధైవతం దర్దురో వదేత్ ॥**
**సర్వదా చ తథా దేవి ! నిషాదం వదతే గజః ॥**

**ప్రతిపదార్థము** : షడ్జం మయూరః వదతి = షడ్జస్వరమును మయూరము పలుకును; ఋషభం చాతకః వదేత్ = రిషభమును చాతకము పలుకును; గాంధారం అజాః వదంతి = గాంధారమును అజములు (మేకలు) పలుకును; క్రౌంచః మధ్యమం వదతి = క్రౌంచ పక్షి మధ్యమమును పలుకును; పుష్పసాధారణేకాలే= వసంతకాలము నందు; కోకిలః పంచమం వదేత్ = కోకిల పంచమ స్వరమును పలుకును; ప్రావృట్ కాలేతు సంప్రాప్తే = వర్షాకాలమురాగా; దర్దురః ధైవతం వదేత్ = కప్ప ధైవతస్వరము పలుకును; తథా = అట్లే, దేవి ! = ఓ పార్వతీ !; స్వరదా = ఎల్లప్పుడు; గజః నిషాదం వదతే = మదగజము నిషాదస్వరము పలుకును

యద్వా ఊర్ధ్వధ్వని గామిత్వేన షడ్జాదీనా మేవ సాధారణత్వం ఇతి = లేక ఊర్ధ్వధ్వని గమనముచే షడ్జాదులకే సాధారణత్వమని; అథవా = లేక; షడ్జాదయః స్వరాః న భవంతి = షడ్జాదులు స్వరములు కాకపోవును; ఆకారాదయ ఏవ స్వరాః = ఆ మొదలగునవియే స్వరములు; షడ్జాదయస్తు తేషామాకారా దీనాం ఉచ్చారణార్థమితి = షడ్జాదులు ఆఆకారాదుల ఉచ్చారణ కొఱకు అని; నను చతుర్దశానాం స్వరాణాం మధ్యే ఆకారాదీనాం కథం గ్రహణత్వం = ఓయీ ! 14 స్వరములలో ఆకారాదులకు ఎట్లుగాగ్రహణము? సత్యముక్తం =

నిజము చెప్పబడినది; ఏతేషామసాధారణత్వేన గ్రహణం కృతం = వీటికి అసాధారణముచేతనే వీటి గ్రహణముచేయబడినది; అసాధారణ త్వంచ ఏతేషాం ఊర్ధ్వధ్వని గామిత్వేన = అసాధారణతయు వీటికి ఊర్ధ్వధ్వని గమనముచేతనే; యద్వా షడ్జాదీనాం వ్యంజనానాం స్వరత్వం ఉక్తం = లేక షడ్జాదివ్యంజనములకు స్వరత్వము చెప్పబడినది; న తు సంకేతమాత్రం ఏతదుక్తం భవతి = సంకేతమాత్రముగా ఇది చెప్పబడలేదు; ఆచార్యాణాం పరిభాషేత్యర్థః = ఆచార్యుల (శిష్టుల) భాషణము అని అర్థము

ఇదానీం అవసరప్రాప్తం చాతుర్విధ్యం స్వరాణాం దర్శయామి = ఇప్పుడు అవసరముగా ప్రాప్తించిన స్వరముల చతుర్విధత్వమును చూపుచున్నాను; తద్యధా = అదియెట్లనగా; వదనాత్ = ప్రతిపాదకత్వము వలన వాదీ = వాదిస్వరము, స్వామి వత్ = ప్రభువువలె; సంవదనాత్ = సంవదనము వలన; సంవాదీ = సంవాదిస్వరము; అమాత్యవత్ = మంత్రివలె; అనువదనాత్ = అనువదనమువలన; అనువాదీ = అనువాదిస్వరము; పరిజనవత్ = సేవకునివలె; వివదనాత్ = వివాదమువలన; వివాదీ = వివాది స్వరము; శత్రువత్ = శత్రువువలె; నను వదనాది కం ప్రాణిధర్మః = ఓయీ వదనాదికము ప్రాణిధర్మము; కథం అచే నానాం స్వరాణాం సంభవతి = ఎట్లు అచేతనములైన స్వరములకు సంభవించును?; సత్యముక్తం = నిజముచెప్పబడినది; వదనం హి నామాత్ర ప్రతిపాదకత్వంవివక్షితం న వచనమితి = వదనమనగా నిక్కడ ప్రతిపాదకత్వము; వచనముకాదు; కింతత్ ప్రతిపాదయతి? = ఏమి ప్రతిపాదించును?; రాగస్య రాగత్వంజనయతి = రాగమునకు రాగత్వమును పుట్టించును; త్రికేచ వాదినః సప్త ఏవ = త్రికమందు వాది స్వరములు ఏడే; స చ వాద్యాంశవత్ దశవిధో బోద్ధవ్యః = అది వాద్యాంశమువలె పదివిధములుగా తెలియదగినది

**వాదిమండలం యథా - వాదిమండల మెట్లనగా -**

స రిగమ పదనీ ! ; సంవాదినస్తు పునః సమశ్రుతికత్వే సతి త్రయోదశనవాంతరత్వేన అవబోద్ధవ్యాః = సంవాదిస్వరములు సమశ్రుతికముకాగా (ఉండగా) పదమూడు తొమ్మిది అంతరముచే

తెలియదగినవి; కింతత్ సంవాదినీత్వం నామ = సంవాదినీ త్వమనమగానేమి?; యద్వాదిస్వరేణ రాగస్య రాగత్వం జనితం తన్నిర్వాహకత్వం నామ సంవాదిత్వం = వాదిస్వరముచే రాగమునకు రాగత్వము జనితమగును. దాని నిర్వాహకత్వమే సంవాదిత్వము

**సంవాదిమండలం యథా -**

(పట్టిక అపెండిక్స్ డి. చివరి పేజీలలో చూడుడు)

**యోఽ ంశత్వేన**

ఇతి సంవాదిమండలం = ఈవిధమైనది, సంవాదిమండలము; సంవాదిప్రయోగో యథా = సంవాదిప్రయోగము ఎట్లనిన; యస్మిన్ గీతే యోఽ ంశత్వేన పరికల్పితః షడ్జః తస్య స్థానే మధ్యమః క్రియమాణః రాగహా న భవేత్= యేగీతమందు యేషడ్జమము అంశముగా కల్పించబడునో దాని స్థానమందు మధ్యమముచేయబడుచున్నదై రాగనాశకముకాదు; యస్మిన్ స్థానే మూర్ఛనావశాత్ మధ్యమః ప్రయుక్తః అస్మిన్ స్థానే క్రియమాణః షడ్జః జాతిరాగహా భవేత్ = దేని స్థానమందు మూర్ఛనావశము వలన మధ్యమము ప్రయోగింపబడునో దాని స్థానమందు చేయబడిన షడ్జము జాతిరాగనాశకముకాదు; షడ్జపంచమయోః స్థానే పంచమషడ్జౌ ప్రయుజ్యమానౌ జాతిరాగహానికరౌ న భవతః = షడ్జపంచమస్థానములందు పంచమ - షడ్జములు ప్రయోగింపబడుచు జాతిరాగహానికరములు కావు; ఏవం ఋషభ ధైవతయోః స్థానే ధైవతర్షభౌ ప్రయుజ్యమానౌ జాతిరాగ వినాశకరౌన భవతః = ఇట్లే రిషభధైవతముల స్థానమందు ధైవతరిషభములు ప్రయోగింపబడినవై జాతిరాగ వినాశకములుకావు; ఏవం గాంధారనిషాదయోః స్థానే నిషాదగాంధారౌ ఋషభస్య ధైవతాంశత్వేన ధైవతస్య ఋషభాంశత్వేన తదుభయరాగ జనన్యాశ్చర్షభజాతే ఋషభాంశపరిగ్రహాత్ పరస్పర సంబద్ధౌ చ ప్రయుజ్యమానౌ జాతిరాగ వినాశకరౌ న భవతః = ఇట్లే గాంధార నిషాదములస్థానమందు నిషాదగాంధారములు రిషభమునకు ధైవతాంశత్వముచేతను, ధైవతమునకు రిషభాంశముచేతను, ఆరెండు రాగముల మాతృకచేతను రిషభజాతికి

రిషభాంశగ్రహణమువలన అన్యోన్యము సంబంధము కలవై ప్రయోగింపబడినవై జాతిరాగనాశకములు కావు; అనువాదిత్వం చపునః ఏకశ్రుత్యంతరహీనత్వేన స్యాత్ = అనువాదిత్వము మాత్రము ఒక శ్రుతి అంతరమున హీనముఅగును; నను కిం తత్ అనివాదిత్వం ?= ఓయీ ? ఆఅనువాది త్వమనగానేమి?; యత్ సంవాదినా రాగస్య రాగత్వం సంపాదితం తత్ ప్రతిపాదకం నామానువాదిత్వంయథా = సంవాదిచేత రాగమునకు రాగత్వము సంపాదింపబడునో దానిని ప్రతిపాదించునది అనువాదిత్వము ఎట్లనగా -

(పట్టిక అపెండిక్స్ ఇ. చివరిపేజీలలో చూడుడు.)

**అనువాదిప్రయోగో యథా -**

షడ్జస్థానే ఋషభః ఋషభస్థానే షడ్జః ప్రయుజ్యమానః స్వరూపం భజన్ జాతిరాగహా న భవతి = షడ్జస్థానమునందు రిషభము, రిషభస్థానమున షడ్జము ప్రయోగింపబడుచున్నదై స్వరూపమునుపొందుచు జాతిరాగనాశకము గాదు; పంచమస్య స్థానే ధైవతః ప్రయుజ్యమానః ధైవతస్య స్థానే పంచమః ప్రయుజ్యమానః రాగహా న భవేత్ = పంచమస్థానమందు ధైవతము, ధైవతస్థానమందు పంచమము ప్రయోగింపబడి రాగనాశకము కాదు; షడ్జస్థానే ధైవతః ప్రయుజ్యమానః ధైవతస్థానే షడ్జః ప్రయుజ్యమానః జాతిరాగ వినాశకరో న భవతి= షడ్జస్థానమందు ధైవతము, ధైవత స్థానమందు షడ్జము ప్రయోగించబడి జాతిరాగవినాశకముకాదు; పంచమస్థానే ఋషభః ప్రయుజ్యమానః ఋషభస్థానే పంచమః ప్రయుజ్యమానః జాతిరాగహా న భవేత్ = పంచమస్థానమందు రిషభము, రిషభస్థానమందు పంచమము ప్రయోగించబడి జాతిరాగ వినాశకముకాదు; ఇదానీం గాంధార నిషాదయోః ఏకశ్రుత్యంతరహీనత్వేన అనువాదిత్వే ప్రాప్తే ద్వ్యంతరత్వాత్ వివాదిత్వముక్తం = ఇప్పుడు గాంధారనిషాదములకు ఏకశ్రుత్యంతర రహితముచే అనువాదిత్వము రాగా ద్విశ్రుత్యంతరమువలన వివాదిత్వము చెప్పబడినది; కింతత్ వివాదిత్వం నామ = ఆవివాదిత్వమనగానేమి ?; వాద్యాదిభిః స్వరైర్యత్ రాగస్య వాదిత్వం సంవాదిత్వమను వాదిత్వం ప్రాప్తం తద్వినాశకత్వం నామ వివాదిత్వం = వాద్యాదిస్వరములచే యేరాగమునకు వాదిత్వ- సంవాదిత్వ- అనువాదిత్వములు పొందబడినవో వాటి వినాశకత్వమే వివాదిత్వము

**వివాదిమండలం యథా -**

(పట్టిక అపెండిక్స్ ఎఫ్. చివరిపేజీలలో చూడుడు.)

**వివాది ప్రయోగో యథా -**

ఋషభస్థానే గాంధారః ప్రయుజ్యమానః గాంధార స్థానే పంచమ ఋషభః ప్రయుజ్యమానః జాతిరాగహానికరో భవేత్ = రిషభస్థానమందు గాంధారము, గాంధారస్థానమున పంచమము రిషభము ప్రయోగింపబడిన జాతి రాగహానియగును; ధైవతస్థానే నిషాదః ప్రయుజ్యమానః జాతిరాగహానికరో భవేత్ = ధైవతస్థానమందు నిషాదము ప్రయోగించబడిన జాతిరాగహానియగును; ఇతి షడ్జగ్రామే = అని షడ్జగ్రామమందు;

ఇదానీం మధ్యమగ్రామే వాదిత్వం సంవాదిత్వం అనువాదిత్వంచ ప్రదర్శ్యతే = ఇప్పుడు మధ్యమగ్రామమున వాదిత్వము, సంవాదిత్వము అనువాదిత్వము చూపబడుచున్నది; తత్ర వాదినః మధ్యమాది స్వరాః = అందు వాదిస్వరములు మధ్యమములు మొదలగునవి; సప్త నవకత్రయో దశాంతాః సంవాదినః = 7,9,13 వరకు సంవాదిస్వరములు; ఏకశ్రుత్యన్తరహీనాదనువాదినః= ఒక శ్రుత్యంతరహీనమువలన అనువాదిస్వరములు; ద్వ్యంతరౌ తు స్వరౌ వివాదినౌ = ద్విశ్రుత్యంతరములు వివాదిస్వరములు; మధ్యమగ్రామే వాదిమండలం = మపదనిసరిగ . సంవాది మండలం యథా -

(పట్టిక అపెండిక్స్ జి. చివరిపేజీలలో చూడుడు.)

**మధ్యమగ్రామే అనువాదిమండలమ్ యథా -**

(పట్టిక అపెండిక్స్ హెచ్. చివరిపేజీలలో చూడుడు.)

**మధ్యమగ్రామే వివాదిమండలం యథా -**

(పట్టిక అపెండిక్స్ ఐ. చివరిపేజీలలో చూడుడు.)

ఇదానీం సప్తవిధ స్వరయోగస్య నామాని కథ్యంతే = ఇప్పుడు సప్తవిధములైన స్వరయోగము యొక్క నామములు చెప్పబడుచున్నవి; ఆర్చికం, గాండికం, సామికం, స్వరాంతరం, ఔడవం, షాడవం, సంపూర్ణం చేతి; తథాచాహ నారదః= అట్లు నారదుడు చెప్పెను

"ఆర్చికో గాడికశ్చైవ సామికశ్చ స్వరాంతరః ।
ఔడవం షాడశ్చైవ సంపూర్ణశ్చేతి సప్తమః ॥

ఆర్చికము, గాడికము, సామికము, స్వరాంతరము, ఔడవము. షాడవము ఏడవది సంపూర్ణము.

ఏకస్వర ప్రయోగః ఆర్చికః సోఽభిధీయతే ।
గాడికో ద్విస్వరో జ్ఞేయః త్రిస్వరశ్చైవ సామికః ॥
చతుఃస్వర ప్రయోగో హి కథితస్తు స్వరాంతరః ।

ప్రతిపదార్థము : ఏకస్వరప్రయోగః ఆర్చికః అభిధీయతే = ఏకస్వరప్రయోగముకలది ఆర్చికముగా చెప్పబడును; ద్విస్వరః గాడికః జ్ఞేయః = ద్విస్వరయుతము గాడికము; త్రిస్వరః సామికః = త్రిస్వరయుతము సామికము; చతుః స్వరప్రయోగః స్వరాంతరః కథితః = చతుః స్వరప్రయోగము స్వరాంతరమనబడును; ఔడవః = ఔడవము

పంచమేన ధృతో యస్మాత్ తేనాసౌ ధైవతో మతః ।
లలాటే ధైవత ఇత్యర్థః ॥

ప్రతిపదార్థము : యస్మాత్ = ఎందువలన; పంచమేన ధృతః = పంచమము చేధృతమగునో; తస్మాత్ = అందువలన; ధైవతః మతః = ధైవతముగా అంగీకృతము; లలాటే = ఫాలమందు; ధైవతః ఇత్యర్థః = ధైవతమని యర్థము

తాత్పర్యము : ఎందువలన పంచమముచే ధృతమగునో అందువలన ధైవతముగా అంగకృతము. ఫాలమందు ధైవతమని యర్థము.

నిషీదంతి స్వరాః సర్వే నిషాదస్తేన కథ్యతే ।
చతుః శ్రుతిస్వరా విప్రాస్త్రిశ్రుతీ క్షత్రియౌమతౌ ॥ 64

ప్రతిపదార్థము : సర్వే స్వరాః = అన్నిస్వరములు; నిషీదంతి = కూర్చొన్నవి; (ఉన్నది) తేన = అందుచే; నిషాదః కథ్యతే = నిషాదము అగుచున్నది; చతుః శ్రుతి స్వరాః విప్రాః = చతుఃశ్రుతిస్వరములు విప్రజాతికములు; త్రిశ్రుతీక్షత్రియౌ మతౌ = త్రిశ్రుతికములు క్షత్రియజాతికములు

**తాత్పర్యము :** అన్నిస్వరములు కూర్చొన్నవి (ఉన్నది) అందుచే నిషాదము అగుచున్నది. చతుః శ్రుతిస్వరములు విప్రజాతికములు. త్రిశ్రుతికములు క్షత్రియజాతికములు.

**వైశ్యౌ ద్విశ్రుతికౌ జ్ఞేయౌ శూద్రౌ చాంతరకౌ స్వరౌ ॥** 65

**ప్రతిపదార్థము :** ద్విశ్రుతికౌ వైశ్యౌ జ్ఞేయౌ = ద్విశ్రుతికములు వైశ్యజాతికములు; అంతరకౌ స్వరౌ శుద్రౌ = అంతర స్వరములు శూద్రజాతికములు

**తాత్పర్యము :** ద్విశ్రుతికములు వైశ్యజాతికములు. అంతరస్వరము శూద్రజాతికములు.

**వర్గాష్టకం తు సంప్రాప్య అకారాదియశాంతకమ్ ।**
**వర్ణమాత్రసమాయుక్త ముద్ధరేత్ స్వరసప్తకమ్ ॥** 66

**ప్రతిపదార్థము :** వర్గాష్టకం సంప్రాప్య = వర్గాష్టకమును పొంది; అకారాది యశాంతకం= అకారముమొదలు యశవరకు; వర్ణమాత్రసమాయుక్తం = వర్ణమాత్రముగా కూడియుండి; స్వరసప్తకం ఉద్ధరేత్ = సప్త స్వరములను ఉద్ధరించవలెను

**తాత్పర్యము :** వర్గాష్టకమునుపొంది అకారము మొదలు యశవరకు వర్ణమాత్రముగా కూడియుండి సప్తస్వరములను ఉద్ధరించవలెను.

**అష్టమస్య తృతీయం తు హరిబీజసమన్వితమ్ ।**
**ఆద్యం స్వరం స్వరజ్ఞస్తు ఉద్ధరేత్తు ప్రయత్నతః ॥** 67

**ప్రతిపదార్థము :** అష్టమస్య = అష్టమ వర్గమునకు; హరిబీజసమన్వితం = హరిబీజముతో కూడిన; తృతీయం = తృతీయమును; ఆద్యం స్వరం = ఆద్యస్వరమును (షడ్జమును); ప్రయత్నతః ఉద్ధరేత్ = ప్రయత్నమువలన ఉద్ధరించవలెను

**తాత్పర్యము :** అష్టమ వర్గమునకు హరిబీజముతో కూడిన తృతీయమును ఆద్యస్వరమును (షడ్జమును) ప్రయత్నమువలన ఉద్ధరించవలెను.

**సప్తమస్య ద్వితీయం తు కామబీజ సమన్వితమ్ ।**
**ద్వితీయం తు స్వరం విద్ధి బ్రహ్మస్థానసముద్భవమ్ ॥** 68

ప్రతిపదార్థము : సప్తమస్య ద్వితీయం = సప్తమవర్గముయొక్క ద్వితీయాక్షరము; కామ బీజసమన్వితః = కామబీజయుతమైనది; బ్రహ్మస్థానసముద్భవం = బ్రహ్మస్థాన జనితమైన; ద్వితీయం స్వరం విద్ధి = రెండవ స్వరము (రిషభము)గా తెలియుము

**తాత్పర్యము** : సప్తవర్గము యొక్కద్వితీయాక్షరము కామబీజయుతమైనది. బ్రహ్మస్థానజనితమైన రెండవ స్వరము (రిషభము) గా తెలియుము.

**ద్వితీయస్యాపి వర్గస్య తృతీయం విష్ణు సంయుతమ్ ।**
**ఉద్ధరేచ్చ స్వరం నిత్యం స్వరభేదమనోహరమ్ ॥** 69

ప్రతిపదార్థము : ద్వితీయస్యాపి వర్గస్య = రెండవవర్గమునకు కూడ; విష్ణుసంయుతం తృతీయం = విష్ణుయుతమైన మూడవ వర్ణమును; నిత్యం = సదా; స్వరభేదమనోహరం = స్వరభేదమువలన అందమైన; స్వరం = స్వరమును (గాంధరము); ఉద్ధరేత్ = ఉద్ధరించవలెను

**తాత్పర్యము** : రెండవవర్గమునకుకూడ విష్ణుయుతమైన మూడవ వర్ణమును సదా స్వరభేదమువలన అందమైన స్వరమును (గాంధారము) ఉద్ధరించవలెను.

**షష్ఠస్యాపి హి వర్గస్య అంతిమం చాదిసంయుతమ్ ।**
**అవినష్టం విజానీయాన్మధ్యమం స్వరసత్తమమ్ ॥** 70

ప్రతిపదార్థము : షష్ఠస్య వర్గస్య = 6వ వర్గముయొక్క; ఆదిసంయుతం అంతిమం = మొదటిదానితో కూడిన అంతిమాక్షరము; అవినష్టం = నశించనిదైన; స్వరసత్తమం మధ్యమం విజానీయాత్ = శ్రేష్ఠస్వరమైన మధ్యమముగా తెలియవలెను

**తాత్పర్యము** : 6వ వర్గముయొక్క మొదటిదానితో కూడిన అంతిమాక్షరము నశించనిదైన శ్రేష్ఠస్వరమైన మధ్యమముగా తెలియవలెను.

**తథాది ప్రథమోపేతం స్వరం సంవిద్ధి శోభనమ్ ।**
**వ్యోమసంఖ్యాసమాయుక్తమోష్ఠస్థానసముద్భవమ్ ॥** 71

ప్రతిపదార్థము : తథా =అట్లే; ఆదిప్రథమోపేతం = ఒకటవ వర్గముతో

మొదటిదానితో కూడినదియు; వ్యోమసంఖ్యాసమాయుక్తం = వ్యోమసంఖ్య(5)తో కూడినదియు; ఓష్ఠస్థాన సముద్భవం = ఓష్ఠస్థానమున జనించిన; శోభనం స్వరం = మంగళప్రదమైన స్వరమును (పంచమము); సంవిద్ధి = తెలియుము

**తాత్పర్యము :** అట్లే ఒకటవ వర్గముతో మొదటిదానితో కూడినదియు వ్యోమసంఖ్య (5)తో కూడినదియు ఓష్ఠస్థానమున జనించిన మంగళప్రదమైన స్వరమును (పంచమము) తెలియుము.

**పంచమస్యాపి వర్గస్య చతుర్థం చాదిసంయుతమ్ ।**
**కోదండ ద్వయ సంభూతముద్ధరేత్ స్వరముత్తమమ్ ॥** 72

**ప్రతిపదార్థము :** పంచమస్యాపి వర్గస్య = పంచమవర్గమునకు; ఆదిసంయుతం చతుర్థం = ఆదియుతమైన చతుర్థవర్ణము; కోదండద్వయసంభూతం = కోదండద్వయ జనితమైన దానిని; ఉత్తమం స్వరం = ఉత్తమస్వరము (ధైవతము) ఉద్ధరించవలెను

**తాత్పర్యము :** పంచమవర్గమునకు ఆదియుతమైన చతుర్థవర్ణము కోదండద్వయజనితమైన దానిని ఉత్తమస్వరము (ధైవతము) ఉద్ధరించవలెను

**అకారాంతాంత సంభిన్నం పంచమాంతం సముద్ధరేత్ ।**
**బ్రహ్మస్థానసముద్భూతం సుతారధ్వని సంయుతమ్ ॥** 73

**ప్రతిపదార్థము :** అకారాంత అంతసంభిన్నం = అకారాంత అంత భిన్నమైనట్టియు; పంచమాంతం = పంచమాంతమును; బ్రహ్మస్థాన సముద్భూతం = బ్రహ్మస్థాన జనితమైన; సుతార ధ్వని సంయుతం = తారశబ్దయుతమైన స్వరమును (నిషాదమును) ; ఉద్ధరేత్ = ఉద్ధరించవలెను

**తాత్పర్యము :** అకారాంత అంతభిన్నమైనట్టియు పంచమాంతమును బ్రహ్మస్థానజనితమైన తారశబ్దయుతమైన స్వరమును (నిషాదమును) ఉద్ధరించవలెను.

**అగమస్థం స్వరోద్ధారమిత్థి తావత్ ప్రదర్శితమ్ ।**
**అధునా సంప్రవక్ష్యామి కులవర్ణాది నిర్ణయమ్ ॥**

ప్రతిపదార్థము : ఆగమస్థం = ఆగమమందున్న; స్వరోద్ధారం ప్రదర్శితం = స్వరోద్ధారము చూపబడినది; అధునా కులవర్ణాది నిర్ణయం = ఇప్పుడు కులవర్ణాది నిర్ణయమును; సంప్రవక్ష్యామి = చెప్పుచున్నాను

తాత్పర్యము : ఆగమమందున్న స్వరోద్ధారము చూపబడినది. ఇప్పుడు కులవర్ణాది నిర్ణయమును చెప్పుచున్నాను.

**దేవకులసముత్పన్నాః షడ్జగాంధారమధ్యమాః ।**
**పితృవంశసముత్పన్నః స్వరోఽసౌ పంచమః కిల ॥ 75**

ప్రతిపదార్థము : షడ్జగాంధారమధ్యమాః = షడ్జగాంధారమధ్యమములు; దేవకులసముత్పన్నాః = దేవవంశమునందు ఉద్భవించినవి; అసౌ పంచమః స్వరః = ఈ పంచమ స్వరము; పితృవంశసముత్పన్నః = పితృవంశమందు జనించినది

తాత్పర్యము : షడ్జగాంధారమధ్యమములు దేవవంశమునందు ఉద్భవించినవి. ఈపంచమస్వరము పితృవంశమందు జనించినది.

**ఋషి వంశసముత్పన్నౌ స్వరౌ వృషభధైవతౌ ।**
**అసురాణాంకులే జాతోనిషాదః సనిసంజ్ఞితః ॥ 76**

ప్రతిపదార్థము : ఋసభధైవతౌ స్వరౌ = రిషభధైవతస్వరములు రెండును; ఋషివంశసముత్పన్నౌ = ముని వంశమునందు పుట్టినవి; నిషాదః = నిషాదస్వరము; అసురాణాం కులే జాతః = రాక్షసవంశజము; సః = అది; నిసంజ్ఞితః = ని అనుగుర్తుకలది

తాత్పర్యము : రిషభధైవతస్వరములు రెండును ముని వంశమునందు పుట్టినవి. నిషాదస్వరము రాక్షసవంశజము, ని అనుగుర్తుకలది.

**శూద్రజాతిసముత్పన్నౌ తత్ కాకలస్యాంతరౌ స్వరౌ ।**
**పద్మపత్రప్రభః షడ్జః ఋషభః శుకవర్ణకః ॥ 77**

ప్రతిపదార్థము : తత్ కాకలస్య అంతరౌ స్వరౌ = అనిషాద భేదములైన కాకలిఅంతర స్వరములు రెండును; శూద్రజాతి సముత్పన్నౌ = శూద్రజాతి

జనితములు; షడ్జః పద్మపత్రప్రభః = షడ్జము పద్మపత్రమువంటి కాంతి (రంగు) కలది; ఋషభః శుకవర్ణకః = రిషభము శుకవర్ణముకలది

**తాత్పర్యము** : ఆనిషాద భేదములైన కాకలి అంతర స్వరములు రెండును శూద్రజాతి జనితములు. షడ్జము పద్మపత్రము వంటికాంతి (రంగు)కలది. రిషభము శుకవర్ణముకలది.

**కనకాభస్తు గాంధారో మధ్యమః కుందసన్నిభః ।**
**పంచమస్తు భవేత్ కృష్ణః పీతవర్ణస్తు ధైవతః ॥** 78

**ప్రతిపదార్థము** : గాంధారకనకాభః = గాంధారము స్వర్ణవర్ణముకలది; మధ్యమః కుంద సన్నిభః = మధ్యమము మల్లి పూవుతో సమానమైనది (శ్వేతవర్ణము); పంచమః కృష్ణః = పంచమము నలుపు; ధైవతః పీతవర్ణః = ధైవతము పసుపు వర్ణముకలది

**తాత్పర్యము** : గాంధారము స్వర్ణ వర్ణముకలది. మధ్యమము మల్లిపూవుతో సమానమైనది (శ్వేతవర్ణము) పంచమము నలుపు ధైవతము పసుపువర్ణముకలది.

**నిషాదః సర్వవర్ణోఽయం విజ్ఞేయః స్వరవర్ణకః ।**
**షడ్జస్య ధైవతం బ్రహ్మ ఋషభో వహ్నిదైవతః ॥** 79

**ప్రతిపదార్థము** : నిషాదః = నిషాద స్వరము; సర్వవర్ణః = చిత్రవర్ణము; స్వరవర్ణకః అయం విజ్ఞేయః = ఈ స్వరవర్ణమును తెలియవలెను; షడ్జస్య ధైవతం బ్రహ్మ= షడ్జస్వరమునకు బ్రహ్మదేవత; ఋషభః అగ్నిదైవతః = అగ్నిదేవతాకము రిషభస్వరము

**తాత్పర్యము** : నిషాదస్వరము చిత్రవర్ణము. ఈస్వరవర్ణమును తెలియవలెను. షడ్జస్వరమునకు బ్రహ్మ దేవత. అగ్నిదేవతాకము రిషభస్వరము.

**గాంధారో భారతీదేవో మధ్యమో హరదైవతః ।**
**పంచమః శతయజ్ఞస్తు ధైవతో గణనాయకః ।**
**నిషాదో భానుదేవస్తు ఇత్యేతే స్వరదేవతాః ॥**

**ప్రతిపదార్థము** : గాంధారః = గాంధారము; భారతీ దేవః = సరస్వతీదేవతాకము;

మధ్యమః హరదైవతః = మధ్యమస్వరము ఈశ్వరదేవతాకము; పంచమః శతయజ్ఞః = పంచమ స్వరము ఇంద్రదేవతాకము; ధైవతః గణనాయకః = ధైవతస్వరము వినాయకదేవతాకము; నిషాదః భానుదేవః = నిషాదస్వరము సూర్యదేవతాకము; ఇత్యేతే = ఇట్లు వీరు; స్వరదేవతాః = స్వరదేవతలు

**తాత్పర్యము** : గాంధారము సరస్వతీదేవతాకము, మధ్యమస్వరము ఈశ్వరదేవతాకము, పంచమస్వరము ఇంద్రదేవతాకము, ధైవతస్వరము వినాయకదేవతాకము, నిషాదస్వరము సూర్యదేవతాకము ఇట్లు వీరు స్వరదేవతలు.

**అగ్నిగీతః స్వరః షడ్జః ఋషభో(బ్రహ్మణోదితః ।**
**సోమేన గీతోగాంధారో విష్ణునా మధ్యమ స్వరః ॥**

**పంచమస్తు స్వరో గీతో నారదేన మహాత్మనా ।**
**ధైవతశ్చ నిషాదశ్చ గీతౌ తుంబురుణా స్వరౌ ॥**

**ప్రతిపదార్థము** : అగ్నిగీతః షడ్జః స్వరః = షడ్జస్వరము అగ్నికీర్తితము; ఋషభః బ్రహ్మణా ఉదితః = రిషభము బ్రహ్మచే చెప్పబడినది; గాంధారః సోమేన గీతః= గాంధారము చంద్రునిచే కీర్తితము; మధ్యమస్వరః విష్ణునాకథితః = మధ్యమము విష్ణువుచే నిగదితము; మహాత్మనా నారదేన పంచమః స్వరః గీతః = మహాత్ముడైన నారదునిచే పంచమస్వరము చెప్పబడినది; ధైవతః నిషాదః చ స్వరౌ తుంబురుణాగీతౌ = ధైవతనిషాదస్వరములు తుంబురునిచే కీర్తింపబడినవి.

**తాత్పర్యము** : షడ్జస్వరము అగ్నికీర్తితము. రిషభము బ్రహ్మచే చెప్పబడినది. గాంధారము చంద్రునిచే కీర్తితము. మధ్యమము విష్ణువుచే నిగదితము. మహాత్ముడైన నారదునిచే పంచమ స్వరము చెప్పబడినది, ధైవతనిషాదస్వరములు తుంబురునిచే కీర్తింపబడినవి.

**హాస్య శృంగారయోః కార్యౌ స్వరౌ మధ్యమ పంచమౌ ।**
**షడ్జర్షభౌ తథా జ్ఞేయౌ వీర రౌద్రాద్భుతేషుచ ।**

**గాంధారశ్చ నిషాదశ్చ కర్తవ్యౌ కరుణే రసే ॥**

**ధైవతశ్చాపి కర్తవ్యో బీభత్సే సభయానకే ॥**

**ప్రతిపదార్థము :** మధ్యమ పంచమౌ స్వరౌ హాస్య శృంగారయోః కార్యౌ = మధ్యమ పంచమ స్వరములు హాస్య శృంగారములందు చేయదగినవి; వీరరౌద్రాద్భుతేషు= వీరరౌద్రఅద్భుత రసములందు; షడ్జర్షభౌ జ్ఞేయౌ = షడ్జరిషభస్వరములను గుర్తింపవలెను; కరుణే రసే = కరుణరసమందు; గాంధారః నిషాదశ్చ కర్తవ్యౌ= గాంధార నిషాదస్వరములను చేయవలెను; సభయానకే బీభత్సే = భయానకరసముతో కూడిన బీభత్సరసమందు; ధైవతః కర్తవ్యః = ధైవతమువాడదగినది

**తాత్పర్యము :** మధ్యమ పంచమ స్వరములు హాస్య శృంగారములందు చేయదగినవి. వీరరౌద్రఅద్భుతరసములందు షడ్జరిషభస్వరములను గుర్తింపవలెను. కరుణరసమందు గాంధారనిషాద స్వరములను చేయవలెను. భయానకరసముతో కూడిన బీభత్సరసమందు ధైవవతము వాడదగినది.

**కంఠాదుత్తిష్ఠతే షడ్జ ఋషభః శిరసః స్థితః ।**
**నాసాయాశ్చైవ గాంధారః ఉరసో మధ్యమః స్వరః ।**
**ఉరసః శిరసః కంఠాత్ ఉత్థితః పంచమః స్వరః ॥**

**తాలుదేశాత్ సముత్పన్నో ధైవతస్తు యశస్విని ।**
**నిషాదస్తు సముత్పన్నో విజ్ఞేయః సర్వసంధితః ॥**

**ప్రతిపదార్థము :** షడ్జః కంఠాత్ ఉత్తిష్ఠతే = షడ్జము కంఠమునుండి పుట్టును; ఋషభః శిరసః స్థితః = రిషభము శిరోజనితము; నాసాయాః గాంధారః = నాసికనుండి గాంధారము ఉద్భవమగును; మధ్యమః ఉరసః = మధ్యమము ఉరస్సునుండి జనితము; పంచమః స్వరః = పంచమ స్వరము; ఉరసః శిరసః కంఠాత్ = ఉరస్సు శిరస్సు కంఠములనుండి పుట్టును; ధైవతః తాలుదేశాత్ సముత్పన్నః = ధైవతము తాలువునుండి పుట్టును; నిషాదః = నిషాదస్వరము; సర్వసంధితః సముత్పన్నః ఇతి విజ్ఞేయః = సర్వ సంధులనుండి ఉత్పన్నమగునని తెలియవలెను

**తాత్పర్యము :** షడ్జము కంఠమునుండి పుట్టును. రిషభము శిరోజనితము. నాసికనుండి గాంధారముఉద్భవమగును. మధ్యమము ఉరస్సునుండి జనితము. పంచమ స్వరము ఉరస్సు శిరస్సు కంఠములనుండి పుట్టును. ధైవతము

తాలువునుండి పుట్టును. నిషాదస్వరము సర్వసంధులనుండి ఉత్పన్నమగునని తెలియవలెను.

ఏవం స్వరాన్ విజానీయాదుత్పన్నాన్ స్వరసాగరే ।
మహాదేవ ముఖోద్భూతాన్ దేశీమార్గే చ సంస్థితాన్ ॥

**ప్రతిపదార్థము :** ఏవం = ఇట్లు; స్వరసాగరే సముత్పన్నాన్ = స్వరసాగరమందు పుట్టినటువంటిన్ని; మహాదేవముఖోద్భూతాన్ = పరమేశ్వరుని ముఖమునుండి పుట్టినటువంటిన్ని; దేశీ మార్గేసంస్థితాన్ = దేశీ మార్గమందున్న; స్వరాన్ = స్వరములను విజానీయాత్ = తెలియవలెను

అథకిముచ్యతే గ్రామశబ్దేన = గ్రామశబ్దము చేనేమిచెప్పబడినది?; నను కతి గ్రామా భవంతి = ఎన్నిగ్రామములగుచున్నవి ?

**తాత్పర్యము :** ఇట్లు స్వరసాగరమందు పుట్టినటువంటిన్ని పరమేశ్వరుని ముఖమునుండి పుట్టినటువంటిన్ని దేశీమార్గమందున్న స్వరములను తెలియవలెను. గ్రామశబ్దముచే నేమిచెప్పబడినది ? ఎన్నిగ్రామమములగుచున్నవి ?

కస్మాదుత్పద్యతే గ్రామః కిం వా తస్య ప్రయోజనమ్ ।

**ప్రతిపదార్థము :** గ్రామః కస్మాత్ ఉత్పద్యతే = గ్రామము దేనినుండి పుట్టుచున్నది; తస్య ప్రయోజనం కిం = దాని ప్రయోజనమేమి?; అత్ర ఉచ్యతే = ఈవిషయమై చెప్పబడుచున్నది

**తాత్పర్యము :** గ్రామముదేనినుండి పుట్టుచ్నుది? దాని ప్రయోజనమేమి ఈవిషయమై చెప్పబడుచున్నది.

సమూహవాచినౌ గ్రామౌ స్వరశ్రుత్యాది సంయుతౌ ॥ 89

యథాకుటుంబినః సర్వ ఏకీభూత్వా వసంతి హి ।
సర్వలోకేషు స గ్రామో యత్ర నిత్యం వ్యవస్థితః ॥ 90

షడ్జమధ్యమ సంజ్ఞౌతు ద్వౌగ్రామౌ విశ్రుతౌ కిల ।
గాంధారం నారదో బ్రూతే స తు మర్త్యై ర్న గీయతే ॥ 91

సామవేదాత్ స్వరా జాతాః స్వరేభ్యః గ్రామసంభవః ।

ద్వావేతౌ చ ఇమౌ జ్ఞేయౌ షడ్జమధ్యమలక్షితౌ ॥ 92

**ప్రతిపదార్థము** : యథాకుటుంబినః సర్వే = కుటుంబ సభ్యులందరు; ఏకీభూత్వా = ఒక్కటిగానయి; వసంతి హి = నివసించినట్లే; స్వరశ్రుత్యాదిసంయుతౌ = స్వరశ్రుతులతోకూడిన; సమూహవాచినౌ గ్రామౌ = సముదాయవాచికములు గ్రామములు; స గ్రామః = ఆగ్రామము; సర్వలోకేషు = అన్నిజగత్తులందును; నిత్యం వ్యవస్థితః = నిత్యముగ ఉండునో; తౌ ద్వౌ గ్రామౌ = ఆరెండు గ్రామములు; షడ్జమధ్యమసంజ్ఞితౌ = షడ్జమధ్యమ నామకములుగా; విశ్రుతౌ= ప్రసిద్ధినొందినవి; గాంధారం = గాంధారగ్రామమును (మూడవది); నారదః బ్రూతే = నారదుడు చెప్పుచున్నాడు; సః = ఆగాంధారగ్రామము; మర్త్యైః = మనుష్యులచే; న గీయతే = గానముచేయబడదు; సామవేదాత్ = సామవేదమునుండి; స్వరాః జాతాః= స్వరములు పుట్టినవి; స్వరేభ్యః = స్వరములనుండి; గ్రామసంభవః = గ్రామములు పుట్టినవి; షడ్జమధ్యమలక్షితౌ= షడ్జమధ్యమగ్రామములుగా చిహ్నితములైన; ఏతౌ ద్వౌ = ఇవిరెండును; జ్ఞేయౌ= తెలియదగినవి

ప్రయోజనం చ యథా = ప్రయోజనమేమనగా; స్వరశ్రుతి మూర్ఛనా తానజాతి రాగాణాం వ్యవస్థాపనత్వం నామప్రయోజనం = స్వర, శ్రుతి, మూర్ఛన, తాన, జాతి, రాగములవ్యవస్థాపనమే ప్రయోజనము; నను కథం షడ్జమధ్యమ స్వరాభ్యాం గ్రామవ్యపదేశః ? = షడ్జమధ్యమ స్వరములచే నెట్లు గ్రామవ్యపదేశము?; అసాధారణత్వంచ దేవకులసముత్పన్నత్వేన = అసాధారణతయు దేవకులజనితమగుట చేత; తథాచాహ నారదః = అట్లు నారదుడు చెప్పుచున్నాడు

**తాత్పర్యము** : కుటుంబసభ్యులందరు ఒక్కటిగానయి నివసించినట్లే స్వరశ్రుతులతో కూడిన సముదాయవాచికములు గ్రామములు ఆగ్రామము అన్ని జగత్తులందును నిత్యముఉండునో ఆరెండు గ్రామములు షడ్జమధ్యమ నామకములుగా ప్రసిద్ధినొందినవి. గాంధార గ్రామమును (మూడవది) నారదుడు చెప్పుచున్నాడు. ఆగాంధార గ్రామము మనుష్యులచే గానముచేయబడదు. సామవేదమునుండి స్వరములు పుట్టినవి. స్వరములనుండి గ్రామములుపుట్టినవి. షడ్జమధ్యమగ్రామములుగా చిహ్నితములైన ఇవిరెండును తెలియదగినవి.

ప్రయోజనమేమనగా స్వర, శ్రుతి, మూర్ఛన, తాన, జాతి, రాగముల వ్యవస్థాపనమే ప్రయోజనము. షడ్జమధ్యమ స్వరములచే నెట్లు గ్రామవ్యపదేశము?, అసాధారణతయు దేవకులజనితమగుటచేత. అట్లు నారదుడు చెప్పుచున్నాడు.

**దేవకులసముత్పన్నాః షడ్జగాంధార మధ్యమాః ।**
**ఏతేషాం దేవతా జ్ఞేయా బ్రహ్మవిష్ణు మహేశ్వరాః ॥**

**ఉభయోర్గ్రామయోర్మధ్యే ముఖ్యత్వం కస్య గమ్యతే ।**
**షడ్జవాహి చ ముఖ్యత్వం గమ్యతే వచనాన్మునేః ॥**

**ప్రతిపదార్థము** : షడ్జగాంధార మధ్యమాః = షడ్జగాంధారమధ్యమ స్వరములు; దేవకుల సముత్పన్నాః = దేవవంశజాతములు; బ్రహ్మవిష్ణుమహేశ్వరాః = బ్రహ్మవిష్ణుమహేశ్వరులు; ఏతేషాం దేవతాః జ్ఞేయాః = వీటికి దేవతలుగా తెలియవలెను; ఉభయోః గ్రామయోః మధ్యే = ఈరెండు గ్రామములలో; కస్య ముఖ్యత్వం గమ్యతే = దేనికి ప్రధానత్వము గమ్యమానము?; మునేః వచనాత్ = నాదర వచనమువలన; షడ్జవాహి చ ముఖ్యత్వం గమ్యతే = షడ్జగ్రామమునకు ప్రధానత్వము తెలియబడుచున్నది; ఏతత్ ఉక్తం భవతి = ఇదిచెప్పబడుచున్నది.

**తాత్పర్యము** : షడ్జగాంధార మధ్యమస్వరములు దేవవంశజాతములు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు వీటికి దేవతలుగా తెలియవలెను. ఈరెండు గ్రామములలో దేనికి ప్రధానత్వము గమ్యమానము? నారద వచనమువలన షడ్జగ్రామమునకే ప్రధానత్వము తెలియబడుచున్నది. ఇది చెప్పబడుచున్నది

**ద్వౌ గ్రామౌ విశ్రుతౌ లోకే షడ్జమధ్యమ సంజ్ఞితౌ ।**

**ప్రతిపదార్థము** : షడ్జమధ్యమ సంజ్ఞితౌ = షడ్జమధ్యమములను పేరుగల; ద్వౌ గ్రామౌ = రెండు గ్రామములు; లోకే విశ్రుతౌ = లోకమందు ప్రసిద్ధములు;

నను కథం ద్వావేవ గ్రామౌ = ఓయీ ! రెండే గ్రామములెట్లు?; ఉచ్యతే= చెప్పబడుచున్నది; ఇహ హి ద్విస్వర ప్రయోగమూల ప్రయోగవశాత్ ద్వౌ గ్రామౌ ఉపన్యస్తౌ = ఇక్కడ, ద్విస్వర ప్రయోగమూల ప్రయోగవశమువలన రెండు గ్రామములు చెప్పబడినవి

**తాత్పర్యము** : షడ్జమధ్యమములను పేరుగల రెండు గ్రామములు లోకమందు

ప్రసిద్ధములు. ఓయీ ! రెండే గ్రామమములెట్లు? చెప్పబడుచున్నది. ఇక్కడ, ద్విస్వర ప్రయోగమూల ప్రయోగవశమువలన రెండు గ్రామములు చెప్పబడినవి.

**జాతిభిః శ్రుతిభిః శ్చైవ స్వరా గ్రామత్వమాగతాః ॥** 93

**ప్రతిపదార్థము** : జాతిభిః = జాతులచేతను; శ్రుతిభిశ్చ = శ్రుతులచేతనుకూడ; స్వరాః = స్వరములు; గ్రామత్వం ఆగతాః = గ్రామత్వమునొందుచున్నవి;

తత్ర జాతిభిః శుద్ధాభిః శ్రుతిభిశ్చ నాతికాభిః ? = అందు శుద్ధజాతులచేతను (అతివ్యాప్తిలేని) శ్రుతులచేతను; తస్మాత్ శుద్ధాసు జాతిషు వికృతాసు చ యే స్వరాః సంతి తేషాం స్వరాణాం శ్రుతివైకల్యాత్ కిం స్యాత్ , ఉత్కర్షా పకర్షాభ్యాం సంకీర్ణత్వేన చ స్వరా గ్రామత్వమాగతాః = అందువలన శుద్ధ వికృత జాతులయందు ఏస్వరములున్నవో ఆస్వరములకు శ్రుతివికలతవలన ఏమగును? ఉత్కర్ష అపకర్షలచేతను, సంకీర్ణతచేతను స్వరములు గ్రామత్వమును పొందుచున్నవి; తత్రశుద్ధాభిః షడ్భిః షడ్జః, వికృతాభిః మధ్యమ ఇతిద్వాభ్యాం చ సంకీర్ణాః జాతాః = అందు శుద్ధము లారింటిచేతను షడ్జగ్రామము, వికృతములచే మధ్యమగ్రామము అనియు, రెండింటిచేతను సంకీర్ణములును జాతములగును; తాభ్యః రాగసంభవేతి(?) = వాటినుండి రాగములపుట్టుకయని; గ్రామాన్యత్వా జ్జాతిరాగాన్యత్వం = గ్రామాన్యత్వము వలన జాతిరాగాన్యత్వముండునని;

ఇదానీమివ స్వరాః ప్రాప్తాః = ఇప్పటిలాగ స్వరములు ప్రాప్తములు; మూర్ఛనాః కథ్యంతే = మూర్ఛనలు చెప్పబడుచున్నవి; నను మూర్ఛనాశబ్దస్య వ్యుత్పత్తిః కీదృశీ? = ఓయీ ! మూర్ఛనా శబ్దమునకు వ్యుత్పత్తి ఎట్టిది? లక్షణం చ కీదృశం? = లక్షణమును ఎటువంటిది? (ఏమిటి) తస్య=దానికి? ఉచ్యతే = చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : జాతులచేతను, శ్రుతులచేతనుకూడ, స్వరములు గ్రామత్వము నొందుచున్నవి. అందు శుద్ధ జాతుచేతను (అతివ్యాప్తిలేని) శ్రుతులచేతను, అందువలన శుద్ధ వికృత జాతులయందు ఏస్వరములున్నవో ఆ స్వరములకు శ్రుతి వికలతవలన ఏమగును? ఉత్కర్ష అపకర్షలచేతను, సంకీర్ణతచేతను స్వరములు గ్రామత్వమును పొందుచున్నవి. అందు శుద్ధములారింటిచేతను

షడ్జగ్రామము, వికృతములచే మధ్యమగ్రామము అనియు, రెండింటిచేతన సంకీర్ణములును జాతములగును. వాటినుండి రాగములపుట్టుకయని, గ్రామాన్యత్వమువలన జాతిరాగాన్యత్వముండునని ఇప్పటిలాగ స్వరములు ప్రాప్తములు మూర్ఛనలు చెప్పబడుచున్నవి. ఓయీ ! మూర్ఛనాశబ్దమునకు వ్యుత్పత్తి ఎట్టిది? లక్షణమును ఎటువంటిది? (ఏమిటి, దానికి) చెప్పబడుచున్నది.

**మూర్ఛనావ్యుత్పత్తిః - 'మూర్ఛా మోహసముచ్ఛ్రాయయోః '**
**మూర్ఛతే (?) యేన రాగో హి మూర్ఛనేత్యభిసంజ్ఞితా ।**
**ఆరోహణావరోహణ క్రమేణ స్వరసప్తకమ్ ॥** 94

**ప్రతిపదార్థము :** యేన = దేనిచేతను; రాగః = రాగము;మూర్ఛతే = మోహము కల్గింపజేయునో; తస్మాత్ = అందువలన; మూర్ఛనా ఇతి = మూర్ఛనయని; అభిసంజ్ఞితా = నామము; ఆరోహణావరోహణ క్రమేణ = ఆరోహణావరోణ క్రమముచే; స్వరసప్తకం = సప్తస్వరములు

**తాత్పర్యము :** దేనిచేతను రాగము మోహము కల్గింపజేయునో అందువలన మూర్ఛనయని నామము. ఆరోహణావరోణక్రమముచే సప్తస్వరములు.

**మూర్ఛనాశబ్ద వాచ్యం హి విజ్ఞేయం తద్విచక్షణైః ।**

**ప్రతిపదార్థము :** తత్ =అది; విచక్షణైః = పండితులచే; మూర్ఛనా శబ్దవాచ్యం విజ్ఞేయం = మూర్ఛనాశబ్ద వాచ్యత్వము (వ్యుత్పత్తి) నిట్లు తెలియదగినది;

సాచ మూర్ఛనా ద్వివిధా సప్తస్వర మూర్ఛనా ద్వాదశ స్వరమూర్ఛనాచేతి= సప్తస్వర మూర్ఛనయని, ద్వాదశ స్వరమూర్ఛనయని ఆమూర్ఛన రెండు విధములు; తత్ర సప్తస్వరమూర్ఛనా చతుర్విధా । పూర్ణా షాడవా ఔడువితా సాధారణాచేతి = అందు పూర్ణము షాడవము ఔడువితము సాధారణముఅని సప్తస్వర మూర్ఛన నాల్గువిధములైనది; తత్ర సప్తభిః స్వరైః యా గీయతే సా పూర్ణా = అందేది సప్తస్వరములతో గానముచేయబడునో అది పూర్ణ మూర్ఛన; షడ్భిః స్వరైః యా గీయతే సా షాడవా = ఆరు స్వరములతో గానము చేయబడునది షాడవ మూర్ఛన; పంచభిః స్వరైర్యాగీయతే సా ఔడువితా= ఐదు స్వరములతో గానముచేయబడునది ఔడువితమూర్ఛన; కాకల్యైరంతరస్వరైర్యా గీయతే సా సాధారణా = కాకలీస్వరములచేతను

అంతరస్వరముల చేతను గానముచేయబడునది సాధారణమూర్ఛన

ఇదానీం మూర్ఛనా మండలముచ్యతే = ఇప్పుడు మూర్ఛనా మండలముచెప్పబడుచున్నది; తత్ర పరిపాట్యాహితత్వేన ప్రవృత్త త్వాత్ సప్తస్వరాణాం మూర్ఛనానాం ప్రతిగ్రామం ఏకోన పంచశత్ స్వరాః కోష్టాశ్చ భవంతి = అందు పరిపాట్యాహితత్వముచేత ప్రవర్తించుటవలన ఏడు స్వరమూర్ఛనలకు ప్రతిగ్రామమును నలుబది తొమ్మిది (49) స్వరముల గదులును ఉండును, తద్యథా = అదిఎట్లనగా -

**ఏకోనా ఖండు(?) పంచాశత్ కర్తవ్యాః స్వరసంయుతాః ॥ 95**
**తిర్యగూర్ధ్వం చ రేఖాభిః అష్టభిశ్చైవ కోష్ఠకాః ॥**

**ప్రతిపదార్థము** : ఏకోన పంచాశత్ స్వర సంయుతాః కర్తవ్యాః = 49 స్వర సంయుతములైనవిగా చేయవలెను; తిర్యక్ = అడ్డుగను; ఊర్ధ్వంచ = నిలువుగను; రేఖాభిః = రేఖల (గీతల)చే; అష్టభిః = ఎనిమిదింటిచే; కోష్ఠకాః= గుదులు; ఏకోన పంచాశత్ కర్తవ్యాః = 49 చేయవలెను

తత్ర సనిధపమగరీత్యాద్యాః సప్త షడ్జగ్రామే = అందు సనిధప మగరి ఇత్యాదులు ఏడును, షడ్జగ్రామమందు;మగరిసనిధపాద్యాః సప్తమధ్యమగ్రామే= మగరిసనిధప మొదలగు ఏడు స్వరములు మధ్యమగ్రామమందు; తిర్యగూర్ధ్వగా అపి స్వరాః తిర్యక్ కార్యాః =అడ్డుగా నిలువును పొందిన స్వరములుకూడ అడ్డుగా చేయవలెను; తద్యథా - నిధపమగరిసా ఇతి షడ్జగ్రామే = అది ఎట్లనగా నిధపరిమగరిస అనిషడ్జగ్రామమందు; గరిసనిధపమా ఊర్ధ్వా మధ్యమగ్రామే = గరిసనిధపమ అని నిలువుగను మధ్యమగ్రామమందు; ఏవం తావత్ ఉభయుగ్రామిక్యః చతుర్దశ మూర్ఛనాః సంపూర్ణాః = ఇట్లు రెండు గ్రామములందలవి 14 మూర్ఛనలు సంపూర్ణములు; సరిగమపధని । నిసరిగమపధ । ధనిసరిగమప । పధనిసరిగమ । మపధనిసరిగ । గమపధనిసరి। రిగమపధనిస । ఇతి ; షడ్జగ్రామే = అని షడ్జగ్రామమందు; మపధనిసరిగ । గమపధనిసరి । రిగమపధనిస । సరిగమ పధని । నిసరిగమపధ । ధనిసరిగమప। పధనిసరిగమ । ఇతి మధ్యమగ్రామే। మూర్ఛనామండలం = అని మధ్యమగ్రామమున- మూర్ఛనామండలము -

(పట్టిక అపెండిక్స్ జె. మరియు కె. చివరిపేజీలలో చూడుడు.)

**ఏవం తావదుభయగ్రామిక్యశ్చతుర్దశ మూర్ఛనాః సంపూర్ణాః కథితాః ।**

ఇట్లు రెండు గ్రామములకు సంబంధించిన 14 సంపూర్ణమూర్ఛనలు చెప్పబడినవి; ఇదానీం తాసాం నామాని కథ్యంతే = ఇప్పుడు వాటిపేర్లు చెప్పబడుచున్నవి;

**షడ్జేచోత్తర మదా స్యాన్ని షాదే రజనీ స్మృతా ।**
**ధైవతే చోత్తరా జ్ఞేయా శుద్ధషడ్జాచ పంచమే ॥** 96

**ప్రతిపదార్థము** : షడ్జే = షడ్జమందు; ఉత్తరమదా = ఉత్తరమదము; నిషాదే = నిషాదమందు; రజనీ స్మృతా = రజనియని చెప్పబడినది; ధైవతే = ధైవతమందు; ఉత్తరా జ్ఞేయా = ఉత్తరగాతెలియవలెను; పంచమే = పంచమమందు; శుద్ధషడ్జా= శుద్ధషడ్జము అగును

**తాత్పర్యము** : షడ్జమందు ఉత్తరమదము, నిషాదమందు రజనియని చెప్పబడినది. ధైవతమందు ఉత్తరగా తెలియవలెను. పంచమమందు శుద్ధ షడ్జము అగును.

**మధ్యమే మత్సరీ జ్ఞేయా గాంధారే చాశ్వక్రాంతికా ।**
**ఋషభేణ చ విజ్ఞేయాః సప్తమీ చ భిరుద్గతాచ ॥** 97

**ప్రతిపదార్థము** : మధ్యమే = మధ్యమమందు; మత్సరీ జ్ఞేయా = మత్సరియని తెలియవలెను; గాంధారే = గాంధారమందు; అశ్వక్రాంతికా = అశ్వక్రాంతిక యగును; ఋషభేణ = రిషభముచే; సప్తమీ = సప్తమియు; అభిరుద్గతా = అభిరుద్గతమును; విజ్ఞేయాః = తెలియదగినవి

**తాత్పర్యము** : మధ్యమమందు మత్సరియని తెలియవలెను గాంధారమందు అశ్వక్రాంతిక యగును. రిషభముచే సప్తమియు అభిరుద్గతమును తెలియదగినవి.

**షడ్జగ్రామాశ్రితా తోయం (?) విజ్ఞేయాః సప్తమూర్ఛనాః ।** 98

**ప్రతిపదార్థము** : షడ్జగ్రామాశ్రితా = షడ్జగ్రామమునాశ్రయించునది; (తోయం=?) సప్త మూర్ఛనాః విజ్ఞేయాః = సప్త మూర్ఛనలు తెలియదగినవి

**తాత్పర్యము** : షడ్జగ్రామమునాశ్రయించునది, సప్తమూర్ఛనలు తెలియదగినవి,

అతః పరం ప్రవక్ష్యామి మధ్యమగ్రామమూర్ఛనాః ।

**ప్రతిపదార్థము** : అతః పరం = ఇటుతరువాత; మధ్యమగ్రామమూర్ఛనాః ప్రవక్ష్యామి = మధ్యమగ్రామమూర్ఛనలు చెప్పుదును

**తాత్పర్యము** : ఇటుతరువాత మధ్యమగ్రామూర్ఛనలు చెప్పుదును.

మధ్యమేన చ సౌవీరీ గాంధారే హరిణాహ్వాయా చ ॥ 99

మూర్ఛనా శుద్ధ మద్య(?) షడ్జే స్యాన్నిషాదే చైవ మార్జికా ।
పౌరవీ ధైవతే జ్ఞేయా హృష్యకా పంచమే తథా ॥ 100

ఇతి తావన్మయా ప్రోక్తా మధ్యమగ్రామమూర్ఛనాః ।
స్యాత్కలోపనతా చైవ ఋషభేణైవ + + + ॥ 101

**ప్రతిపదార్థము** : మధ్యమేన = మధ్యమముచే; సౌవీరీ = సౌవీరీ మూర్ఛన; గాంధారే = గాంధారమందు; హరిణాహ్వాయా = హరిణనామక మూర్ఛన; షడ్జే = షడ్జమందు; శుద్ధమధ్యమమూర్ఛనా = శుద్ధమధ్యమూర్ఛనయు; ధైవతే= ధైవతమందు; పౌరవీ = పౌరవీ మూర్ఛన; పంచమే = పంచమమందు; హృష్యకా = హృష్యక నామకమూర్ఛన; ఋషభేణ = రిషభముచే; కలోపనతాస్యాత్ = కలోపనతయు అగును; ఇతితావత్ = ఈప్రకారముగా; మధ్యమగ్రామమూర్ఛనాః మయా ప్రోక్తాః = మధ్యమగ్రామమూర్ఛనలు నాచే చెప్పబడినవి

**తాత్పర్యము** : మధ్యమముచే సౌవీరీమూర్ఛన, గాంధారమందు హరిణనామక మూర్ఛన, షడ్జమందు శుద్ధమధ్యమమూర్ఛనయు, నిషాదమందు మార్జికానామకమూర్ఛనయు, ధైవతమందు పౌరవీమూర్ఛన, పంచమమందు హృష్యక నామకమూర్ఛన, రిషభముచే కలోపనతయు అగును. ఈప్రకారముగా మధ్యమగ్రామమూర్ఛనలు నాచే చెప్పబడినవి.

షట్ స్వరైః షాడవా జ్ఞేయా ఔడువా పంచభిః స్వరైః ।
షాడవౌష్ఠీ చ తాసాం చ వ్యుత్పత్తిశ్చ నిగద్యతే ॥ 102

**ప్రతిపదార్థము** : షట్ స్వరైః = 6 స్వరములచే; షాడవా జ్ఞేయాః = షాడవములుగా తెలియదగినవి; ఔడువాః పంచభిః స్వరైః జ్ఞేయాః = 5 స్వరములచే ఔడువములుగా తెలియదగినవి; షాడవౌష్ఠీ చ = షాడవము లౌష్టికములు; తాసాం వ్యుత్పత్తిః నిగద్యతే = వాటి వ్యుత్పత్తి చెప్పబడుచున్నది; షట్ స్వరాః అవంతి రక్షంతి యే తే = ఏ(వి) ఆరు స్వరములు రక్షించునో అవి(?)

**తాత్పర్యము** : 6స్వరములచే షాడవములుగా తెలిదగినవి 5స్వరములచే ఔడువములుగా తెలియదగినవి. షాడవములు లౌష్టికములు వాటివ్యుత్పత్తి చెప్పబడినది. ఏ(వి) ఆరుస్వరములు రక్షించునో అవి(?)

**ఇదానీం సంప్రవక్ష్యామి షాడవౌడవమూర్ఛనాః ।**

**ప్రతిపదార్థము** : ఉడవో నక్షత్రాణి గచ్ఛంతి యస్మిన్నాకాశే తదాకాశమౌడవం= యే ఆకాశమందు నక్షత్రములు పొందునోఆ ఆకాశము ఔడవమనబడును; తేన పంచ సంఖ్యాలక్ష్యతే = దానిచే పంచ సంఖ్య(5) గుర్తింపబడుచున్నది

**తాత్పర్యము** : యే ఆకాశమందు నక్షత్రములు పొందునో ఆ ఆకాశము ఔడవమనబడును. దానిచే పంచ సంఖ్య (5) గుర్తింపబడుచున్నది.

**పంచమం హి మహాభూతం తత్స్థా సంఖ్యా చ విద్యతే ॥** 103

**ప్రతిపదార్థము** : పంచమం మహాభూతం= ఔడవ భూతమైన ఆకాశము; దానియందున్న సంఖ్యఉన్నది; యస్య తదౌడువితం షాడవస్వరాః తేషాం ప్రయోగః షాడవః = యస్య = దేనికి; షాడవస్వరాః = షాడవస్వరములు; ఔడవితం = ఔడవితమగునో; తేషాం ప్రయోగః = వాటి ప్రయోగము; షాడవః = షాడవము; తారకాదితచ్ప్రత్యయ = తారకాదితచ్ ప్రత్యయము

**తాత్పర్యము** : ఔడవ భూతమైన ఆకాశము దానియందున్న సంఖ్య ఉన్నది. దేనికి షాడవస్వరములు ఔడవితమగునో వాటి ప్రయోగము షాడవము. తారకాదితచ్ ప్రత్యయము.

**షాడవం షట్ స్వరం జ్ఞేయం లక్షణం సప్తధా మతమ్ ।**
**ఇత్యేకోన పంచాశత్ సంఖ్యం తజ్ జ్ఞేయం గీతవేదిభిః ॥** 104

**ప్రతిపదార్థము** : షాడవం షట్ స్వరం జ్ఞేయం = షాడవము 6 స్వరములు

కలదిగా తెలియుదగినది; లక్షణం సప్తధా మతం = లక్షణము ఏడు విధములైనదిగా సమ్మతము; ఇతి = ఈవిధముగా; తత్ = అది; ఏకోన పంచాశత్ సంఖ్యం జ్ఞేయం = 49 సంఖ్యయని తెలియువలెను

**తాత్పర్యము** : షాడవము 6 స్వరములు కలదిగా తెలియదగినది. లక్షణము ఏడు విధములైనదిగా సమ్మతము. ఈవిధముగా అది 49 సంఖ్యయని తెలియవలెను.

**పంచ స్వరమౌడువితం పంచధా లక్షణం స్మృతమ్ ।**
**పంచ త్రింశచ్చ సంఖ్యం హిఆచార్యైర్యదుదాహృతమ్ ॥**

**ప్రతిపదార్థము** : పంచస్వరం = 5 స్వరములు కలది; ఔడవితం = ఔడవితము; లక్షణం పంచధా స్మృతం = లక్షణము 5 విధములుగా చెప్పబడినది; పంచ త్రింశత్ సంఖ్యం ఉదాహృతం = 35 సంఖ్యగా ఉదాహరింపబడినది

షడ్జ ఋషభౌ పంచమనిషాదైః షడ్జగ్రామికాః షాడవాః = షడ్జరిషభములు పంచమ నిషాదములచే షడ్జగ్రామసంబంధి షాడవములు; షడ్జఋషభ గాంధారైః హీనాః మధ్యమగ్రామే షాడవాః = షడ్జరిషభ గాంధారములచే రహితములును మధ్యమగ్రామమందు షాడవములు; సంవాదిలోపాత్ ఔడువిత్వమితి వచనాత్= సంవాది లోపము వలన ఔడవిత్వమనుమాటవలన; సంవాదిస్వరాభ్యాం ఔడువితత్వం ప్రాప్తమితి ప్రాయికం = సంవాది స్వరములచే ఔడువితత్వము పొందబడిన దనునది ప్రాయికము; (కదాచిత్ అనువాది స్వరాభ్యాం ఔడువితత్వం ప్రాప్తమితి ప్రాయికం = ఒకప్పుడు అనువాది స్వరములచే ఔడువితత్వము పొందబడినదని అనునది (ప్రాయికము) కదాచిదను వాదిస్వరాభ్యాం ఔడువితత్వం భవత్యేవ = ఒక్కొక్కప్పుడు అనువాది స్వరములచేఔడువితత్వమే జరుగును; (ఉండును) యథాపంచమ ఋషభయోః షడ్జగ్రామే మధ్యమగ్రామే ధైవతఋషభయోరితి పంచమషడ్జవిహీనః ద్విశ్రుతికాభ్యాం తథావిహీనాశ్చ పంచమఋషభవిహీనం చౌడవితౌ భవతి = ఏవిధముగా, షడ్జగ్రామమునదు పంచమ రిషభములకు; మధ్యమగ్రామమందు ధైవతరిషభములని పంచమ షడ్జరహితమును ద్విశ్రుతికములచే నట్లే

రహితములును పంచమరిషభ విహీనమునుకూడ ఔడవితములగుచున్నది; షడ్జగ్రామే ధైవతఋషభవిహీనః ద్విశ్రుతికాభ్యాం విహీనే తా జ్ఞేయూ పంచమస్వరకర్తా స్థానా(?) భవంతి ఖలు మధ్యమగ్రామే = షడ్జగ్రామమందు ధైవతరిషభరహితము; ద్విశ్రుతికములచే రహితమందు అవి తెలియదగినవి; మధ్యమగ్రామమందు పంచమస్వరకర్తస్థానములగుచున్నవిగనా (?) ఇదానీమేతదేవ ప్రస్తారేణ దర్శయతి = ఇప్పుడు ఇదియే ప్రస్తారముచే చూపుచున్నాడు; తద్యథా = అదిఎట్లనగా - షడ్జహీనాః షాడవాః = షడ్జరహిత(ములు) షాడవములు; నిధపమగరి । ధపమగరిని । పమగరినిధ। మగరినిధప । గరినిధపమ । రినిధపమగ । నిధపమగరి

ఋషభహీనాః = రిషభరహితములు- నిధపమగస । ధపమగసని । పమగసనిధ। మగసనిధప । గసనిధపమ । సనిధపమగ । నిధపమగస । సగమపధని; నిరిగమధ । ధనిరిగమ । మధనిరిగ । గమధనిరి । రిగమధని - సపహీనాః = షడ్జపంచమ రహితములు; నిగహీనాః = నిషాదగాంధార హీనములు - సరిమపధ। ధసరిమప । పధసరిమ । మపధసరి । రిమపధస । పరిహీనాయోగాః = పంచమ రిషభహీనయోగములైన మూర్ఛనలు- సగమధని । నిసగమధ । ధనిసగమ । మధనిసగ । గమధనిస ।

మధ్యమగ్రామే వత్వాత్ (?)= మధ్యమగ్రామమునందు వత్వములన (?) మపదనిరిగ। గమపధనిరి । రిగమపధని । నిరిగమపధ । ధనిరిగమప । (పధనిరిగమ) షడ్జహీనాః = షడ్జరహితములు; మపధనిసగ । గమపధనిస । సగమపధని । నిసగమపధ । ధనిసగమప । పదనిసగమ । రిహీనాః = రిషభహీనములు - మపధనిసరి । రిమపధనిస । సరిమపధని । నిసరిమ పధ । ధనిసరిమప । పధనిసరిమ । గహీనాః = గాంధారహీనములు - మపని(ధ?స)గ। గమపనిస । సగమపని । నిసగమప। పనిసగమ । ధరిహీనాః = ధైవతరిషభరహితములు :- మపధసరి । రిమపధస । సరిమపధ । ధసరిమప। పధసరిమ । నిగహీనాః = నిషాదగాంధారహితములు; ఇత్యౌడవితాః = అని ఔడవితములు-

ననుమూర్ఛనాతానయోః కః భేదః ? = మూర్ఛనాతానములకు

భేదవేంమి?; ఉచ్యతే = చెప్పబడుచున్నది; మూర్ఛనాతానయెూను నత్వాంతరత్వమితి వి(శాంఖిల(?) ఏతచ్చాసంగతం = మూర్ఛనా తానములలో అనునత్వ అంతరత్వమని. ఇదిఅసంగతము (?) సం(గహశ్లోకేతు మూర్ఛనాతానయోర్భేదస్య (ప్రతిపాదితత్వాత్ = సం(గహశ్లోకమునందు మూర్ఛనా తానములభేదము (ప్రతిపాదింపబడుట వలన; తత్ కథం = అదిఎట్లు?; మూర్ఛనాఆరోహ(క్రమేణ, తానః అవరోహ(క్రమేణ భవతీతి భేదః = మూర్ఛన ఆరోహ(క్రమముచేతను, తానముఅవరోహ(క్రమముచేతను అగునని భేదము; అధునా తానానాం యజ్ఞనామాని కథ్యంతే = ఇప్పుడు తానములకు యజ్ఞనామములు చెప్పబడుచున్నవి

**అగ్నిష్టోమోఽ త్యగ్నిష్టోమో వాజపేయోథ షోడశీ ।**
**పుండరీకోఽ శ్వమేధశ్చ రాజసూయశ్చ సప్తమః ॥ 106**

**(ప్రతిపదార్థము :** అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము నాజపేయము, షోడశీ, పుండరీకము, అశ్వమేధము, రాజసూయము ఏడవది; ఇతి షడ్జహీనషాడవతాన నామాని = అని షడ్జహీనషాడవతాననామములు; స్వరసృష్టిః = స్వరసృష్టి.

**తృడ్బహుః + సువర్ణశ్చ గోసవశ్చ మహా(వతః ।**
**విశ్వజిద్బహుయజ్ఞశ్చ (ప్రాజాపత్యస్తథైవ చ ॥ 107**

తృడ్బహువు, +సువర్ణము, గోసనము, మహా(వతము, విశ్వజిత్తు, బహుయజ్ఞము, (ప్రాజాపత్యము, ఇతి ఋషభహీనషాడవ తాననామాని = అని ఋషభరహిత షాడవతాననామములు

**అశ్వ(క్రాంతో రథ(క్రాంతో విష్ణు(క్రాంతసథైవ చ ।**
**సూర్య(క్రాంతో గజ(క్రాంతో వలతీనామ వ(జకౌ ॥ 108**

అశ్వ(క్రాంతము, రథ(క్రాంతము, విష్ణు(క్రాంతము, సూర్య(క్రాంతము, గజ(క్రాంతము, వలతి, వ(జకములు; ఇతి పంచమహీన షాడవతాననామాని = అని పంచమరహిత షాడవతాననామములు.

**చాతుర్మాసికసంజ్ఞశ్చ శస్త్రశ్చైకోత్థకస్తథా ।**
**సౌ(త్రామణిశ్చ పి(త్రా చ ఉద్భిద్యాగశ్చ సప్తమః ॥ 109**

సమనంతరస్వరేషు హసి తవద్యపరః చతుః పరోవాపి (?)।
ఆరోహత్యేకకలోహుంకారాఖ్యం సవిజ్ఞేయః ॥ 161

స్థానాంతరమారుహ్య ప్రత్యేకద్వ్యయశ్చతుష్కలో జ్ఞేయః ।
క్రమనోర్ధ్వపరిక్షేపః సంధిప్రచ్ఛాదనోనామ ॥

**ప్రతిపదార్థము** : హసితం ఉపహసితం ద్విరపి = హసితోపహసితములు రెండును; ద్వికలం గదితం = ద్వికలముగా చెప్పబడినవి; తతః = తరువాత; ఉపహసితం = ఉపహసితము; ఆక్షిప్తకమివ = ఆక్షిప్తమువలె; సమనంతరకృతం జ్ఞేయం = తరువాతి స్వరము చేయబడినదిగా తెలియదగినది; హసితవత్ = హసితమువలె; సమనంతర స్వరేషు = తరువాతి స్వరములయందు; అపరః చతుః = తరువాత నాల్గు స్వరములు; పరోపివా = పరమందుగాని; ఏకకలః ఆరోహతి = ఏకకలముగా ఆరోహించునో; సః = అది; హుంకారాఖ్యః విజ్ఞేయః= హుంకారాలంకారముగా తెలియవలెను; ప్రత్యేకద్వ్యయః = ప్రత్యేకముగా ద్వికలాస్వరములు; స్థానాంతరమారుహ్య = స్థానాంతర మారోహణచేసి; చతుష్కలః = కలాచతుష్కము; క్రమః = క్రమముగా; ఊర్ధ్వపరిక్షేపః = ఊర్ధ్వముగా పరిక్షేపమేదికలదో; సః= అది; సంధిప్రచ్ఛాదనోనామ అలంకారః = సంధిప్రచ్ఛాదనమనునలంకారమగును

**తాత్పర్యము** : హసితోపహసితములు రెండును ద్వికలముగాచెప్పబడినవి. తరువాత ఉపహసితము ఆక్షిప్తమువలె తరువాతి స్వరము చేయబడినదిగా తెలియదగినది. హసితమువలె తరువాతి స్వరములయందు తరువాత నాల్గుస్వరములు; పరమందుగాని ఏకకలముగా ఆరోహించునో అది హుంకారాలంకారముగా తెలియవలెను. ప్రత్యేముగా ద్వి(కలా)స్వరములు స్థానానాంతరమారోహణచేసి కలాచతుష్కము క్రమముగా ఊర్ధ్వముగా పరిక్షేపమేదికలదో అది సంధి ప్రచ్ఛాధనమనునలంకారమగును.

ఆదౌ పదముచ్చార్య యః స్యాత్ ద్విస్వరో లఘుని వర్ణః ।
సమనంతరమారోహత్యేకకలా తం విధూతం తు ॥ 163

ఆదా + + వరోహీస్యాత్ ప్రస్తారో ఽ ంతేఽ వరోహతే యత్ర ।
ప్రమాణతశ్చ కలాసు చ వంత్యాకార (?) ముద్గీతమ్ ॥ 164

**హుంకారవదారోహీ అనంతరాంస్తు స్వరాన్ కలాంతరయోః ।**
**ద్వౌ ద్వౌ చ కంపమతౌ (?) స్వరౌ చ తస్య ప్రసన్నౌ ద్వౌ ॥ 165**

**ప్రతిపదార్థము :** ఆదౌ = మొదట; పదముచ్చార్య = పదమున పలికి; ద్విస్వరః వర్ణః = ద్విస్వరవర్ణము; లఘుని = లఘువుయందు; సమనంతరం= తరువాత; యః ఏకకలా ఆరోహతి = ఏకకలాస్వరమేది ఆరోహణమగునో; తం =దానిని; విధూతం విదుః =విదూతముగా తెలియుదురు; ఆదౌ = మొదట; ప్రస్తారః = ప్రస్తారము; ఆరోహీ స్యాత్ = ఆరోహియగును; అంతే = చివర; యత్ర = ఎక్కడ; అవరోహతే = అవరోహణమగునో; ప్రమాణతః = ప్రమాణముచే; కలాసు= కలలయందు; అంత్యాకారం= అంతాకారముకలదగునో; తం ఉద్గీతం విదుః =దానినుద్గీతముగాతెలియుదురు; హుంకారవత్ = హుంకారము వలె; ఆరోహీ = ఆరోహణమందు; అనంతరాన్ స్వరాన్ = తరువాతి స్వరములను; కలాన్తరయోః = కలాంతములందు; ద్వౌద్వౌ స్వరౌ= రెండు రెండు స్వరములు; కంపమతౌ = కంపముకలవియగునో; తస్య = దానికి; ద్వౌ ప్రసన్నౌ = రెండు ప్రసన్నములు

**తాత్పర్యము :** మొదట పదమును పలికి ద్విస్వరవర్ణము లఘువుయందు తరువాత ఏకకలాస్వరవేది ఆరోహణమగునో దానిని విధూతముగా తెలియుదురు. మొదట ప్రస్తారము ఆరోహియగును. చివర ఒక్కడ అవరోణమగునో కలలయందు అంత ఆకారము కలదగునో దానినుద్గీతముగా తెలియుదురు. హుంకారమువలె ఆరోహణమందు తరువాతి స్వరములను కలాంతరములందు రెండు రెండు స్వరములు కంపము కలవియగునో దానికి రెండు ప్రసన్నములు.

**వర్ణాలంకారవిధౌ విజ్ఞేయౌ గాత్రవర్ణ ఇత్యేవమ్ ।**
**ఆకారోకారతయా దీర్ఘాక్షరమన్యదపి యోజ్యమ్ ॥ 166**

**ప్రతిపదార్థము :** వర్ణాలంకారవిధౌ = వర్ణాలంకారవిధియందు; గాత్రవర్ణ ఇతి= గాత్రవర్ణమని; ఏవం =ఇట్లు, ఆకారోకారతయా = ఆకార, ఉకారముచే; దీర్ఘాక్షరం అన్యత్ అపి యోజ్యం = మరియొక దీర్ఘాక్షరముకూడ కూర్చదగినది

**తాత్పర్యము :** వర్ణాలంకారవిధియందు గాత్రవర్ణమని ఇట్లు ఆకార, ఉకారముమరియొక దీర్ఘాక్షరముకూడ కూర్చదగినది.

**గీతాలంకారణాం కరణవిధిరయం సముద్దిష్టః।**
**ఏభిరలంకర్తవ్యా గీతిర్నామావిరోధేన ॥ 167**

**ప్రతిపదార్థము :** గీతాలంకారాణాం = గీతాలంకారములకు; అయం కరణవిధిః = ఈ కరణవిధి; సముద్దిష్టః = ఉద్దేశింపబడినది; నామవిరోధేన = నామవిరోధముచే; ఏభిః = వీటిచే; గీతిః అలంకర్తవ్యా = గీతి అలంకరింపదగినది

**తాత్పర్యము :** గీతాలంకారములకు ఈ కరణవిధి ఉద్దేశింపబడినది. నామవిరోధముచే వీటిచే గీతి అలంకరింపదగినది.

**స్థానే చాలంకారం కుర్యాత్ గాభ్యురసి కించిత్ ఉదావేద ।**
**బహవో౽ లంకారాః స్యుర్వర్ణవిహీనాః ప్రయోక్తవ్యాః ॥ 168**

**ప్రతిపదార్థము :** స్థానే = యుక్తముగదా ; గాభిః = గానములచే; ఉరసి = హృదయమందు; కించిత్ = కొంచెము; అలంకారం కుర్యాత్ = అలంకారము ఉంచదగినది(అలంకారవిషయము మనస్సునందుంచుకొనవలెను); బహవః అలంకారాః = అనేక అలంకారములు; వర్ణవిహీనాః= ప్రయోక్తవ్యాః స్యుః= వర్ణరహితములుగా ప్రయోగింపదగినవగును

**తాత్పర్యము :** యుక్తముగదా ! గానములచే హృదయమందు కొంచెము అలంకారముఉంచదగినది(అలంకారవిషయము మనస్సునందుంచుకొనవలెను). అనేక అంకారములు వర్ణరహితములుగా ప్రయోగింపదగినవగును.

**శశివిరహితేవ రజనీ విజలేవ నదీ లతా హ్యపుష్పేవ ।**
**అనలంకృతేవ నారీ గీతిరలంకారహీనా స్యాత్ ॥ 169**

**ప్రతిపదార్థము :** అలంకారహీనా గీతిః = అలంకారములేని గీతి; శశివిరహితా రజనీ ఇవ = చంద్రుడు లేని రాత్రివలె; విజలా నదీ ఇవ = నీరులేని నదివలె; అపుష్పా లతా ఇవ = పూవులు లేని లతవలె; అనలంకృతా నారీ ఇవ స్యాత్ = అలంకరింపబడని స్త్రీవలె నుండును

తాత్పర్యము : అలంకారములేని గీతి చంద్రుడులేని రాత్రివలె, నీరులేని నదివలె, పూవులులేని లతవలె, అలంకరపబడని స్త్రీవలె నుండును.

**అలంకారస్త్రయస్త్రింశ దేవమేతే మయోదితాః ।**
**నోదీయోపి (?) తేఽ ప్యత్ర ప్రయోక్తవ్యా మనీషిభిః ॥** 170

ప్రతిపదార్థము: ఏతే త్రయస్త్రింశత్ అలంకారాః = ఈ33 అలంకారములును; ఏవం = ఇట్లు; మయా ఉదితాః = నాచే చెప్పబడినవి; న ఉది(యో) తోపి = చెప్పబడకపోయినను; మనీషిభిః = బుద్ధిమంతులచే ; తే = అవి; అత్ర= ఈగీతములందు; ప్రయోక్తవ్యాః = ప్రయోగింపదగినవి

తత్ర ప్రస్తారో యథా - అందు ప్రస్తారమెట్లనగా -

షడ్జాదిషు = షడ్జాదులందు; సరిగమపదనిసా; ప్రసన్నాదిః = ప్రసన్నాది; సనిధపమగరిసా; ప్రసన్నాంతః = ప్రసన్నాంతము; సరిగమపధనిసా; నిధపమగరిపసా; ప్రసన్నాద్యంతః = ప్రసన్నాద్యంతము; సనిధపమగరిసా సరిగమపధనిసా; ప్రసన్నమధ్యమః = ప్రసన్నమధ్యము; సరిగమపధనిసా; సమం స స్యాత్ =అది సమమగును; స బిందుః = అది బిందువు

**సాదససా నివృత్తః ప్రవృత్తః ।**
**సరిగమ పధని నిధపమగరిస వేణుః ।**
**సరిగమపధనిసా । కంపితః ।**
**సనిరిగమపధనిసా (కు) హరితః ।**
**సరి మ । గమపధనిసా । రేచితః ।**

సరిరిస । రిగాగరీ । గమామగా । మపాపమా । పధాధపా । ధనీనిధా । నిసాసనీ। సంప్రేంఖోలితః ।

సరిగమప । నిరిగమప । రిగమపధరి । గమపధ । గాగమ । పధనిగ। మపధని। మ । మపధనిసమ। తారామంద్రప్రసన్నః

సప । మగరిసరిధమపగరిగని । ధప । మగ ।మస। నిధపమ । మంద్రతారప్రసన్నః ।

సరిరిస । రిగగరిస। సరిగమ । మగరిస । సరిగమప । పమగరిస ।
సరిగమపధ । ధపమగరిస । సరిగమపదని । నిగస[illegible]

సరిగమపధనిసా । సనిధపమగరిసా । ప్రస్తారః ।

సనినిస । సనిధ । ధనిస । సనిధప । పధనిస । సనిధపమ । మపధనిసా

సనిధపమగరీ । రిగమపధనిసా । సనిధపమగరిస । రిగమపధనిస । ప్రసాదః

సరిగమపధని । నిసధనినిధధప । పమమగ । గరిరిసా । ఉద్వాహితః ।

సరిసరి । రిగరిగ। గమగమ। మపమప। పధపధ। ధనిధని। నిసనిస। సనిసని। నిధనిధ। ధపధప । పమపమ। మగమగ। గరిగరి। రిసరిస। ఉపలోలకః।

సరిరిస। సరిగ। గరిస। సరిగమ। మగరిస। సరిగమప। పమగరిస। సరిగమపధ। ధపమగరిస । సరిగమపధని । నిధపమగరిస । క్రమా ।

సగరిమ । గపమధ । పనిసధ । నిష్కూజితః ।

సధస । ధనిపనిప । ధమధమ । పగపగ । మరిమరి । గసగస । హ్రోదమానః।

సరిగరి । రిగమ । పగ ।గమ । పమ । మప।ధప । పధ । నిధ । ధని। సరిని । రంజితః ।

సరిగమపధనిసా । సనిధపమగరిసా । ఆవర్తకః ।

సరి ।గప । పమ । గస । రిగ । మధా । ధప। మరి। గమ। పని। నిధ। పగామపధసా। సని। ధమా। నిధ। పగా। గమ। ధని।ధమ।పరి। రిగ।మధా। పమ। గసా। సరి। గపా। పరివర్తకః ।

సరి। మపా। పమ। రిసా। రిగ। మపధా। ధప। గరి। గమధని। నిధమగా। మపనిసా। పనిపమా। పధనిసా। సనిపమా। మపనిసా ।

నిధమగా। గమధని। ధపగరి। రిగపధ। పమరిసా। ఉద్వాహితః ।

సారీగా రీగామా । గామాపా। మాపాధా। పధని। ధనిస। సనిధ। నిధప। ధపమ। పమగ। మగరి। గరిసా। ఆక్షిప్తకః ।. . . .

సగమా మరిసా। రిపమా। పగరీ। గమధా। ధమగా। మధనీ। నిపమా । పనిసా। సధప। ధనిసా। సధపా। పనిసా। నిపమా। మధనీ। ధమగా। గపధా। పగరీ। రిపమా। మరిసా। సగమా। గరిసా। సంప్రదానమ్ ।. . . .

మగమ। మరిస। రిమప। పగరి।

దక్షిణే అతీతః చిత్రవృత్తౌ అగతః జాతిప్రయోగాత్ సమన్వితా = దక్షిణమందతీతమైన దియు చిత్రవృత్తియందాగతమైనదియు, జాతిప్రయోగమువలన కూడినది(?)

**ప్రథమా మాగధీ జ్ఞేయా ద్వితీయా చార్ధమాగధీ ।**
**సంభావితా తృతీయా చ చతుర్థీ పృథులా స్మృతా ॥ 171**

**ప్రతిపదార్థము :** ప్రథమా మాగధీ = ఒకటవది మాగధి; ద్వితీయా అర్ధమాగదీ= రెండవది అర్ధమాగధి; తృతీయా సంభావితా = మూడవది సంభావిత; చతుర్థీ పృథులా స్మృతా = నాల్గవది పృథులగా చెప్పబడినది

**తాత్పర్యము :** ఒకటవది మాగధి, రెండవది అర్ధమాగధి, మూడవది సంభావిత, నాల్గవది పృథులగా చెప్పబడినది.

**త్రిర్నివృత్తా చ యా గీతిః సా గీతిర్మాగధీ స్మృతా ।**
**అర్ధకాలనివృత్తా చ విజ్ఞేయా త్వర్ధ మాగధీ ॥ 172**

**ప్రతిపదార్థము :** యా గీతిః = ఏగీతి; త్రిర్నివృత్తా = మూడు పర్యాయములు నివృత్తమగునో; సా గీతిః మాగధీ స్మృతా = ఆగీతి మాగధియనబడును; అర్ధకాలనివృత్తా = అర్ధకాలనివృత్తమైన గీతిక; అర్ధమాగధీ విజ్ఞేయా = అర్ధమాగధిగా తెలియనగును. (సంభావితాః?) = (సంభావితములు?)

**తాత్పర్యము :** ఏగీతి మూడు పర్యాయములు నివృత్తమగునో ఆగీతి మాగధియనబడును; అర్ధకాలనివృత్తమైనగీతిక అర్ధమాగధిగా తెలియనగును. (సంభావితములు?)

**అలంకారా మయా ప్రోక్తా యథావన్మునిసత్తమ ।**
**అథ గీతిం ప్రవక్ష్యామి ఛందోఽ క్షర + + ++ ॥ 173**

**సంభావితా చ విజ్ఞేయా గుర్వక్షరసమన్వితా ।**
**పృథులాఖ్యా చ విజ్ఞేయా లఘ్వక్షరసమన్వితా ॥ 174**

**ప్రతిపదార్థము :** మునిసత్తమ! = మునిశ్రేష్ఠ; యథావత్ = ఉన్నదున్నట్లుగా;

మయా అలంకారాః ప్రోక్తాః = నాచే అలంకారములుచెప్పబడినవి; అథ = తరువాత; ఛందోక్షర సమన్వితాం = ఛందోక్షరములతో కూడిన; గీతిం ప్రవక్ష్యామి= గీతిని చెప్పుదును; గుర్వక్షరసమన్వితా= గుర్వక్షరములు కలది; సంభావితా విజ్ఞేయా = సంభావిత యగును; లఘ్వక్షరసమన్వితా పృథులా విజ్ఞేయా= లఘ్వక్షరములతో కూడినది పృథులగా తెలియదగినది

దక్షిణే మార్గపృథులా గీతిః వార్తికే మార్గే సంభావితా = దక్షిణమార్గ (మందు) దక్షిణమందు మార్గపృథులగీతియు; వార్తికమార్గమందు సంభావితము; చిత్రైర్మార్గే మాగధిః అష్టా కలా = చిత్రమార్గము(లం)నందు మాగధిఅష్టకలాయుతము; తాలప్రయోగక్రమేణ = తాల ప్రయోగక్రమముచేతను

**తాత్పర్యము** : మునిశ్రేష్ఠ! ఉన్నదున్నట్లుగా నాచే అలంకారములు చెప్పబడినవి. తరువాత ఛందోక్షరములతో కూడిన గీతిని చెప్పుదును. గుర్వక్షరములు కలది సంభావితయగును. లఘ్వక్షరములతో కూడినది పృథులగాతెలియదగినది. దక్షిణమార్గ(మందు)దక్షిణమందు మార్గపృథులగీతియు, వార్తికమార్గమందు సంభావితము. చిత్రమార్గమునందు మాగధిఅష్టకలాయుతము. తాల ప్రయోగ క్రమముచేతను

**చిత్రే చైవకలే తాలే విజ్ఞేయా గీతిర్మాగధీ ।**
**వార్తికే ద్వికలా జ్ఞేయా గీతిః సంభావితా బుధైః ॥** 175

**ప్రతిపదార్థము** : ఏకకలే చిత్రే తాలే = ఏకకలాయుతమైన చిత్రముయొక్క తాలమందు; మాగధీ గీతిః విజ్ఞేయా = మాగధిగీతిగ తెలియదగినది; వార్తికే = వార్తికమందు; ద్వికలా సంభావితా గీతిః జ్ఞేయా = ద్వికలాయుతమైన సంభావితగీతిగా తెలియవలెను

**తాత్పర్యము** : ఏకకలాయుతమైన చిత్రముయొక్క తాలమందు మాగధిగీతి తెలియదగినది. వార్తికమందు ద్వికలాయుతమైన సంభావితగీతిగా తెలియవలెను.

**దక్షిణే పృథులా గీతిస్తాలైర్జ్ఞేయా చతుష్కలే ।**

**అనేనైవ విధానేన గాతవ్యా గీతయో బుధైః ॥** 176

**ప్రతిపదార్థము :** చతుష్కలే దక్షిణే = చతుష్కలాయుతదక్షిణమందు; తాలైః= తాలములచే; పృథులా గీతిః జ్ఞేయా = పృథులగీతి తెలియదగినది; అనేనైవవిధానేన = ఈప్రకారముగనే, గీతయః బుధైః గాతవ్యాః = గీతులు పండితులచే గానముచేయదగినవి;

చిత్రే చైకకలే ఏవ తాలః ర్కః (?) = చిత్రమందేకకలయందే తాలము చేయదగినది; తం ద్విమాత్రక ప్రయోగాత్ వార్తికే ద్వికలే ఏవ తాలః చతుర్మాత్రిక ప్రయోగాత్ దక్షిణే చతుష్కల ఏవ తాలః అష్టమాత్రిక ప్రయోగాత్ (ద్వి?) = దానిని ద్విమాత్రిక ప్రయోగమువలన వార్తికమందు ద్వికలయందే తాళము, చతుర్మాత్రిక ప్రయోగమువలన, దక్షిణమందు చతుష్కయందే తాళము, అష్టమాత్రాప్రయోగమువలన (ద్వి?)

**తాత్పర్యము :** చతుష్కలాయుత దక్షిణమందు తాలములచే పృథులగీతి తెలియదగినది, ఈప్రకారముగనే గీతులు పండితులచే గానముచేయదగినవి. చిత్రమందే కకలయందే తాలముచేయుదగినది. దానిని ద్విమాత్రిక ప్రయోగమువలన దక్షిణమందు చతుష్కలయందే తాళము అష్టమాత్రాప్రయోగము వలన (ద్వి?)

**ద్విగురుద్వినివృత్తాచ చిత్రే గీతస్తు మాగధిః ।**
**సంభావితా గురుర్వృత్తౌ పృథులా దక్షిణే లఘు ॥** 177

**ప్రతిపదార్థము :** ద్విగురు = రెండు గురువులు; ద్వినివృత్తాచ = రెండు వృత్తములు కల; మాగధిః గీతః = మాగధిగీతము; చిత్రే = చిత్రమందగును; దక్షిణే వృత్తే = దక్షిణ వృత్తియందు; గురుః సంభావితా గురువు కల సంభావితయు; లఘు పృథులాచ = లఘుపృథులయు అగును

యథా మాగధీ = మాగధివలె; అథ సంభావితా పృథులా వార్తికే సంగ్రహాత్ దక్షిణే అధీతః = పిమ్మట సంభావితయు, పృథులవార్తిక మందు సంగ్రహమువలన దక్షిణ మందుచదువబడినది. చిత్రవృత్తే అగతః జాతి ప్రయోగాః (?) = చిత్రవృత్తియందగతమైన జాతిప్రయోగము(?); వృత్తిర్నామ

చికథితం = వృత్తియనగా (చికథితము); అథా దక్షిణే వృత్తిశ్చేతి త్రేతిమాత్రా అష్టౌ చతుచతుః ద్విక్రమేణ = అట్లే దక్షిణమందు వృత్తియని త్రిమాత్ర, అష్టమాత్ర, నాల్గునాల్గు క్రమద్వయముచే (నగును); యథా -

**తాత్పర్యము** : రెండు గురువులు రెండువృత్తములు కల మాగధిగీతము చిత్రమందగును. దక్షిణవృత్తియందు గురువుకల సంభావితయు, లఘుపృథులయు అగును

మాగధివలె (ఎట్లుఅనగా) పిమ్మట సంభావితయు, పృథువార్తిక మందు సంగ్రహము వలన దక్షిణ మందు చదువబడినది. చిత్రవృత్తియందగతమ్మైన జాతిప్రయోగము(?) వృత్తియనగా (చికథితము) అట్లే దక్షిణమందు వృత్తియని త్రిమాత్ర, అష్టమాత్ర, నాల్గునాల్గు క్రమద్వయముచే (నగును)

**ధ్రువకా సర్పిణీ కృష్ట్యా వర్తిన్యథవిసర్జితా ।**
**విక్షిప్తాచ పతాకా చ పతితా చాష్టమీ స్మృతా ॥** 178

**ప్రతిపదార్థము** : ధ్రువక, సర్పిణి, కృష్ట్యా, వర్తినీ, విసర్జిత, విక్షిప్త, పతాక, చ = మరియు; అష్టమీ పతిత స్మృతా = ఎనిమిదవదిగా పతిత చెప్పబడినది

**తాత్పర్యము** : ధ్రువక, సర్పిణి, కృష్ట్యా, వర్తినీ, విసర్జిత, విక్షిప్త, పతాక, మరియు ఎనిమిదవదిగా పతిత చెప్పబడినది.

**తత్ర ధ్రువకాచ శబ్దస్యాః(?) సర్పిణే వామాగా భవేత్ ।**
**కృష్ట్యా దక్షిణతో యాతా వర్తినీ చాప్యథోగతాః ॥** 179

**వివర్తితా బహిర్యాతా విక్షిప్తా కూర్చితా భవేత్ ।**
**పతాకా చోర్ధ్వగా జ్ఞేయా వనితా భ్రమ్మిగా భవేత్ ॥** 180

**ప్రతిపదార్థము** : తత్ర = అందు, ధ్రువకాశబ్దస్య సర్పిణీ వామగా భవేత్ = ధ్రువకాశబ్దమునకు వామము (ఎడమ) గాపోవునది సర్పిణి (అగును); కృష్ట్యా దక్షిణతః యాతా = కృష్ట్య కుడివైపుగా వెళ్లునది; వర్తినీ అధోగతా = వర్తిని క్రిందుగా వెళ్ళునది; వివర్తితా బహిః యాతా = వివర్తత వెలుపలకు వెళ్లునది; విక్షిప్తా కూర్చితా భవేత్ = విక్షిప్త కూర్చితమగును; పతాకా ఊర్ధ్వగా జ్ఞేయా =

పతాకపైకి వెళ్లునదిగా తెలియవలెను; వనితా భ్రమ్మిగా భవేత్ = వనిత పర్యంతము తిరుగునదియగును; వార్తికే చ = వార్తికమందుకూడ

**తాత్పర్యము :** అందు ధ్రువకాశబ్దమునకు ఎడమగా పోవునది సర్పిణి అగును కృష్ట్య కుడివైపుగా వెళ్లునది. వర్తిని క్రిందుగావెళ్ళునది. వివర్తత వెలుపలకు వెళ్లునది విక్షిప్త కూర్చితమగును. పతాక పైకి వెళ్లునదిగా తెలియవలెను. వనిత పర్యంతము తిరుగునదియగును. వార్తికమందుకూడ,

> **"దక్షిణా చోర్ధ్వగా చిత్రే ద్వే తు ధ్రువకా సర్పిణీ ।**
> **కృష్ట్యా పద్మినీ + + + +++++ +++ (?) ॥"** 181

**ప్రతిపదార్థము :** చిత్రే = చిత్రమందు; దక్షిణా = దక్షిణ; ధ్రువకా సర్పిణీ ద్వే తు = ధ్రువకా సర్పిణిలు రెండును కూడ; ఊర్ధ్వగా = ఊర్ధగములు; కృష్ట్యా పద్మినీ = కృష్ట్య పద్మినులు + + + +++ + + + +(?)

**తాత్పర్యము :** చిత్రమందు దక్షిణ ధ్రువక, సర్పిణి, ఊర్ధ్వముగా వెళ్లునవి. కృష్ట్యపద్మినులు.

> **ప్రథమే మధ్యమాంగులీచో (?) ద్వితీయే సార్ధని + + ।**
> **తృతీయే ముష్టిమోక్షశ్చ చతుర్థే కరపాతనా ।**
> **ధ్రువకా సర్పిణీ చిత్రే దక్షిణావితీ చితగీతా (?) ॥** 182

**ప్రతిపదార్థము :** ప్రథమే = మొదటిదానియందు; మధ్యమాంగులీ = మధ్యమాంగులియు; ద్వితీయే = రెండవదానియందు; సార్ధని + + = సార్ధనియు; తృతీయే = మూడవదానియందు; ముష్టిమోక్షః = ముష్టిమోక్షము (పిడికిలి విప్పుట); చతుర్థేకరపాతనా = నాల్గవయందు హస్తపాతనము; ధ్రువకా సర్పిణీ = ధ్రువక సర్పిణులు; చిత్రే = చిత్రమందు; దక్షిణావితీ = దక్షిణాయని; చితగీతాః (?) = చిత్రగీతములు (?)

**తాత్పర్యము :** మొదటిదానియందు మధ్యమాంగులియు, రెండవదానియందు సార్ధనియు, మూడవదానియందు ముష్టమోక్షము, నాల్గవదానియందు హస్తపాతనము, ధ్రువక - సర్పిణులు చిత్రమందు, దక్షిణాయని చిత్రగీతములు.

ఉభయ వాద్య ప్రవర్తనవశాత్ ప్రతీతిశ్చాగీత ప్రధాన దక్షిణావృత్తిః ఉపభయప్రధానావృత్తిః మాంబిత్తి (?) వాద్యప్రధానా చిత్రవృత్తిః = ఉభయవాద్య ప్రవర్తనమువలన ప్రసిద్ధి ఏమనగా ఆగీత (గీతపర్యంతము) ప్రధానదక్షిణావృత్తి, ఉభయ ప్రధానవృత్తి, మాంబిత్తి వాద్యప్రధానచిత్రవృత్తి; ఇదానీం ప్రాధాన్యం జ్ఞాపయతి పాణికృతం వివర్తితం = ఇప్పుడు ప్రాధాన్యము పాణికృతవివర్తనము తెలుపుడుచేయుచున్నది; (ప్రాణికృతవివర్తిత ప్రాధాన్యము తెలుపు చేయుచున్నది)

తదుక్తా తాం యతి మార్గ ప్రాధాన్యాదాసాం యధా సంఖ్యం స్వరవ్యంజ కాని(?) భవంతి = దాని వలన చెప్పబడిన తాల, యతి, మార్గప్రాధాన్యమువలన వీటికి యధాసంఖ్యముగా (లెక్కననుసరించి) స్వరవ్యంజకములగుచున్నవి

చిత్రేసమాయాతి+ద్రుతోలయః ఉపరిపాణిః మాగధీఘనాముఖోఽ వయవః వార్తికేస్రోతోగతా యతి మధ్యః లయః సమపాణిః సంభావితా = చిత్రమందు ద్రుతము,లయ, ఉపరిపాణి మాగధి; సంబంధి ఘనాముఖ అవయవము, వార్తికమందు స్రోతోగతమైన యతిమధ్యలయ సంభావితసమపాణి వచ్చుచున్నది. అత్రగవోవలయవః ఉదగ్దక్షిణే గోపుచ్ఛాయది (?) విలంబితోలయః అధమపాణిః పృథులా గీతి తత్వం చావయవః వృత్తినాం చ వాద్యా సమానఅసమాన ఆగతతీతగ్రహైః కార్యం (?) = ఇందు గోవలయవము ఉదగ్దషిణమందు గోష్పచ్ఛమైనయెడల (?) విలంబిత లయ అధమపాణి, పృధులాగీతి తత్వఅవయవము. వృత్తుల వాద్యాసమానాసమాన ఆగతాతీత గ్రహములచే చేయదగినది(?) తత్ర చిత్రేఅనాగతోగ్రహః అభిత్పర్వో (?) వాద్యప్రయోగః పశ్చాత్ కలా చతుష్టయేఽ తీతే సతివాద్యగ్రహ యోగః సోఽ ధః పాణిరుచ్యతే= అందు చిత్రమందనాగతగ్రహము, అభిత్పూర్వవాద్యప్రయోగము, తరువాత కలాచతుష్కమందు అతీతము కాగా వాద్యగ్రహయోగము; అది అధమపాణిగా చెప్పబడుచున్నది. తన్మాగధీనామ గీతం విపరీత యోజన తయాదృశ్యతే = ఆ మాగధియను గీతము విపరీతయోజనగా కనబడుచున్నది

తద్యథా = అదిఎట్లనగా - దక్షిణే మార్గే ప్రవృత్తా గీతిర్యథాచిత్రే ప్రయుజ్యతే, తథా పృథులా గీతిః మాగధీత్యుచ్యతే = దక్షిణమార్గమందు

ప్రవృత్తమైన గీతి ఏవిధముగా చిత్రమందు ఉపయోగింపబడునో (ప్రయోగింపబడునో) అట్లే పృథులా గీతి మాగధియని చెప్పబడును; వృత్తిమార్గే చ చిత్రే యదా ప్రయుజ్యతే తదా సా మాగధీ సంభావితాః శబ్దాః వాద్యావ్యా (?) ద్విః పరివృత్త క్రమేణ యోజ్యతే = వృత్తిమార్గ చిత్రమందు ఎప్పుడు ప్రయుజ్యమగునో అప్పుడు ఆ మాగధి సంభావితశబ్దములు వాద్య సంబంధి యగు రెండు పర్యాయములు పరివృత్తక్రమముచే కూర్చబడినది

యావద్దక్షిణా చ చిత్రో మార్గః ప్రయుజ్యతే = అంతవరకు దక్షిణాయను చిత్రమార్గము ప్రయోగింపబడును; ఆవాపాదిక్రమేణ అష్టధా చతుర్ధా చ ఇతి = ఆవాపాదిక్రమముచే 8,4 విధములని; ఏవముక్తం భవతి = ఇట్లుచెప్పబడుచున్నది; చిత్రే చ ద్విమాత్రాకాలా(?) సైవ మాగధీ గీతిః సంభావితయా గీత్యా ప్రయుజ్యతే = చిత్రమందు ద్విమాతికకల (?) అదియు మాగధీగీతి సంభావితగీతిచే ప్రయోగింపబడుచున్నది; తదా చతుర్మాత్రిక వృత్తిశబ్దేన ఉచ్యతే = అప్పుడు చతుర్మాత్రిక వృత్తిశబ్దముచే చెప్పబడుచున్నది; యదా తు చిత్రే మాగధీగీతిః సంభావితశబ్దవాచ్యా ద్విగుణితా అష్టమాత్రా పృథులాశబ్దవాచ్యా దక్షిణమార్గే భవతి = ఎప్పుడు చిత్రమందు మాగధీగీతి సంభావితశబ్దవాచ్యమగునో(చు) ద్విగుణమైఅష్టమాత్రకమైనపృథులాశబ్దవాచ్యమై దక్షిణమార్గమందగుచున్నది; త్రీత్రీన్నివృత్తిస్త్రిరా వృత్తిమాగధీయధా భవమీశం (?) పదం గీత్వా ప్రథమే కలాం నిర్వాప్య విలంబిత లయేన యథాద్వితీయా కలా మధ్యమవయేన (?) దేవమిత్యనేన వరదేన శర్వమితి సహితేన గాయతి= మూడుమూడు నివృత్తులుకలదియు మూడావృత్తులుకల మాగధి ఏవిధముగా భవుడు ఈశుడు అయినపరమేశ్వరసంబంధిపదమున గానముచేసి ధ్రువమందు కలను సమాప్తిచేసి, విలంబితలయచే ఎప్పుడు రెండవ కల మధ్యమవయ(స్సు)చే (?)దేవుడు వరదుడు అనుటచే శర్వమనునది కూడ కలిపి గానముచేయుచున్నది(చున్నాడు); తత్రాపిచ తృతీయాం కలాద్రుతవయేన దేవశర్వపదద్వయే వందే ఇతి పదద్వయేన వందే ఇతి పదాంతరసహితేన నిర్వాహయతి కలావయవ్యాపాతనాత్ (?) = అందును మూడవదానిని ద్రుత వయముచే దేవ, శర్వపదద్వయమునందు వందే అను పదద్వయముచే, వందేఅను మరియొక పదముతో కూడ కలావయవ్యాపాతనము వలన

నిర్వహింపజేయుచున్నది; యథా - ఎట్లనగా - మామాసాసా । మాసాసామా । ససమాసమ । మరిరిని । మగధదేశోద్భవత్వాత్ మాగధీ = మగధదేశమందు పుట్టుటవలన మాగధి (అయినది); అన్యే తు నివృత్తాం మాగధీం పఠంతి అర్ధమితి పదసంబంధ్యర్థపాదత్వేన అర్ధమాగధీ = కొందరు నివృత్తమాగధిని పఠింతురు. అర్ధమను పదసంబంధియైన అర్థప్రతిపాదనచే అర్ధమాగధియైనది; నచ పాదాద్యనివృత్తినివృత్తా వర్ధః ప్రవృత్తినివృత్తిగః హేతుః మంతవ్యాః = పాదాద్యనివృత్తి నివృత్తియందర్ధము ప్రవృత్తి నివృత్తిని పొందినదై హేతువుగా తలవరాదు; యతః సామవేదగీత ప్రథాదేవ ఆ వృత్తిష్వర్ధ ఆద్రియత ఇతి = ఏకారణమువలన సామవేదగీత ప్రసిద్ధివలనే ఆ వృత్తులందు అర్ధము ఆదరింపబడుచున్నది. తదుక్తం = అదిచెప్పబడినది; య ఉ వృత్తాత్మా జాతవేదసమితి = య ఉవృత్తిచే ఆత్మ జాతవేదస మని; అత్ర వేదశబ్దపర్యవసితా సంభావితాః లఘుప్రయావ (?) పృథులాభూయస్త్వాత్ పదగ్రామస్య పృథులేత్యుక్త్వా స్వరతాను ఇతిమార్గలయా మార్గత్రయో గీతిః విధౌ లయః ప్రయోగే నవధా ద్రష్టవ్యాః (?) = ఇందు వేదశబ్దపర్యవసితములైన సంభావితలఘు ప్రయావ(?) పృథులాధిక్యతవలన పదగ్రామమునకు పృథులయని పలికి స్వరతాను అని మార్గలయు, మార్గత్రయుమైనగీతి విధియందు లయప్రయోగమందు తొమ్మిదివిధములుగా చూడదగినవి; లయసంప్రయోగం దర్శయతి = లయ సంప్రయోగము చూపుచున్నాడు- దక్షిణోమార్గో వార్తికో మార్గశ్చిత్రమార్గ ఇతి = దక్షిణమార్గము, వార్తికమార్గము చిత్రమార్గము అని; దక్షిణావృత్తౌ లయుత్రయుం వార్తికమార్గశ్చిత్రమార్గో ధ్రువమార్గః శూన్యమార్గశ్చేతి = దక్షిణావృత్తము లయుత్రయము వార్తికమార్గము, చిత్రమార్గము, ధ్రువమార్గము అని, వృత్తి మార్గప్రవృత్తౌ లయత్రయం చిత్రమార్గో ధ్రువమార్గః శూన్యమార్గశ్చేతి = వృత్తిమార్గప్రవృత్తియందు, లయత్రయము చిత్రమార్గము ధ్రువమార్గము శూన్యమార్గము అని; చిత్రే లయత్రయం ఏవం నవధా లయయోగః చిత్రాదిమార్గేషు ద్రష్టవ్యః = చిత్రమందు లయత్రయము ఇట్లు తొమ్మిదివిధములుగా లయుయోగము చిత్రాదిమార్గములందు చూడదగినది; ఇతి గీత్యధ్యాయే ప్రతిపాదితం = అని గీత్యధ్యాయమందు ప్రతిపాదింపబడినది; యథా । చిత్ర ఏకో గురుః ఏకో లఘుః ఏకో ద్రుతం =

చిత్రమందు ఒక గురువు, ఒక లఘువు, ఒక ద్రుతము

**ఏకద్విగుణో వృత్తౌ తద్విగుణో దక్షిణే తథా ।**
**ద్విమాత్రా స్యాత్ కలాచిత్రే చతుర్మాత్రా తు వార్త్తికే ॥** 183

**ప్రతిపదార్థము** : వృత్తౌ = వృత్తియందు; ఏకద్విగుణః = ఏకము ద్విగుణమగును; తథా = అట్లే; దక్షిణే = దక్షిణావృత్తియందు; తద్విగుణః = దానికి ద్విగుణము; ద్విమాత్రా స్యాత్ కలాచిత్రే = కలాచిత్రమందు ద్విమాత్రికమగును; వార్త్తికే = వార్త్తికమందు; చతుర్మాత్రా స్యాత్ = చతుర్మాత్రికమగును

**తాత్పర్యము** : వృత్తియందు ఏకము ద్విగుణమగును. అట్లే దక్షిణావృత్తియందు దానికి ద్విగుణము. కలాచిత్రమందు ద్విమాత్రికమగును. వార్త్తికమందు చతుర్మాత్రికమగును.

**అష్టమాత్రా తు విద్వద్భిః దక్షిణే సముదాహృతా ।**
**వార్త్తికే దక్షిణే ఇతి ॥**

**ప్రతిపదార్థము** : దక్షిణే = దక్షిణావృత్తియందు; అష్టమాత్రాః సముదాహృతాః= అష్టమాత్రలు ఉదహరింపబడినవి;వార్త్తికే = వార్త్తికమందు; దక్షిణే = దక్షిణమందు; ఇతి = అని

**తాత్పర్యము** : దక్షిణావృత్తియందు అష్టమాత్రలు ఉదహరింపబడినవి. వార్త్తికమందు దక్షిణమందు అని

ఇదానీం అవసర ప్రాప్తానాం జాతీనాముద్దేశమాహ = ఇప్పుడు అవసరముగా ప్రాప్తించిన జాతుల ఉద్దేశముచెప్పుచున్నాడు. తత్ర జాతయో అష్టాదశ ఏవ = అందు జాతులు 18 మాత్రమే; ఏతాః సమాంశభేదేన శతం చత్వారింశదధికం సంఖ్యయా భవంతి = ఇవి సమ, అంశభేదముచే గణనచేత 140 అగుచున్నవి; తత్ర స్వరే = అందు స్వరమందు

**సాధారణ కృతాస్తిస్రః విజ్ఞేయా జాతయో బుధైః ॥**
**మధ్యమా మత్సరీ చైవ తథా వై షడ్జమధ్యమా ॥** 184

**ప్రతిపదార్థము :** సాధారణ కృతాః జాతయః = సాధారణ కృతములైన జాతులు; త్రిస్రః విజ్ఞేయాః = మూడుగా తెలియనగును; తే = అవి; మధ్యమా మత్సరీ షడమధ్యమా = మధ్యమ మత్సరి షడ్జమధ్యము అని; ఇతి సప్త షడ్జగ్రామాశ్రయాః= ఇట్లు ఏడు షడ్జగ్రామాశ్రయములు

**తాత్పర్యము :** సాధారణ కృతములైన జాతులు మూడుగాతెలియనగును. అవి మధ్యమ, మత్సరి షడ్జమధ్యమము. ఇట్లు ఏడు షడ్జగ్రామాశ్రయములు

**గాంధారీ మధ్యమా చైవ పంచమీ చ తథైవ హి ॥** 185

**గాంధారోదీచ్య వా చైవ తథాగాంధారపంచమీ ।**
**తతశ్చ రక్తగాంధారీ మధ్యమోదీచ్యవా తథా ॥** 186

**అంధ్రీ చ నందయంతీ చ కర్మారవ్యథ కైశికీ ।**
**ఏవమేకాదశ జ్ఞేయా మధ్యమగ్రామసంశ్రయాః ॥** 187

**ప్రతిపదార్థము :** గాంధారి, మధ్యమ, పంచమి, గాంధరోదీచ్యవా, గాంధారపంచమీ, రక్తగాంధారీ, మధ్యమోదీచ్యవా, అంధ్రి, నందయంతి, కర్మారవీ, కైశికీ; ఏవం= ఇట్లు, మధ్యమగ్రామాశ్రయములు; ఏకాదశవిజ్ఞేయాః = 11 గాతెలియదగినవి

ఆభ్యః అష్టాదశ జాతిభ్యః సప్తస్వరాఖ్యాశ్చ ఉక్తా ద్విధాశుద్ధా వికృతాశ్చ ఇతి = ఈ 18 జాతులనుండి సప్తస్వరములు శుద్ధములు, వికృతములు అని రెండు విధములుగ చెప్పబడినవి; తత్రశుద్ధా అన్యూనస్వరా స్వరస్వర గ్రాహోన్యాసాశ్చ (?) ఏభ్యః లక్షణేభ్యః అన్యతమేన ద్వాభ్యాం బహుభిర్వా లక్షణైర్వాయ్యాపి తుష్టా (?) న్యాసవర్జం వికృతసంజ్ఞా భవంతి = అందు శుద్ధము తక్కువకాని స్వరములు కలది (సంపూర్ణస్వరములుకలది) స్వరస్వర గ్రాహములు న్యాసములు కలదియు; ఈలక్షణములనుండి ఒకదానిచే రెండు లక్షణములచేగాని, అనేక లక్షణములచే గాని ఏది సంతుష్టము, న్యాసములేనిది అగునో అవి వికృతములగుచున్నవి; తత్రన్యాస వలమాహ = అందు న్యాసలక్షణము చెప్పుచున్నాడు; తత్ర న్యాస విధౌ యజ్జాతయః శుద్ధాః తాసు నామకారి(?) యో న్యాసః నియమేన మంద్రోభవతి = అందు న్యాసవిధియందు ఏజాతులు శుద్ధములో వాటిలో నామకారి (?)ఏన్యాసమో అది నియమముచే

మంద్రమగుచున్నది; వికృతాసు చ నామక వికారీ (?) వా మంద్రో భవతీత్యనియమః = వికృతములందు నామవికారిగాని మంద్రమగునను నియమములేదు; తత్ర శుద్ధానాం జాతీనాం శుద్ధత్వం వికృతత్వంచ రూపద్వయమస్తి = అందు శుద్ధజాతులకు శుద్ధత్వము, వికృతత్వము అనురెండు రూపములు కలవు; ఏకాదశానాం జాతీనాం వికృతోద్భవత్వాత్ వికృతత్వమేవ రూపంభవతి = 11 జాతులయొక్క వికృతమునుండి పుట్టుట వలన వికృత త్వరూపము అగుచున్నది; నను శుద్ధత్వమితి కుతః ఏతత్ ? = ఓయీ ! శుద్ధత్వమనునది ఎక్కడిది?; తా హి పరస్పరసంసర్గాత్ జాయంతే = అవి అన్యోన సంబంధమువలన పుట్టుచున్నవి; తథాచాహ భరతః -

**శుద్ధా వికృతాశ్చైవ హి సమవాయాజ్జాతయస్తు జాయంతే ।**
**పునరేవాశుద్ధకృతా భవంత్యథైకాదశపరాస్తు ॥**

**తాసాం యాస్తు నివృత్తాః స్వరేష్వథాంశేషు జాతిషు చ ।**
**జాతీస్తా వక్ష్యామః సంక్షేపేణ క్రమేణ చైవాత్ర ॥**

**ప్రతిపదార్థము :** శుద్ధాః వికృతాః జాతయః = శుద్ధవికృతజాతులు; సమవాయాత్ జాయంతే = సమవాయసంబంధమువలన పుట్టుచున్నవి; పునరేవ = మరల; అశుద్ధకృతాః = వికృతములు; అథ = తరువాత; ఏకాదశపరాః భవంతి = 11 విధములగుచున్నవి; తాసాం = వాటిలో; స్వరేషు = స్వరములందు; అంశేషు= అంశములందు; జాతిషు చ = జాతులయందును; యాః నివృత్తాః = ఏవినివృత్తములో; తాః జాతీః = ఆజాతులను; క్రమేణ = క్రమముగా; సంక్షేపేణ= సంగ్రహముగా; వక్ష్యామః = చెప్పుదుము

**తాత్పర్యము :** శుద్ధవికృతజాతులు సమవాయసంబంధమువలన పుట్టుచున్నవి. మరల వికృతములు తరువాత11 విధములగుచున్నవి. వాటిలో స్వరములందు అంశములందు జాతులయందును ఏవి నివృత్తములో ఆజాతులను క్రమముగా సంగ్రహముగా చెప్పుదుము.

**షడ్జాయాః మధ్యమాయాశ్చ సంసర్గాత్ షడ్జమధ్యమా ।**
**షడ్జాయాశ్చ గాంధార్యాః జాయతే షడ్జకైశికీ ॥**

**ప్రతిపదార్థము** : షడ్జాయాః మధ్యమాయాశ్చ సంసర్గాత్ = షడ్జమధ్యములసంయోగము వలన; షడ్జమధ్యమా జాయతే = షడ్జమధ్యమము జనించుచున్నది; షడ్జాయాః గాంధార్యాః సంసర్గాత్ షడ్జకైశికీ జాయతే = షడ్జగాంధారముల సంబంధమువలన షడ్జకైశికి పుట్టుచున్నది

**తాత్పర్యము** : షడ్జమధ్యమములు సంయోగమువలన షడ్జమధ్యమము జనించుచున్నది. షడ్జగాంధారముల సంబంధమువలన షడ్జకైశికి పుట్టుచున్నది.

**తయోరేవ సధైవత్యోః షడ్జోదీచ్యవతీ భవేత్ ।**
**ఆసాం సమధ్యమానాం తు గాంధారోదీచ్యవా భవేత్ ॥**

**ప్రతిపదార్థము** : తయోరేవ సధైవత్యోః= ధైవతసహిత షడ్జగాంధారసంబంధము వలన; షడ్జోదీచ్యవతీ భవేత్ = షడ్జోదీచ్యవతి యగును; సమధ్యమానాం ఆసాం సంసర్గాత్= మధ్యమసహితములైన వీటి కలయిక వలన; గాంధారోదీచ్యవా భవేత్ = గాంధారోదీచ్యవయగును

**తాత్పర్యము** : ధైవతసహిత షడ్జగాంధార సంబంధమువలన షడ్జోదీచ్యవతి యగును. మధ్యమసహితములైన వీటి కలయిక వలన గాంధారోదీచ్యవయగును.

**గాంధార్యా మధ్యమాయాశ్చ పంచమ్యాశ్చైవ సంకరాత్ ।**
**సధైవతీనామాసాం తు మధ్యమోదీచ్యవా భవేత్ ॥**

**ప్రతిపదార్థము** : గాంధార్యాః = గాంధారియొక్కయు; మధ్యమాయాః = మధ్యమముయొక్కయు; పంచమ్యాః సంకరాత్ = పంచమియొక్క సంసర్గమువలన; సధైవతీనాం ఆసాం = ధైవతసహితములైనవీటి యొక్క కలయిక వలన; మధ్యమోదీచ్యవా భవేత్ = మధ్యమోదీచ్యవయగును

**తాత్పర్యము** : గాంధారియొక్కయు మధ్యమముయొక్కయు పంచమియొక్కయు సంసర్గమువలన ధైవతసహితములైన వీటి యొక్క కలయికవలన మధ్యమోదీచ్యవయగును.

**ఆసాం స్యాత్ రక్తగాంధారీ నైషాదీ చేచ్చతుర్థికా ।**
**ఆర్షభ్యాస్తు భవేద్యంధ్రీ గాంధార్యాశ్చైవ సంకరాత్ ॥**

**ప్రతిపదార్థము :** ఆసాం = వీటికి; నైషాదీ చతుర్థికా చేత్ = నైషాది నాల్గవదిగా కలసినచో; రక్తగాంధారీ స్యాత్ = రక్తగాంధారియగును; ఆర్షభ్యాః గాంధార్యాశ్చ సంకరాత్ = రిషభ, గాంధారులసంయోగమువలన; అంధ్రీ భవేత్ = అంధ్రియగును

**తాత్పర్యము :** వీటికి నైషాది నాల్గవదిగా కలసినచో రక్తగాంధారియగును. రిషభగాంధారులసంయోగమువలన అంధ్రియగును.

**అనయోస్తు సపంచమ్యోః నందయంతీ ప్రజాయతే ।**
**సన్నిషాదా స్వగాంధార్యాః కుర్యుః కార్మారవీమిమామ్ ॥**

**ప్రతిపదార్థము :** సపంచమ్యోః అనయోః సంకరాత్ = పంచమి సహితములైన ఈ రెండింటి సంకరమువలన; నందయంతీ ప్రజాయతే = నందయంతి పుట్టుచున్నది; సన్నిషాదా = నిషాదముతో కూడ; స్వగాంధారియొక్క కలయికవలన; ఇమాం కార్మారవీం కుర్యుః = ఈకార్మరవిని చేయుచున్నారు

**తాత్పర్యము :** పంచమి సహితములైన వీటిసంకరమువలన నందయంతి పుట్టుచున్నది. నిషాదముతో కూడ స్వగాంధారియొక్క కలయికవలన ఈకార్మరవిని చేయుచున్నారు.

**గాంధారీ పంచమీ చైవ తథా గాంధారపంచమీ ।**
**ఆర్షభీ ధైవతీ వర్జ్యాః కైశికీమితి సంకరాః ॥**

**ప్రతిపదార్థము :** గాంధారీ పంచమీచ = గాంధారి, పంచమిల సంసర్గమువలన; గాంధారపంచమియగును; ఆర్షభీ ధైవతీవర్జ్యాః = రిషభిధైవతవర్జములు (విహీనములు); కైశికీం ఇతి = కైశికిని యని; సంకరాః = సంకీర్ణములు

ఇదానీం విభాగమాహుః - ఇప్పుడు విభాగమును చెప్పుచున్నారు -

**తాత్పర్యము :** గాంధారి, పంచమిల సంసర్గమువలన గాంధారపంచమియగును రిషభధైవత వర్జములు (విహీనములు) కైశికినియని సంకీర్ణములు. ఇప్పుడు విభాగమును చెప్పుచున్నారు -

**చతస్రో జాతయో నిత్యం జ్ఞేయాః సప్తస్వరాః బుధైః ।**

**చతస్రః షట్ స్వరాశ్చాద్యా దశపంచస్వరాః స్మృతాః ॥ 188**

**ప్రతిపదార్థము** : చతస్రః జాతయః = నాల్గు జాతులు; సప్తస్వరాః = సప్తస్వరములు; నిత్యం = ఎల్లప్పుడు; బుధైః జ్ఞేయాః = పండితులచే తెలియదగినవి; చతస్రః = నాల్గవది; షట్స్వరాః = ఆరుస్వరములుగలది; ఆద్యా = మొదటిది; దశపంచస్వరాః = 15 స్వరములు; స్మృతాః = స్మరింపబడినవి; ఏతదేవ స్ఫుటంభవతి = ఇదియే స్పష్టమగుచున్నది

**తాత్పర్యము** : నాల్గుజాతులు, సప్తస్వరములు ఎల్లప్పుడు పండితులచే తెలియదగినవి. నాల్గవాది ఆరుస్వరములు గలది. మొదటిది 15 స్వరములుకలదిగా స్మరింపబడినవి. ఇదియే స్పష్టమగుచున్నది.

**మధ్యమోదీచ్యవా చైవ తథా నై షడ్జకైశికీ ।**
**కార్మారవీ చ సంపూర్ణా తథా గాంధారపంచమీ ॥ 189**

**ప్రతిపదార్థము** : మధ్యమోదీచ్యవా, షడ్జకైశికీ, కార్మారవీ, గాంధారపంచమీ, సంపూర్ణాః = సంపూర్ణస్వరములు కలవి

**తాత్పర్యము** : మధ్యమోదీచ్యవ, షడ్జకైశికి, కార్మారవి, గాంధారపంచమి, సంపూర్ణస్వరములు కలవి.

**షడ్జాంధ్రీ నందయంతీ చ గాంధారోదీచ్యవా తథా ।**
**చతస్రః షట్ స్వరా హ్యేతాః జ్ఞేయా పంచస్వరాః పరాః ॥ 190**

**ప్రతిపదార్థము** : షడ్జా, అంధ్రీ, నందయంతీ, గాంధారోదీచ్యవా, ఏతాః చతస్రః= ఈనాల్గును; షట్స్వరాః = షట్స్వరములుగలవి; పరాః = మిగిలినవి; పంచస్వరాః= పంచస్వరములుగలవి

**తాత్పర్యము** : షడ్జ, అంధ్రి, నందయంతీ, గాంధారోదీచ్యవతి, ఈనాల్గును షట్స్వరములు గలవి. మిగిలినవి పంచస్వరములు గలవి.

**నిషాదవత్యార్షభీ+ ధైవతీ షడ్జమధ్యమా ।**
**షడ్జోదీచ్య వతీ చైవ పంచషడ్జా త్రిధా స్మృతాః ॥(?) 191**

**గాంధారీ రక్తగాంధారీ మధ్యమా పంచమీ తథా ।**

కైశికీ చేతివిజ్ఞేయాః పంచైతే మధ్యమాశ్రితాః ॥ 192

**ప్రతిపదార్థము** : నిషాదవతి, రిషభి+ ధైవతి, షడ్జమధ్యమా, షడ్జోదీచ్యవతీ, పంచషడ్జాః = ఈ ఐదు షడ్జములు; త్రిధా స్మృతాః = మూడు విధములుగా చెప్పబడినవి; గాంధారి, రక్తగాంధారి, మధ్యమ, పంచమి, కైశికి, ఏతే పంచ = ఈ ఐదును; మధ్యమాశ్రితాః విజ్ఞేయాః = మధ్యమాశ్రితములుగా తెలియదగినవి

**తాత్పర్యము** : నిషాదవతి, రిషభి, ధైవతి, షడ్జమధ్యమా, షడ్జోదీచ్యవతీ, ఈ ఐదుషడ్జములు మూడువిధములుగా చెప్పబడినవి. గాంధారి, రక్తగాంధారి, మధ్యమా, పంచమి, కైశికి, ఈ ఐదును మధ్యమాశ్రితములుగా తెలియదగినవి.

షడ్జగ్రామే తు విజ్ఞేయా గాంధారోదీచ్యవా బుధైః ।
అంధ్రీ చ నందయంతీ చ మధ్యమగ్రామసంశ్రయాః ॥ 193

ఏవమేతా బుధైర్జ్ఞేయా ద్వ్యె గ్రామికో విభాగతః ।
యాస్తాః సప్తస్వరా జ్ఞేయా యాశ్చైతాః షట్‌స్వరాః స్మృతాః ॥ 194

క్వచిత్ షాడవితాస్తాస్తు పక్షే ఔడువితీకృతాః ॥ 195

**ప్రతిపదార్థము** : షడ్జగ్రామే = షడ్జగ్రామమందు; గాంధారోదీచ్యవా విజ్ఞేయా = గాంధారోదీచ్యవగ తెలియదగినది; అంధ్రీ, నందయంతి, మధ్యమగ్రామసంశ్రయాః = మధ్యమగ్రామము నాశ్రయించినవి; ఏవం = ఇట్లు, ఏతాః = ఇవి, విభాగతః = విభాగముచే; ద్వ్యెగ్రామికో జ్ఞేయాః = రెండు గ్రామములకు చెందినవిగా తెలియదగినవి; యాఃసప్తస్వరాః జ్ఞేయాః = ఏవి సప్తస్వరములు కలవియో; తాః = అవి; యాః షట్ స్వరాః = ఏవి షట్ స్వరములో; ఏతాశ్చ = అవి; క్వచిత్= ఒకచోట; షాడవితాః = షాడవితములు; పక్షే = పక్షమునందు; ఔడువితీకృతాః = ఔడువితములుగా చేయబడినవి

**తాత్పర్యము** : షడ్జగ్రామమందు గాంధారోదీచ్యవగ తెలియదగినది. అంధ్రి, నందయంతి, మధ్యమగ్రామమునాశ్రయించినవి. ఇట్లు ఇవి విభాగముచే రెండు గ్రామములకు చెందినవిగా తెలియదగినవి. ఏవి సప్తస్వరముకలవియో అవి, ఏవి షట్ స్వరములోఅవియును ఒకచోట షాడవితములు, పక్షమునందు ఔడువితములుగా చేయబడినవి.

ఇదానీం లక్షణమాహ = ఇప్పుడు లక్షణమును చెప్పుచున్నాడు -

శ్రుతిగ్రహస్వరాదిసమూహాత్ జాయంతే జాతయః =శ్రుతిగ్రహ స్వరముమొదలగు సముదాయయమువలన జాతులు పుట్టుచున్నవి; అతో జాతయ ఇత్యుచ్యంతే = అందుకనే జాతులని చెప్పబడుచున్నవి; యస్మాజ్జాయతే రసప్రతీతిః ఆరభ్యత ఇతి జాతయః = దేనివలన రసప్రతీతికల్గునో అందువలన జాతులు అగుచున్నవి; అథవా సకలస్య రాగాదేర్జన్మహేతుత్వాజ్జాతయ ఇతి = లేక సమస్త రాగాదుల జననకారణముగా జాతులగుచున్నవని; యద్వా జాయన్తే ఇతి జాతయః = లేక పుట్టుచున్నవిగాన జాతులని; యథా నరాణాంబ్రాహ్మణత్వాదయో జాతయః = ఉదా - మనుష్యులలో బ్రాహ్మణత్వాది జాతులు; శుద్ధాశ్చ వికృతాశ్చైవ - మత్రాపి జాతిలక్షణం = శుద్ధములని, వికృతములని ఇట్లు ఇక్కడ కూడ జాతిలక్షణము

ఇదానీం విశేషలక్షణ మాహ = ఇప్పుడు విశేషలక్షణము చెప్పుచున్నాడు-

**గ్రహాంశౌ తారమంద్రౌ చ షాడవౌడవితే తథా ।**
**అల్పత్వంచ బహుత్వం చ న్యాసోఽ పన్యాస ఏవచ ॥** 196

**జ్ఞాయతే తద్యథా జాతి దేశజాతీయలక్షణా ।**
**లక్షణం దశకస్యాస్య సంక్షేపేణాభిధీయతే ॥** 197

**ప్రతిపదార్థము :** గ్రహాంశౌ = గ్రహాంశములు; తారమంద్రౌ = తారమంద్రములు; షాడవౌడవితే = షాడవ, ఔడవములు; అల్పత్వం = అల్పత్వము; బహుత్వం= బహుత్వము; నాస్యః అపన్యాసశ్చ = న్యాస అపన్యాసములు; తద్యథా దేశజాతీయ లక్షణాజ్ఞాయతే = దేశ జాతీయ లక్షణము కలదిగా తెలియబడుచున్నది; అస్య దశకస్య అపి సంక్షేపేణ లక్షణం అభిధీయతే = ఈ పదింటికి లక్షణము సంగ్రహముగా చెప్పబడుచున్నది

తత్ర ఆదౌ జాత్యాదిప్రయోగః గృహ్యతే యేన అసౌ గ్రహః = ఇందు మొదట దేనిచేతను; జాత్యాదుల ప్రయోగము గ్రహింపబడునోఅది గ్రహము; అంశవర్తిషష్టి భేదభిన్నో బోద్ధవ్యః = అంశమందున్న 60 భేదములకంటే భిన్నమైనదిగ తెలియదగినది; నన్వేవం గ్రహాంశయోః కో భేదః = ఓయీ !

అట్లయిన గ్రహము, అంశములకు తేడాఏమి?; ఉచ్యతే = చెప్పబడుచున్నది; అంశో వాద్యేవ పరం, గ్రహస్తు వాద్యాదిభేదభిన్నః చతుర్విధః = అంశము వాద్యమందే, గ్రహముమాత్రము వాద్యాదిభేదభిన్నమై నాల్గువిధములగును; యద్వా ప్రధానాప్రధానకృతో భేదః = లేక ప్రధానము, అప్రధానములవల్లనైన భేదము; గ్రహో హ్యప్రధానభూతః = గ్రహము అప్రధానమైనది; నను కథం అంశస్యైవ ప్రాధాన్యముచ్యతే = అంశమునకే ఎట్లు ప్రాధాన్యము చెప్పబడినది?; రాగజనకత్వాత్ వ్యాపకత్వాచ్చ అంశస్యైవ ప్రాధాన్యం= రాగజనకత్వమువలన, వ్యాపకత్వమువలనకూడ అంశమునకే ప్రధానత్వము; యద్యపి సర్వజాతీనాం గ్రహోఽ ంశశ్చ ప్రధానీభూత ఇతి ఉత్సర్గ సిద్ధం = సర్వజాతులకు గ్రహము, అంశమును కూడ ప్రధానము అనునది సాధారణసిద్ధము; తథాపి సంవాద్యనువాదివిధినా చోద్యతే = సంవాది అనువాదివిధిచే ప్రయత్నితము; తథాపి ప్రథమచతుర్థషష్ఠగీతేషు మంద్రప్రకృతో విశేషః నియమః ప్రథమే సంవాదిత్వాత్ కథం భేదప్రయోగః = అయినను ప్రథమ, చతుర్థ, షష్ఠ గీతములందు మంద్రకృత విశేషనియమము ప్రథమమందు సంవాదిత్వమువలన ఎటు భేదప్రయోగము; షడ్జోదీచ్యవామధ్యమోదీచ్యవా రక్తగాంధారీగాంధారీ పంచమీనాం తు గ్రహో వివాది త్వేన(?) గ్రహస్తు ఆర్షభీ ధైవతీ నిషాదవత్యంధ్రీ షడ్జకైశికీ షడ్జమధ్యమా చ ఇతి = షడ్జోదీచ్యవ మధ్యమోదీచ్యవ రక్తగాంధారి, గాంధారి, పంచమిలకు గ్రహములు వివాదిత్వముచే; గ్రహముమాత్రము రిషభి, ధైవతి, నిషాదవతి, అంధ్రిషడ్జకైశికి షడ్జమధ్యమును; ఏవం నందయంత్యామితి గ్రహవిధిః = ఇట్లే నందయంతియందును గ్రహవిధి; తథాచాహ భరతః = అట్లే భరతుడు చెప్పుచున్నాడు -

**"గ్రహస్తు సర్వజాతీనామంశవత్ పరికీర్తితః ।**
**యత్ ప్రవృత్తో భవేద్ గేయః సోఽ ంశో గ్రహవికల్పతః ॥"**

**ప్రతిపదార్థము** : గ్రహః = గ్రహము; స్వరజాతీనాం = అన్నిజాతులకు; అంశవత్ పరికీర్తితః = అంశమువలె చెప్పబడినది; యత్ గేయః =ఏగేయము; ప్రవృత్తః భవేత్ = ప్రవృత్తమగునో; సః = అది; గ్రహవికల్పతః = గ్రహవైకల్ప్యముచే; అంశః = అంశము;

అథాంశః కథ్యతే = తరువాత అంశము చెప్పబడుచున్నది; అంశవిభాగః స దశవిధో బోద్ధవ్యః = ఆయంశవిభాగము 10 విధములుగా తెలియవలెను; యస్మిన్నంశే క్రియమాణే రాగాభివ్యక్తిర్భవతి సోఽ ంశః = యే అంశము చేయబడగా రాగము అభివ్యక్తము (స్పష్టము) అగునో అది అంశము; యస్మాద్వారభ్య గీతః ప్రవర్తతే = దేనినుండి మొదలుకొని గీతము ప్రవర్తించునో; నగ్రహస్వరితః స్వాంరో ద్వితీయా తారమంద్రాభివ్యక్తికిహేతుః స్వాంశః తృతీయః పంచమస్వరమారోహణం తారం కదాచిత్ షష్ఠస్వరారోహణం పితారః = గ్రహస్వరితము నుండి స్వాంశద్వితీయము తారమంద్రాభివ్యక్తికి హేతువు స్వాంశము తృతీయము పంచమస్వర ఆరోహణము తారము ఒక్కొక్కప్పుడు షష్ఠస్వర ఆరోహణము పితారము; తథా గాంధార్యాః షడ్జః తారః = అట్లే గాంధారికి షడ్జము తారము; నిధనిధసా । యథా తారనియామకమంద్రనియామకస్వరోఽ ప్యంశసప్తస్వరారోహణా = ఎట్లు తారనియామక మంద్రనియామకస్వరముకూడ అంశసప్తస్వరారోహణము కలది; యథా మంద్రాంశాయాః షడ్జసంస్థానే = ఎట్లనగా మంద్రాంశమునకు షడ్జ సంస్థానమందు- సాసాసాధా ఇతి = అని; యశ్చ బహుప్రయోగతరః సోఽ ప్యంశః = ఏది అనేకముగా ప్రయోగింపబడునో అదికూడ అంశస్వరము; యో రాగస్య విషయత్వేన అవస్థితః స్వరః సోఽ ప్యంశః = ఏది రాగమునకు విషయముగానుండునో ఆస్వరముకూడ అంశమగును; యత్ర గీతమితి సమాప్తిరితి సంభావ్యతే సోఽ పన్యాసః = ఎక్కడ గీతమని, సమాప్తియని తలవబడునో అది అపన్యాసము; సర్వవిదారీ మధ్యమో భవతి = సమస్త విదారిస్వరము మధ్యమమగును; సా చ విదారీ ద్వివిధా = ఆవిదారి రెండువిధములు; గీతవిదారీ పదవిదారీ చేతి = గీత విదారి, పదవిదారియని; నను విదారీశబ్దేన కిముచ్యతే = ఓయీ ! విదారిశబ్దముచేనేమి చెప్పబడుచున్నది; పాదానాం స్యాదిత్యాది విదారణా ఖండన మితి యావత్ = పాదములలోనగును అను విదారణ ఖండనమని (ఉదా); గీతకేశీ గీత ఖండమితి యావత్ = గీతకేశి గీతఖండమనునది (యగును)

ఇదానీం స న్యాసోఽ భిధీయతే = ఇప్పుడాన్యాసము చెప్పబడుచున్నది; తత్ర ప్రథమవిదారీ మధ్యే న్యాసస్వరాః ప్రయుక్తాః = అందు ప్రథమవిదారిలో

న్యాసస్వరములు ప్రయోగింపబడినవి; సన్న్యాసః సోఽభిధీయతే = అది సన్న్యాసమనబడును; అంశస్య విదారీ యథా నభవతి ప్రథమవిదార్యాంతే ర్యాది ప్రవృత్తౌ యథా న భవతి, తదాసౌ సన్న్యాస ఇత్యర్థః = అంశమునకు విదారి ఎట్లుకాదో, ప్రథమ విదారి చివరర్యాది ప్రవృత్తమెప్పుడగునో అప్పుడు సన్న్యాసమని అర్థము;

ఇదానీం విన్యాసమాహ - ఇప్పుడు విన్యాసమును చెప్పుచున్నాడు- ఏష ఏవ తు సన్న్యాస స్వరః పదాంతే విన్యస్యతే తదావిన్యాసః = ఈ సన్న్యాసస్వరమే పదాంతమందుంచబడిన యెడల నప్పుడు విన్యాసమగును;అత ఏవ తదుక్తం భవతి = అందుకనే అది చెప్పబడుచున్నది.

**అంశస్య సంవాదీవా భవతి యస్మాచ్చైవ ప్రవర్తతే ।**
**నేతాచతారమంద్రాణాం యోత్యర్థ ముపలభ్యతే ॥** 197

గ్రహాపన్యాసవిన్యాససన్న్యాస గోచరః ।
**అనువృత్తశ్చ యశ్చేహ సోఽంశః స్యాద్దశలక్షణః ॥** 198

**ప్రతిపదార్థము** : యస్మాత్ ప్రవర్తతే = దేనివలన ప్రవర్తించునో; తస్మాత్ = అందువలన; అంశస్య సంవాదీ వా భవతి = అంశమునకు సంవాదిగాని యగుచున్నది; తారమంద్రాణాం నేతా యః అత్యర్థం ఉపలభ్యతే =ఏది తారమంద్రములకు నేత మిక్కిలిగా యగునో యగుచున్నది; గ్రహ, అపన్యాస, విన్యాస, సన్న్యాస, న్యాస గోచరములు, అనువృత్తము; యః = ఏది, ఇహ = ఇక్కడ; యగునో; సః = ఆ; అంశః=అంశము, దశలక్షణః స్యాత్ = పదిలక్షణములుకలదగును

ఇదానీం తారలక్షణముచ్యతే = ఇప్పుడు తారలక్షణము చెప్పబడుచున్నది; బలవతి శ్రుతికేంశే దుర్బేర్బలేశాంశే అంశస్వర ప్రయోగాదారభ్య పంచస్వరపరా తార గతిః = బలవంతమైన (స్థిరమైన) శ్రుతి గల అంశమందు, దుర్బలాంశమందు అంశ స్వరప్రయోగమునుండి ప్రారంభించి పంచస్వరపరమైనది తారగతి (గమనము);కిముక్తం భవతి ?= ఏమి చెప్పబడుచున్నది?; పంచ స్వరమారోహణం తార ఇతి, చతుస్స్వరమారోహణం

తార ఇతి = పంచస్వరారోహణము తారమని; చతుఃస్వరమారోహణము తారమని; నందయంతీ యథా - సాసరిగసా। ఇతి పంచమాంశత్వాత్ షడ్జస్తారః = నందయంతి ఎట్లనగా - సాసరిగసా। ఇట్లు పంచమాంశమువలన షడ్జము తారము; ఆపంచమాదితి యోజనా = పంచమము నుండియని కూడిక; అష్టభ్యా విదార్యా బోద్ధవ్యః = ఎనిమిదవదానితో ఖండించి బోధింపదగినది (తెలియదగినది); పంచస్వరం యావత్ తారవిధిం యథా గాంధార్యాం నిధనిసా । ఇతి = పంచమస్వరమువరకు తారవిధిని ఎట్లనగా గాంధారి యందు నిధనిసా । యని; వా శబ్దాత్ సప్తస్వరస్యాపి తారతా భవతి = వాశబ్దము వలన సప్తస్వరమునకు గూడ తారత్వమగుచున్నది; చతుర్ధా తారగతిః తథాచాహ భరతః = తారగతి నాలుగు విధములు. అట్లే భరతుడు చెప్పుచున్నాడు -

**"అంశాత్ తారగతింవిద్యాదాచతుర్థ స్వరాదిభిః ।**
**ఆపంచమాత్ సప్తమాద్వా నాతః పరమిహేష్యతే ॥"**

**ప్రతిపదార్థము** : ఆచతుర్థస్వరాదిభిః = చతుర్థస్వరాదులు మొదలు కొని; ఆపంచమాత్ = పంచమస్వరము నుండి; సప్తమాద్వా = సప్తమమునుండి తారగతిని తెలియవలెను; అతః పరం ఇహ న ఇష్యతే = ఇటు తరువాత ఇక్కడ ఇష్టముకాదు

ఇదానీం మంద్రముచ్యతే = ఇప్పుడు మంద్రము చెప్పబడుచున్నది; మృదుస్వరో మంద్రః = కోమలమైన స్వరము మంద్రము; సా చ మంద్రగతి స్త్రిధా = ఆ మంద్రగతి మూడువిధములు; అంశపరా న్యాసపరా తత్పరా చేతి= అంశపరము, న్యాసపరము, తత్పరము అని; అంశస్వరస్య పరోయస్మాత్ ఇతి, బహుబ్రీహౌ తస్మాత్ పూర్వో యః స్వరః స మంద్రః = అంశస్వరస్య పరోయస్మాత్ (అంశస్వరమునకు పరముదేనికంటె); అను బహుబ్రీహిసమాసమునందు దానికంటె పూర్వమేస్వరమో అది మంద్రము; యథా ధైవత్యాం = ధైవతమందు ధాధనిధమ పధమా । మామామా । ఏవం అత్రాపి న్యాసస్వర ఇతి = ఇట్లే ఇక్కడ న్యాసస్వరముకూడ అని; న్యాసస్వరోప్యేవమేవ= న్యాసస్వరముకూడ ఇట్లే;

ఇదానీం షాడవముచ్యతే = ఇప్పుడు షాడవస్వరము చెప్పబడుచున్నది;

షట్స్వరం షాడవమితి = షట్ స్వరము(ల) ను షాడవమందురు; చతుర్దశ జాతివిషయత్వాత్ చతుర్దశవిధః = చతుర్దశ (14) జాతులకు విషయమగుట వలన 14 విధములైనది; చతసృణాం జాతీనాం నిత్యసంపూర్ణత్వే తదభావాత్ జాత్యంశభేదేన తు సప్తచత్వారింశత్ ప్రకారం చ తద్భవతి = నాల్గు జాతులకు నిత్యము సంపూర్ణత్వమైనచో, ఆపూర్ణతలేక పోవుటవలన జాతియొక్క అంశభేదముచే అది 47 విధములు అగుచున్నది; తథాచాహ భరతః = భరతుడట్లే చెప్పుచున్నాడు -

షట్స్వరం షాడవం చతుర్దశవిధం సప్తచత్వారింశత్ ప్రకారం పూర్వోక్తం లక్షణం చ అస్య = షట్ స్వర (యుత) మైన షాడవము 14 విధములైనది. 47 విధములైనదని దీనికి లక్షణము ముందుచెప్పబడినది; చతుః స్వరాత్ ప్రభృతి న మార్గః శబరపులింద కాంబోజవంగకిరాతబాహ్లీకాంధ్రద్రవిడవనాదిషు ప్రయుజ్యతే = చతుః స్వరమునుండి మార్గభేదము శబర, పులింద, కాంబోజ, వంగ, కిరాత, బాహ్లీక, ఆంధ్ర, ద్రవిడవనాదులలో ప్రయోగింపబడదు; అనియమాత్ శ్రుతిమాత్రం అత్ర గ్రాహ్యం = నియమములేకపోవుటవలన శ్రుతిమాత్రమిక్కడ గ్రహింపదగినది; యదా చతుఃస్వర ప్రయోగోఽ పి స్వరాంతరమాహ అవకృష్టధ్రువాస్వేవ వేదితవ్యం = ఎప్పుడు చతుః స్వరప్రయోగము స్వరాంతరమును చెప్పునో అవకృష్టధ్రువములందే తెలియదగినవో; తం ధ్రువం మధ్యే స్ఫుటీకరిష్యామః = ఆధ్రువమును మధ్యన స్ఫష్టముచేయుచున్నాము; తథా చాహ భరతః = అట్లే భరతుడు చెప్పుచున్నాడు-

**షట్స్వరస్య ప్రయోగోఽ స్తి తథా పంచస్వరస్యచ ।**
**చతుః స్వరప్రయోగోఽ పి హ్యవకృష్టధ్రువాస్వపి ॥**

**ప్రతిపదార్థము :** అవకృష్టధ్రువాస్వపి = అవకృష్ట ధ్రువములందు కూడ; షట్ స్వరస్య = షట్ స్వరమునకు; పంచస్వరస్య = పంచస్వరమునకు; ప్రయోగః అస్తి = ప్రయోగముకలదు; చతుః స్వరప్రయోగః అపిఅస్తి = చతుః స్వర ప్రయోగముకూడ కలదు; అపిశబ్దాత్ అత్ర సంపూర్ణోఽ పి గ్రాహ్యః = అపిశబ్దమువలన నిక్కడ సంపూర్ణస్వరముకూడ గ్రహింపదగినది; ఏవం చతుర్విధః ప్రయోగః ధ్రువాణాం వేదితవ్యః = ఇట్లు ధ్రువముల చతుర్విధప్రయోగము తెలియదగినది;

ఇదానీమల్పత్వ బహుత్వే బ్రవీమి = ఇప్పుడు అల్పత్వ, బహుత్వములను గూర్చి చెప్పుచున్నాను; తత్ర స్వరాణాం అల్పశః ప్రయోగాత్ అల్పత్వం బహుశః ప్రయోగాత్ బహుత్వం = స్వరములయొక్క అల్ప (తక్కువ)ప్రయోగమువలన అల్పత్వము, అధిక ప్రయోగమువలన బహుత్వమునగును; తథా అల్పత్వం బహుత్వం చ ద్వివిధం = అట్లే అల్పత్వ, బహుత్వములు రెండును రెండువిధములు; సన్న్యాసాదిగతః భవేత్ తదాంతరమార్గేణేతి = సన్న్యాసాదిగతము, అంతర మార్గము అని (రెండు విధములు) అగును; అంతరమార్గస్య లక్షణం యథా - జాతిషు క్వచిద్వా అనంశో వినాల్పః = అంతరమార్గ లక్షణమెట్లనగా - జాతులయందొక్కొక్కచోట గాని అనంశములేక యే అల్పము; తథాచ కార్మారవ్యాం గాంధారస్య సర్వస్వరసంగత్యా బహుత్వేనాంతరమార్గ ప్రయోగ ఇతి వక్ష్యతే = అట్లే కార్మారవియందు గాంధారమునకు సమస్తస్వర సంబంధముచే బహుత్వముచే అంతరమార్గప్రయోగమని చెప్పబడుచున్నది;గాంధారస్య విశేషేణ సర్వతో గమనం భవేత్ ఇతి = గాంధారము యొక్క విశేషముచే అంతట గమనముండునని; అథ బహుత్వామాహ = తరువాత బహుత్వమును గూర్చి చెప్పుచున్నాడు; అల్పవదత్ర బహుత్వమితి = అల్పత్వమువలే నిక్కడ బహుత్వమును అని; లక్ష్యేదితి విశేష = లక్షణసమన్వయముచేయవలెననునది విశేషము; కథమిత్యాహ = ఎట్లనగా చెప్పుచున్నాడు; బలవదబలవతోర్విపర్యాసో బలమల్పం తద్విపర్యయే బలవదితి బలవల్లక్షణం గమ్యతే ఏవ = బలముకలదానికి బలములేనిదానికి విపర్యయము అల్పబలము కలదానికి విపరీతమైనది బలవంతము అని బలవంతమైన దానికి లక్షణము గమ్యమానమగుచున్నది; అత ఏవ ఆహ = అందుకనే చెప్పుచున్నాడు -

**సంచారోఽంశబలస్థాన మల్పత్వం దుర్బలాసు చ ।**
**ద్వివిధాంతరమార్గస్తు జాతీనాం వ్యక్తికారకః ॥**

**ప్రతిపదార్థము** : దుర్బలాసు = దుర్బలములయందు; అంశ బలస్థానం = అంశబలస్థానము; అల్పత్వం = అల్పత్వము; జాతీనాం ద్వివిధాంతరమార్గః సవచారః వ్యక్తికారకః = జాతులయొక్క ద్వివిధాంతరమార్గసంచారము వ్యక్తి కారకము; (స్పష్టీకరణమునకు హేతువు); ఇదానీం న్యాసమాహ = ఇప్పుడు

న్యాసమును చెప్పుచున్నాడు; న్యస్యతే త్యజ్యతే యస్మిన్ యేన వా గీతం తన్న్యాస ఇతి = దేనియందు గాని దేనిచేతను గాని గీతము న్యాసము చేయబడునో (ఉంచబడునో) త్యాజ్యమగునో (విడువబడునో) అది న్యాసమని; స న్యాసః స ఏకవింశతి సంఖ్య ఇతి = అట్టి ఆన్యాసము 21 విధములని చెప్పబడినది; తద్యథాషడ్జాయాః ఏకషడ్జోనామ న్యాసః = అది ఎట్లనగా షడ్జమునకు ఏకషడ్జమను న్యాసము; ఏవమాది బోద్ధవ్యం = ఈ మొదలైనది తెలియదగినది; అష్టాదశ జాతిషు చ న్యాసాః = 18 జాతులయందును న్యాసములు; అంశః సమాప్తౌ కార్య ఇత్యర్థః = అంశము సమాప్తియందు చేయదగినదని యర్థము; ఇదానీమపన్యాసమాహ = ఇప్పుడు అపన్యాసమును గూర్చి చెప్పుచున్నాడు - అపన్యాసోఽంతే ప్రయోగసమాప్తౌ అపన్యాసః = అపన్యాసము అంతమందు; ప్రయోగసమాప్తి యందు అపన్యాసము; సచ షట్పంచాశత్ భేదభిన్నః భవతి గీతానాం మధ్యే బోద్ధవ్యః = అది గీతముల మధ్యన 56 బేధములగుచున్నదిగా తెలియదగినది; యథా యత్ర సమాప్తమివ గీతం ప్రతిభాసతే సోఽపన్యాసః = ఎట్లనగా ఎక్కడ గీతము సమాప్తమైనదిగా భాసించునో అది అపన్యాసము; స చ విదారీమధ్యే భవతి = అది విదారి - యందగుచున్నది; గీతశరీరమధ్యమ ఇత్యర్థః = గీతశరీరమధ్యమమని అర్థము; యథా షడ్జగ్రామే మధ్యాయాః సప్తాపన్యాసా భవంతి = ఎట్లనగా షడ్జగ్రామమందు షడ్జమధ్య (మ)ము నకు ఏడు అపన్యాసములగుచున్నవి; షడ్జోదీచ్యవాయాశ్చ ద్వౌ పంచానాం ప్రత్యేకం త్రయం త్రయమితి చతుర్వింశతిః శేషాస్తు మధ్యమగ్రామే = షడ్జోదీచ్యవాకు రెండు, ఐదింటికి ప్రత్యేకముగా మూడుమూడు అని ఇరువదినాల్గు, మిగిలినవి మధ్యమగ్రామమందగును; తథాచాహ భరతః- అట్లే భరతుడు చెప్పుచున్నాడు-

**"న్యాసో హ్యంశసమాప్తౌ స చైకవింశతివిధో విధాతవ్యః ।**
**షట్పంచాశత్సంఖ్యో భవేదపన్యాససంజ్ఞోఽసౌ ॥"**

**ప్రతిపదార్థము :** అంశసమాప్తౌ = అంశసమాప్తియందు; స న్యాసః = షడ్జన్యాసము; ఏకవింశతి విధో విధాతవ్యః = ఇరువదియొక్క విధములుగ చేయదగినది; అసౌ అపన్యాససంజ్ఞః = ఈ అపన్యాసమనునది; షట్పంచాశత్ సంఖ్యః భవేత్= 56 విధములగును; దశవిధజాతిలక్షణమితి = పదివిధములైన జాతియొక్క

లక్షణము అని (ఇట్టిదియని)

**తాత్పర్యము :** అంశసమాప్తియందు షడ్జన్యాసము ఇరువదియొక్క విధములుగ చేయదగినది. ఈ అపన్యాసమనునది 56 విధములగును. పదివిధములైన జాతియొక్క లక్షణము అని (ఇట్టిదియని)

**అంశాః స్యుః పంచ షడ్జ్యాయాం నిషాదర్షభవర్జితాః ।**
**అపన్యాసస్తు గాంధారః పంచమశ్చాథ సంగతిః ॥**

**ప్రతిపదార్థము :** షడ్జ్యాయాం నిషాదర్షభవర్జితాః పంచ అంశాః స్యుః = షడ్జమందు నిషాదరిషభములు తప్ప ఐదు అంశములుండును; గాంధారః అపన్యాసః = గాంధారమపన్యాసము; అథ పంచమశ్చ సంగతిః = తరువాత పంచమము సంగమము

**తాత్పర్యము :** షడ్జమందు నిషాదరిషభములు తప్ప ఐదు అంశములుండును. గాంధారమపన్యాసము. తరువాత పంచమము సంగమము

**షడ్జగాంధారయోస్తు స్యాత్ షడ్జధైవతయోస్తథా ।**
**షాడవంచ నిషాదే స్యాత్ నాస్యాదౌడువితం భవేత్ ॥** 202

**ప్రతిపదార్థము :** షడ్జగాంధారయోః తథాషడ్జధైవతయోః = షడ్జగాధారములందు షడ్జధైవతములందు; (స్యాత్ = అగును)నిషాదే షాడవం స్యాత్ = షాడవము నిషాదమందు అగును; ఔడువితం న భవేత్ = ఔడువితముకాదు

**తాత్పర్యము :** షడ్జగాంధారములందు షడ్జధైవతములందు (అగును) షాడవము నిషాదమందు అగును. ఔడువితముకాదు.

**ఆర్షభ్యాస్తు స్మృతా అంశా నిషాదర్షభధైవతాః ।**
**షడ్జపంచమహీనే చ షాడవౌరద్వితే క్రమాత్ ॥** 203

**ప్రతిపదార్థము :** ఆర్షభ్యాః నిషాదర్షభ ధైవతాః అంశాః స్మృతాః = నిషాదరిషభ ధైవతాంశములు రిషభసంబంధులని చెప్పబడినవి; క్రమాత్ = క్రమముగా; షడ్జపంచమహీనే = షడ్జపంచమరహితము నందు షాడవౌరద్వితే -?

**తాత్పర్యము :** నిషాదరిషభ ధైవతాంశములు రిషభసంబంధులని చెప్పబడినవి;

క్రమముగా షడ్జపంచమ రహితము నందు గాషాడవౌరద్వితే ?

ధైవత్యాం గురుభిః ప్రోక్తౌ అంశావృషభధైవతౌ ।
సమధ్యమా వపన్యాసౌ ప్రాగుక్తౌ హీనతో త్క్రమాత్ ॥ 204

ప్రతిపదార్థము : ధైవత్యాం = ధైవతియందు; ఋషభధైవతా అంశౌ ప్రోక్తౌ = రిషభధైవతాంశములు చెప్పబడినవి; హీనతోత్క్రమాత్ = ఉత్క్రమరహితము వలన; సమధ్యమౌ అపన్యాసౌ ఉక్తౌ = షడ్జమధ్యమములు అపన్యాసములుగా గురువులచే చెప్పబడినవి

**తాత్పర్యము :** ధైవతియందు రిషభధైవతాంశములు చెప్పబడినవి. ఉత్క్రమరహితము వలన షడ్జమధ్యమములు అపన్యాసములుగా గురువులచే చెప్పబడినవి.

అంశో నిషాదవత్యాస్తు ద్విశ్రుతీ సర్షభౌ స్మృతౌ ।
ధైవతీవద్ భవేచ్ఛేషో న్యాసో నామకృదేవ తు ॥ 205

అంశాస్తు షడ్జకైశిక్యాం షడ్జగాంధారపంచమాః ।
సనిషాదా అగాంధారా అపన్యాసాస్త ఏవ తు ॥ 206

ఋషభోఽల్పప్రయోగః స్యాన్న్యాసో గాంధార ఇష్యతే ।
నిత్యం పూర్ణస్వరా చేయమాచార్యైః పరికీర్తితా ॥ 207

స్యాత్ షడ్జోదీచ్యవత్యంశైః షడ్జమధ్యమధైవతైః ।
సనిషాదైరపన్యాసౌ విజ్ఞేయౌ షడ్జధైవతౌ ॥ 208

ప్రతిపదార్థము : నిషాదవత్యాః = నిషాదవతికి; ద్విశ్రుతీ = ద్విశ్రుతికములైన; సర్షభౌ = షడ్జరిషభములు; అంశః స్మృతౌ = అంశముగా చెప్పబడినవి; శేషః = మిగిలినది; ధైవతీవత్ భవేత్ = ధైవతియందువలెనగును; న్యాసః నామకృత్ ఏవ = న్యాసము, నామమాత్రముగానే; షడ్జకైశికాం = షడ్జకైశికియందు; షడ్జగాంధార పంచమాః అంశాః = షడ్జగాంధార పంచమములు అంశములు; సనిషాదాః = నిషాదసహితములు; అగాంధారాః = గాంధారరహితములు అయిన; తే ఏవ = ఆ షడ్జగాంధారపంచమములే; అపన్యాసాః = అపన్యాసములు; ఋషభః అల్పప్రయోగః స్యాత్ = రిషభము అల్పప్రయోగమగును; గాంధారః

న్యాసః ఇష్యతే = గాంధారము న్యాసముగా సమ్మతము; నిత్యం = సర్వదా; ఇయం = ఇది; పూర్ణస్వరా = పూర్ణ స్వరములు కలది (అని); ఆచార్యైః పరికీర్తితా= పండితులచే చెప్పబడినది; షడ్జోదీచ్యవతీ సనిషాదైః = షడ్జోదీచ్యవతి నిషాదసహితములైన; షడ్జమధ్యమధైవతైః అంశైః స్యాత్ = షడ్జమధ్యధైవతాంశములతోనగును; షడ్జధైవతౌ అపన్యాసౌ విజ్ఞేయౌ = షడ్జధైవతములు అపన్యాసములుగా తెలియబడవలెను

**తాత్పర్యము** : నిషాదవతికి ద్విశ్రుతికములైన షడ్జరిషభములు అంశముగాచెప్పబడినవి. మిగిలినది ధైవతియందువలెనగును. న్యాసము నామమాత్రముగానే. షడ్జగాంధార పంచమములు అంశములు నిషాదసహితములు. గాంధారరహితములయిన ఆషడ్జగాంధారపంచమములే అపన్యాసములు. రిషభము అల్పప్రయోగమగును. గాంధారము న్యాసముగా సమ్మతము. సర్వదా ఇది పూర్ణస్వరములు కలది యని పండితులచే చెప్పబడినది. నిషాదసహితములైన షడ్జమధ్యమధైవతాంశములతోనగును. షడ్జధైవతములు అపన్యాసములుగా తెలియబడవలెను.

**ఋషభేణ విహీనేయం ద్వాభ్యాం ద్వే పంచమేన చ ।**
**మంద్రగాంధార భూయస్త్వ మపన్యాసస్తు మధ్యమః ॥ 209**

**సర్వాంశాన్నామకృన్న్యాసా విజ్ఞేయా షడ్జమధ్యమా ।**
**స్యాతాం నిషాదగాంధారావస్యాం గీతత్వకారిణౌ ॥ 210**

**ప్రతిపదార్థము** : షడ్జమధ్యమా = షడ్జమధ్యము; సర్వాంశా(న్) = సర్వాంశము; నామకృత్ న్యాసా = నామమాత్రమైన న్యాసముకలదిగా; విజ్ఞేయా = తెలియదగినది; అస్యాం = దీనియందు; నిషాదగాంధారౌ గీతత్వకారిణౌ స్యాతాం = నిషాద గాంధారములు గీతత్వకారకములగుచున్నవి

**తాత్పర్యము** : షడ్జమధ్యము సర్వాంశము నామమాత్రమైన న్యాసముకలదిగా తెలియదగినది. దీనియందు నిషాదగాంధారములు గీతత్వకారకములగుచున్నవి.

**యథేష్టం స్యాత్తు సంచారో యథా గ్రామవిరోధకృత్ ।**
**షడ్జగ్రామే తు సప్తైతాః శేషా మధ్యమజాతయః ॥ 211**

**గాంధార్యా ద్వావనంశౌ చ హేయౌ వృషభ ధైవతౌ ।**
**క్రమాన్నిత్యంత్వమపన్యాసౌ విజ్ఞేయౌ షడ్జపంచమౌ ॥** 212

**ప్రతిపదార్థము :** సంచారః యథేష్టం స్యాత్ = సంచారము యథేష్టముగానగును; యథా గ్రామవిరోధకృత్ = (అట్లే) గ్రామవిరోధమును చేయునదియు; ఏతాః సప్తజాతయః = ఈ ఏడుజాతులు; షడ్జగ్రామే = షడ్జగ్రామమందును; శేషాః = మిగిలినవి; మధ్యమ జాతయః = మధ్యమగ్రామజాతులు; గాంధార్యా = గాంధారిచేత; ద్వాౌఅనంశౌ = రెండు అంశరహితములు; ఋషభధైవతౌ హేయౌ= రిషభధైవతములు విడువదగినవి; నిత్యం = సదా; క్రమాత్ = క్రమముగా; షడ్జపంచమౌ అపన్యాసౌ విజ్ఞేయౌ = షడ్జపంచమములపన్యాసములుగా తెలియవలెను

**తాత్పర్యము :** సంచారము యథేష్టముగానగును. గ్రామవిరోధమును చేయునదియు, ఈ ఏడు జాతులు షడ్జగ్రామమందును, మిగిలినవి మధ్యమ గ్రామజాతులు. గాంధారిచేత రెండు అంశరహితములు రిషభధైవతములు విడువదగినవి. సదా క్రమముగా షడ్జపంచమములపన్యాసములుగా తెలియవలెను.

**ధైవతాదృషభం గచ్ఛేదేవం స్యాత్ సర్వమేవ తత్ ।**
**ప్రాయశో రక్త గాంధార్యామపన్యాసస్తు మధ్యమః ॥** 213

**బహుప్రయోగః కర్తవ్యో ధైవతోఽథ నిషాదవాన్ ।**
**షడ్జగాంధార సంచారః కార్యశ్చాస్యాః ప్రయోక్తృభిః ॥** 214

**ప్రతిపదార్థము :** ధైవతాత్ ఋషభం గచ్ఛేత్ = ధైవతమునుండి రిషభమును చేరవలెను; సర్వమేవ తత్ ఏవం స్యాత్ = అదంతయు అట్లే జరుగవలెను; ప్రాయశః = తరచుగా; రక్తగాంధార్యాం = రక్తగాంధారియందు; అపన్యాసః మధ్యమః = అపన్యాసము మధ్యమము; ధైవతః = ధైవతము; నిషాదవాన్ = నిషాదయుతమును (గా); బహుప్రయోగః కర్తవ్యః = అనేకముగా ప్రయోగము చేయదగినది; అస్యాః = దీనికి; షడ్జగాంధారసంచారః ప్రయోక్తృభిః కార్యశ్చ = షడ్జగాంధార సంచారము ప్రయోక్తలచే చేయదగినదియును

**తాత్పర్యము :** ధైవతమునుండి రిషభమును చేరవలెను. అదంతయు

అట్లేజరుగవలెను. తరచుగా రక్తగాంధారియందు అపన్యాసము మధ్యమము ధైవతము నిషాదయుతమును, షడ్జగాంధారసంచారము ప్రయోక్తలచే చేయదగినదియును.

**గాంధారోదీచ్యవా ప్రాయః షడ్జోదీచ్యవతీసమా ।**
**షడ్జశ్చ మధ్యమశ్చాంశో న చౌడువిభమిష్యతే ॥ 215 ॥**

**ప్రతిపదార్థము** : గాంధారోదీచ్యవా ప్రాయః షడ్జోదీచ్యవతీ సమా = గాంధారోదీచ్యవ తరచుగా షడ్జోతీచ్యవసమానము; షడ్జశ్చ = షడ్జమును; మధ్యమశ్చ అంశః = మధ్యమమును అంశము; ఔడువిభం నేష్యతే = ఔడువితముగాసమ్మతము కాదు

**తాత్పర్యము** : గాంధారోదీచ్యవ తరచుగా షడ్జోతీచ్యవసమానము షడ్జమును మధ్యమమును అంశము ఔడువితముగా అసమ్మతము.

**పంచాంశా మధ్యమాయాస్తు జ్ఞేయా ద్విశ్రుతివర్జితాః ।**
**క్రమాత్ తాభ్యాంచ హీనత్వం బహులౌ షడ్జమధ్యమౌ ॥ 216**

**గాంధారోదీచ్యవా తుల్యా మధ్యమోదీచ్యవా భవేత్ ।**
**సాప్తస్వర్యం తు నిత్యంస్యాదన్యాదంశస్తు పంచమః ॥ 217**

**పంచమ్యాం గురుభిః ప్రోక్తా వంశావృషభధైతౌ ।**
**సమధ్యమావపన్యాసౌ మధ్యమర్షభసంగతిః ॥ 218**

**షడ్జమధ్యమగాంధారా అల్పాశ్చ పరికీర్తితాః ।**
**స్యాన్నిషాదాచ్చ గాంధారో అల్పశ్చ పరికీర్తితా ॥ 219**

**ప్రతిపదార్థము** : మధ్యమాయాః = మధ్యమమునకు; ద్విశ్రుతివర్జితాః = ద్విశ్రుతిరహితములైన; పంచ అంశాః జ్ఞేయాః = ఐదు అంశములుగా తెలియదగినవి; క్రమాత్ =వరసగా; తాభ్యాం హీనత్వం = ఆ రెండింటిచేత లేమి; షడ్జమధ్యమౌ బహులౌ = షడ్జమధ్యమములు అధికములును; మధ్యమోదీచ్యవా గాంధారో దీచ్యవాతుల్యాభవేత్ = మధ్యమోదీచ్యవ గాంధారోదీచ్యవతో సమానమగును; నిత్యం= ఎల్లప్పుడు; సాప్తస్వర్యం స్యాత్=

సప్తస్వరములు కలదగును; అన్యాత్ = అన్యమువలన; పంచమః అంశః = పంచమాంశము; పంచమ్యాం = పంచమియందు; ఋషభధైవతౌ అంశౌ ప్రోక్తౌ= రిషభధైవతములు అంశములుగా చెప్పబడినవి; సమధ్యమౌ అపన్యాసౌ = షడ్జమధ్యమములు అపన్యాసములు; మధ్యమర్షభసంగతిః = మధ్యమరిషభ సంబంధము; షడ్జమధ్యమగాంధారాః అల్పాః పరికీర్తితాః = షడ్జమధ్యమ గాంధారములు అల్పములుగా చెప్పబడినవి; నిషాదాత్ గాంధారః అల్పశ్చ పరికీర్తితా = నిషాదముకంటే గాంధారము అల్పమని చెప్పబడినది

**తాత్పర్యము** : మధ్యమమునకు ద్విశ్రుతిరహితములైన ఐదు అంశములుగా తెలియదగినవి.వరుసగా ఆ రెండింటినిచేత లేమి షడ్జమధ్యమములధికములును, మధ్యమదీచ్యవ గాందారోదీచ్యవతో సమానమగును. ఎల్లప్పుడు సప్తస్వరములు కలదగును. అన్యమువలన పంచమాంశము పంచమియందు, రిషభధైవతములు అంశములుగా చెప్పబడినవి. షడ్జమధ్యమములు అపన్యాసములు. మధ్యమరిషభసంబంధము షడ్జమధ్యమగాంధారములు అల్పములుగా చెప్పబడినవి. నిషాదముకంటే గాంధారము అల్పమని చెప్పబడినది.

**స్యాన్నిషాదాచ్చ + + +మధ్యమా చచ్చహీనతా (?) ।**
**జ్ఞేయో గాంధారపంచమ్యాః పంచమోఽ ంశః ప్రయోక్తృభిః ॥ 220**

**సర్షభస్యాదపన్యాసో న్యాసో గాంధార ఇష్యతే ।**
**గాంధారమథ పంచమ్యా స్వత్సంచారాదికీర్తితః ॥ 221**

**తదస్యామపి విజ్ఞేయం కిం తు పూర్ణస్వరా సదా ।**
**అంధ్ర్యామనంశా విజ్ఞేయాః షడ్జమధ్యమధైవతాః ॥ 222**

**ప్రతిపదార్థము** : నిషాదాత్ = నిషాదమునుండి; + + + మధ్యమాచహీనతా స్యాత్ = మధ్యమము హీనమగును; ప్రయోక్తృభిః = గాయకులచే; గాంధారపంచమ్యాః = గాంధారపంచమికి; పంచమః అంశః జ్ఞేయః = పంచమాంశము తెలియదగినది; అపన్యాసః ఇష్యతే = గాంధారము న్యాసముగా అంగీకారము; గాంధారం = గాంధారమును; పంచమ్యాః = పంచమికి; స్వత్సంచారాదికీర్తితః = స్వత్వమందు సంచారాదిగా చెప్పబడినది; తత్ =అది; అస్యాం అపి = దీనియందుకూడ; విజ్ఞేయం = తెలియదగినది; కింతు =

కాని, సదా = ఎల్లప్పుడు; పూర్ణస్వరా = పూర్ణస్వరములుకలది; ఆంధ్ర్యాం = ఆంధ్రియందు; షడ్జమధ్యమ ధైవతాః అనంశాః విజ్ఞేయాః = షడ్జమధ్యమ ధైవతములు అనంశములుగా తెలియదగినవి

**తాత్పర్యము** : నిషాదమునుండి మధ్యమము హీనమగును. గాయకులచే గాంధారపంచమికి పంచమాంశము తెలియదగినది. గాంధారము న్యాసముగా అంగీకారము, గాంధారమును పంచమికి స్వత్వమందు సంచారాదిగా చెప్పబడినది. అది దీనియందు కూడ తెలియదగినది. కాని ఎల్లప్పుడు పూర్ణస్వరములుకలది. ఆంధ్రియందు, షడ్జమధ్యమ ధైవతములు అనంశములుగా తెలియదగినవి.

**షాడవం షడ్జహీనం స్యాత్ న్యాసో గాంధార ఇష్యతే ।**
**నందయంత్యామపన్యాసో జ్ఞేయౌ మధ్యమపంచమౌ ॥ 223**

**గ్రహో న్యాసశ్చ గాంధారః పంచమోఽ ంశః ప్రకీర్తితః ।**
**ఆంధ్రీవత్ షాడవం జ్ఞేయమనోడుబితమేవ చ ॥ 224**

**స్యాన్మంద్రర్షభసంచారో లంఘనీయశ్చ స క్వచిత్ ।**
**కార్మారవ్యామనంశాస్తు షడ్జగాంధారమధ్యమాః ॥ 225**

**పూర్ణతా పంచమో న్యాసో గాంధారగమనం బహు ।**
**కైశిక్యామృషభోఽ నంశో న్యాసౌ తు ద్విశ్రుతౌ + + ॥ 226**

**ప్రతిపదార్థము** : షడ్జహీనం షాడవం స్యాత్ = షడ్జరహితము షాడవమగును; గాంధారః న్యాసః ఇష్యతే = గాంధారమున్యాసముగా అంగీకృతము; నందయంత్యాం = నందయంతి యందు; మధ్యమపంచమౌ అపన్యాసౌ జ్ఞేయౌ= మధ్యమ పంచములపన్యాసములుగా తెలియవలెను; గాంధారః గ్రహః న్యాసశ్చ = గాంధార గ్రహము, గాంధార న్యాసమును; పంచమః అంశః పరికీర్తితః = పంచమ అంశముగా చెప్పబడినది; ఆంధ్రీవత్ = ఆంధ్రివలె; షాడవం జ్ఞేయం = షాడవము తెలియవలెను; అనౌడు వితమేవ = ఔడువితముకాదు; మంద్రర్షభః సంచారః స్యాత్ = మంద్రరిషభము సంచారమగును; క్వచిత్ స లంఘనీయః = ఒక్కొక్కచోట షడ్జము లంఘనీయము (దాటదగినది) కార్మారవ్యాంః =

కార్మారవియందు; షడ్జగాంధారమధ్యమాః అనంశాః = షడ్జగాంధార మధ్యమములంశరహితములు; పూర్ణతా = పూర్ణత్వము; పంచమః న్యాసః = పంచమన్యాసము; గాంధార గమనం బహు = గాంధార సంచారమధికము; కైశిక్యాం ఋషభః అనంశః = కైశికియందు రిషభమంశరహితము; న్యాసౌ = న్యాసములు; ద్విశ్రుతౌ = ద్విశ్రుతులని (తెలియదగినది)

**తాత్పర్యము :** షడ్జరహితము షాడవమగును. గాంధారము న్యాసముగా అంగీకృతము. నందయంతియందు మధ్యమపంచమములపన్యాసముగా తెలియవలెను. గాంధారగ్రహము గాంధారన్యాసమును, పంచమ అంశముగా చెప్పడినది. ఆంధ్రివలె, షాడవముగా తెలియవలెను. ఔడువితముకాదు, మంద్రరిషభసంచారమగును. ఒక్కొక్కచోట షడ్జము లంఘనీయము (దాటదగినది) కార్మారవియందు షడ్జగాంధార మధ్యమములంశరహితములు. పూర్ణత్వము పంచమ న్యాసము గాంధార సంచారమధికము కైశికియందు రిషభమంశరహితము న్యాసములు ద్విశ్రుతులైన

**ఋషభో ధైవతశ్చైవ హేయావస్యాం యథాక్రమమ్ ।**
**పంచమోఽ పి భవేన్న్యాసో నిషాదేంశేఽ థ ధైవతే ॥** 227

**ఋషభః స్యాదపన్యాసః కైశ్చిదుక్తోఽ ంశవత్ తథా ।**
**అస్మద్గురుమతే ఋషభస్తావదపన్యాసో భవతి అనంశత్వాత్ ।**
**కైశ్చిత్ పునః అంశవత్ ఋషభో హ్యపన్యాసః కృతః ॥** 228

**పంచమో బలవాన్న స్యాత్ స్యాన్నిషాదస్తథైవ చ ।**
**ఇతి త్రిషష్టిరంశా యే తేషామేకైకశోఽ ంశతామ్ ॥** 229

**ప్రతిపదార్థము :** అస్యాం = ఇందు; యథాక్రమం = వరుసగా; ఋషభః ధైవతశ్చ హేయౌ = రిషభధైవతములు వర్జ్యములు; నిషాదే అంశే = నిషాదాంశమునందు; అథ = తరువాత, ధైవతే = ధైవతమందు; పంచమః అపి= పంచమము కూడ; న్యాసః = న్యాసమగును; ఋషభః అపన్యాసః స్యాత్ = రిషభమపన్యాసమగును; తథా =అట్లే; కైశ్చిత్ = కొందరిచే; అంశవత్ ఉక్తః = అంశమువలె చెప్పబడినది; అస్మత్ గురుమతే = మాగురువుగారి మతమందు; ఋషభస్తావత్ అపన్యాసః భవతి = రిషభమపన్యాసమగును; అనంశత్వాత్ –

అంశత్వములేకపోవుట వలన; కైశ్చిత్తువః = కొందరిచేత మాత్రము; అంశవత్= అంశమువలె; ఋషభః అపన్యాసః కృతః = రిషభమపన్యాసము చేయబడినది; పంచమః బలవాన్నస్యాత్= పంచమము దుర్బలమగును; నిషాదః తథైవ స్యాత్= నిషాదమునుఅట్లే యగును; ఇతి = ఈవిధమైన; యే త్రిషష్టిః అంశాః = ఏ 63 అంశములో; తేషాం =వాటిలో; ఏకైకశః అంశతాం = క్రమముగ అంశత్వమును

**తాత్పర్యము** : ఇందు వరునగా రిషభధైవతములు వర్జ్యములు. నిషాదాంశమునందు మరియు ధైవతమందు పంచమముకూడ న్యాసమగును. రిషభమపన్యాసమగును. అట్లే కొందరిచే అంశమువలె చెప్పబడినది మాగురువుగారి మతమందు రిషభమపన్యాస మగును. అంశత్వము లేకపోవుట వలన కొందరిచేత మాత్రము అంశమువలె రిషభమపన్యాసము చేయబడినది. పంచమము దుర్బలమగును. నిషాదమును అట్లే యగును. ఈవిధమైన ఏ 63 అంశములో వాటిలో క్రమముగ అంశత్వమును

ప్రకల్ప్యాపోద్యతే ప్రాప్తషాడవౌడువితం క్వచిత్ ।
అషాడవాఏతే త్రిషష్టిరంశా ఏతేషామంశో న జాతి ++++ ॥ 230

**ప్రతిపదార్థము** : ప్రకల్ప్య = కల్పించి; క్వచిత్ = ఒక్కొక్కచోట; ప్రాప్తషాడవౌడువితం అపోద్యతే = పొందబడిన షాడవత్వఔడువత్వము నిరసింపబడుచున్నది; ఏతే అషాడవాః = ఇవి అషాడవములు; ఏతేషాం = వీటియొక్క; అంశాః త్రిషష్టిః = అంశములు 63; అంశః =అంశము; నజాతి + + + +

**తాత్పర్యము** : కల్పించి ఒక్కొక్కచోట పొందబడిన షాడవత్వ ఔడువత్వము నిరసంపబడుచున్నది. ఇవి అషాడవములు. వీటియొక్క అంశములు 63. అంశము నజాతి + + + +

అంశవచ్చగ్రహో జ్ఞేయా సర్వాసామేవ నిత్యశః ।
సర్వసామేవ జాతీనాం త్రిజాతిస్తు గణః స్మృతః ॥ 231

లక్షణాత్ స చ విజ్ఞేయో వర్ధమానః స్వరోబుధైః ।
ఏకస్వరో ద్విస్వరశ్చ త్రిస్వరశ్చ చతుః స్వరః ॥ 232

పంచస్వరశ్చతుర్ధా చ ఏకధా సప్తషట్ స్వరాః ।

ప్రతిపదార్థము : నిత్యశః = సర్వదా; అంశవత్ = అంశమువలె; సర్వాసాం ఏవ = అన్నింటికి; గ్రహాః జ్ఞేయాః = గ్రహములు తెలియదగినవి; త్రిజాతిస్తు గణః స్మృతః = అన్నిజాతులలో త్రిజాతిమాత్రము గణముగా చెప్పబడుచున్నది; బుధైః = పండితులచే; వర్ధమానస్వరః = వృద్ధియగుచున్న స్వరముకల; సః= అది; లక్షణాత్ విజ్ఞేయః = లక్షణమువలన తెలియదగినది; ఏకస్వరము, ద్విస్వరము, త్రిస్వరము, చతుఃస్వరము, పంచస్వరము;(అని); చతుర్ధా = నాల్గువిధములుగను; షట్ = సప్తస్వరములు; ఏకధా = ఒక విధము

అస్యార్థః = దీనియర్థము - త్రిజాతికో గణ ఇతి నిర్దేశనం తత్ర ఏకస్వరాంశాః తిస్రః మధ్యమోదీచ్యవా గాంధారపంచమీ నందయంతీ చ ఇతి = త్రిజాతికము గణమని నిర్దేశము అందు ఏకస్వరాంశములు మూడు - మధ్యమోదీచ్యవ, గాంధార పంచమీ, నందయంతి అని, - పపప।

ద్విస్వరాంశాః తిస్రః = ద్విస్వరాంశముల మూడు; ధైవతీ, గాంధారోదీచ్యవా పంచమీ చ; ఇతి = అని, ధరిసరిపరి ।

త్రిస్వరాంశాః తిస్రః = త్రిస్వరాంశములు మూడు, ఆర్షభి, నైషాది, షడ్జకైశికీ,. ఇతి = అని, ధనిసాగరిససగ (ప?పా); చతుస్వరాంశాః తిస్రః = చతుః స్వరాంశములు మూడు; షడ్జోదీచ్యవతి, అంధ్రీ కర్మారవీచ; ఇతి = అని; సమధనినిగపని। పరిధని । పంచ స్వరాంశాః చతస్రః = పంచస్వరాంశములు నాల్గు; షడ్జ, గాంధారీ, రక్త గాంధారీ, మధ్యమా, చ ఇతి = అని; సగమపధ । సగమపని సరిగమపధ । సరిమపధ । షడ్జస్వరాంశా కైశికీ = షడ్జస్వరాంశము కైశికి; సమగపధని । సప్తస్వరాంశా షడ్జమధ్యమా = షడ్జమధ్యమము సప్తస్వరాంశము; సరిగమపధని ।

ఏవం త్రిషష్టిరంశాః వ్యాఖ్యాతాః = ఇట్లు 63 అంశములు వ్యాఖ్యానింపబడినవి.

**మధ్యమోదీచ్యవా చైవ తథా గాంధార పంచమీ ॥** 233
**నందయంతీ చ తిస్రస్తాః పంచమ్యై కాంశ తః స్మృతాః ।**
**ధైవతీపంచమీ చైవ జ్ఞేయే ధరిదివాంశకే ॥** 234

ప్రతిపదార్థము : మధ్యమోదీచ్యవ, గాంధార పంచమి, నందయంతియు ; తాః తిస్రః = ఆ మూడును; పంచమ్యైకాంశతఃస్మృతాః = పంచమము యొక్క ఒకఅంశ

వలన చెప్పబడినవి; ధైవతి, పంచమి రెండును; ధరిదివాంశకే జ్ఞేయే = ధైవత రిషభాంశకములుగా తెలియవలెను

**తాత్పర్యము** : మధ్యమోదీచ్యవ, గాంధార పంచమి, నందయంతియు ఆమూడును పంచమముయొక్క ఒక అంశవలన చెప్పబడినవి. ధైవతి, పంచమి రెండును ధైవతరిషభాంశకములుగా తెలియవలెను

**గాంధారోదీచ్యవా ద్వాభ్యాం మధ్యమర్షభ ఇత్యపి ।**
**ఆర్షభ్యాం నిరిధా అంశా నైషాద్యాం నిరిగాస్త్రయః ॥** 235

**ప్రతిపదార్థము** : మధ్యమర్షభ ఇత్యపి ద్వాభ్యాం అంశాభ్యాం = మధ్యమరిషభాంశములు రెండింటితోను కూడినది; గాంధారోదీచ్యవా = ఆర్షభ్యాం = ఆర్షభియందు, నిరిధాః అంశాః = నిషాదరిషభ ధైవతములంశములు; నైషద్యాం = నిషాదియందు; నిరిగాః త్రయః అంశాః = నిషాదరిషభగాంధారములు మూడంశములు

**తాత్పర్యము** : మధ్యమరిషభాంశములు రెండింటితోను కూడినది ఆర్షభియందు నిషాదరిషభ ధైవతములంశములనిషాదియందు నిషాదరిషభగాంధారములు మూడంశములు.

**సగపాః షడ్జకైశిక్యాంతి స్రః త్ర్యంశాః ప్రకీర్తితాః ।**
**చతురంశ్యాసమనిధైః షడ్జోదీచ్యవతీ స్మృతా ॥** 236

**ప్రతిపదార్థము** : షడ్జకైశిక్యాం = షడ్జకైశికియందు; సగపాః = షడ్జగాంధార పంచమములు;తిస్రః త్ర్యంశాః = మూడు మూడంశములు; (6); ప్రకీర్తితాః = చెప్పబడినవి; సమనిధైః = షడ్జమధ్యమ నిషాధధైవతములచే; చతురంశాః = నాల్గంశములు; షడ్జోదీచ్యవ తీస్మృతాః = షడ్జోదీచ్యవతి చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : షడ్జకైశికియందు షడ్జగాంధారపంచమములుమూడు మూడంశములు (6) చెప్పబడినవి. షడ్జమధ్యమ నిషాదధైవతములచే నాల్గంశములు షడ్జోదీచ్యవతి చెప్పబడుచున్నది.

**కర్మారవీ రిపనిధై రాంధ్రీచ గపనిధైరపి ।**
**సగమపధైః షాడ్జీసాక్ పంచభిశ్చాపి మధ్యమా ॥** 237

**సరిమపధై రంశైః స్యాత్ గాంధారీ సగమానిపైః ।**
**తద్వత్ స్యాత్ రక్తగాంధారీ పూర్వైరంశై శ్చ పంచభిః ॥** 238

**కైశిక్యేకా షడంశాస్యాత్ సగమపనిధైః స్మృతా ।**
**షడ్జమధ్యమాతు సప్తాంశా త్రిషష్టిరితి తేంశకాః ॥** 239

**ప్రతిపదార్థము :** కర్మారవీ రిపనిధైః = రిషభపంచమనిషాదధైవతాంశములచేతను; ఆంధ్రీగవనిధైః = ఆంధ్రిగాంధారపంచమనిషాదమధ్యమ పంచమ ధైవతములచేతను; షాడ్జి సగమపధైః అంశైః = షాడ్జి, షడ్జగాంధార మధ్యమ పంచమధైవతములచేతను; గాంధారీ సగమనిపైః = గాంధారి, షడ్జగాంధారమధ్యమనిషాదపంచమములచేతను; స్యాత్ = అగును; తద్వత్= అట్లే; రక్తగాంధారీ పూర్వైః పంచభిః అంశైః సగమానిపైః స్యాత్ = రక్తగాంధారీ పూర్వపు పంచాంశములైన షడ్జగాంధారమధ్యమ నిషాదపంచమములచే తనేయగును; ఏకాకైశికీ = ఒక్కకైశికి మాత్రము; సగమపనిధైః= షడ్జగాంధారమధ్యమ పంచమ నిషాద ధైవతములచే; షడం స్యాత్ = షడంశమగును; షడ్జమధ్యమా తు సప్తాంశా = షడ్జమధ్యమము మాత్రము సప్తాంశము; ఇతి = ఈవిధముగా; తేత్రి షష్ఠిఅంశకాః = ఆ 63 అంశములు

**తాత్పర్యము :** రిషభపంచమనిషాద ధైవతాంశములచేతను, ఆంధ్రి గాంధారపంచమనిషాదపంచమములచేతను, షాడ్జి షడ్జరిషభమధ్యమపంచమ ధైవతములచేతను, షడ్జగాంధారమధ్యమనిషాదపంచమములచేతను అగును. అట్లే రక్తగాంధారి పూర్వపు పంచాంశములైన షడ్జగాంధార మధ్యమ నిషాద పంచమములచేతనే యగును. ఒక్కకైశికి మాత్రము షడ్జ గాందార మధ్యమ పంచమనిషాదధైవతములచే షడంశమగును. షడ్జమధ్యమముమాత్రము సప్తాంశము ఈ విధముగా ఆ63 అంశములు.

**అంశకైః గ్రామరాగాస్తు జనయంతీతి జాతయః ।**
**ఆసాం ప్రయోగ కాలేతు యుగ్మా యుగ్మా క్రమోవిధిః ॥** 240

**ప్రతిపదార్థము :** అంశకైః గ్రామరాగాస్తు జనయంతి ఇతి జాతయః = అంశములచే గ్రామరాగములను పుట్టించుచున్నవని జాతులగుచున్నవి; ఆసాం ప్రయోగకాలే =

వీటి ప్రయోగ సమయమందు; విధిః = విధి, యుగ్మాయుగ్మాశ్రయః = యుగ్మ అయుగ్మములనాశ్రయించునదగును

**తాత్పర్యము** : అంశములచే గ్రామరాగములను పుట్టించు చున్నవని జాతులగుచున్నవి. వీటిప్రయోగ సమయమందు విధి యుగ్మఅయుగ్మముల నాశ్రయించునదగును.

**మార్గైస్త్రిభిః ప్రయోక్తవ్యాశ్చిత్ర వార్తిక దాక్షిణైః ।**
**పూర్వరంగే కృతే శుద్ధా కర్తవ్యం గీతయోక్తృభిః ॥ 241**

**ఆసారికం వాణికాది తతో వాత్యంశకల్పనమ్ ।**
**స్వరాణా మంగహారైర్యత ఏవాసారితక్రమైః ॥ 242**

**ప్రతిపదార్థము** : చిత్రవార్తిక దాక్షిణైః త్రిభిః మార్గైః = చిత్ర వార్తిక దక్షిణమార్గముల మూడిటిచేతను; ప్రయక్తవ్యా = ప్రయోగింపదగినది; పూర్వరంగే కృతే = పూర్వరంగము చేయబడగా; గీతయోక్తృభిః = వాగ్గేయ కారులచే; శుద్ధాకర్తవ్యం= శుద్ధ (అంశ) ముచేయదగినది; ఆసారికం = ఆసారికము; వాణికాది = వాణికము మొదలగునది; తతః = తరువాత; వా = లేక; (వికల్పముగా); అత్యంశ కల్పనం = అత్యంశ కల్పనము, స్వరాణాం = స్వరములకు; అత ఏవ = అందుకనే; ఆసారతక్రమైః అంగహారైః = ఆసారితక్రమ (ముగా) అంగహారములచే

**తాత్పర్యము** : చిత్రవార్తిక దక్షిణమార్గములమూడిటిచేతను ప్రయోగింపదగినది. పూర్వరంగముచేయబడగా, వాగ్గేయకారులచే శుద్ధ (అంశ)ముచేయదగినది, తరువాత లేక (వికల్పముగా) అత్యంశకల్పనము స్వరములకు అందుకనే ఆసారితక్రమ (ముగా) అంగహారములచే

**వర్ధమాన పదేతాసాం కార్యాస్యాదంశ కల్పనా ।**
**ఇతి త్రిషష్టిరంశాయే తేషామేకైక శోంశతామ్ ॥ 243**

**ప్రతిపదార్థము** : వర్ధమానపదే = వృద్ధిమార్గమందు; తాసాం =వాటికి; అంశకల్పనా కార్యాస్యాత్ = అంశత్వకల్పనముచేయదగినదగును; ఇతి = ఈవిధముగా; యేత్రిషష్టిః అంశాః = ఏ అరవై మూడంశములు గలవో; తేషాం = వాటికి; ఏకైకతః = ఒక్కటొక్కటిగా; అంశతాం = అంశత్వము

**తాత్పర్యము** : వృద్ధిమార్గమందు వాటికి అంశత్వకల్పనము చేయదగినదగును. ఈవిధముగా ఏ అరవై మూడంశములు గలవో వాటికి ఒక్కటొక్కటిగా అంశత్వము

**ప్రకల్ప్య పోద్యతే ప్రాప్తం షాడవౌడుబితం క్వచిత్ ॥** 244

**ప్రతిపదార్థము** : ప్రకల్ప్య = కల్పించి; క్వచిత్ = ఒకానొకచోట; ప్రాప్తం = పొందబడిన షాడవౌడుబితం = షాడవ త్వౌడుబత్వము(లు), ఆపోద్యఇతి త్రిషష్టిరంశాయే ఉక్తాః తేషాం మధ్యేయే అనంశాః తేషామనంశానాం ప్రత్యేక మంశానాం పరికల్ప్య షాడవత్వం ఔడుబితత్వం ప్రాప్తం క్వచిదితి జాతి విషమే ఆపోద్యతే = ఈవిధముగా 63 అంశములేవి చెప్పబడినవో వాటిలో యేవి అనంశములో ఆఅనంశములకు అంశత్వము ప్రత్యేకముగా కల్పించి షాడవత్వౌడువత్వములొక్కొక్కచోట పొందబడినదని జాతి విషయమున నిరసింప బడుచున్నది; ఏతదేవ స్ఫుటయతి = దీనినే స్పష్టము చేయుచున్నాడు

**తాత్పర్యము** : కల్పించి ఒకానొకచోట పొందబడిన షాడవత్వౌడుబత్వము (లు) ఈవిధముగా 63 అంశములేవి చెప్పబడినవో వాటిలో యేవి అనంశములో ఆ అనంశములకు అంశత్వము ప్రత్యేకముగా కల్పించి షాడవత్వౌడువత్వము లొక్కొక్కచోట పొందబడినదని జాతివిషయమున నిరసింపబడుచున్నది. దీనినే స్పష్టము చేయుచున్నాడు.

**అషాడబానిషాదేఽ ంశే సని స్యాత్ షడ్జమధ్యమా ॥** 244
**గాంధారే చ యతో లోపో నాంశసంవాదినో మతః ।**

**ప్రతిపదార్థము** : సని స్యాత్ = షడ్జమధ్యమ (ము); అషాడబమై షడ్జనిషామగును; యతః= ఎందువలన; గాంధారే = గాంధారమందు; లోపః = లోపమో; అతః = అందువలన; న అంశ సంవాదినః మతః = అంశ సంవాదులకు సమ్మతముకాదు; అస్యార్థః దీనయర్థము -నిషాదేఽ ంశే షడ్జమధ్యా - జాతిరషాడబా - నిషాదాంశమందు షడ్జమధ్యాజాతి అషాడబము; కథం = ఎట్లు?; షడ్జగ్రామే షాడవవిధౌ గాంధారస్య లోపో నాస్తి = షడ్జగ్రామమందు షాడవవిధిలో గాంధారమునకు లోపములేదు; గాంధారేంశే నిషాదేన అషాడవా బోద్ధవ్యాః =

గాంధారాంశమందు నిషాదముచే అషాడవములుగా తెలియుదగినవి; అంశసంవాదినో లోపాభావాత్ = అంశ సంవాదులకు లోపము లేకపోవుటవలన

**తాత్పర్యము :** షడ్జమధ్యమ (ము) అషాడబమై షడ్జనిషామగును. ఎందువలన గాంధారమందులోపమో, అందువలన అంశసంవాదులకు సమ్మతముకాదు. అషాడము, ఎట్లు?, షడ్జగ్రామమందు షాడవవిధిలో గాంధారమునకు లోపములేదు. గాంధారాంశమందు నిషాదముచే అషాడవములుగా తెలియదగినవి. అంశ సంవాదులకు లోపము లేకపోవుటవలన

**కైశికీ రక్తగాంధారీ గాంధారీ చైవ పంచమే ॥ 245**
**తథా షాడ్జాతుగాంధారే ధైవతా తదాదీచ్యవా ।**

**ప్రతిపదార్థము :** కైశికీ రక్తగాంధారీ = కైశికి రక్తగాంధారి; గాంధారీచైవ పంచమే= గాంధారి పంచమమందు; తథా = అట్లే; గాంధారే = గాంధారమందు; షడ్జా తదాదీచ్యవా = షడ్జోదీచ్యవా; నిశబుషభేణ = నిషాదాంశ రిషభముచే; షడ్జోదీచ్యవా. . . . శే అషాడవా విజ్ఞేయా = అషాడవము (లు)గా తెలియవలెను; ఇదానీం ఔడుబితంప్రాప్తమాపోద్యతే = ఇప్పుడు పొందబడిన ఔడుబితత్వము నిరసింపబడుచున్నది

**గాంధారీ రక్తగాంధార్యోః షడ్జమధ్యమపంచమా ॥ 246**
**సనిషాదాః స్మృతా అంశా అనౌడుబిత భాగినః ।**

**ప్రతిపదార్థము :** గాంధారీ- రక్తగాంధార్యోః = గాంధారీ రక్త గాంధారులకు; షడ్జమధ్యమ పంచమాః = షడ్జమధ్యమపంచమములు; సనిషాదాః = నిషాద సహితములుగా; అనౌడుబితభాగినఃఅంశాః స్మృతాః =అనౌడుబితములైన అంశములు చెప్పబడినవి; ఏతచ్చ అసంగతం = ఇది సరియైనదికాదు; ఔడుబితప్రాప్తేరభావాత్ = ఔడుబిత ప్రాప్తి లేక పోవుటచే; సత్యముక్తం = యథార్థముచెప్పబడినది; ఔడుబితనిషేధవ చనాని విధేశ్చాప్రాప్తమేవ ఔడుబిత్వం నిషిధ్యతే = ఔడుబితనిషేధవచనములు విధికి అప్రాప్తమయియే ఔడుబితత్వము నిషేధింపబడుచున్నది

**తాత్పర్యము :** గాంధారీ రక్తగాంధారులకు షడ్జమధ్యమ పంచమములు నిషాద సహితములుగా అనౌడుబితములైన అంశములు చెప్పబడినవి. ఇది

సరియైనదికాదు. ఔడుబితప్రాప్తిలేక పోవుటచే యథార్ధము చెప్పబడినది. ఔడుబితనిషేధవచనములు విధికి అప్రాప్తమయియే ఔడుబితత్వము నిషేధింపబడుచున్నది

**షడ్జమధ్యమజాతౌ తు గాంధారోఽథనిషాదవాన్ ॥ 247**
**కైశిక్యామథ పంచమ్యాం క్రమావృషభధైవతౌ ।**

**ప్రతిపదార్థము :** షడ్జమధ్యమజాతౌ = షడ్జమధ్యమజాతియందు; గాంధారః = గాంధారము; అథ = తరువాత; నిషాదవాన్ = నిషాదియు; కైశిక్యాం = కైశికియందు; పంచమ్యాం = పంచమియందు; క్రమాత్ = క్రమముగా; ఋషభధైవతౌ = రిషభధైవతములు; గాంధారోథ నిషాదవానౌడుబితభాగీ = గాంధారము నిషాదియు ఔడుబితభాగులు; కైశిక్యాం ఋషభః పంచమ్యాం ధైవతశ్చ అనౌడువితభాగీ స్యాత్ = కైశికియందు రిషభము, పంచమియందు ధైవతమును, అనౌడుబిత (భాగం) ము(ల)గును; తత్ర ప్రాప్త మేవ అనౌడుబితత్వం నిషిధ్యతే అంశతాచ అప్రాప్తైవ కల్ప్యతే = అందు పొందిన అనౌడుబితత్వము నిషేదింపబడినది; పొందబడని అంశత్వము కల్పించబడినది; ఇదానీం యే అపవాదీ భూతాః స్వరాః షాడవౌడుబితవిధౌ తానుదస్యతి = ఇప్పుడు అపవాద భూతములైన స్వరములు ఏవి షాడవౌడుబిత విధియందు కలలో వాటిని చెప్పుచున్నాడు

**యోజ్యాః సప్తాధికాశ్చైవ చత్వారింప చ్చషాడవే ॥ 248**

**ప్రతిపదార్థము :** షాడవే = షాడవమందు; సప్తాధికాః చత్వారింశత్ యోజ్యాః = 47 అంశములు కూర్చదగినవి; అస్యార్థః = దీని అర్థము - షాడవే విధౌ క్రియమాణే సప్తాదికాంశ్చైవ చత్వారింశచ్చ షాడవ అస్యార్ధ విధౌక్రియమాణే సప్తాధికాశ్చత్వారింశ దంశకా అపవాదస్వరరహితా యోజనీయా ఇత్యర్థః = షాడవవిధిచేయగా 47ను షాడవమందు దీనికి అర్థవిధిచేయగా 47 అంశములు అపవాదరహితములు యోజ్యములనియర్థము; చతస్రుణాం జాతీనాం నిత్యసంపూర్ణానాం నవాంశాః పాతనీయాః త్రిషష్టిమధ్యే = నిత్యపూర్ణములైన నాల్గుజాతులకు 63 టిలో 9 అంశములు వేయదగినవి; తద్యథా = అదిఎట్లనగా- రిపధనిపసగ । పధ । ఏషు నవాంశేషు పాతితేషు చతుష్పంచాశదంశాః వశిష్యంతే=

పాతితములైన ఈ తొమ్మిదంశములందు 54 అంశములుండును; తత్రాపి షడ్జమధ్యమా షడ్జోదీచ్యవా కైశికీ గాంధారీ రక్తగాంధారీ ధైవతీ ఆసాం షడ్జాతీనాం సప్తాంశాః పాతనీయాః = అందును, షడ్జమధ్యమా, షడ్జోదీచ్యవా, కైశికీ, గాంధారీ, రక్తగాంధారీ ధైవతీ ఈఆరింటిలో సప్తాంశములు వేయదగినవి; తేషు సప్తాంశేషు పాతితేషు సప్తచత్వారింశదంశా భవంతి = వేసిన ఆ సప్తాంశములందు 47 అంశములున్నవి; తద్యథా -

**మధ్యమోదీచ్యవాయాం వా తథా గాంధార పంచమీ ।**
**కార్మారవీ రిపనిధైః సగపైః షడ్జకైశికీ ॥** 249

**సగమపధైః స్మృతా + + + ++++ ।**
**నందయంతీ భవేత్పాగా గాంధారోదీచ్యవా సమా ॥**

**ప్రతిపదార్థము** : మధ్యమోదీచ్యవాయాం = మధ్యమోదీచ్యవయందు; తథా =అట్లే; గాంధారపంచమీ = గాంధారపంచమియు; రిపనిధైః = రిషభపంచమనిషాద ధైవతములతో; కార్మారవీ = కార్మారవియు; షడ్జకైశికీ = షడ్జకైశికి; సగపైః = షడ్జగాంధారపంచమములతోను; సగమపధైః = సగమపదలతో; స్మృతా = చెప్పబడినది+ + + + ++ ; గాంధారోదీచ్యవా సమా = గాంధారోదీచ్యవాతుల్యముగా; నందయంతీ పాగా భవేత్ = నందయంతి పంచమ గాంధారములుఅగును; తేషు చత్వారింశదంశేషు ఉక్తపరైః షడావవిధిః కర్తవ్యః = ఆ40 అంశములందు చెప్పగా మిగిలిన వానితోషాడవ విధిచేయదగినది;

ఇదానీం ఔడువితవిధౌ యేషు అనపవాదినః స్వరాః తాన్ దర్శయతి = ఇప్పుడు ఔడువిత విధియందేవి అనపవాదిస్వరములో వాటిని చూపుచున్నాడు;

**తథాపవాదనిర్ముక్తః త్రింశదౌడువితే భవేత్ ॥** 250

అట్లే అపవాదత్యక్తమైన 30 (అంశముల సముదాయము) ఔడువితమందగును.

అస్యార్థః - దీనియర్థము - తథా తేనప్రకారేణ అపవాద నిర్ముక్తస్త్రింశత్ ప్రకారో బోద్ధవ్యః = అట్లే ఆప్రకారముగా అపవాదత్యక్తమైన 30 విధములైన

దానిని బోధింపదగినది; తద్యాథా - అదిఎట్లనగా - త్రిషష్టిమధ్యే నిత్యసంపూర్ణానాం చతస్పృణాం జాతీనాం నవాంశాః పాతనీయాః = 63 అంశములలో నిత్యసంపూర్ణములైన నాల్గుజాతులలో నవాంశములు వేయదగినవి; తేషు పాతితేషు చతుష్పంచాశత్ అంశాః తత్ర వశిష్యంతే = వేయబడిన తరువాత వాటియందు 54 అంశములుండును; తత్రాపి చతుష్పంచాశన్మధ్యే చతస్పృణాం జాతీనాం నిత్యసంపూర్ణా షాడబానాం ద్వాదశ సప్తాంశాః పాతనీయాః = అందును 54 లోను నాల్గు నిత్యసంపూర్ణ షాడబ జాతులలోను 12,7 (19) అంశములు వేయదగినవి; తేషు పాతితేషు ద్విచత్వారింశదంశేషు ఉక్తస్వరైః ఔడుబితవిధిర్భవతీతి = అట్లు వేయబడిన వాటియందు 42 అంశములందు చెప్పబడిన స్వరములచేత ఔడువితవిధి యగుచున్నది; తథాచాహ భరతః = భరతుడట్లే చెప్పుచున్నాడు -

**షట్స్వరా సప్తమే త్వంశే నేష్యతే షడ్జమధ్యమా ।**
**సంవాద్యలోపాత్ గాంధారే తద్వత్ ధైవతహీనతా ॥**

**ప్రతిపదార్థము :** షడ్జమధ్యమా = షడ్జమధ్యమము; షట్ స్వరాః = షట్స్వరములు; సప్తమేఅంశే = సప్తమాంశమందు; న ఇష్యతే = ఇష్టముకాదు; గాంధారే = గాంధారమందు; సంవాది అలోపాత్ = సంవాదిలోపము లేకపోవుట వలన; తద్వత్ = అట్లే; ధైవతహీనతా = ధైవతరాహిత్యము

**తాత్పర్యము :** షడ్జమధ్యమము షట్స్వరములు సప్తమాంశమందు ఇష్టముకాదు. గాంధారమందు సంవాదిలోపము లేకపోవుట వలన అట్లే ధైవతరాహిత్యము

**గాంధారీ రక్తగాంధారీ కైశికీనాం చ పంచమః ।**
**షడ్జాయూశ్చైవ గాంధారమంశో మధ్యమషాడబౌ ॥**

**ప్రతిపదార్థము :** గాంధారీ రక్తగాంధారీ కైశికీనాం = గాంధార, రక్తగాంధారి, కైశికిలకు; పంచమః = పంచమాంశము; షడ్జాయాః = షడ్జమునకు; గాంధారం అంశః = గాంధార మంశము; మధ్యమషాడబౌ = మధమషాడబములును

**తాత్పర్యము :** గాంధార, రక్తగాంధారి, కైశికిలకు పంచమాంశము. షడ్జమునకు గాంధరమంశము, మధ్యమషాడబములును

**షాడవం ధైవతేనాస్తి షడ్జోదీచ్యంశకే ద్విజాః ।**
**గాంధారీరక్త గాంధార్యోః షడ్జమధ్యమ పంచమాః ॥**

**ప్రతిపదార్థము** : షాడవం ధైవతేనాస్తి = ధైవతమందు షాడవములేదు; షడ్జోదీచ్యంశకే ద్విజాః = షడ్జోదీచ్యంశమందు ద్విజాతికము; గాంధారీ రక్తగాంధార్యోః = గాంధారీరక్త గాంధారులయందు; షడ్జమధ్యమ పంచమాః = షడ్జమధ్యమ పంచమాంశములు

**తాత్పర్యము** : ధైవతమందు షాడవములేదు. షడ్జోదీచ్యంశమందు ద్విజాతికము గాంధారీరక్తగాంధారములయందు షడ్జమధ్యమ పంచమాంశములు.

**సప్తమశ్చైవ విజ్ఞేయో య్త్తెః స్వనౌడుబితం భవేత్ ।**
**ద్వౌషడ్జమధ్యమాంశౌ తు గాంధారః స నిషాదవాన్ ॥**

**ప్రతిపదార్థము** : య్త్తెః = వేటి చేతను; స్వనౌడుబితం భవేత్ = స్వయముగా ఔడుబితములుకావో; తే = అని; (అది) సప్తమశ్చవిజ్ఞేయః = సప్తమాంశముగా తెలియదగినది; ద్వౌ షడ్జమధ్యమాంశౌ = షడ్జమధ్యమాంశములు రెండు (కలది); సః = అది; గాంధారః = గాంధారము; సః = అది; నిషాదవాన్ = నిషాదసహితమైనది

**తాత్పర్యము** : వేటిచేతను స్వయముగా ఔడుబితములుకావో అని (అది) సప్తమాంశముగా తెలియదగినది. షడ్జమధ్యమాంశములు రెండు (కలది) అది గాంధారము నిషాదసహితమైనది.

**ఋషభశ్చైవ పంచమ్యాం కైశిక్యాం ధైవతస్తథా ।**
**ఏవం చ ద్వాదశైవైతే వర్జ్యాః పంచస్వరే సదా ॥** 256

**ప్రతిపదార్థము** : పంచమ్యాం ఋషభః = పంచమియందు రిషభము; కైశిక్యాం= కైశికియందు; ధైవతః = ధైవతము; ఏవం = ఇట్లు; ఏతే ద్వాదశ = ఈ 12; సదా = ఎల్లప్పుడు; పంచస్వరే = పంచస్వరమందు; వర్జ్యాః = విడువదగినవి

**తాత్పర్యము** : పంచమియందు రిషభము కైశికియందు ధైవతముఇట్లు ఈ 12 ఎల్లప్పుడు పంచస్వరమందు విడువదగినవి.

**సర్వస్వరాణాం నాశోఽత్ర విహితః సర్వజాతిషు ।**
**న మధ్యమస్య లోపో హి కర్తవ్యస్తు కదాచన ॥**

**ప్రతిపదార్థము :** అత్ర = ఇక్కడ; సర్వజాతిషు = అన్నిజాతులయందు; సర్వస్వరాణాం = అన్ని స్వరములకు; నాశః విహితః = నాశము విహితమైనది; కింతు = కాని; కదాచన = ఒకప్పుడును; మధ్యమస్య లోపః న కర్తవ్యః = మధ్యమమునకు లోపము చేయరాదు

**తాత్పర్యము :** ఇక్కడ అన్నిజాతులయందు అన్నిస్వరములకు నాశము విహితమైనది. కాని ఏ ఒకప్పుడును మధ్యమమునకు లోపముచేయరాదు.

**స్వరస్వరాణాం ప్రవర అనాశీ మధ్యమస్వరః ।**
**గాంధర్వకల్పో విహితః సామాస్వపి చ మధ్యమః ॥**

**ప్రతిపదార్థము :** మధ్యమస్వరః = మధ్యమస్వరము; సర్వస్వరాణాం ప్రవరః = అన్నిస్వరములలో శ్రేష్ఠమైనది; అనాశీ = శాశ్వతమైనది; సామాస్వపి = సామములందుకూడ; మధ్యమః = మధ్యము(నకు); గాంధర్వకల్పః విహితః = గాంధర్వ కల్పమువిహితమైనది (నిర్ణీతమైనది).

**తాత్పర్యము :** మధ్యమస్వరము అన్నిస్వరములలో శ్రేష్ఠమైనది. శాశ్వతమైనది. సామములందుకూడ మధ్యము (నకు) గాంధర్వ కల్పము విహితమైనది (నిర్ణీతమైనది)

ఇదానీం షాడవౌడబితవిధిస్తు ఉత్సర్గ అపవాద విధిస్తు వికృతాస్వేవ జాతిషు బోద్ధవ్యః = ఇప్పుడు షాడవ ఔడుబితవిధియు, ఉత్సర్గ అపవాదవిధియు వికృత జాతులందే యని తెలియదగినది; నను శుద్ధాసు జాతిషు తాసాం శుద్ధానాం అన్యజాత్యుత్పత్తౌ మూలత్వాత్ ఏతా ఏవ శుద్ధావికృతా భవంతి = ఓయీ ! శుద్ధజాతులయందు, ఆశుద్ధములలో అన్యజాతి ఉత్పత్తియందు ప్రాధాన్యమగుట వలన ఇవియే శుద్ధములు వికృతములు అగుచున్నవి; కథం= ఎట్లు?;

**తద్గ్రహాంతదపన్యాసాతదంశాచ యదా భవేత్ ।**
**మంద్రన్యాసాచ పూర్ణాచ శుద్ధా జాతిస్తథో చ్యతే ॥** 251

ప్రతిపదార్థము : తద్గ్రహో = అదియే గ్రహము; తదపన్యాసా = అదియే అపన్యాసము; తదంశా = అదియే అంశము; యదా భవేత్ = ఎప్పుడు అగునో; మంద్రన్యాసా = మంద్రన్యాసముకలదియు; పూర్ణా చ = సంపూర్ణమగునదియు అయినచో; శుద్ధాజాతిః ఉచ్యతే = శుద్ధజాతియని చ్పెబడుచున్నది

ఇతి శుద్ధలక్షణముక్తం = అని శుద్ధలక్షణము చెప్పబడినది.

ఏతేన లక్షణేన ఏకేన ద్వాభ్యాం వావికృతా భవంతి = ఈలక్షణముచేత ఒకదానిచేతను గాని రెండింటిచేతను గాని వికృతములగుచున్నవి; పునః న్యాస వర్జ్యమితి = మరల న్యాసవియుక్తమనియు; న్యాసేనవికృతం చ నాస్తి న్యాసవర్జ్యమితి వచనాత్ = న్యాసవర్జ్యమని చెప్పుట వలన న్యాసముచేతన వికృతముండదు; వికృతా షాడ్జీ ద్వివిధా నిత్యసంపూర్ణా షాడవాచేతి = నిత్య సంపూర్ణము, షాడవము అని వికృతషాడ్జి రెండు విధములు; నామాంశేన షాడ్జీ శుద్ధవికృతాషాడ్జీ గాంధారాంశేన సంపూర్ణా అంశసంవాద్యలోపాత్ = అంవసంవాది అలోపమువలన నామాంశముచే షాడ్జి శుద్ధవికృతమును, గాంధారాంశముచే సంపూర్ణమును (అగుచున్నది); మధ్యమపంచమధైవతాంశే నిషాదేన షాడవా యదా తు షాడ్జీ శుద్ధా గీయతే తదా పంచమస్య అంశత్వేన శేషాణాం స్వరాణాం బహుత్వం = మధ్యమపంచమ ధైవతాంశమందు నిషాదముచే షాడవము శుద్ధషాడ్జి ఎప్పుడు గానముచేయబడునో అప్పుడు పంచమాంశముతో శేషస్వరములకు అధికత్వమగును; బహుత్వేన షడ్జపంచమయోః త్రింశదంశా భవంతి = బహుత్వముచే షడ్జపంచములందు 30 అంశములగుచున్నవి; షడ్భిః చతుర్ధశవిధో భవతి = ఆరింటిచేతను పదునాల్గువిధములగుచున్నది; గాంధారశ్చ ఏకోనవింశతి విధః = గాంధారము 19 విధములగుచున్నది; మధ్యమః చతుర్ధశవిధః = మద్యమము 14 విధములైనది; మిలిత్వా సప్తస్వరాః అష్టావింశత్యధికం శతం భవతీత్యలం = కలసి ఏడుస్వరములు 128 విధములగుచున్నది; ఇదానీం దశలక్షణమధ్యే యద్యస్యాం జాతౌ భవతి తత్ తస్యా దర్శయతి = ఇప్పుడు దశలక్షణమధ్యమందు ఈ జాతియందు కనబడినయెడల అది దానికి చూపబడుచున్నది; తత్ర షాడ్జ్యాః షడ్జగ్రామసంబంధాయా అంశాః గ్రహాః పంచభవంతి = అందు షాడ్జికి

షడ్జగ్రామికమైన అంశములు గ్రహములు ఐదు అగుచున్నవి; తద్యథా షడ్జగాంధార మధ్యమ పంచమధైవతా గ్రహో అంశాశ్చ = అదెట్లనగా షడ్జగాంధర మధ్యమ పంచమధైవతములు గ్రహములు అంశములును; గాంధార పంచమౌ అపన్యాసౌ = గాంధారపంచమములు అపన్యాసమలు; నిషాదహీనా షాడవ షడ్జసము న్యాసము; షడ్జగాంధారయోః షడ్జధైవతయోశ్చ సంగతిః = షడ్జగాంధారములకు షడ్జధైవతములకు సంయోగము; పంచస్వరపరా తారగతిః = పంచమస్వరపరమైనది (తరువాతిది); తారగతి షడ్జస్వరాత్ పరావామంద్రగతిః = షడ్జస్వరముకంటె పరమైనది (గాని) మంద్రగతి; షడ్జధైవతయోశ్చ ఔడుబితత్వంచ సర్వధైవనాస్తి = షడ్జధైవతములకు ఔడుబితత్వము అన్నివిధములుగను లేదు; (ఉండదు) సంపూర్ణా షాడబా = షాడబము సంపూర్ణము; యదా సంపూర్ణా గీయతే తదా ఋషభపంచమయోః అల్పత్వం కార్యం = ఎప్పుడు సంపూర్ణముగానముచేయుబడునో అప్పుడు రిషభపంచమములకు నిషాదపంచమములకు అల్పత్వము చేయవలెను; కుతః = ఎందువల్లననగా -

యంవినా హీనతా యస్యాం స్యాత్ చేత్ తస్యాంతు స్యోల్పకః = యేదిలేనిదే దేనియందు హైన్యము సంబవించునో దానియందది అల్పమగును; ఇతి వచనాత్ = అనుమాట వలన; యదా షాడబాగీయతే తదా ఋషభస్య అల్పత్వం కార్యం = ఎప్పుడు షాడబముగా నముచేయబడునో అప్పుడు రిషభమునకు అల్పత్వముచేయవలెను; శేషాణాం స్వరాణాం బహుత్వం = మిగిలిన స్వరములకు బహుత్వము; అస్యాశ్చ దశాంశకాః = దీనికి దశ అంశములు; తద్యథా = అదిఎట్లనగా - శుద్ధా వికృతాశ్చ పంచపూర్ణాః చత్వారః షాడబాః గాంధారే షాడబాపవాదాత్ తేనాంశాః స్ఫుటయంతే తేన లిఖితాః షడ్జాంశేన శుద్ధత్వం షడ్జశ్చ అపన్యాసః సంపూర్ణావస్థాయాం అష్టవిధలక్షణం = శుద్ధములు వికృతములును ఐదుపూర్ణస్వరములు నాల్గు షాడవములు గాంధారాంశమందు షాడవ అపవాదము వలన దానిచే అంశములు స్పష్టమగుచున్నవి; అందుచే వ్రాయబడినవిషడ్జాంశముచేత శుద్ధత్వము షడ్జమపన్యాసమును సంపూర్ణావస్థయందు అష్టవిధలక్షణము; షాడవావస్థాయాం నవవిధత్వం = షాడవావస్థయందు నవ (9) విధములైనది; శుద్ధం పరిత్యజ్య

చతుర్విధాషాడ్జీ వికృతాబోద్ధవ్యా = శుద్ధమును విడిచి నాల్గువిధములైన షాడ్జి వికృతముగా తెలియదగినది; అస్యాశ్చ ధైవతాదిమూర్ఛనా పంచపాణిశ్చిత్రేమార్గే మాగదీగీతిః పంచపాణి ద్వికలః దక్షిణే మార్గే పృథులాగీతిః = దీనికి ధైవతాది మూర్ఛన పంచపాణి చిత్రమార్గమందు మాగదీగీతియు పంచపాణి కలాద్వయము, దక్షిణమార్గమందు పృథులాగీతియు; అనేన క్రమేణ సర్వాసాం జాతీనాం బోద్ధవ్యం = ఈ విధముగనే అన్ని జాతులకు తెలియదగినది; వీరరౌద్రాద్భుతాః రసాః కార్యాః = వీరరౌద్రఅద్భుత రసములుచేయదగినవి; ప్రథమోపక్షే గేధ్రువాగానే వినియోగః = ప్రథమోపక్షేపణమందు,ధ్రువాగానమందు వినియోగము;

ఆర్షభీ శుద్ధా గీయతే = రిషభి శుద్ధముగ గానముచేయబడును; నిషాదపంచమాల్పత్వం ఋషభగాంధార మధ్యమ పంచమధైవనిషాదాః షడ్జషడ్జః మిలిత్వా . . . . షభ్యాం = నిషాద పంచమాల్పత్వమును రిషభగాంధార మధ్యమ పంచమధైవత నిషాదములు షడ్జషడ్జములు కలిసి. . . .షభ్యాం (?); ఋషభధైవత నిషాదాః గ్రహాః స్వయమేవాంశాః = రిషభధైవతనిషాదములు గ్రహములు, స్వయముగానవియే అంశములు; త ఏవాపన్యాసాః = రిషభధైవత నిషాదములే అపన్యాసములు; పంచస్వర పరస్తారః = పంచస్వరముకంటె తరువా(తిది)త తారము; నిషాదః ఋషభో న్యాసః = నిషాదరిషభము (లు) న్యాసము; న్యాసపరస్తత్పరోవా మంద్రః = న్యాసస్వరముకంటె పరమైనది గాని దానితరువాతిది గాని మంద్రము; షడ్జధైవతపంచమః ఋషభగాంధారయోశ్చ సంగతిః = షడ్జధైవత పంచమము (లు) రిషభగాంధారములందు సంయోగము; షడ్జహీనం షాడవం = షడ్జరహిత షాడవము; షడ్జపంచమహీనం ఔడువితం= షడ్జపంచమ రహితమౌడువితము; పూర్ణావస్థాయాం షడ్జగాంధార పంచమానామల్పత్వం = పూర్ణావస్థయందు షడ్జగాంధార పంచమములకు అల్పత; ఔడువితే గాంధారమధ్యమయోరల్పత్వం శేషాణాం చ బహుత్వం = ఔడువితమందు గాంధారమధ్యమములకు అల్పతయు మిగిలినవాటికి బహుత్వమును; దశవిధత్వం చాస్యాః దశాంశాః శుద్ధవికృతాః పూర్ణాస్త్రయః = దీనికి దశ (10) విధత్వము, దశ(10) అంశములు శుద్ధవికృతములు, పూర్ణములు మూడు (3); పంచమాదిమూర్ఛనా చచ్చత్పుటస్తాలః = పంచమాదిమూర్ఛనయు

చచ్చుత్పుటముతాళము; ఏకకలేన చిత్రేణ మాగధీ = ఏకకలాయుత చిత్రమార్గము చేమాగధీగీతియు; ద్వికలేన వార్తికేన సంభావితా = ద్వికలావార్తికముచే సంభావితము; చతుష్కలేన దక్షిణేన పృథులా మాత్రా = చతుష్కలాయుత దక్షిణమార్గముచే పృథులా మాత్రయు;

దక్షిణేకలా = దక్షిణమందు కల; వీరరౌద్రాద్భుతాః రసాః =వీరరౌద్ర అద్భుత రసములు; ప్రథమప్రేక్షణ కే నైష్క్రామికీ ధ్రువాగానే వినియోగః = ప్రథమప్రేక్షణమందు నిష్క్రామసంబంధమైన ధ్రువాగానమందు వినియోగము; ధైవతాది మూర్ఛనా ధైవత్యాధైవతం మహౌ గ్రహౌ అంశౌ చ = ధైవతాది మూర్ఛన ధైవతిచే ధైవతము మహత్తులైన గ్రహములును అంశములును; శుద్ధావస్థాయాం ధైవత్యేవ న్యాసః = శుద్ధావస్థయందు ధైవతియేన్యాసము; వికృతావస్థాయాం చ ధైవతర్షభమధ్యమా అపన్యాసాః = వికృతావస్థయందు ధైవతరిషభమధ్యములు అపన్యాసములు; ధైవతోన్యాసః= ధైవతమున్యాసము; పంచమహీనాం షాడవం పంచమషడ్జహీనం షాడవం పంచమషడ్జహీనమౌడుబితం = పంచమరహితషాడవము; పంచమషడ్జహీనము ఔడుబితము; తావేవ షడ్జపంచమస్వరౌ తు బలౌ కర్తవ్యౌ = ఆషడ్జపంచమస్వరములే అధికములు చేయబడవలెను; క్వచిల్లంఘనీయౌ = ఒక్కొక్కచోట లంఘనీయములు (దాటదగినవి); పంచస్వరపరస్తారః = పంచస్వరపరము తారము; న్యాసపరస్తత్పరో వా మంద్రః = న్యాసపరమైనదిగాని దానికంటె పరమైనదిగాని మంద్రము; పూర్ణావస్థాయాం షడ్జగాంధారమధ్యమపంచమనిషాదానామల్పత్వం పంచమషడ్జవర్జం చ = పూర్ణావస్థయందు షడ్జగాంధారమద్యమపంచమనిషాదములకు అల్పత; పంచమషడ్జములు త్యాజ్యములును; ఏతేషాం ఔడుబితే అల్పత్వం = వీటికి ఔడువితమందల్పత్వము; శేషాణాం చ బహుత్వం = మిగిలిన వాటికి బహుత్వము; వివిధత్వమస్యాః సప్తాంశకాః శుద్ధావికృతాః పూర్ణా ఋషభాదిమూర్ఛనా తాలః పంచపాణిః ఏకకలశ్చిత్రో మార్గః మాగధీగీతిః = వివిధత్వము దీనికి సప్తాంశకములు శుద్ధములు వికృతములు పూర్ణములు; రిషభాది మూర్ఛన, తాలము పంచపాణి, ఏకకలాయుత చిత్రమార్గము; మాగధీగీతి, ద్వికలోవార్తికః సంభావితా = ద్వికలవార్తికము సంభావితము;

చతుష్కలో దక్షిణః పృథులాకలా దక్షిణే కలాః ద్వాదశ వార్తికే కలా అష్టచత్వారింశత్ = చతుష్కలా దక్షిణము పృథులాకలా; దక్షిణమందు 12 కళలు, వార్తికమందు 48 కళలు; రసా వీరభీభత్సభయానకాః = వీరభీభత్స భయానకరసములు; ధ్రువాగానే ప్రథమే ప్రేక్షణకే వినియోగః = ప్రథమప్రేక్షణమందు ధ్రువాగానమందు వినియోగము; నిషాదవత్యా నిషాదర్షభగాంధారా గ్రహాః అంశాశ్చ = నిషాదవతికి నిషాదరిషభగాంధారములు గ్రహములు అంశములును; అపన్యాసాశ్చ నిషాదగాంధారర్షభాః = నిషాదగాంధారరిషభములుఅపన్యాసములు; నిషాద ఏకో న్యాసః = నిషాదమొక్కటియే న్యాసము; పంచమహీనం షాడబం = పంచమ రహితషాడబమును; పంచమషడ్జహీనమౌడుబితం = పంచమ షడ్జరహితమైన ఔడుబితము; పూర్ణావస్థాయాం షడ్జగాంధార మధ్యమ పంచమానాం అల్పత్వం= పూర్ణావస్థయందు షడ్జగాంధారమధ్యమపంచమములకు అల్పత; ఔడుబితే మధ్యమధైవత యోరల్పత్వం = ఔడుబితమందు మధ్యమ ధైవతములకు అల్పత; పంచస్వరపరా తారగతిః = పంచ స్వరపరమైనది తారగతి; న్యాసపరస్తారత్పరో వా మంద్రః = న్యాసపరముకంటె పరమైనదానికి గాని మంద్రము; గాంధారాది మూర్ఛనా = గాంధారాది మూర్ఛన, తాలశ్చచ్చత్పుటః = చచ్చత్పుటతాలము; దక్షిణే కలా చతుష్షష్టిః = దక్షిణమార్గమందు 64 కలలు; చిత్రే అష్టౌ = చిత్రమార్గమందెనిమిది; దశవిధత్వం చాస్యాః దశాంశాః శుద్ధాః త్రయో వికృతాః పూర్ణా = దశవిధత్వము దీనికి దశాంశములు శుద్ధములు మూడువికృతులు; పూర్ణము రసశ్చ కరుణః = కరుణరసము ధ్రువాగానే; ప్రథమప్రేక్షణకే వినియోగః =ధ్రువాగానమందు ప్రథమ ప్రేక్షణమందు వినియోగము;

షడ్జకైశిక్యా షడ్జగాంధారపంచమాః గ్రహాః అంశాశ్చ = షడ్జకైశికికి షడ్జగాంధార పంచమములు గ్రహములు అంశములును; పంచస్వరపరస్తారః = పంచస్వరముకంటె తరువాతిది తారము; న్యాసపరస్తత్పరోవా మంద్రః = న్యాస పరముగాని తరువాతిదిగాని మంద్రము; నిత్యసంపూర్ణా చ = నిత్య సంపూర్ణమును; ధైవతనిషాదగ్రహా = ధైవతనిషాదగ్రహములుకలది; మధ్యమానామల్పత్వం = మధ్యమములకు అల్పతః; ఋషభస్య అల్పతరత్వం=

రిషభమునకు మిక్కిలి అల్పత; శేషాణాం బహుత్వం = మిగిలినవాటికి బహుత్వము; న్యాసస్తు గాంధారః = గాంధార (ము)న్యాసము; షడ్జనిషాదపంచమాః అష్టధైవఅస్యాః శుద్ధత్వం అంశకాః పూర్ణాః చచ్చత్పుటస్తాలః = షడ్జ నిషాదపంచమములు ఎనిమిది విధములుగా దీనికి శుద్ధత్వము; అంశములు పూర్ణములు; తాలము చచ్చత్పుటము; ఏకకటేచిత్రే మాగధీ గీతిః = ఏకకలాచిత్రమార్గమందు మాగధీ గీతి; ద్వికలే వార్త్తికే సంభావితా = ద్వికలావార్త్తికమందు సంభావితము; చతుష్కలే దక్షిణే పృథులా = చతుష్కలా దక్షిణమందు పృథులాగీతి; రసశ్చ కరుణః = కరుణ రసము; ప్రథమప్రవేశగీతే ద్వితీయ ప్రేక్షణకే వినియోగః = ప్రథమప్రవేశగీతమందు ద్వితీయ ప్రేక్షణమందు వినియోగము; షడ్జోదీచ్యవయాః షడ్జమధ్యమధైవతనిషాదాగ్రహాః అంశాశ్చ = షడ్జోదీచ్యవాకు షడ్జమధ్యమ ధైవతనిషాదములు గ్రహములు అంశములు; పంచస్వరపరస్తారః = పంచస్వరపరము తారము; న్యాసపరస్తత్పరో వా మంద్రః = న్యాసముగాని దానితరువాతిదిగాని మంద్రము; ఋషభహీనం షాడబం = రిషభహీనము షాడవము; ఋషభపంచమహీనమౌడుబితం = రిషబపంచమరహితమౌడువితము; పూర్ణావస్థాయాం ఋషభషడ్జగాంధార పంచమయోరల్పత్వం గాంధారస్య అంశత్వే ప్రాప్తౌ బాహుల్యం షాడబే పంచమస్య అల్పత్వం ఔడుబితేన కస్యాపి అల్పత్వం అశేషాణాం బహుత్వం మధ్యమో న్యాసః = పూర్ణావస్థయందు రిషభషడ్జగాంధార పంచమములకు అల్పత, గాంధారమునకు అంశత్వమురాగా బహుళత, షాడవమందు పంచమమునకుఅల్పత; ఔడుబితమందు దేనికి అల్పత లేదు, అన్నిటికి బహుత్వము,మధ్యమన్యాసము, ఋషభధైవతౌ అపన్యాసౌ = రిషభధైవతములు అపన్యాసములు; అంశానాం పరస్పరగమనం = అంశములకు అన్యోన్యగమనము; దశవిధత్వమస్యాః సప్తాంశక . . . తత్ర సప్తపూర్ణా పంచ షాడబాః పంచ ఔడుబగాంధార మూర్ఛనా తాలః పంచపాణిః = దశవిధత్వము దీనికి సప్తాశము. . . ... . .అందు ఏడు పూర్ణములు, ఐదు షాడవములు, ఐదు ఔడువములు, గాంధారమూర్ఛనా, తాలము పంచపాణి; ఏకకలేన చిత్రేణ మాగధీ = ఏకకలాచిత్రమార్గముచే మాగధీ గీతి; ద్వికలేన వార్త్తికే సంభావితా= ద్వికలావార్త్తికముచే సంభావితము; చతుష్కలేన దక్షిణేన పృథులా = చతుష్కలా

దక్షిణమార్గముచే పృథులాగీతి; రసౌ శృంగారహాస్యౌ = శృంగారహాస్యరసములు; ధ్రువాగానే ద్వితీయప్రేక్షణకే వినియోగః = ధ్రువాగానమందు ద్వితీయప్రేక్షణమున వినియోగము; షడ్జమధ్యమాయాః గ్రహాః అంశాశ్చ సప్తైవ స్వరాః = షడ్జమధ్యమమునకు సప్తస్వరనపరస్తారః = పంచస్వర పరమైనదితారము; న్యాసపరస్తాత్ పరో వా మంద్రః = న్యాసముకంటె తరువాతిదిగాని దానితరువాతిది గాని మంద్రము; నిషాదహీనా షాడబా = నిషాదరహితషాడవము; నిషాదగాంధార హీనా ఔడుబితా = నిషాదగాంధారరహితము ఔడుబితము; గ్రామావిరోధేన యథేష్టం సంచారః = గ్రామవిరోధములేకపోవుటచే స్వేచ్ఛాగమనము; పూర్ణావస్థాయాం నిషాదగాంధారయోః అల్పత్వం = పూర్ణావస్థయందు నిషాదగాంధారములకు అల్పత; షడ్జమధ్యమౌ న్యాసౌ = షడ్జమధ్యమములు న్యాసములుగా కలది; దశవిధత్వమస్యాః ఏతదంశకాశ్చత్వారః షాడబాః = దశ విధత్వము దీనికి, దీనికి నాల్గంశములు షాడబములు; తథైవ ధైవతేంశే షాడబానాం ఔడువితాశ్చ శుద్ధత్వం నాస్తి = అట్లే ధైవతాంశమందు షాడవములకు ఔడువితములు శుద్ధత్వములేదు; మధ్యమాదిమూర్ఛనా = మధ్యమాదిమూర్ఛన; తాలః పంచపాణిః = వంచ పాణితాలము; ఏకకలేన చిత్రేణ మాగధీ = ఏకకలాచిత్రమార్గముచే మాగధీగీతి; ద్వికలేన వార్తికేన సంభావితా = ద్వికలా వార్తికముచే సంభావితము; చతుష్కలేన దక్షిణేన పృథులా = చతుష్కలా దక్షిణమార్గముచే పృథులా గీతి; సర్వరసాత్మికా = నవరసాత్మకము; ధ్రువాగానే ద్వితీయప్రేక్షణకే వినియోగః = ధ్రువాగానమందు ద్వితీయప్రేక్షణమందు వినియోగము; ఏతాః షడ్జగ్రామసంబంధాః సప్తజాతయః = ఇవి షడ్జగ్రామసంబంధితములైన ఏడు జాతులు; ఇదానీం మధ్యమ గ్రామ సంబంధా జాతయః ఉచ్యంతే = ఇప్పుడు మధ్యమగ్రామసంబంధములైన జాతులు చెప్పబడుచున్నవి; తత్ర గాంధార్యా గాంధార షడ్జమధ్యమపంచమనిషాదా గ్రహాః త ఏవాంశాః = అందు గాంధారికి గాంధారషడ్జమధ్యమ పంచమనిషాదములు గ్రహములు; అవియే అంశములును; పంచస్వరపరస్తారః = పంచస్వరపరము తారము; న్యాసపరస్తత్పరోవా మంద్రః = న్యాసపరముగాని దానితరువాతిదిగాని మంద్రము; ఋషభహీనం షాడవం = రిషభరహితము షాడవము;

ఋషభధైవతహీనమౌడుబితం = రిషభధైవతరహితమౌడువితము; పూర్ణావస్థయాం ఋషభధైవతయోరల్పత్వం = పూర్ణావస్థయందు రిషభధైవతములకు అల్పత; శేషాణాం బహుత్వం = మిగిలిన వాటికి బహుత్వము; స్వరజాతిత్వాత్ గాంధారో న్యాసః = స్వరజాతిత్వమువలన గాంధారన్యాసము; షడ్జమధ్యమావపన్యాసౌ = షడ్జమధ్యమములు అపన్యాసములు; ధైవతర్షభయోః సంగతిః = ధైవతరిషభములకు సంబంధము; తద్యథా - గాంధారీ యదా సంపూర్ణా గీయతే తదా మాదారిగా ఇతి గాయంతీతి ప్రయోగః స్యాత్ = గాంధారి ఎప్పుడు సంపూర్ణముగా గానముచేయబడునో అప్పుడు మాదారిగా అనిగానముచేయుచున్నారని ప్రయోగమగును; యదా ఋషభహీనా గీయతే ధరస్వర ప్రవేశనం (?) మాధాధాగా ఇతి ప్రయోగః స్యాత్= రిషభహీనముగా గానముచేసినపుడు మాధాధాగా అని ధర స్వర ప్రయోగమగును; యదా ఔడుబితా గీయంతే ఉత్తర స్వర ప్రవేశే మాగాగా ఇతి ప్రయోగః స్యాత్ = ఎప్పుడు ఔడువితములు గానముచేయబడునో అప్పుడు ఉత్తరస్వరప్రవేశమందు మాగాగా అని ప్రయోగమగును; మాపరిధ ఇతి ప్రయోగః కదాచిదపి న స్యాత్= మాపరిధ అను ప్రయోగమెప్పుడును జరుగదు; దశ విధత్వమస్యాః ఏకాదశాంశకాః శుద్ధా వికృతాః పూర్ణాః పంచ చత్వారః షాడవాః ఔడబిత ఏకః మూర్ఛనా ధైవతాదిః చచ్చత్పుటః తాలః ఏకకలవిధః చిత్రమార్గే మాగధీ ద్వికలే వార్తికే సంభావితా చతుష్కలే దక్షిణే పృథులా రసః కరుణః మాత్రాదక్షిణే వార్తికే చిత్రే కలా ధ్రువాగానే తృతీయప్రేక్షణకే వినియోగః = దశవిధత్వము దీనికి 11 అంశముల శుద్ధములు వికృతములు పూర్ణములు5, షాడవములు4, ఔడుబితమొకటి, ధైవతాదిమూర్ఛన చచ్చత్పుటము తాలము; చిత్రమార్గమందేక కలా మాగధీగీతియు ద్వికలావార్తికమందు సంభావితము, చతుష్కలాదక్షిణమందు పృథులాగీతయు, కరుణరసము,దక్షిణ వార్తికమందు మాత్ర చిత్రమార్గమందు కళ, ధ్రువాగానమునందు తృతీయప్రేక్షణమందు వినియోగము;

రక్తగాంధార్యాః షడ్జమధ్యమపంచమగాంధారనిషాదగ్రహాః అంశాశ్చ = రక్తగాంధారికి షడ్జమధ్యమపంచమగాంధారనిషాదములు గ్రహములు అంశములును; పంచ స్వరపరస్తారః = పంచస్వరముతారము; న్యాసపరస్తత్పరో వా మంద్రః = న్యాసపరముగాని దానితరువాతిదిగాని మంద్రము; ఋషభహీనం

షాడవం = రిషభరహితషాడవము; ఋషభధైవతహీనమౌడుబితం = రిషభధైవతరహిత మౌడువితము; పూర్ణావస్థాయాం ఋషభధైవతయోరల్పత్వం శేషాణాం బాహుళ్యం = పూర్ణావస్థయందు రిషభధైవతములకు అల్పత; మిగిలినవాటికి బహుత్వము; నిషాదస్య అంశత్వాత్ అబహుత్వే ప్రాప్తే వచనాదబహుత్వం (?) = నిషాదమునకు అంశతవలన అల్పత్వే ప్రాప్తే వచనాత్ బాహుళ్యం = ధైవతమునకు అనంశతవలన అల్పత్వమురాగా వచనమువలన బహుళతయు; షాడవే ధైవతస్యాబాహుల్యం = షాడవమందు ధైవతముకు అల్పత; ఋషభస్య న కదాచిదపి = రిషభమునకు ఎప్పుడును అల్పత్వముండదు; ఔడుబితే సర్వేరషామంశత్వాన్నతస్యాల్పత్వం = ఔడుబితమందు అన్నిటికి అంశతవలన దానికి అల్పత్వము లేదు; ఉక్తభంగ్యా శేషాణాం బాహుళ్యం = చెప్పిన ప్రకారముగా మిగిలిన వాటికి బహుళత; న్యాసో గాంధార ఏవ చ = గాంధార న్యాసము; అపన్యాసస్తు మధ్యమ ఏవ = మధ్యమమే అపన్యాసము; షడ్జగాంధారయోస్తు సంచారః = షడ్జగాంధారములకు సంచారము; దశవిధత్వమస్యాః ద్వాదశాంశక్రమః = దశవిధత్వము దీనికి ద్వాదశాంశక్రమము; పూర్ణాః పంచ = పూర్ణములైదు; చత్వారః షాడబే = షాడబమందు నాల్గు; పంచాప్యంశే అపవాద = అపవాదులైదు అంశమందు; ఋషభాదిమూర్ఛనా = రిషభాది మూర్ఛన; కరుణో రసః = కరుణరసము; తాలః పంచపాణిః = పంచపాణి తాళము; ఏకకలే చిత్రే మాగధీ = ఏకకలాచిత్రమార్గమందు మాగధీ గీతి; ద్వికలే వార్తికే సంభావితా = ద్వికలావార్తికమందు సంభావితము;

**(షట్ అంశాః) సప్తస్వరాః షడ్జమధ్యమయా మిథశ్చ తే ॥**

**ప్రతిపదార్థము :** షడ్జమధ్యమాయాః = షడ్జమధ్యమకు; షట్ అంశాః = 6 అంశములు; సప్తస్వరాః = ఏడు స్వరములు; తే మిథః = అవి; పరస్పరము; నిరల్పః = బహుత్వము; అంశాంగాద్భతే = అంశాంగములు లేనిదే

**తాత్పర్యము :** షడ్జమధ్యమకు 6 అంశములు, ఏడు స్వరములు. అవి పరస్పర బహుత్వము; అంశాంగములులేనిదే

**సంగచ్ఛంతే నిరల్పోంశాంగాద్భతే వాదితాం వినా ।**
**నిలోపే నీగలోపే చ షాడవౌడబితే మతే ॥** 253

**ప్రతిపదార్థము** : వాదితాం వినా= వాదిత్వములేనిదే; సంగచ్ఛన్తే = సంయోజ్యమగుచున్నవి;నిలోపే = .నిషాదలోపమునందు, నీగలోపే = నిషాదగాంధారలోపమునందు; క్రమాత్ = వరుసగా; షాడవౌడుబితే మతే = షాడవ ఔడువితములు సమ్మతములు

**తాత్పర్యము** : వాదిత్వములేనిదే సంయోజ్యమగుచున్నవి. నిషాదలోపమునందు నిషాదగాంధారలోపమునందు వరుసగా షాడవ ఔడువితములసమ్మతములు.

**షాడవౌడవయోః స్యాతాం ద్విశ్రుతీ తు విరోధినౌ ।**
**గీతితాలకలాదీని షాడ్జీవన్మూర్ఛనా పునః ॥**
**మధ్యమాదిరిహ జ్ఞేయాః పూర్వవత్ వినియోజనమ్ ॥**

**ప్రతిపదార్థము** : షాడవౌడనయోః =షాడవ ఔడువములందు; ద్విశ్రుతీ విరోధినౌ స్యాతాం =ద్విశ్రుతికలములు విరోధినులగును; గీతితాలకలాదీని = గీతితాలము కలమొదలగునవి; షాడ్జీవత్ = షాడ్జివలెను; మూర్ఛనా పునః = మూర్ఛనమాత్రము; మధ్యమాదిః = మధ్యమాది; ఇహ = ఇందు; పూర్వవత్ = ముందువలె వినియోజన జ్ఞేయాః = వినియోగాదులు తెలియదగినవి

అస్యాం షడ్జమధ్యమౌ న్యాసౌ = ఇందు షడ్జమధ్యమములు న్యాసములు; సప్తస్వరాః అపన్యాసాః = సప్తస్వరములు అపన్యాసములు; ప్రస్తారః - మాగాసగప (ధప) మానిధనిమా (1) మామాసరీగరిని (ధ) పధాపా (2) మాగారీగామామా సాసా (3)। ధాగధపరిరిగగరిగ సధసధా । రిగరిగసాసా । సాసారిగరిగ (5)(?)। నిధధరీమమ మామామామా (6)। మాంమాం మగమమమ । పపధపనిమగ (7)। ధాపధపరిగమ గారిగస+ సగ (8); మామాధనిధసధపపమపాపా(9)। మామగమామా పధపమగమగస (10)। ధాగధపరిరిగగరిగసధస (11)। నిధసరిమగ మమామామామా । షడ్జమధ్యమా। స॥

**తాత్పర్యము** : షాడవ ఔడువములందు, ద్విశ్రుతికములు విరోధినులగును. గీతితాలము కలమొదలగునవి షాడ్జివలెను, మూర్ఛనమాత్రము మధ్యమాది, ఇందు ముందువలె వినియోగాదులు తెలియదగినవి.ఇందు షడ్జమధ్యమములు న్యాసములు, సప్తస్వరములు అపన్యాసములు.

గాంధారోదీచ్యవాయాం తు ద్వావంశౌ షడ్జమధ్యమౌ ॥ 255

రిలోపాత్ షాడవం జ్ఞేయం పూర్ణత్వేంశే తరాల్పతా ।
అల్పా నిధపగాంధారాః షాడవత్వే ప్రకీర్తితాః ॥ 256

రిధయోః సంగతిర్జ్ఞేయా ధైవతాదిశ్చ మూర్ఛనా ।
తాలశ్చత్పుటో జ్ఞేయః కలాః షోడశ కీర్తితాః ॥ 257

వినియోగో ధ్రువా గానే చతుర్థప్రేక్షణే మతః ।

ప్రతిపదార్థము : గాంధారోదీచ్యవాయాం = గాంధారోదీచ్యవయందు; షడ్జమధ్యమౌ ద్వౌ అంశౌ = షడ్జమధ్యమములు రెండంశములు; రిలోపాత్ షాడవంజ్ఞేయం = రిషభలోపమువలన షాడవముగా నెరుగవలెను; పూర్ణత్వే అంశే తరఅల్పతాః = పూర్ణతయందు అంశమందు మిక్కిలి అల్పత; షాడవత్వే నిధవగాంధారాః అల్పాః ప్రకీర్తితాః = షాడవమందు నిషాదధైవత పంచమగాంధారములల్పములు; రిధయోః సంగతిః = రిషభధైవతములకు సంగతి; ధైవతాదిః మూర్ఛనాః = ధైవతాది మూర్ఛన; తాలః చచ్చత్పుటః = చచ్చత్పుటతాలము; షోడశ కలాః కీర్తితాః = 16 కలలు చెప్పబడినవి; ధ్రువాగానే చతుర్థప్రేక్షణే వినియోగః మతః = ధ్రువాగానమందు చతుర్థప్రేక్షణమున వినియోగమిష్టము; అస్యాం మధ్యమో న్యాసః = ఇందు మధ్యమన్యాసము; షడ్జధైవతావపన్యాసౌ = షడ్జధైవతములు అపన్యాసములు; ప్రస్తారః = సాసాపామా పాధపమామా । ధాపామామా సాసాసాసా। ధానీసాసా మామాపాపా । నీనీనీనీనీనీనీనీ । మామాధానిస నీనీనీనీ । మాపామాపరిగాగాసాసా । గాగమపాపధ మాధనిపాపా । రిగసాసాధ నీనీధాధా । (గారిగసాసని)గారిగసాసా। సాసాసామా మనిధనీనీనీ । ధామా పాపాపరి గాగాసాసా । గాసాగాసా మాపామాప రిగా। గాగాగాగాగాగాసాసా। నీనిపాధా నీగాగాగా। నీనీధాపా ధాపామాపా। ధాపామామా మామామామా । గాంధారోదీచ్యవతీ । మ॥

తాత్పర్యము : గాంధారోదీచ్యవయందు షడ్జమధ్యమములు రెండంశములు రిషభలోపమువలన షాడవముగా నెరుగవలెను. పూర్ణతయందు అంశమందు మిక్కిలిఅల్పత, షాడవమందు నిషాదధైవతపంచమగాంధారములల్పములు. రిషభధైవతములకు సంగతి, ధైవతాది మూర్ఛన, చచ్చత్పుటతాలము, 16కలలు

చెప్పబడినవి. ధ్రువాగానమందు చతుర్థప్రేక్షణమున వినియోగమిష్టము. ఇందు మధ్యమన్యాసము, షడ్జధైవతములు అపన్యాసములు.

అంశాః స్యుః రక్తంగాంధార్యాం పంచ మ ర్షభవర్జితాః ॥ 258

రీమతిక్రమ్య సగయోః కార్యే సన్నిధిమేలనే ।
రిలోపరిధలోపాభ్యాం షాడబౌడవమిష్యతే ॥ 259

బహుత్వం నిధయోరంశః పంచమో ద్వేష్టి షాడబమ్ ।
ద్విషంత్యౌడుబితం షడ్జనిమపాః సంగతౌ సగౌ ॥ 260

పంచపాణ్యాది షాడ్జీవత్ ఋషభాదిస్తు మూర్ఛనా ।
తృతీయప్రేక్షణగతం ధ్రువాయాం వినియోజనమ్ ॥ 261

ప్రతిపదార్థము : రక్తగాంధార్యాం = రక్తగాంధారియందు; ధర్షభవర్జితాః పంచ అంశాః స్యుః = ధైవతరిషభరహితములైన 5 అంశములుండును; రింఅతిక్రమ్య= రిషభమునతిక్రమించి; సగయోః = షడ్జగాంధారములకు; సన్నిధిమేలనే కార్యే= సంగతిని చేయువలెను; రిలోపరిధలోపాభ్యాం = రిషభలోపముచేతను రిషభధైవతలోపముచేతను; క్రమేణ = క్రమముగా; షాడబౌడబం ఇష్యతే = షాడవౌడవితములు సమ్మతము; నిధయోః బహుత్వం = నిషాదధైవతములకు బహుత్వము; షాడబం = షాడబమును; పంచమః అంశః ద్వేష్టి = పంచమాంశము ద్వేషించును; షడ్జనిమపాః ఔడుబితం ద్విషంతి = షడ్జనిషాదమధ్యమపంచమములు ఔడువితమును ద్వేషించుచున్నవి; సగౌ సంగతౌ = షడ్జగాంధారములు సంగతములు; షాడ్జీవత్ పంచపాణ్యాది = పంచపాణ్యాది తాలాదులు షాడ్జీవలెనగును; ఋషభాదిస్తు మూర్ఛనా = రిషభాదిమూర్ఛన; తృతీయప్రేక్షణగతం ధ్రువాయాం వినియోజనం = ధ్రువాగానమందు తృతీయ ప్రేక్షణగతమైనది వినియోగము; తస్యాః గాంధారో న్యాసః = దానికి గాంధారము న్యాసము; మధ్యమోఽపన్యాసః = మధ్యమమపన్యాసము

తాత్పర్యము : రక్తగాంధారియందు ధైవతరిషభరహితములైన 5 అంశములుండును. రిషభమునతిక్రమించి షడ్జగాంధారములకు సంగతిని చేయువలెను. రిషభలోపముచేతను రిషభధైవతలోపముచేతను, క్రమముగా

షాడవౌడవితములు సమ్మతము. నిషాదధైవతములకు బహుత్వము. షాడబమును పంచమాంశము ద్వేషించును. షడ్జనిషాదమధ్యమపంచమములు ఔడువితమును ద్వేషించుచున్నవి. షడ్జగాంధారముల సంగతములు, పంచపాణ్యాదితాలాదులు షాడ్జివలెనగును. రిషభాదిమూర్ఛన. ధ్రువాగానమందు తృతీయప్రేక్షణగతమైనది వినియోగము. దానికి గాంధారము న్యాసము, మధ్యమమపన్యాసము.

ప్రస్తారః :- పానీ సాసా గాసాపానీ । సాంసాం పాపా మామాగాగా। మాపాధాపా మాపాధప (మ)గ। మామామామా మామామామా । ధానీపాపధధానీపాపా । మాంపా మాంపాపా పామా। రీగాం మాంపా పాపామాపా । రీగామాపా పాపామాపా। పాపాపాపా పాపా పాపా। రీగాంధాధా రీగాగాగా। గాపాపాధం ధానిధపాపా। మాపరిమాగా గాగాగాగా। రక్తగాంధారీ ॥

కైశిక్యాం ఋషభాన్యాంశా నిధావంశౌ యదా తదా ।
న్యాసః పంచమ ఏవ స్యాదన్యదో ద్విశ్రుతీ మతౌ ॥ 262

**ప్రతిపదార్థము** : కైశిక్యాం = కైశికియందు; ఋషభన్యాసా = రిషభన్యాసము; నిధౌ అంశౌ = నిషాదధైవతములు, అంశములు; యదా =ఎప్పుడగునో; తదా= అప్పుడు; పంచమః న్యాసః = పంచమన్యాసము; అన్యథా = అట్లుకానిచో; ద్విశ్రుతీ మతౌ = ద్విశ్రుతికములగును

**తాత్పర్యము** : కైశికియందు రిషభన్యాసము నిషాదధైవతములు అంశములు ఎప్పుడగునో అప్పుడు పంచమన్యాసము. అట్లుకానిచో ద్విశ్రుతికములగును.

అన్యేతు నిగపన్యాసా నిధయోరంశయోర్విదుః ।
రిలోపరిధలోపేన షాడవౌడబితం మతమ్ ॥ 263

**ప్రతిపదార్థము** : నిధయోః అంశయోః = నిషాదధైవతాంశములందు; అన్యే = మిగిలినవి; నిగపన్యాసాః = నిషాదగాంధార పంచమములు న్యాసములు అని తెలిసికొనిరి; రిలోపరిధలోపేన = రిషభలోపముచేతను రిషభధైవతలోపము చేతను; షాఢబవౌడవితం మతం = షడబ ఔడవితములు సమ్మతములు

**తాత్పర్యము** : నిషాదధైవతాంశములందు మిగిలినవి. నిషాదగాంధార పంచమములు న్యాసములు అనితెలిసికొనిరి. రిషభలోపముచేతను

రిషభధైవతలోపముచేతను, షాడబ ఔడవితములు సమ్మతములు.

**రిరల్పో నిపబాహుల్యం అంశానాం సంగతిర్మిథః ।**
**షాడబౌడుబితే ద్విష్టః క్రమాత్ పంచమధైవతౌ ॥ 264**

**ప్రతిపదార్థము :** రిరల్పః = రిషభాల్పము; నిపబాహుల్యం = నిషాదపంచమ బహుళత; అంశానాం మిధః సంగతిః = అంశములకన్యోన్యము సంయోగము; క్రమాత్ = క్రమముగా; పంచమధైవతౌ = పంచమధైవతములు; షాడబౌడుబితేద్విష్టః = షాడబౌడవములను ద్వేషించుచున్నవి

**తాత్పర్యము :** రిషభాల్పము, నిషాదపంచమబహుళత, అంశములకన్యోన్యము సంయోగము. క్రమముగా పంచమధైవతములు షాడబౌడవములను ద్వేషించుచున్నవి.

**షాడ్జీవత్ పంచపాణ్యాది గాంధారాదిస్తు మూర్ఛనా ।**
**పంచమప్రేక్షణగతం ధ్రువాయాం వినియోజనమ్ ॥ 265**

**ప్రతిపదార్థము :** షాడ్జీవత్ = షాడ్జీవలె; పంచపాణ్యాది = పంచపాణిమొదలగు తాళములు; గాంధారాది మూర్ఛనా = గాంధారాది మూర్ఛన; ధ్రువాయాం = ధ్రువయందు; పంచప్రేక్షణగతం వినియోజనమ్ = పంచప్రేక్షణగతమైన వినియోగము; అస్యాః గాంధారపంచమనిషాదా న్యాసాః = దీనికి గాంధారపంచమనిషాదములు న్యాసములు; రివర్జ్యాః షట్ సప్త వా అపన్యాసాః = రిషభత్యక్తములైన ఆరుస్వరములు గాని సప్తస్వరములుగాని అపన్యాసములు

**తాత్పర్యము :** షాడ్జీవలె పంచపాణిమొదలగు తాళములు, గాంధారాది మూర్ఛన, ధ్రువయందు పంచప్రేక్షణ గతమైన వినియోగము. దీనికి గాంధార పంచమనిషాదములు న్యాసములు. రిషభత్యక్తములైన ఆరుస్వరములుగాని సప్తస్వరములుగాని అపన్యాసములు.

ప్రస్తారః - పాధనిపాధని గాగా గాగా। పాపామాధని నిధపాపాపా । ధానీసాసారీంరీంరీంరీం । సాంసాంసాంరీం గామామామా । మాధానీధా (మా) ధామాపా । నిగరీసాధని రీరీరీరీ । గాంరీంసాంసాం పాధామామా। గాగాగామా మానీధనీనీ । గాగానీనీ గాగాగాగా। గాగానీనీ ధాపాపాపా। మాపామాపా

పాపామామా। ధామాగానిధానీనీగాగా। కైశికీ ।మ॥

**పంచమాంశాః సదా పూర్ణా మధ్యమోదీచ్యవా మతా ।**
**లక్ష్మ శేషం విజానీయాత్ గాంధారోదీచ్యవాగతమ్ ॥** 266

**మాధ్యమాదిర్మూర్ఛనా స్యాత్ తాలశ్చచ్చత్పుటో మతః ।**
**చతుర్ధస్య ప్రేక్షణకే ధ్రువాయాం వినియోజనమ్ ॥**

**ప్రతిపదార్థము** : మధ్యమోదీచ్యవా = మధ్యమోదీచ్యవ, పంచమాంశా = పంచమాంశము; సదా పూర్ణా = సర్వదా సంపూర్ణము; శేషం = మిగిలినది; గాంధారోదీచ్యవాగతం లక్ష్మ విజానీయాత్ = గాంధారోదీచ్యవకు సంబంధించినలక్షణముగా తెలియవలెను; మధ్యమాదిమూర్ఛనా = మధ్యమాది మూర్ఛన; తాలః చచ్చత్పుటః = చచ్చత్పుట తాలము; చతుర్ధస్య ప్రేక్షణకే = చతుర్ధమునకు ప్రేక్షణమందు; ధ్రువాయాం = ధ్రువయందు; వినియోజనం= వినియోగము; అస్యాః మధ్యమో న్యాసః = దీనికి మధ్యమన్యాసము; షడ్జధైవతౌ అపన్యాసౌ = షడ్జదైవతములు అపన్యాసములు

**తాత్పర్యము** : మధ్యమోదీచ్యవ పంచమాంశము, సర్వదా సంపూర్ణము. మిగిలినది గాంధారోదీచ్యవకు సంబంధించినలక్షణముగా తెలియవలెను. మధ్యమాది మూర్ఛన, చచ్చత్పుటతాలము, చతుర్ధమునకుప్రేక్షణమందు, ధ్రువయందు వినయోగము, దీనికి మధ్యమన్యాసము. షడ్జధైవతములు అపన్యాసములు.

ప్రస్తారః = పాధనినీనీ మామానీపా । రీరీరీగా సారిగగాగా । నీనీనీనీ (నీనీనీనీ)। నీనిధపమా నిధనిధపాపా। పాపారీరీ రీరీరీరీ। మారిగసాసధ నీనీనీనీ । సాపానీమా పాపాగాంగాం । గాపామాని ధానీనీసాసా । పాపామాధని పాపాపా। మాపామారిగ గాగాగాగా। గాపామాపా। నీనీనీనీ। మాపామాపరి గాగాగాగా। గాగాగామా మానిధనీనీ। నీనీధపమా నిధనిధపాపా। రీంగాంసాంగాం మానిధనీనీ। నీనీధాపా ధాపామామా। మధ్యమోదీచ్యవా । మ ॥

**కార్మారవ్యాం భవన్త్యంశా నిషాదరిపధైవతాః ।**
**బహవోఽ౦తరమార్గత్వాదనంశాః పరికీర్తితాః ॥** 268

**గాంధారోఽత్యంతబహులః సర్వాంశత్వం స్వసంగతైః ।**

చచ్చత్పుటః షోడశాత్ర కలాః షడ్జాది మూర్ఛనాః ॥ 269
పంచమస్య ప్రేక్షణస్య ధ్రువాయాం వినియోజనమ్ ।

**ప్రతిపదార్థము** : కార్మారవ్యాం = కార్మారవియందు; నిషాదరిపధైవతాః అంశాః = నిషాదరిషభ పంచమ ధైవతములంశములు; అంతరమార్గత్వాత్ = అంతర మార్గము వలన; బహవః అనంశాః పరికీర్తితాః = అనేకములు అనంశములుగా చెప్పబడినవి; గాంధారః అత్యంతబహులః = గాంధారము మిక్కిలిఅధికము; స్వసంగత్తైః సర్వాంశత్వం = స్వసంగతములచే సర్వాంశత్వము; చచ్చత్పుటః = చచ్చత్పుటతాలము; అత్ర షోడశ కలాః = ఇక్కడ 16 కలలు; షడ్జాదిమూర్ఛనాః= షడ్జాది మూర్ఛనలు; ధ్రువాయాం = ధ్రువయందు; పంచమస్య ప్రేక్షణస్య వినియోగః = పంచమ ప్రేక్షణముయొక్కవినియోగము; అస్యాం పంచమో న్యాసః = ఇందు పంచమన్యాసము; అంశా ఏవాపన్యాసః = అంశములే అపన్యాసము

**తాత్పర్యము** : కార్మారవియందు నిషాదరిషభపంచమ ధైవతములంశములు. అంతర మార్గమువలన అనేకములు అనంశములుగా చెప్పబడినవి. గాంధారము మిక్కిలి అధికము. స్వసంగతములచే సర్వాంశత్వము. చచ్చత్పుటతాలము. ఇక్కడ 16 కలలు, షడ్జాదిమూర్ఛనలు, ధ్రువయందు పంచమప్రేక్షణముయొక్క వినియోగము. ఇందు పంచమ న్యాసము అంశములే అపన్యాసములు.

ప్రస్తారః - రీరీరీరీరీరీరీరీ। మాం గాం సాం గాం సా నీనీనీనీ। నీమానీమాపా (పాగాగా)। గాపామాపా నీనీనీనీ। రీంగాసానీ రీంగాంరీంగాం। రీగారీసా నిధనీపాపా। మాపామాపరి గాగాగాగా। రీంరీంగాం సమమామాపాపా। మాపామాపరి గాగాగాగా ।ధానీపామా ధానీసాసా। నీనీనీనీ నీనీనీనీ। మామాధానీ నీధాపాపా। మాపామాపరి గాగాగాగా। నీనీపాధని గాగాగాగా। సారీమాసా నీనీనీనీ। నీనీధాపా పాపాపాపా। కార్మారవీ ।మ॥

అంశో గాంధారపంచమ్యాం పంచమః సంగతిః పునః ॥ 270
కర్తవ్యాత్రాపి గాంధారీపంచమ్యోరివ సూరిభిః ।
చచ్చత్పుటః షోడశాత్ర కలా గాదిశ్చ మూర్ఛనా ॥ 271
తుర్యప్రేక్షణసంబంధి ధ్రువాగానే నియోజనమ్ ।

**ప్రతిపదార్థము** : గాంధారపంచమ్యాం పంచమః అంశః = గాంధారపంచమము

పంచమిలో అంశము; సంగతి: = సంయోగము; అత్రాపి = ఇందుకూడా; గాంధారీ పంచమ్యోరివ = గాంధారిపంచమిలవలె; కర్తవ్యా = చేయదగినది; చచ్చత్పుటః = చచ్చత్పుటతాలము; షోడశకలాః = 16 కలలు; గాదిః మూర్ఛనా = గాంధారాది మూర్ఛన; ధ్రువాగానే = ధ్రువాగానమున; తుర్యప్రేక్షణ సంబంధి; నియోనజం = చతుర్ధప్రేక్షణమున నియోగము; అస్యాం గాంధారోన్యాసః = ఇందు గాంధారము న్యాసము; ఋషభపంచమౌ అపన్యాసౌ = రిషభ పంచమములు అపన్యాసములు

**తాత్పర్యము** : గాంధార పంచమిలో పంచమము అంశము. సంయోగము ఇందుకూడా గాంధారి, పంచమిలవలె చేయదగినది చచ్చత్పుటతాలము 16 కలలు గాంధారాది మూర్ఛన. ధ్రువాగానమున చతుర్ధ ప్రేక్షణమున నియోగము, ఇందు గాంధారము న్యాసము. రిషభపంచమములు అపన్యాసములు.

ప్రస్తారః - పామపమధన ధపమాధానీ। సనిధాపాపాపాపాపా। ధానీసాసా మామా పాపా। నీనీనీనీ నీనీనీనీ । నీనీధపమా నిధనిధపాపా। పాపారీరీ రీరీపాపా। మారిగసాసధ నీనీనీనీ। నీరీసారిస రీరీరీరీ। నీగాసానిగ సానీనీనీ। నీమాం నీమాం పాపాగాంగాం। గాంపామాంపా నీనీనీనీ। మాపామాపరి గాగాగాగా। నీనీపాధా నీగాంగాంగాం। నీనీనీనీ నీనీనీనీ। మాంమాంధానీ సనిధపాపా। మాంపాం మాంపరి। గాంగాంగాంగాం। గాంధార పంచమీ॥

**అంధ్ర్యామంశా నిరగపా రిగయోర్నిధయోస్తథా ॥ 272**

**సంగతిర్న్యాసపర్యంతమంశానుక్రమతో వ్రజేత్ ।**
**షాడవం షడ్జలోపేన మధ్యమాదిశ్చ మూర్ఛనా ॥ 273**

**పూర్వవత్తు కలాతాలవినియోగాః ప్రకీర్తితాః ।**

**ప్రతిపదార్థము** : అంధ్ర్యాం = అంధ్రియందు; నిరగాపాః అంశాః = నిషాదరిషభ గాంధార పంచమములు అంశములు; రిగయోః నిధయోః సంగతిః = రిషభగాంధారములకు నిషాదధైవతములకు సంగతి; న్యాసపర్యన్తం = న్యాస పర్యంతము; అంశానుక్రమతః వ్రజేత్ = అంశముననుసరించి వెళ్లును; (పొందును); షడ్జలోపేన షాడవం = షడ్జరహితముచే షాడవము; మధ్యమాదిః

మూర్ఛనా = మధ్యమాది మూర్ఛన; కలాతాలవినియోగాః = కళాతాళ వినియోగములు; పూర్వవత్ ప్రకీర్తితాః = పూర్వము వలె చెప్పబడినవి; అస్యాం గాంధారో న్యాసః = ఈ ఆంధ్రియందు గాంధారన్యాసము; మధ్యమపంచమావపన్యాసౌ = మధ్యమ పంచమములు అపన్యాసములు

**తాత్పర్యము** : ఆంధ్రియందు నిషాదరిషభగాంధారపంచమములు అంశములు. రిషభగాంధారములకు నిషాదధైవతములకుసంగతి. న్యాస పర్యంతము, అంశముననుసరించివెళ్ళును (పొందును) షడ్జరహితముచే షాడవము. మధ్యమాది మూర్ఛన. కళాతాళ వినియోగములు పూర్వము వలె చెప్పబడినవి. ఇందు గాంధారన్యాసము. మధ్యమపంచమములు అపన్యాసములు

ప్రస్తారః- గారీరీరీ రీరీరీరీ। రీగారీగా రీరీరీరీ। రీరీగాగా రీరీమామా। రీగాసాధని నీంనీంనీంనీం। నీంరీంనీంరీం ధనిధనిపాపా। మాపామారిగ గాగాగాగా। రీరీగానమమామాపాపా। మాపామారిగగాగాగాగా। ధానీగాగా గాగాగాగా। పాపామారిగ గాగాగాగా। నీనీనీనీరీరీరీరీ। రీరీమానీ సాసానీనీ। పాపామాగరి గాగాగాగా। రీరీగానమ మామాపాపా। మామానీనీసారీగాపా। రిగగాగాగా గాగాగాగా। అంధ్రీ। మ॥

**నందయంత్యాం పంచమోఽంశో గాంధారస్తుగ్రహః స్మృతః ।**
**కైశ్చిత్తు పంచమః ప్రోక్తో గ్రహోఽస్యాంగీతవేదిభిః ॥**

**మంద్రర్షభస్య బాహుళ్యం షాడవం షడ్జలోపతః ।**
**హృష్యనామూర్ఛనా తాలః పూర్వవత్ ద్విగుణాః కలాః ॥**
**వినియోగోధ్రువాగానే ప్రథమప్రేక్షణే భవేత్ ॥**

**ప్రతిపదార్థము** : నందయంత్యాం = నందయంతియందు; పంచమః అంశః = పంచమాంశము; గ్రహః గాంధారః= గాంధారగ్రహము; కైశ్చిత్గీతవేదిభిః = కొందరు సంగీతజ్ఞులచే; అస్యాం = దీనియందు; పంచమః గ్రహః ప్రోక్తః = పంచమగ్రహమని చెప్పబడినది; షడ్జలోపతః షాడవం = షడ్జరాహిత్యమువవలన షాడవము; హృష్యనామూర్ఛనా పూర్వవత్తాలః =ముందుదానికివలె తాలము; కలాద్విగుణాః = కళలు ద్విగుణితములు; ధ్రువగానే ప్రథమప్రేక్షణే వినియోగః= ధ్రువాగానము ప్రథమప్రేక్షణమందువినియోగము; అస్యాం గాంధారోన్యాసః =

ఇందు గాంధారన్యాసము; మధ్యమపంచమావపన్యాసౌ = మధ్యమపంచమములు అపన్యాసము

**తాత్పర్యము** : నందయంతియందు పంచమాంశము గాంధారగ్రహము. కొందరు సంగీతజ్ఞులచే దీనియందు పంచమగ్రహమని చెప్పబడినది. షడ్జరాహిత్యమువలన షాడవము ముందుదానికివలె తాలము. కళలుద్విగుణతములు ధ్రువాగానమున ప్రథమప్రేక్షణమందు వినియోగము. ఇందు గాంధారన్యానము మధ్యమపంచమమలు అపన్యాసములు.

ప్రస్తారః - గాగాగాగా పాపాధపమ। ధాధాధా ధనీసనిధా । పాపాపాపా పాపాపా। ధానీమాపా గాంగాంగాంగాం। మారీగాగా గాగాగాగా। మాపామాపా ధాధనిపాపా। ధానీమాపా గాగాగాగా। మపాపాపా మామాగాగా। ధానీమాపా గాగాగాగా। మామామామా మామామామా। రీగామాపా పామపాపానీ। రీరీరీరీ పాపామామా। ధానీసనిధా పాపాపాపా। ధానీమాపా గాగాగాగా। గాపాపాపా ధామాగామా। ధాధానిధా పాపాపాపా। రీగామాపా పమపాపామ । రీరీరీరీ పాపాపాపా। పాపాపాపా ధామామామా। నిపాగాగమ గాంగాంగాంగాం। రీంరీంగాగా మామామామా। నీపానీమా నీధాపాపా। సాసాధనిధా పాపాపాపా। మాపా(మా) పా(రిగ) గాగాసాంసాం। రీరీగాగా మామాపామా। రీంరీంరీంగా । మారిగమా (మా)। మానీపానీ గాగాగాగా। మామాపాపా ధాధనినిధమా। ధాధాసానీ ధానీపాపా। రీంరీంరీంరీం మాపాధామా। నీనీనీనీ ధాపామామా। మాపరిగాగాగాగాగాగా। నందయంతీ । మ ॥

> **భం జ్యోతిస్తద్రతో హంసః తస్మాత్ తం భరతం విదుః ।**
> **తద్భవం భరతజ్ఞానం తద్భవా భారతీ శుభా ॥** 277
>
> **కిముచ్యతే రాగశబ్దేన కిం వా రాగస్య లక్షణమ్ ।**
> **వ్యుత్పత్తిలక్షణం తస్య యథావద్ వక్తుమర్హసి ॥** 278

**ప్రతిపదార్థము** : భం = నక్షత్రము; జ్యోతిః = జ్యోతిస్వరూపము; హంసః తద్రతః = పరమాత్మ ఆజ్యోతిస్వరూపమందు రమించువాడు; తస్మాత్ = అందువలన; తం = ఆపరమాత్మను; భరతం విదుః = భరతునిగా తెలియుదురు; తద్భవం భరతజ్ఞానం = భరతజ్ఞానము ఆపరమాత్మనుండి పుట్టినది; శుభా =

మంగళప్రధమైన; భారతీ = వాక్కు(సరస్వతి); తద్భవా = దానినుండిపుట్టినది; రాగశబ్దేన కిం ఉచ్యతే = రాగశబ్దముచే నేమిచెప్పబడుచున్నది? రాగస్య లక్షణం కిం = రాగమునకు లక్షణమేమి? వ్యుత్పత్తిలక్షణం = వ్యుత్పత్తి లక్షణమును; యధావత్ = యథాశాస్త్రముగా (ఉన్నదున్నట్లుగా); వక్తుం అర్హసి = చెప్పుటకు తగియున్నావు; మతంగ ఉవాచ = మంతగమహర్షి చెప్పుచున్నాడు

**తాత్పర్యము** : నక్షత్రము జ్యోతిస్వరూపము. పరమాత్మ ఆజ్యోతిస్వరూపమందు రమించువాడు. అందువలన ఆపరమాత్మను భరతునిగా తెలియుదురు. భరతజ్ఞానము ఆపరమాత్మనుండి పుట్టినది. మంగళప్రదమైన వాక్కు (సరస్వతి) దానినుండి పుట్టినది. రాగశబ్దముచే నేమిచెప్పబడినది? రాగమునకు లక్షణమేమి? వ్యుత్పత్తిలక్షణమును యథాశాస్త్రముగా (ఉన్నదున్నట్లుగా) చెప్పుటకు తగియున్నావు. మంతగ మహర్షి చెప్పుచున్నాడు.

**రాగమార్గస్య యద్రూపం యన్నోక్తం భరతాదిభిః ।**
**నిరూప్యతే తదస్మాభిః లక్ష్యలక్షణసంయుతమ్ ॥** 279

ప్రతిపదార్థము : రాగమార్గస్య యత్ రూపం = రాగమార్గమునకు ఏరూపముకలదో; భరతాదిభిః = భరతాదులచే; యన్నోక్తం = ఏదైతే చెప్పబడలేదో; తత్ = అది; అస్మాభిః = మాచేత; లక్ష్యలణసంయుతం = లక్ష్యలక్షణసహితముగా; నిరూప్యతే = నిరూపింపబడుచున్నది; తత్రాదౌ = అందు మొదట

**తాత్పర్యము** : రాగమార్గమునకు ఏరూపముకలదో భరతాదులచే ఏదైతే చెప్పబడలేదో అది మాచేత లక్ష్యలక్షణసహితముగా నిరూపింప బడుచున్నది. అందు మొదట

**స్వరవర్ణవిశేషేణ ధ్వనిభేదేన వా పునః ।**
**రజ్యతే యేన యః కశ్చిత్ స రాగః సమ్మతః సతామ్ ॥** 280

**ప్రతిపదార్థము** : స్వరవర్ణవిశేషేణ = స్వరవర్ణవిశేషముచేతను గాని; ధ్వనిభేదేన వా = ధ్వనిభేదముచేతనుగాని; యేన = దేనిచేతను; యః కశ్చిత్ రజ్యతే = ఏవ్యక్తియైనను రంజింపజేయబడునో; సః = అది; సతాం మతే = పెద్దల మతమున; రాగః **ఇతి** సమ్మతః = రాగమనియంగీకరింపబడినది; అథవా =లేక

**తాత్పర్యము** : స్వరవర్ణవిశేషముచేతను గాని, ధ్వనిభేదముచేతనుగాని దేనిచేతను ఏవ్యక్తియైనను రంజింపజేయబడునో అది పెద్దలమతమున రాగమనియంగీకరింపబడినది. లేక

**యోఽసౌ ధ్వనివిశేషస్తు స్వరవర్ణవిభూషితః ।**
**రంజకో జనచిత్తానాం స చ రాగ ఉదాహృతః ॥** 281

**ప్రతిపదార్థము** : స్వరవర్ణవిభూషితః = స్వరవర్ణములతో అంలంకృతమైన; యః అసౌ ధ్వనివిశేషః = ఏధ్వని విశేషము; జనచిత్తానాం రంజకః = ప్రజల మనస్సులను రంజింపజేయునో; సః = అది; రాగః ఉదాహృతః = రాగముగా ఉదహరింపబడినది

**తాత్పర్యము** : స్వరవర్ణములతో అలంకృతమైన ఏధ్వని విశేషము ప్రజల మనస్సులను రంజింపజేయునో అది రాగముగా ఉదహరింపబడినది.

**సామాన్యం చ విశేషంచ లక్షణం ద్వివిధం మతమ్ ।**
**చతుర్విధం తు సామాన్యం విశేషశ్చాంశకాదికమ్ ॥** 282

**ప్రతిపదార్థము** : సామాన్యం విశేషంచ లక్షణం ద్వివిధం మతం = సామాన్యము విశేషము అని లక్షణము రెండు విధములైనది; సామాన్యం చతుర్విధం = సామాన్యము నాల్గువిధములైనది; విశేషశ్చ అంశకాదికం = అంశకాదులు విశేషము

**తాత్పర్యము** : సామాన్యము విశేషము అనిలక్షణము రెండు విధములైనది. సామాన్యము నాల్గువిధములైనది. అంశకాదులు విశేషము

**ఇత్యేవం రాగశబ్దశ్య వ్యుత్పత్తి రభిధీయతే ।**
**రంజనాజ్జాయ తే రాగో వ్యుత్పత్తిః సముదాహృతా ॥** 283

**ప్రతిపదార్థము** : ఇతి ఏవం = ఈవిధముగా; రాగశబ్దస్య = రాగశబ్దమునకు; వ్యుత్పత్తిః అభిధీయతే = వ్యుత్పత్తి చెప్పబడుచున్నది; రంజనాత్ = రంజనమువలన; రాగః జాయతే ఇతి = రాగము పుట్టుచున్నదని; వ్యుత్పత్తిః సముదాహృతా = వ్యుత్పత్తి చెప్పబడినది

**తాత్పర్యము :** ఈవిధముగా రాగశబ్దమునకు వ్యుత్పత్తి చెప్పబడుచున్నది. రంజనమువలన రాగము పుట్టుచున్నదని వ్యుత్పత్తి చెప్పబడినది.

**అశ్వకర్ణాదివద్రూఢో యౌగికో వాపి వాచకః ।**
**యోగరూఢోఽథవారాగో జ్ఞేయః పంకజశబ్దవత్ ॥ 284**

**ఇదానీం సంప్రవక్ష్యామి సప్తగీతీర్మనోహరాః ।**
**ప్రథమా శుద్ధగీతిః స్యాత్ ద్వితీయా భిన్నకా భవేత్ ॥ 285**

**తృతీయా గౌడికా చైవ రాగగీతిశ్చతుర్థికా ।**
**సాధారణీ తు విజ్ఞేయా గీతిజ్ఞైః పంచమీ తథా ॥ 286**

**భాషాగీతిస్తు షష్ఠీ స్యాత్ విభాషాచైవ సప్తమీ ।**
**సప్తగీత్యో మయాప్రోక్తా ఇదానీం భేద ఉచ్యతే ॥ 287**

**ప్రతిపదార్థము :** అశ్వకర్ణాది వత్ = అశ్వకర్ణమువలె; వాచకః = వాచకము; యౌగికః = యౌగికము; రూఢః అపి = రూఢమునుఅగుచున్నది; అథవా = లేక; పంకజశబ్దవత్ = పంకజశబ్దమువలె; యోగరూఢః జ్ఞేయః = యోగరూఢముగ తెలియదగినది; ఇదానీం = ఇప్పుడు; మనోహరాః సప్తగీతీః సంప్రవక్ష్యామి = అందములైన సప్తగీతులను చెప్పుదును; ప్రథమాశుద్ధ గీతిఃస్యాత్ = మొదటిది శుద్ధగీతి; ద్వితీయా భిన్నకా భవేత్ = రెండవది భిన్నకము; తృతీయా గౌడికా = మూడవది గౌడిక; చతుర్థికారాగగీతిః = నాల్గవది రాగగీతి; పంచమీ సాధారణీ విజ్ఞేయా = ఐదవది సాధారణి; షష్ఠీ స్యాత్ భాషాగీతిః = ఆరవది భాషాగీతి; సప్తమీ విభాషా = ఏడవది విభాష; మయా సప్తగీత్యః ప్రోక్తాః = నాచే సప్తగీతులు చెప్పబడినవి; ఇదానీం భేద ఉచ్యతే = ఇప్పుడు భేదము చెప్పబడుచున్నది

**తాత్పర్యము :** అశ్వకర్ణమువలె వాచకము యౌగికము రూఢము అగుచున్నది. పంకజశబ్దమువలె యోగరూఢముగ తెలియదగినది. ఇప్పుడు అందములైన సప్తగీతులను చెప్పుదును. మొదటిది శుద్ధగీతి, రెండవది భిన్నకము, మూడవది గౌడిక, నాల్గవది రాగగీతి, ఐదవది సాధారణి, ఆరవది భాషాగీతి, ఏడవది విభాష. నాచే సప్తగీతులు చెప్పబడినవి. ఇప్పుడు భేదముచెప్పబడుచున్నది.

**గీతయః పంచ విజ్ఞేయాః శుద్ధా భిన్నాథ వేసరా ।**

**గౌడా సాధారితా ప్రోక్తా యాష్టికేన మహాత్మనా ॥** 288

**ప్రతిపదార్థము** : యాష్టికేన మహాత్మనా = యాష్టికునిచే; ప్రోక్తాః = చెప్పబడిన; గీతయః = గీతులు; శుద్ధాః భిన్నాః వేసరాః గౌడా సాధారితా ఇతి పంచవిజ్ఞేయాః = శుద్ధములు భిన్నములు వేసరములు గౌడములు సాధారితములు అని ఐదు విధములుగా తెలియదగినవి; ఇతితేషాం లక్షణముచ్యతే దుర్గశక్తిమతం = ఇట్టి లక్షణము దుర్గ శక్తిమతమున చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : యాష్టికునిచే చెప్పబడిన గీతులు శుద్ధముల భిన్నములు వేసరములు గౌడములు సాధారితములు అని ఐదు విధములుగా తెలియదగినవి. ఇట్టి లక్షణము దుర్గశక్తిమతమున చెప్పబడుచున్నది.

**"ప్రథమా మాగధీ జ్ఞేయా ద్వితీయా చార్ధమాగధీ ।**
**సంభావితా తృతీయా చ చతుర్ధీ పృథులా మతా ॥"**

ఇతి భరతమతే -

**ప్రతిపదార్థము** : ప్రథమా మాగధీ = మొదటిది మాగధి; ద్వితీయా అర్ధమాగధీ= రెండవది అర్ధమాగధి; తృతీయా సంభావిత = మూడవది సంభావితా; చతుర్ధీ పృథులా = నాల్గవది పృథుల; ఇతి = అని, భరతమతే = భరతమతమందు

**తాత్పర్యము** : మొదటిది మాగధి, రెండవది అర్ధమాగధి, మూడవది సంభావిత, నాల్గవది పృథుల అని భరతమతమందు

**భాషా చైవ విభాషాచ తథా చాంతరభాషికా ।**
**తిస్రస్తు గీతయః ప్రోక్తా యాష్టికేన మహాత్మనా ॥** 289

**ప్రతిపదార్థము** : భాషా = భాషాగీతి; విభాషా చ = విభాషాగీతియు; అంతరభాషికా ఇతి = అంతరభాషికాగీతియని; తిస్రః గీతయః = మూడు గీతులు; యాష్టికేన మహాత్మనా = మహాత్ముడైన యాష్టికునిచే; ప్రోక్తాః = చెప్పబడినవి

**తాత్పర్యము** : భాషాగీతి విభాషాగీతి అంతరభాషికాగీతియని మూడు గీతులు మహాత్ముడైన యాష్టికునిచే చెప్పబడినవి.

**భాషాగీతిర్విభాషా చ మతంగేనాప్యుదాహృతా ।**
**భాషాగీతిస్తథైకైవ శార్దూలమతసమ్మతా ॥** **290**

**ప్రతిపదార్థము :** భాషాగీతిః = భాషాగీతియు; విభాషాచ = విభాషాగీతియు; మతంగేన అపిఉదాహృతా = మతంగమునిచే కూడ చెప్పబడినది; తథా = అట్లే; భాషాగీతిః ఏకా ఏవ = బాషాగీతి ఒక్కటియే; శార్దూలమతసమ్మతా = శార్దూలమతమందిష్టము

**తాత్పర్యము :** భాషాగీతియు విభాషాగీతియు మతంగమునిచే కూడ చెప్పబడినది. అట్లే భాషాగీతి ఒక్కటియేశార్దూలమతమందిష్టము.

**ఇదానీం సంప్రవక్ష్యామి రాగలక్షణముత్తమమ్ ।**
**మంద్రా మంద్రైశ్చ తారైశ్చ ఋజుభిర్లలితైః సమైః ॥** **291**
**స్వరైశ్చ శ్రుతిభిః పూర్ణా చోక్షా గీతిరుదాహృతా ।**
**సూక్ష్మైశ్చ ప్రచలైర్వక్రైరుల్లసీత ప్రసారితైః ॥** **292**

**ప్రతిపదార్థము :** ఇదానీం ఇప్పుడు; ఉత్తమం రాగలక్షణం = ఉత్తమమైన రాగలక్షణమును; సంప్రవక్ష్యామి = చెప్పుదును; మంద్రా = మంద్రము; మంద్రైః = మంద్రములైనట్టియు; తారైః = తారములైనట్టియు; ఋజుభిః = ఋజువైనట్టియు; లలితైః = లలితములైనట్టియు; సమైఃస్వరైః= సమములచేతను, స్వరములచేతను; శ్రుతిభిః = శ్రుతులచేతను; పూర్ణా = సంపూర్ణమైన; చోక్షాగీతిః ఉదాహృతా = ఛోక్షగీతి చెప్పబడినది; సూక్ష్మైః = సూక్ష్మములైనట్టియు; ప్రచలైః = చలితములైనట్టియు; వక్రైః = వక్రములైన; ప్రసారితైః = ప్రసారితములచే; ఉల్లసీత= ప్రకాశించును(?)

**తాత్పర్యము :** ఇప్పుడు ఉత్తమమైన రాగలక్షణమును చెప్పుదును. మంద్రము, మంద్రములైనట్టియు, తారములైనట్టియు, ఋజువులైనట్టియు, లలితములైనట్టియు, సమములచేతను శ్రుతులచేతను, సంపూర్ణమైన ఛోక్షగీతిచెప్పబడినది. సూక్ష్మములైనట్టియు, చలితములైనట్టియు, వక్రములైన ప్రసారితములచే ప్రకాశించును.

**లలితైస్తారమంద్రైశ్చ భిన్నాగీతిరుదాహృతా ।**

**ఓహాలలితైశ్చాపి త్రయో గౌడాశ్చ శోభనాః ॥** 293

**ప్రతిపదార్థము :** లలితైః = లలితములచేతను; తారమంద్రైః = తారమంద్రములచేతను; భిన్నాగీతిః ఉదాహృతా = భిన్నగీతిచెప్పబడినది; ఓహాలలితైః = ఓహాల లలితములచే; శోభనాః = మంగళప్రదములైన; త్రయః గౌడాః ఉక్తాః = మూడుగౌడలు చెప్పబడినవి

**తాత్పర్యము :** లలితములచేను తారమంద్రములచేతను భిన్నగీతిచెప్పబడినది. ఓహాలలలితములచే మంగళప్రదములైన మూడు గౌడలు చెప్పబడినవి.

**హకారోకారయోర్యోగాదోహాలీ పరికీర్తితా ।**
**చిబుకం హృదయే న్యస్య ఓహాడీ మంద్రజా భవేత్ ॥** 294

**ప్రతిపదార్థము :** హకార ఉకారయోః యోగాత్ = హకార, ఉకారసంబంధము వలన; ఓహాలీ పరికీర్తితా = ఓహాలి చెప్పబడినది; చిబుకం = చిబుకమును; హృదయే న్యస్య = హృదయమందుంచి; ఓహాడీమంద్రజా భవేత్ = ఓహాడి మంద్రజనితమగును

**తాత్పర్యము :** హకార ఉకారసంబధమువలన ఓహాలి చెప్పబడినది. చిబుకమును హృదయమందుంచి ఓహాడి మంద్రజనితమగును.

**ద్రుతా ద్రుతతరా కార్యా సహ కంపేన పీడితా ।**
**ఓహాడీ లలితా చాపి దృష్టాదృష్టేన పాణినా ॥** 295

**ప్రతిపదార్థము :** కంపేన సహపీడితా = కంపముచే పీడితమైన; ద్రుతా ద్రుతతరా కార్యా = ద్రుతము ద్రుతతతరము చేయదగినది; ఓహాడీ, లలితా, చాపి = ఓహాడి లలితకూడ; దృష్టాదృష్టేన పాణినా = దృష్టాదృష్టపాణిచేత; కార్యా = చేయదగినది

**తాత్పర్యము :** కంపముచే పీడితమైన ద్రుతము, ద్రుతతరము చేయదగినది. ఓహాడి లలితకూడ దృష్టాదృష్టపాణి చేయదగినది.

**త్రిస్థానకరణైర్యుక్తా స్వస్థానచలానాకులా ।**
**చతుర్విధా తథాహాడీ కర్తవ్యా గేయవేదిభిః ॥** 296

**ప్రతిపదార్థము** : త్రిస్థానకరణైః యుక్తా = త్రిస్థానకరణములతో కూడినదియు; స్వస్థాన చలనాకులా = స్వస్థానమందు చలనము ఆకులము అయినదియు; ఓహాడీ= ఓహాడి; చతుర్విధా కర్తవ్యా = నాల్గువిధములుగా చేయబడవలెను

**తాత్పర్యము** : త్రిస్థానకరణములతో కూడినదియు స్వస్థానమందుచలనము ఆకులము అయినదియు ఓహాడి నాల్గువిధములుగా చేయబడవలెను

**సమాక్షరా సమా చైవ కార్యారోహావరోహిణీ ।**
**అవిశ్రమేణ త్రిస్థానే గౌడీ గీతిరుదాహృతా ॥** 297

**ప్రతిపదార్థము** : సమాక్షరా , సమా , ఆరోహిణీ, అవరోహిణీ, ఇతి = అని; కార్యా = చేయదగినది; త్రిస్థానే = త్రిస్థానములందు; అవిశ్రమేణ = విశ్రమములేకనే; గౌడీ గీతిః ఉదాహృతా = గౌడీ గీతి చెప్పబడినది

**తాత్పర్యము** : సమాక్షరా, సమా, ఆరోహిణీ, అవరోహిణీ అని చేయదగినది. త్రిస్థానములందు విశ్రమములేకనే గౌడీగీతి చెప్పబడినది.

**ప్రయోగైశ్చ ద్రుతైః కార్యా మిశ్రై శ్చ మాలవైః ।**
**ఈషత్ ప్రకంపితైః కించిద్వలితైస్తారదీపితైః ॥ 298 ॥**

**సోచ్ఛ్వాసైః ఖండఖండైశ్చ భిన్నా గీతిరుదాహృతా ।**
**+ + + + + ++ +ఓహాడీ పరిగీయతే ॥ 299 ॥**

**ప్రతిపదార్థము** : ప్రయోగైః = ప్రయోగములచేతను; ద్రుతైః = ద్రుతములచేతను; మిశ్రామిశ్రై = మిశ్రామిశ్రములైన; మాలవైః = మాలవములచేతను; ఈషత్ ప్రకంపితైః = కొంచెము చలితములచేతను; కించిత్ వలితైః = కొంచెము వక్రములైనట్టియు; తారదీపితైః = తారముచే ప్రకాశించునట్టివియు; సోచ్ఛ్వాసైః = ఉచ్ఛ్వాస సహితములును అయిన; ఖండఖండైశ్చ = ఖండఖండములచే; భిన్నా గీతిః = భిన్నగీతి; ఉదాహృతా = ఉక్తమైనది; + + + + +++ ఓహాడీ పరిగీయతే = ఓహడి గానముచేయబడుచున్నది

**తాత్పర్యము** : ప్రయోములచేతను, ద్రుతములచేతను మిశ్రామిశ్రములైన మాలవములచేతను కొంచెముచలితములచేతను, కొంచెము వక్రములైనట్టియు,

తారముచే ప్రకాశించునట్టివియు, ఉచ్ఛ్వాస సహితములును అయిన ఖండఖండములచే భిన్నగీతి ఉక్తమైనది ఓహాడి గానము చేయబడుచున్నది.

**లలితైర్గమకైశ్చిత్రైః ప్రసన్నైరౌరసైః సమైః ।**
**రంజకైః సురసందర్భైః రాగగీతిరుదాహృతా ॥ 300**

**ప్రతిపదార్థము :** లలితైః గమకైః = లలితములైన గమకములచేతను; చిత్రైః ప్రసన్నైః = చిత్రములైన ప్రసన్నతలచేతను; ఔరసైః సమైః = ఔరసములచేతను; రంజకైః = ఆనంద దాయకములైన; సురసందర్భైః = సురసందర్భములచే; రాగగీతిః ఉదాహృతా= రాగగీతిచెప్పబడినది.

**తాత్పర్యము :** లలితములైన గమకములచేతను, చిత్రములైన ప్రసన్నతలచేతను, ఔరసములచేతను ఆనందదాయకములైన సురసందర్భములచే రాగగీతి చెప్పబడినది.

**చతుర్ణామపి వర్ణానాం యో రాగః శోభనో భవేత్ ।**
**స సర్వో దృశ్యతే యేషు తేన రాగా ఇతి స్మృతాః ॥ 301 ॥**

**ప్రతిపదార్థము :** చతుర్ణాం వర్ణానాం = నాల్గువర్ణములలో; యః రాగః శోభనః భవేత్ = ఏరాగము మంగళప్రదమగునో; సః = అది; యేషు = వేటియందు; సర్వః దృశ్యతే = సర్వముగా కనబడునో; తేన = అందుచే; రాగాః ఇతి స్మృతాః = రాగములని చెప్పబడినవి

**తాత్పర్యము :** నాల్గువర్ణములలో ఏరాగము మంగళప్రదమగునో అది వేటియందు స్వరముగా కనబడునో అందుచే రాగములని చెప్పబడినవి.

**ఋజుభిర్లలితైః కించిత్ సూక్ష్మాసూక్ష్మైశ్చ సుశ్రవైః ।**
**ఈషద్ద్రుతైశ్చ కర్తవ్యా మృదుభిర్లలితైస్తథా ॥ 302**

**ప్రయోగైర్మసృణైః సూక్ష్మైః కాకుమిశ్రైః సుయోజితైః ।**
**స్వరైః సాధారణాగీతిః గీతిజ్ఞైః సముదాహృతా ॥ 303**

**ప్రతిపదార్థము :** ఋజుభిః = సాధుత్వముకలిగినట్టి; లలితైః = లలితములైనట్టివియు; కించిత్ = కొంచెము; సూక్ష్మాసూక్ష్మైః =

సూక్ష్మాసూక్ష్ములైనట్టియు; సుశ్రవ్యై: = చక్కని శ్రావ్యతకలవియు; ఈషత్ ద్రుతై: = కొంచెము ద్రుతత్వముకలిగినట్టి; మృదుభి: = మృదువైనట్టియు; లలితై: =లలితములైనట్టియు; స్వరై: = స్వరములచే; అపిచ = మరియు; మసృణై: ప్రయోగై: = అందములైన ప్రయోగములుగల; కాకుమిశ్రై: సూక్ష్మై: = కాకుస్వరమిశ్రిత సూక్ష్మములచేతను; సుయోజితై: స్వరై: = చక్కగా కూర్చబడిన స్వరములచే; సాధారణా గీతి: గీతజ్ఞై: సముదాహృతా = సాధారణగీతి సంగీతజ్ఞులచే ఉదహరింపబడినది

**తాత్పర్యము** : సాధుత్వముకలిగినట్టియు లలితములైనట్టివియు కొంచెము సూక్ష్మాసూక్ష్ములైనట్టియు చక్కని శ్రావ్యత కలిగినట్టియు కొంచెము ద్రుతత్వముకలిగినట్టియు మృదువైనవియు లలితములైనవియు స్వరములచే . మరియు అందములైన ప్రయోగములుగల కాకుస్వరమిశ్రితసూక్ష్మములచేతను చక్కగా కూర్చబడిన స్వరములచే సాధారణగీతి సంగతజ్ఞులచే ఉదహరింపబడినది.

**ఏవం సాధారణా జ్ఞేయా సర్వగీతిసమాశ్రయా ।**
**ప్రయోగైర్గాత్రజై: శ్లక్ష్ణై: కాకురక్తై: సుయోజితై: ॥ 304 ॥**

**ప్రతిపదార్థము** : ఏవం = ఇట్లు; సర్వగీతిసమాశ్రయా = సమస్తగీతులను ఆశ్రయించినది, సాధారణా జ్ఞేయా = సాధారణగీతిగా తెలియదగినది; గాత్రజై: ప్రయోగై: = గాత్రజనిత ప్రయోగములచేతను; శ్లక్ష్ణై: = విభేదములచేతను; కాకురక్తై: = కాకుస్వరముచే రంజకములైనట్టియు; సుయోజితై: = సమీచీనముగా యోజన చేయబడినట్టియు

**తాత్పర్యము** : ఇట్లు సమస్తగీతులను ఆశ్రయించినది సాధారణగీతిగా తెలియదగినది. గాత్రజనితప్రయోగముచేతను విభేదములచేతను కాకుస్వరముచే రంజకములైనట్టియు సమీచీనముగా యోజనచేయబడినట్టియు

**కంపితై: కోమలైర్దీప్తై: మాలవీకాకునాన్వితై: ।**
**లలితై: సుకుమారైశ్చ ప్రయోగైశ్చ సుసంయుతై: ॥ 305**

**ప్రతిపదార్థము** : కంపితై = గమకములుకలదియు; కోమలై: =

సుస్నితముల్లైనవియు; దీప్తైః = ప్రకాశితములును; మాలవీకాకునా అన్వితైః = మాలవసంబంధిత కాకువుచే కూడినవియు; లలితైః = లలితముల్లైనట్టియు; సుకుమారైః = సుకుమారముల్లైన; సుసంయతైః ప్రయోగై = సునియమిత ప్రయోగములచే

**తాత్పర్యము :** గమకములుకలదియు సుస్నితముల్లైనవియు ప్రకాశితములును మాలవ సంబంధితకాకువుచే కూడినవియు లలితముల్లైనట్టియు సుకుమారముల్లైన సునియమిత ప్రయోములచే

**భాషాగీతిః సమాఖ్యాతా ఏషా గీతివిచక్షణైః ।**
**యథా వై రజ్యతే లోకః తథా వై సంప్రయుజ్యతే ॥ 306**

**ప్రతిపదార్థము :** ఏషాభాషాగీతిః = ఈ భాషాగీతి చెప్పబడినది; యథా లోకః రజ్యతే = ఎట్లు లోకము రంజింప బడునో; తథా సంప్రయుజ్యతే = అట్లే ప్రయోగింప బడుచున్నది

**తాత్పర్యము :** ఈ భాషాగీతి చెప్పబడినది. ఎట్లు లోకమురంజింప బడునో అట్లే ప్రయోగింపబడుచున్నది.

**లలితైర్బహుభిర్దీప్తైః కంపితైరౌరసైః సమైః ।**
**తారీతి తారైః మస్నణైర్మధ్యే మధ్యమదీపితైః ॥ 307**

గమకైః శ్రోత్రసుఖదైః లలితైస్తు యదృచ్ఛయా ।
**విభాషాగీతిస్తు (విజ్ఞేయా) సంయోజ్యా యథా లోకోఽనురజ్యతే ॥**
**308**

**ప్రతిపదార్థము :** లలితైః = లలితముల్లైన; బహుభిః దీప్తైః = అనేక దీప్తులచేతను; కంపితైః = కంపితముల్లైన; ఔరసైః సమైః = స్వీయముల్లైన సమములచేతను; తారాతితారైః = తారాతితారములచేతను; మస్నణైః = అంధముల్లైన; మధ్యమదీపితైః = మధ్యమదీపితములలో; శ్రోత్రసుఖదైః గమకైః = శ్రోత్రములకు సుఖమును కలుగజేయు (వినుటకింపగు) గమకములచేతను; లలితైః = లలితముల్లైన స్వరములచే; యదృచ్ఛయా = స్వేచ్ఛగా; భాషాగీతిః = భాషాగీతి; యథా లోకః అనురజ్యతే తథా = లోక రంజనమునమసరించి; సంయోజ్యా =

కూర్చదగినది

**తాత్పర్యము :** లలితములైన అనేక దీప్తులచేతను కంపితములైన స్వీయములైన సమములచేతను తారాతితారములచేతను, అంధములైన మధ్యమదీపితములలో శ్రోతములకు సుఖమును కలుగజేయు (వినుటకింపగు) గమకములచేతను లలితములైన స్వరములచే స్వేచ్ఛగా భాషాగీతి లోకరంజనముననుసరించి కూర్చదగినది.

**గీతానాం లక్షణం ప్రోక్తం రాగసఖ్యోచ్యతేఽ ధునా ।**
**పంచ చోక్షాః సమాఖ్యాతా స్తత్ప్రమాణాశ్చభిన్నకాః ॥** 309

**ప్రతిపదార్థము :** గీతానాం లక్షణం ప్రోక్తం = గీతముల లక్షణము చెప్పబడినది; అధునా రాగసంఖ్యా ఉచ్యతే = ఇప్పుడు రాగ సంఖ్య చెప్పబడుచున్నది; పంచ చోక్షాః సమాఖ్యాతాః = పంచచోక్షములు చెప్పబడినవి; తత్ ప్రమాణాః భిన్నకాః = వాటి ప్రమాణములు మాత్రము భిన్నములు

**తాత్పర్యము :** గీతముల లక్షణము చెప్పబడినది. ఇప్పుడు రాగసంఖ్య చెప్పబడుచున్నది. పంచచోక్షములు చెప్పబడినవి. వాటి ప్రమాణములు మాత్రము భిన్నములు.

**గౌడాస్త్రయస్తు కథితా రాగాశ్చాష్టౌ ప్రకీర్తితాః ।**
**సప్త సాధారణాః ప్రోక్తా భాషాశ్చైవాత్ర షోడశ ॥** 310

**ప్రతిపదార్థము :** గౌడాః త్రయః కథితాః = గౌడరాగము మూడుగా చెప్పబడినది; రాగాః అష్టౌ ప్రకీర్తితాః = రాగములు ఎనిమిదిగా చెప్పబడినవి; సాధారణాః సప్త ప్రోక్తాః = రాగములు ఏడుగా చెప్పబడినవి; భాషాశ్చ అత్రషోడశకీర్తితాః = భాషా విభేదములిందు 16 గా చెప్పబడెను

**తాత్పర్యము :** గౌడ(రాగము)లు మూడుగా చెప్పబడినది. రాగములు ఎనిమిదిగాచెప్పబడినది. రాగములు ఏడుగా చెప్పబడినవి. భాషా విభేదములిందు 16 గాచెప్పబడెను.

**ద్వాదశైవ విభాషాః స్యుః నామాని చ నిబోధమే ।**

**షాడబః పంచమశ్చైవ తథాకైశిక మధ్యమః ॥** 311

**చోక్షసాధారితశ్చైవ చోక్షకైశిక ఇత్యపి ।**
**ఏతే చోక్షాస్తు విజ్ఞేయా భిన్నకాన్ సాంప్రతం శృణు ॥** 312

**ప్రతిపదార్థము :** ద్వాదశ విభాషాః స్యుః = విభాషా రాగములు 12 అగును; మే = నాకు, నామాని నిబోధ = పేర్లు తెలియజేయుము; షాడబము, పంచమము, కైశికమధ్యమము, చోక్షసాధారితము, చోక్షకైశికమిత్యపి= అని; ఏతే = ఇవి; చోక్షాః విజ్ఞేయాః = చోక్షములుగా తెలియదగినవి; సాంప్రతం బిన్నకాన్ శృణు = ఇప్పుడు భిన్నకములను గూర్చివినుము -

**తాత్పర్యము :** విభాషారాగములు 12 అగును. వాని పేర్లు తెలియజేయుము. షాడబము, పంచమము, కైశికమధ్యమము, చోక్షసాధారితము, చోక్షకైశికము, అని ఇవి చోక్షములుగా తెలియదగినవి. ఇప్పుడు భిన్నకములను గూర్చివినుము -

**భిన్నషడ్జశ్చ తానశ్చ భిన్నకైశిక మధ్యమః ।**
**భిన్నపంచమ ఇత్యుక్తః త్రయో గౌడాః ప్రకీర్తితాః ॥** 313

**టకురాగశ్చ సౌవీరస్తథా మాలవపంచమః ।**
**షాడబో బోట్టరాగశ్చ తథా హిందోలకః పరః ॥** 314

**టక కైశిక ఇత్యుక్తస్తథా మాలవకైశికః ।**
**ఏతే రాగాః సమాఖ్యాతాః నామతో మునిపుంగవైః ॥** 315

**ప్రతిపదార్థము :** భిన్నషడ్జము, తానము, భిన్నకైశికమధ్యమము, భిన్నపంచమము, ఇతుక్తాః = అని చెప్పబడినవి; త్రయః గౌడాఃప్రకీర్తితాః = మూడు గౌడలుచెప్పబడినవి; టకురాగము, సౌవీరము, మాలవపంచమము, షాడబము బోట్టరాగము, హిందోలకము, టకకైశికము, మాలవకైశికము, ఇతిఉక్తః = అనిచెప్పబడినది; ఏతే రాగాః = ఈరాగములు; మునిపుంగవైః = మహర్షులచే; నామతః సమాఖ్యాతాః = నామములచే నిర్దేశింపబడినవి

**తాత్పర్యము :** భిన్నషడ్జము, తానము, భిన్నకైశికమధ్యమము, భిన్నపంచమము,

అనిచెప్పబడినవి. టకురాగము, సౌవీరము, మాలవపంచమము, షాడబము, బోట్టరాగము, హిందోలకము, టకకైశికము, మాలవకైశికము, అని చెప్పబడినది, ఈరాగములు మహర్షులచే నామములచే నిర్దేశింపబడినవి.

**(గర్త:) శకాఖ్యః కకుభస్తథా హర్మాణ పంచమః ।**
**రూపసాధారిత శ్చైవ తథా గాంధారపంచమః ।**
**షడ్జకైశికసంజ్ఞశ్చ సప్త సాధారణాః స్మృతాః ॥ 316**

**ప్రతిపదార్థము** : గర్తము, శకము, కకుభము, హర్మాణపంచకము, రూపసాధారితము, గాంధారపంచమము, షడ్జకైశికము అని, సాధారణాః సప్త స్మృతాః = సాధారణరాగములేడు చెప్పబడినవి; ఇదానీం శుద్ధానాం లక్షణమాహ = ఇప్పుడు శుద్ధములకు లక్షణము చెప్పుచున్నాడు

**తాత్పర్యము** : గర్తము, శకము, కకుభము, హర్మాణపంచకము, రూపసాధారితము, గాంధారపంచమము, షడ్జకైశికము అని సాధారణ రాగములేడు చెప్పబడినవి. ఇప్పుడు శుద్ధములకు లక్షణము చెప్పుచున్నాడు.

**నిరపేక్ష్యాన్యజాతీర్యే స్వజాతిమనువర్తకాః ।**
**స్వజాత్యన్యతమాశ్చైవ తే శుద్ధాః పరికీర్తితాః ॥ 317**

**ప్రతిపదార్థము** : యే = ఏవి; అన్యజాతీః నిరపేక్ష్య = ఇతర జాతులను అపేక్షింపక; స్వజాతిం అనువర్తకాః = స్వజాతిని అనుసరించునవియో; స్వజాత్యన్యతమాః = స్వజాతిలోకొన్నియో; తే = అవి; శుద్ధాః పరికీర్తితాః = శుద్ధములని చెప్పబడుచున్నవి;

తత్ర షాడవ ఇతికస్మాత్? = అందు షాడవమని ఎందుకు?; కిం షడ్భిః స్వరైర్గీయత ఇతి షాడబః యద్వా షట్సు రాగేషు ముఖ్యఇతి షాడబః = ఆరు స్వరములచే గానము చేయబడునది అని షాడబమా? లేక ఆరు రాగములందు ముఖ్యమగునదియని షాడబమా?; తత్రనాయమాద్యః పక్షః = ఇందిక్కడ మొదటిపక్షము కాదు; కుతః = ఎందువలన?; సంపూర్ణత్వాత్ అముష్య రాగస్య = ఈ రాగమునకు సంపూర్ణత్వమువలన; తస్మాత్ ఉత్తరపక్ష ఏవ జ్యాయాన్ = అందువలన తరువాతి పక్షమే విశిష్టము; నను కథం షట్సున

రాగేషు ముఖ్యోయముచ్యతే = ఓయీ ! ఆరు రాగములందు ఇది ముఖ్యమైనను ఎందుకు చెప్పబడలేదు?; పూర్వం శుద్ధషాడబః ప్రయోక్తవ్య ఇతి వచనాత్ = పూర్వము శుద్ధ షాడవము ప్రయోగించదగినదియని చెప్పుటవలన; పూర్వరంగే ప్రచుర ప్రయోగాత్ అస్య శుద్ధషాఢబస్య ఆదౌ నిర్దేశః = పూర్వరంగమునందు అధికప్రయోగమువలన ఈశుద్ధషాడబమునకు నిర్దేశము మొదట చేయబడినది.

**తాత్పర్యము** : అందు షాడవమని ఎందుకు? ఆరుస్వరములచే గానముచేయబడునది అని షాడబమా? లేక ఆరురాగములందు ముఖ్యమగునదియని షాడబమా? ఇందిక్కడ మొదటి పక్షముకాదు. ఎందువలన? ఈరాగమునకు సంపూర్ణత్వమువలన. అందువలన తరువాతి పక్షమే విశిష్టము. ఓయీ! ఆరురాగములందు ఇది ముఖ్యమైనను ఎందుకు చెప్పబడలేదు? పూర్వము శుద్ధషాడవము ప్రయోగించదగినదియని చెప్పుటవలన. పూర్వంగమందు అధిక ప్రయోగమువలన శుద్ధషాడబమునకు నిర్దేశము మొదట చేయబడినది.

**వికారమధ్యమాజాతేః సంభూతః శుద్ధషాడబః ।**
**గర్తః శకాఖ్యః కకుభస్తథా హర్మ్మా (లవ) ణపంచమః ॥ 318 ॥**

**ప్రతిపదార్థము** : శుద్ధషాడబః వికారమధ్యమాజాతేసంభూతః = శుద్ధషాడవము వికారమధ్యమజాతినుండి జనించినది; గర్తము, శకాఖ్యము, కకుభము, హర్మ్మాణ పంచమము, రూపసాధారితము.

**తాత్పర్యము** : శుద్ధషాడవము వికారమధ్యమజాతినుండి జనించినది. గర్తము, శకాఖ్యము, కకుభము, హర్మ్మాణ పంచమము, రూపసాధారితము.

**రూపసాధారతశ్చైవ తథా గాంధారపంచమః ।**
**షడ్జకైశికసంజ్ఞాశ్చ, + + + +++++ ॥ 319**

**న్యాసోఽ స్య మధ్యమాంశశ్చ గాంధారేణ చ దుర్బలః ॥ 320**

**ప్రతిపదార్థము** : అస్య న్యాసః అంశశ్చ మధ్యమః = దీనికి మధ్యమన్యాసమును అంశమును; గాంధారేణ దుర్బలః = గాంధారమల్పము; అస్యార్థః = దీని యర్థము - శుద్ధషాడబో మధ్యమగ్రామసంబంధః =

శుద్ధషాడబముమధ్యమగ్రామికము; తారమధ్యమో గ్రహః = తారమధ్యమము గ్రహము; మధ్యమోంశో న్యాసశ్చ = మధ్యమము అంశము, న్యాసమునుకూడ; గాంధారస్య చ అల్పత్వం = గాంధారముకు అల్పత్వము; నిషాదగాంధారౌ చాత్ర కా(కల్యం) తరౌ = నిషాదగాంధారములు కాకలీ అంతరములు (క్రమముగా); పూర్ణస్వరశ్చ అయం = ఇది పూర్ణస్వరము; పూర్వరంగేఽ స్య ప్రయోగః = పూర్వరంగమందు దీనికి ప్రయోగము; మధ్యమో వాదీ = మధ్యము వాదిస్వరము; షడ్జః సంవాదీ = షడ్జము సంవాదిస్వరము; ఋషభపంచమౌ అనువాదినౌ = రిషభ పంచమములు అనువాదిస్వరములు; వివాదీ నాస్తి = వివాదిస్వరములేదు; శృంగారహాస్యౌ రసౌ = శృంగార హాస్యములు రసములు; మధ్యమాది మూర్ఛనా = మధ్యమాది మూర్ఛన; అవరోహీ వర్ణః = వర్ణము అవరోహి; ప్రసన్నాంతోఽ లంకారః = అలంకారము ప్రసన్నాంతము; త్రిషు మార్గేషు గీయతే = మూడు మార్గములందు గానము చేయబడును; దక్షిణే కలా వృత్తౌ కలా చిత్రేకలా = దక్షిణమందు కల; వృత్తియందు కల; చిత్రమందు కల; స్వరపదేషు చచ్చత్పుటాదితాలః = స్వరపదములందు చచ్చత్పుటాదితాలము; ఆక్షిప్తకా = ఆక్షిప్తకము; శుద్ధపంచమః షడ్జోదీచ్యవతీ జాతిః స్మృతాః = శుద్ధపంచమము షడ్జోదీచ్యవతి జాతియని భావింపబడినది

**తాత్పర్యము** : దీనికి మధ్యమన్యాసమును అంశమును, గాంధారమల్పము. దీనియర్థము- శుద్ధషాడబము మధ్యమగ్రామికము, తారమధ్యమము గ్రహము, మధ్యమము అంశము న్యాసముకూడ, గాంధారమునకు అల్పత్వము, నిషాదగాంధారములు కాకలీ అంతరములు. (క్రమముగా); ఇది పూర్ణస్వరము. పూర్వరంగమందు దీనికి ప్రయోగము. మధ్యమము వాదిస్వరము, షడ్జము సంవాదిస్వరము, రిషభపంచమములు అనువాదిస్వరములు. వివాదిస్వరము లేదు. శృంగార హాస్యములు రసములు. మధ్యమాది మూర్ఛన, వర్ణము అవరోహి, అలంకారము ప్రసన్నాంతము, మూడు మార్గములందు గానముచేయబడును. దక్షిణమందు కళవృత్తియందు కల, చిత్రమందు కల, స్వరపదములందు చచ్చత్పుటాదితాలము ఆక్షిప్తకము శుద్ధపంచమము షడ్జోదీచ్యవతి జాతియని భావింపబడినది.

షడ్జాంశో మధ్యమన్యాసః స్వల్పద్విశ్రుతికస్వరః ।
స్యాత్ షడ్జమధ్యమాజాతేః శుద్ధః సాధారితస్తథా ॥ 321

ప్రతిపదార్థము : షడ్జాంశ = షడ్జాంశము; మధ్యమన్యాసః = మధ్యమన్యాసము; స్వల్పద్విశ్రుతిక స్వరః = అల్పద్విశ్రుతిస్వరము; షడ్జమధ్యమాజాతేః = షడ్జమధ్యమ జాతిసంబంధితములు; తథా = అట్లే; శుద్ధః సాధారితః = శుద్ధసాధారితము

అస్యార్థః - దీనియర్థము - శుద్ధసాధారితో రాగః షడ్జగ్రామసంబంధ = శుద్ధ సాధారితరాగము షడ్జగ్రామికము; షడ్జమధ్యమజాతేఃఉత్పన్నత్వాత్ = షడ్జమధ్యమ జాతినుండి పుట్టుటవలన; తారషడ్జో గ్రహః అంశశ్చ = తారషడ్జము గ్రహము, అంశమును; మధ్యమో న్యాసశ్చ = మధ్యమము న్యాసము; నిషాదగాంధారయోరల్పత్వం = నిషాదగాంధారములకు అల్పత; పూర్ణశ్చాయం = ఇది పూర్ణము; గర్భసంధౌ వినియోగః = గర్భసంధియందునియోగము; వీరరౌద్రాదికో రసః = వీరరౌద్రాదికము రసము; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; అవరోహీ వర్ణః = వర్ణమవరోహి; ప్రసన్నాన్తోఽ లంకారః = అలంకారము ప్రసన్నాంతము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వృత్తకలా = వృత్తియందు కల; చిత్రే కలా = చిత్రమార్గమందును కళ; స్వరపదగీతే చచ్చత్పుటాది తాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము

**తాత్పర్యము :** షడ్జాంశము, మధ్యమన్యాసము అల్పద్విశ్రుతిస్వరము షడ్జమధ్యమ జాతిసంబంధితములు అట్లే శుద్ధసాధారితము, శుద్ధసాధారిత రాగము షడ్జగ్రామికము. షడ్జమధ్యమజాతినుండి పుట్టుటవలన తారషడ్జము గ్రహము, అంశమును, మధ్యమము న్యాసము,నిషాదగాంధారములకు అల్పత ఇది పూర్ణము. గర్భసంధియందు నియోగము. వీరరౌద్రాదికము రసము, షడ్జాది మూర్ఛన. వర్ణమవరోహి. అలంకారము ప్రసన్నాంతము. దక్షిణమందు కల. వృత్తియందు కల. చిత్రమార్గమందును కళ. స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము.

కైశికీషడ్జమధ్యాభ్యాం శుద్ధకైశికమధ్యమః ।
షడ్జాంశో మధ్యమన్యాసః త్యక్తఃత్రిశ్రుతిపంచమః ॥ 321

**ప్రతిపదార్థము :** కైశికీషడ్జమధ్యాభ్యాం = కైశికీషడ్జమధ్యములచేత; శుద్ధకైశికమధ్యమః = శుద్ధకైశిక మధ్యమరాగమగును; షడ్జాంశః = షడ్జాంశము; మధ్యమన్యాసః = మధ్యమన్యాసము; త్యక్త త్రిశ్రుతిపంచమః = విడువబడిన త్రిశ్రుతిపంచమముకలది

అస్యార్థః - శుద్ధకైశికమధ్యమోరాగః = శుద్ధకైశికమధ్యమము రాగము; షడ్జగ్రామ సంబంధః = షడ్జగ్రామముతో సంబంధము; కైశికీషడ్జమధ్యమజాత్యోః సముత్పన్నత్వాత్ = కైశికీషడ్జమధ్యమజాతులనుండి పుట్టుటవలన; (నను) కైశికీ మధ్యమగ్రామసంబద్ధా, షడ్జమధ్యమా షడ్జగ్రామసంబంధా, అతః ఉభయగ్రామతా అస్తీతి భావః = కైశికి మధ్యమ గ్రామసంబద్ధము, షడ్జమధ్యమము షడ్జగ్రామసంబద్ధము; అందువలన ఉభయ గ్రామత్వము ఉన్నదని భావము; తారషడ్జో అస్య గ్రహోంశశ్చ = తారషడ్జము దీనికి అంశము, గ్రహమును; మధ్యమో న్యాసః = మధ్యమన్యాసము; నిషాదగాంధారయోరల్పత్వం = నిషాద గాంధారములకు అల్పత; పంచమర్షభయోః లోపః = పంచమరిషభములకు లోపము; నిషాదోఽత్ర కాకలిషాడవశ్చ = నిషాదమిందు కాకలిషాడవము; నిర్వహణే చాస్య ప్రయోగః = నిర్వహణమందు దీనికి ప్రయోగము; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; రౌద్రవీరాదికో రసః = రౌద్రవీరాదికము రసము; ప్రసన్నాంతోఽలంకారః = అలంకారము ప్రసన్నాంతము;

**షడ్జాంశైః పంచమో న్యాసః కైశికీజాతిసంభవః ।**
**తథా కార్మారవీజాతేః స్వరైః పూర్ణైశ్చ కైశికః ॥**

**ప్రతిపదార్థము :** షడ్జాంశైః పంచమో న్యాసః = షడ్జాంశములచే పంచమమున్యాసము; కైశికీ జాతిసంభవః = కైశికీజాతిజనితము; తథా కార్మారవీజాతేః స్వరైః పూర్ణైః శ్చ కైశికః = అట్లే కార్మారవి జాతియొక్క పూర్ణస్వరములచే కైశికము

**తాత్పర్యము :** షడ్జాంశములచే పంచమము న్యాసము. కైశికీజాతిజనితము. అట్లే కార్మారవిజాతియొక్క పూర్ణస్వరములచే కైశికము.

అస్యార్థః - శుద్ధకైశికో నామ మధ్యమగ్రామసంబంధః = శుద్ధకైశిక రాగము

మధ్యమగ్రామ సంబంధితము; కైశికీకార్మారవీజాత్యోః సముత్పన్నత్వాత్ = కైశికికార్మారవి జాతులనుండి పుట్టుటవలన; తారషడ్జోఽ స్య గ్రహః అంశశ్చ = తారషడ్జము దీనికి గ్రహము, అంశమును; పంచమో న్యాసః = పంచమన్యాసము; నిషాదోఽ త్ర కాకలీ = ఇందు నిషాదము కాకలి; పూర్ణస్వరశ్చాయం = ఇది పూర్ణస్వరములుకలది; చిత్రాస్యష్టాదశాంగస్య నిర్వహణే వినియోగః = (18) అష్టాదంశాంగములు కల చిత్రముయొక్క నిర్వహణమందు వినియోగము; వీరరౌద్రాదికో రసః = వీర రౌద్రాదికము రసము; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణము ఆరోహి; ప్రసన్నాదిరలంకారః = అలంకారము ప్రసన్నాది; దక్షిణే కలా = దక్షిణ మార్గమందుకల; వృత్తే కలా = వృత్తియందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చుత్పుటాదితాలః = స్వరపదగీతియందు చచ్చుత్పుటాది తాలము; నను ఏతే గ్రామవిశేషసంబంధాః = ఓయీ! ఇవి గ్రామ విశేషసంబంధములు, కుతోఽ యం విశేషలాభః = విశేషలాభమేమి?; ఉచ్యతే = చెప్పబడుచున్నది; భరతవచనాదేవాసౌ విశేషో లభ్యతే = భరతునియొక్క మాటవలననే ఈ విశేషము లభ్యమగుచున్నది; తథాచాహ భరతమునిః = భరతుడట్లే చెప్పుచున్నాడు; "జాతిసంభూతత్వాత్ గ్రామరాగాణా మితి" = గ్రామరాగములు జాతిజనితములగుటవలన అని; యత్ కించిత్ ఏతత్ గీయతే లోకే తత్ స్వరజాతిషు స్థితమితి వచనాత్ = ఏకొద్దిపాటైనను లోకమున గానముచేయబడుచున్నదో అది అన్నిజాతులయందు ఉన్నదనుమాటవలన; తథా కాశ్యపేనాప్యుక్తం = అట్లే కాశపునిచేతను కూడ చెప్పబడినది -

**తాత్పర్యము** : కైశికీషడ్జమధ్యములచేత శుద్ధకైశిక మధ్యమరాగమగును. షడ్జాంశము మధ్యమన్యాసము, విడువబడిన త్రిశ్రుతిపంచమముకలది. శుద్ధకైశికి మధ్యమమురాగము. షడ్జగ్రామముతో సంబంధము. కైశికీషడ్జమధ్యమజాతులనుండి పుట్టుటవలన కైశికి మధ్యమగ్రామసంబద్ధా, షడ్జమధ్యమషడ్జగ్రామ సంబద్ధము, కైశికి మధ్యమగ్రామసంబద్ధము, షడ్జమధ్యము షడ్జగ్రామసంబద్ధము అందువలన ఉభయగ్రామత్వము ఉన్నదని భావము. తారషడ్జము దీనికి అంశము గ్రహమును; మధ్యమ న్యాసమునిషాదగాంధారములకు అల్పత. పంచమ రిషభములకు లోపము.

నిషాదమిందు కాకలిషాడవము. నిర్వహణమందు దీనికి ప్రయోగము. షడ్జాది మూర్ఛన. రౌద్రవీరాదికము రసముఅలంకారము ప్రసన్నాంతము. దీనియర్థము శుద్ధకైశిక రాగము మధ్యమగ్రామ సంబంధితము. కైశికికార్మారవిజాతులనుండి పుట్టుటవలన తారషడ్జము దీనికి గ్రహము, అంశమును; పంచమన్యాసము, ఇందు నిషాదము కాకలీ, ఇది పూర్ణస్వరములుకలది. (18) అష్టాదశాంగములు కల చిత్రముయొక్క నిర్వహణమందు వినియోగము. వీర రౌద్రాదికమురసము షడ్జాది మూర్ఛన. వర్ణము ఆరోహి. అలంకారము ప్రసన్నాది. దక్షిణామార్గమందు కల. వృత్తియందు కల. చిత్రమందు కల. స్వరపదగీతియందు చచ్చత్పుటాది తాలము. ఓయీ ! ఇవి గ్రామవిశేష సంబంధములు. విశేషలాభమేమి? చెప్పబడుచున్నది. భరతునియొక్క మాటవలనే ఈవిశేషము లభ్యమగుచున్నది. భరతుడట్లే చెప్పుచున్నాడు. గ్రామరాగములు అని జాతిజనితములగుటవలన. ఏ కొద్దిపాటైనను లోకమున ఇదిగానము చేయబడుచున్నదో అది అన్ని జాతులయందు ఉన్నదను మాట వలన; అట్లే కాశపునిచేతను కూడ చెప్పబడినది -

"షాడబే మధ్యమగ్రామే పంచమః కకుభస్తథా ।
షడ్జే సాధారితశ్చైవ తథా కైశిక మధ్యమః ॥"

**ప్రతిపదార్థము** : మధ్యమగ్రామే = మధ్యమగ్రామమునందు; షాడబే = షాడబమందు (మధ్యమగ్రామషాడబమందు); పంచమః = పంచమము; కకుభః = కకుభము; షడ్జే = షడ్జగ్రామమందు; సాధారితః = సాధారితము; కైశికమధ్యమః = కైశిక మధ్యమము

నను అమీ వినియోగవిశేషాః కస్మాల్లభ్యంతే ? = ఓయీ! ఈవినియోగవిశేషములు దేనినుండివచ్చుచున్నవి?; వచనాదేవ లభ్యంతే = వచనము వలనే లభించుచున్నవి; తథాచాహ భరతః = భరతుడట్లే చెప్పుచున్నాడు -

**తాత్పర్యము** : మధ్యమగ్రామమునందు షాడబమందు (మధ్యమగ్రామషాడబమందు) పంచమము కకుభము. షడ్జగ్రామమందు సాధారితము కైశికమధ్యమము.

ఓయీ ! ఈవినియోగ విశేషములు దేనినుండి వచ్చుచున్నవి? వచనమువలనే లభించుచున్నవి. భరతుడట్లే చెప్పుచున్నాడు-

**"ముఖే తు మధ్యమగ్రామః షడ్జః ప్రతిముఖే భవేత్ ।**
**గర్భే సాధారితశ్చైవ అవమర్శే+తు పంచమః ॥"**

**ప్రతిపదార్థము** : ముఖే = ముఖసంధియందు; మధ్యమగ్రామః = మధ్యమగ్రామము; ప్రతిముఖే = ప్రతిముఖసంధియందు; షడ్జః = షడ్జము (గ్రామము); గర్భే సాధారితః = గర్భసంధియందు సాధారితము; అవమర్శే పంచమః = అవమర్శసంధియందు పంచమము

**తాత్పర్యము** : ముఖసంధియందు మధ్యమగ్రామము. ప్రతిముఖసంధియందు షడ్జము (గ్రామము). గర్భసంధియందు సాధారితము. అవమర్శసంధియందు పంచమము.

**సంహారే కైశికః ప్రోక్తః పూర్వరంగే తు షాడవః ।**
**చిత్రస్యాషాడశాంగస్య త్వంతే కైశికమధ్యమః ॥**
**శుద్ధానాం వినియోగోఽయం బ్రహ్మణా సముదాహృతః ।**

**ప్రతిపదార్థము** : సంహారే కైశికః ప్రోక్తః = సంహారమందు కైశికము చెప్పబడినది; పూర్వరంగే షాడవః = పూర్వరంగమందు షాడవము; చిత్రస్య అష్టాదశాంగస్య అంతే = చిత్రాష్టాదశాంగముయొక్క అంతమందు; కైశికమధ్యమః = కైశికమధ్యమము; అయం శుద్ధానాం వినియోగః బ్రహ్మణా సముదాహృతః = శుద్ధముల ఈవినియోగము బ్రహ్మచేతను ఉదహరింపబడినది; ఇదానీం భిన్నానాం లక్షణమాహ = ఇప్పుడు భిన్నముల లక్షణమును చెప్పుచున్నాడు -

**తాత్పర్యము** : సంహారమందు కైశికము చెప్పబడినది. పూర్వంరంగమందుషాడవము. చిత్రాష్టాదశాంగముయొక్క అంతమందు కైశికమధ్యమము. శుద్ధముల ఈవినియోగము బ్రహ్మచేతను ఉదహరింపబడినది. ఇప్పుడు భిన్నముల లక్షణమును చెప్పుచున్నాడు-

**శ్రుతిభిన్నో జాతిభిన్నః శుద్ధభిన్నః స్వరైస్తథా ।**
**చతుర్భిః భిద్యతే యస్మాత్ తస్మాత్ భిన్నక ఉచ్యతే ॥** 325

**ప్రతిపదార్థము :** శ్రుతిభిన్నము, జాతిభిన్నము, శుద్ధభిన్నము, తథా = అట్లే; స్వరైః భిన్నః = స్వరభిన్నము అని; యస్మాత్ = ఎందువలన; చతుర్భిః భిద్యతే = నాల్గిటి చేతను భేదింపబడినదో; తస్మాత్ భిన్నకః ఉచ్యతే = అందువలన భిన్నకమని చెప్పబడినది

నను భిన్నశబ్దేన కిమభిధీయతే? = ఓయీ ! భిన్నశబ్దముచే నేమిచెప్పబడినది?; కిం విదారితోఽ ర్థః = అర్థము భిన్నమైనదా?; ఏతస్మాదయం వ్యతిరిక్త ఇత్యర్థో వా భిన్నశబ్దః = ఇందువలన అదివ్యతిరిక్తమైనదని అర్థమా?; భిన్నశబ్దః = భిన్నశబ్దము; ఏతన్నవాచ్యం = ఇట్లనరాదు; భిన్నోఽ త్ర వికృత ఉచ్యతే = ఇక్కడ భిన్నశబ్దముచే వికృతము చెప్పబడినది; వికృతత్వం పూర్వోక్తశ్రుతిభిన్నేత్యాది లక్షణాత్ = వికృతత్వమనగా పూర్వము చెప్పబడిన శ్రుతిభిన్నము మొదలగు లక్షణమువలన; నను పంచసురాగేషు మధ్యే భిన్నషడ్జస్య లక్షణముచ్యతే = ఓయీ ! పంచరాగములలో భిన్నషడ్జమునకు లక్షణము చెప్పబడినది;

తాత్పర్యము : శ్రుతిభిన్నము, జాతిభిన్నము, శుద్ధభిన్నము, అట్లే స్వరభిన్నము ఏది ఎందువలన నాల్గిటిచేతను భేదింపబడినదో అందువలన భిన్నకమని చెప్పబడినది.

ఓయీ ! భిన్నశబ్దముచే నేమి చెప్పబడినది? అర్థముభిన్నమైనదా? ఇందువలన ఇదివ్యతిరిక్తమైనదని భిన్నశబ్దమునకు అర్థమా? ఇట్లనరాదు. ఇక్కడ భిన్నశబ్దము (చే) వికృతము చెప్పబడినది. వికృతత్వమనగా పూర్వము చెప్పబడిన శ్రుతిభిన్నము మొదలగు లక్షణమువలన ఓయీ ! పంచరాగములలో భిన్నషడ్జమునకు లక్షణము చెప్పబడినది.

**యదా వాదీ గృహీతః స్యాత్ సంవాదీ చ విమోక్ష్యతే ।**

**ప్రతిపదార్థము :** యదా = ఎప్పుడు; వాదీ గృహీతః స్యాత్ =వాది గ్రహింపబడునో; తదా సంవాదీ విమోక్ష్యతే = అప్పుడు సంవాది విడువబడును; ఇత్యాదావేవ అభిధానం కుతః? = ఇత్యాదులందే చెప్పుట ఎందుకు?; సత్యముక్తం = నిజము చెప్పబడినది;ముఖ్యత్వాత్ అస్య = దీనికి ముఖ్యతవలన; ముఖ్యత్వం చ యథా

శుద్ధగీతిషు శుద్ధషాడబస్య, ఏవం భిన్నగీతిషు భిన్నషడ్జస్యేతి తద్భేదాదస్యేతి = ముఖ్యత్వమెట్లనగా శుద్ధగీతులయందు శుద్ధషాడబమునకు; ఇట్లే భిన్నగీతులందు భిన్నషడ్జమునకు అని దాని భేదమువలెనే దీనికిని; ఇదానీం భిన్నానాం ప్రాగుక్తలక్షణప్రకటనార్థం తత్రాదౌ స్వరభిన్నస్య లక్షణముచ్యతే = ఇప్పుడు భిన్నములకు ఇదివరకు చెప్పబడిన లక్షణమును వెల్లడి చేయుటకుముందు ఇందు స్వరభిన్నమునకు లక్షణము చెప్పబడుచున్నది

**తాత్పర్యము :** ఎప్పుడు వాది గ్రహింపబడునో అప్పుడు సంవాది విడువబడును. ఇత్యాదులందే చెప్పుట ఎందుకు? నిజము చెప్పబడినది. దీనికి ముఖ్యతవలన; ముఖ్యతమెట్లనగా శుద్ధగీతులయందు శుద్ధషాడబమునకు, ఇట్లే భిన్నగీతులందు భిన్నషడ్జమునకు అని; దాని భేదమువలెనే దీనికిని ఇప్పుడు భిన్నములకు ఇదివరకు చెప్పబడిన లక్షణమును వెల్లడి చేయుటకు ముందు ఇందు స్వరభిన్నమునకు లక్షణము చెప్పబడుచున్నది -

**యదా వాదీ గృహీతఃస్యాత్ సంవాదీ చ విమోక్ష్యతే ॥** 323
**వివాదీవానువాదీ వా స్వరభిన్నః స ఉచ్యతే ।**

**ప్రతిపదార్థము :** యదా వాదీ గృహీతః స్యాత్ = వాదిస్వరమెప్పుడు గ్రహింపబడునో; తస్మాత్ = అందువలన; సంవాదీ విమోక్ష్యతే = సంవాదిస్వరము విడువబడును; వివాదీవా అనువాదీ వా = వివాదిస్వరముగాని, అనువాదిస్వరముగాని; సః = అది; స్వరభిన్నః ఉచ్యతే = స్వరభిన్నమని చెప్పబడును.

**తాత్పర్యము :** వాదిస్వరమెప్పుడు గ్రహింపబడునో అందువలన సంవాదిస్వరము విడువబడును. వివాదిస్వరముగాని, అనువాదిస్వరముగాని అదిస్వరభిన్నమని చెప్పబడును.

అస్యార్థః - మధ్యమగ్రామాశ్రితస్య శుద్ధషాడవస్య యోఽ సౌ మధ్యమో గ్రహాంశః తత్స్థానే ధైవతోఽ పి వాదిత్వేన అనువాదిత్వేన వా గృహీతో భవతి = మధ్యమగ్రామాశ్రితమైన శుద్ధషాడవమునకు యే మధ్యమము గ్రహాంశమో, తత్స్థానమందు ధైవతముకూడ వాదిత్వముచేతగాని, అనువాదిత్వముచేతగాని

గ్రహింపబడుచున్నది; మధ్యమ స్వరస్య సంవాదీ త్యజ్యతే న్యస్యతే వా తదాసౌ స్వరభిన్న ఉచ్యతే = మధ్యమస్వరమునకు సంవాది విడిచిపెట్టబడినను ఉంచబడినను అది స్వరభిన్నమని చెప్పబడుచున్నది; భిన్నషడ్జః అత్ర వచనాత్ వాదీ = భిన్న షడ్జము వచనమువలన ఇక్కడ వాదిస్వరము; ధైవతః పునః బహుప్రయోగో భవతి = ధైవతము మరల బహుప్రయోగము కలదగును

మధ్యమగ్రామాశ్రితమైన శుద్ధషాడవమునకు యేమధ్యమము గ్రహాంశమో, తత్స్థానమందు ధైవతము కూడ వాదిత్వము చేతగాని, అనువాదిత్వముచేతగాని గ్రహింపబడుచున్నది. మధ్యమస్వరమునకు సంవాది విడిచిపెట్టబడినను ఉంచబడినను అది స్వరభిన్నమని చెప్పబడుచున్నది. భిన్నషడ్జము వచనము వలన ఇక్కడ వాదిస్వరము. ధైవతము మరల బహుప్రయోగము కలదగును.

**ధైవతాంశో మధ్యమాంతః పంచమర్షభవర్జితః ॥** **324**
**షడ్జోదీచ్యవతీజాతో భిన్నషడ్జః స్మృతో బుధైః ।**

**ప్రతిపదార్థము** : భిన్నషడ్జః = భిన్నషడ్జము; ధైవతాంశః = ధైవతాంశము; మధ్యమాంతః = మధ్యమాంతము; పంచమర్షభవర్జితః = పంచమరిషభత్యక్తము; షడ్జోదీచ్యవతీ జాతః ఇతి = షడ్జోదీచ్యవతినుండి పుట్టినదని; స్మృతః = భావింవబడినది; భిన్నషడ్జః షడ్జగ్రామసంబంధః = భిన్నషడ్జము షడ్జగ్రామసంబంధితము; షడ్జోదీచ్యవతీజాతేః జాతత్వాత్ = షడ్జోదీచ్యవతిజాతినుండి పుట్టుటవలన; ధైవతః గ్రహోఽంశశ్చ = ధైవతము గ్రహము, అంశమును; మధ్యమో న్యాసః = మధ్యమన్యాసము; ఋషభపంచమహీన ఔడువితః = రిషభపంచమరహితమౌడువితము; నిషాదగాంధారౌ కాకల్యంతరౌ = నిషాదగాంధారములు కాకలీ అంతరములు; సర్వోపకరణప్రవృత్తస్య విజాతీయో నిరణానివృత్తస్య (?) మృగయాయాం ప్రవృత్తస్య నాయకస్య ప్రవేశాదికాసు అస్య వినియోగః = సమస్త ఉపకరణములయందు ప్రవర్తించినట్టియు, విజాతీయ రణనివృతుడైనట్టియు, వేటయందు ప్రవృత్తుడైన నాయకుని ప్రవేశాదులందు దీనికి వినియోగము; భీభత్సభయానకరసౌ = భీభత్స భయానక రసములు; ధైవతాదిమూర్ఛనా = ధైవతాది మూర్ఛన; సంచారీ వర్ణః = వర్ణము సంచారి; ప్రసన్నాదిరలంకారః =

అలంకారము ప్రసన్నాది; దక్షిణే కలా వృత్తౌ కలాచిత్రే కలా = దక్షిణమందు కల, వృత్తియందు కల; చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాది తాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాది తాళము; పంచమస్య స్థానే స్థానే వివాదిత్వేన గృహీతో భవతి = పంచమముయొక్క ప్రతి స్థానమందు వివాదిత్వముచే గ్రహింపబడుచున్నది; పంచమస్య అసంవాదిత్వేన వర్జ్యతే కదాచిదసౌ భిన్నపంచమః స్వరభిన్నోఽభిధీయతే = పంచమమునకు అసంవాదిత్వముచే విడువబడుచున్నది; ఒక్కొక్కప్పుడు ఇది భిన్నపంచమము స్వరభిన్నమనియు చెప్పబడుచున్నది; లక్షణం చ తద్యథా = ఆలక్షణమెట్లనగా -

**తాత్పర్యము** : భిన్నషడ్జము, ధైవతాంశము మధ్యమాంతము పంచమరిషభత్యక్తము. షడ్జోదీచ్యవతినుండి పుట్టినదనిభావింపబడినది. భిన్నషడ్జము షడ్జగ్రామసంబంధితము, షడ్జోదీచ్యవతిజాతినుండి పుట్టుటవలన ధైవతము గ్రహము, అంశమును; మధ్యమన్యాసము. రిషభపంచమరహితమౌడుబితము. నిషాదగాంధారములు కాకలీ అంతరములు. సమస్త ఉపకరణములయందు ప్రవర్తించినట్టియు, విజాతీయు రణనివృతుడైనట్టియు వేటయందు ప్రవృత్తుడైన నాయకునిప్రవేశాదులందు దీనికి వినియోగము. భీభత్సభయానకరసములు. ధైవతాది మూర్ఛన. వర్ణము సంచారి. అలంకారము ప్రసన్నాది. దక్షిణమందు కల. వృత్తియందు కల. చిత్రమందు కల. స్వర పదగీతమందు చచ్చత్పుటాదితాళము. పంచమస్థానమందు వివాదిత్వముచే గ్రహింపబడుచున్నది. పంచమమునకు అసంవాదిత్వముచే విడువబడుచున్నది. ఒక్కొక్కప్పుడు ఇది బిన్నపంచమము స్వరభిన్నమనియు చెప్పబడుచున్నది. ఆలక్షణమెట్లనగా -

**శుద్ధపంచమవత్ ప్రోక్తః స్వరజ్ఞైర్భిన్నపంచమః ॥** 325
**ధైవతాంశః పంచమాంతః సూత్రధారప్రవేశనే ।**

**ప్రతిపదార్థము** : స్వరజ్ఞైః = స్వరజ్ఞానముకలవారిచే; భిన్నపంచమః = భిన్నపంచమము; శుద్ధపంచమవత్ ప్రోక్తః = శుద్ధపంచమమువలె చెప్పబడినది; ధైవతాంశః = ధైవతముఅంశము; పంచమాంతః = పంచమాంతము; సూత్రధార ప్రవేశనే వినియోగః = సూత్రధార ప్రవేశమందు వినియోగము

**తాత్పర్యము** : స్వరజ్ఞానముకలవారిచే భిన్నపంచమము శుద్ధపంచమవలె చెప్పబడినది. ధైవతము అంశము, పంచమాంతము. సూత్రధారప్రవేశమందు వినియోగము.

అస్యార్థః - భిన్నపంచమో మధ్యమగ్రామ సంబంధః = భిన్నపంచమము మధ్యమగ్రామ సంబధితము; షడ్జోదీచ్యవతీ జాతో: మధ్యమా (పంచమీ) జాత్యోర్జాతత్వాత్ =మధ్యమాపంచమమీ జాతులనుండి పుట్టుట వలన; షడ్జోదీచ్యవతీ జాతికిచెందినది; గ్రహాంశశ్చ ధైవతః = ధైవతగ్రహము అంశమును; పంచమో న్యాసః = పంచమ న్యాసము; నిషాదోఽ త్ర కాకలీ = ఇందు కాకలినిషాదము; క్వచిన్నిషాదస్యాపి ప్రయోగః = ఒక్కొక్కచోట నిషాదమునకు కూడ ప్రయోగముగలదు; సంపూర్ణశ్చాయం = ఇది సంపూర్ణము; సూత్రధార ప్రవేశే అస్య వినియోగః = సూత్రధార ప్రవేశమందు దీనికి వినియోగము; బీభత్సభయానకౌ: రసౌ = బీభత్సభయానకములు రసములు; ధైవతాదిమూర్ఛనా= ధైవతాది మూర్ఛన; సంచారీ వర్ణః = వర్ణము సంచారి; ప్రసన్నాదిరలంకారః = అలంకారము ప్రసన్నాది; దక్షిణే కలా వృత్తౌ కలా చిత్రే కలా = దక్షిణమందు కల, వృత్తియందు కల, చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాది తాలః = స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము; ఇదానీం జాతిబిన్నస్య లక్షణమాహ = ఇప్పుడు జాతిబిన్నమునకు లక్షణము చెప్పుచున్నాడు-

దీనియర్థము - భిన్నపంచమము మధ్యమగ్రామసంబంధితము మధ్యమ పంచమిజాతులనుండి పుట్టుటవలన షడ్జోదీచ్యవతీ జాతికి చెందినది. ధైవతగ్రహము, అంశమును; ఇందు కాకలి నిషాదము. ఒక్కొక్కచోట నిషాదమునకు కూడ ప్రయోగముగలదు. ఇది సంపూర్ణము. సూత్రధారప్రవేశమందు దీనికి వినియోగము. బీభత్సభయానకములు రసములు. ధైవతాది మూర్ఛన. వర్ణము సంచారి. అలంకారము ప్రసన్నాది. దక్షిణమందు కల, వృత్తియందు కల, చిత్రమందు కల స్వరపదగీతియందు చచ్చత్పుటాది తాలము.

ఇప్పుడు జాతిభిన్నమునకు లక్షణము చెప్పుచున్నాడు -

**జాతీనాం మంశకం స్థాయ(?) స్వల్పకస్తు బహుస్తథా ॥** 326

**అల్పత్వం చ బహుత్వం చ ప్రయోగాల్పబహుత్వతః ।**
**సూక్ష్మాతిసూక్ష్మైర్వక్రైశ్చ జాతిభిన్నః స ఉచ్యతే ॥** 327

**ప్రతిపదార్థము** : జాతీనాం అంశకం = జాతుల అంశకము; స్థాయస్వల్పకః = స్థాయస్వల్పము; తథా = అట్లే; బహు =బహుత్వము; ప్రయోగాల్పబహుత్వతః = అల్పత్వ బహుత్వప్రయోగమువలన; అల్పత్వం బహుత్వం చ = అల్పత్వము బహుత్వమును అగును; సూక్ష్మఅతిసూక్ష్మైః = సూక్ష్మములచేతను; అతిసూక్ష్మములచేతను; వక్రైః = వక్రములచేతను (ప్రయోగము) ఏదికలదో; సః = అది; జాతిభిన్నః ఉచ్యతే = జాతిభిన్నమని చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : జాతుల అంశకము స్థాయస్వల్పము. అట్లే బహుత్వము. అల్పత్వబహుత్వప్రయోగమువలన అల్పత్వము బహుత్వమును అగును. సూక్ష్మములచేతను అతిసూక్ష్మములచేతను వక్రములచేతను (ప్రయోగము) ఏదికలదో; అది జాతిభిన్నమని చెప్పబడుచున్నది.

అస్యార్థః - శుద్ధకైశికమధ్యో హి కైశికీషడ్జమధ్యమాజాత్యోః జాతః = శుద్ధకైశిక మధ్యమము కైశికి షడ్జమధ్యమజాతులనుండి పుట్టినది; భిన్నకైశికమధ్యస్తు షడ్జమధ్యమజాతేర్జాతత్వాత్ తదంశగ్రాహిత్వేన మస్థాయివర్ణగ్రాహిత్వేన చ సూక్ష్మాతిసూక్ష్మైః ప్రయోగశ్చ జాతిభిన్నో భవేదిత్యర్థః = భిన్నకైశికమధ్యమము షడ్జమధ్యమజాతినుండి పుట్టుటవలన దాని అంశగ్రహణముచే మధ్యమస్థాయి వర్ణగ్రహణముచేతను కూడ సూక్ష్మఅతి సూక్ష్మప్రయోగములచేతను, జాతి భిన్నమగునని అర్థము; లక్షణం చాస్య యథా = దీనికి లక్షణమనగా -

శుద్ధకైశికి మధ్యమ కైశికి- షడ్జమధ్యమజాతులనుండి పుట్టినది. భిన్నకైశికమధ్యమము షడ్జమధ్యమజాతినుండి పుట్టుటవలన దాని అంశగ్రహణముచే మధ్యస్థాయివర్ణ గ్రహణముచేతను కూడసూక్ష్మఅతి సూక్ష్మప్రయోగములచేతను, జాతిభిన్నమగునని అర్థము. దీనికి లక్షణమనగా-

**స్యాత్ షడ్జమధ్యమాజాతేః భిన్నకైశికమధ్యమః ।**
**షడ్జాంశో మధ్యమన్యాసో మంద్రైస్తు గమకైర్యుతః ॥** 328

**ప్రతిపదార్థము** : భిన్నకైశిక మధ్యమః = భిన్నకైశిక మధ్యమము; షడ్జమధ్యమజాతేః స్యాత్ = షడ్జమధ్యమజాతినుండి అగును; షడ్జాంశః = షడ్జాంశము; మధ్యమన్యాసః = మధ్యమన్యాసము; మంద్రైఃగమకైఃయుతః = మంద్రగమకములతో కూడియున్నది;

**తాత్పర్యము** : భిన్నకైశక మధ్యమము షడ్జమధ్యమజాతినుండి అగును. షడ్జాంశము మధ్యమన్యాసము మంద్రగమకములతో కూడియున్నది.

భిన్నకైశికమధ్యమః షడ్జగ్రామసంబంధః =భిన్నకైశికమధ్యమము షడ్జగ్రామసంబందితము; షడ్జమధ్యమజాతేః ఉత్పన్నత్వాత్ = షడ్జమధ్యమజాతినుండి పుట్టుటవలన; షడ్జోఽ స్యగహోఽ ంశశ్చ = షడ్జము దీనికి గ్రహము, అంశమును; మధ్యమోన్యాసః = మధ్యమన్యాసము; మంద్రగమకశ్చ= మంద్రగమకము; నిషాదోత్రకాకలీ = ఇందుకాకలీనిషాదము; పూర్ణశ్చాయం= ఇది పూర్ణము; దానవీరే చాస్యప్రయోగః = దానవీర మందు దీనిప్రయోగము; వీరరౌద్రాదికోరసః = వీర రౌద్రాదకమురసము; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; వర్ణః సంచారీ = సంచారి వర్ణము; ప్రసన్నాదిరలంకారః = అలంకారము ప్రసన్నాది; దక్షిణేకలా వార్తికే కలా చిత్రేకలా = దక్షిణమందు కల వార్తికమందు కల; చిత్రమందు కల; చచ్చత్పుటాది తాలః = చచ్చత్పుటాదితాలము; శుద్ధభిన్నస్య లక్షణమాహ = శుద్ధభిన్నలక్షణము చెప్పుచున్నాడు

భిన్నకైశికమధ్యమము షడ్జగ్రామసంబంధితము. షడ్జమధ్యాజాతినుండి పుట్టుటవలన షడ్జము దీనికి గ్రహము, అంశమును; మధ్యమన్యాసము, మంద్రగమకము. ఇందు కాకలీనిషాదము. ఇది పూర్ణము. దానవీరమందు దీనిప్రయోగము. వీరరౌద్రాదికమురసము. షడ్జాది మూర్ఛన. సంచారి వర్ణము. అలంకారము ప్రసన్నాది. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల చచ్చత్పుటాది తాలము

శుద్ధభిన్నలక్షణము చెప్పుచున్నాడు-

**పరిత్యజన్నన్యజాతిం స్వజాతి కులభూషణః ।**
**స్వకం కులం తు సంగృహ్ణాన్ శుద్ధభిన్నః ప్రకీర్తితః ॥ 332 ॥**

**ప్రతిపదార్థము** : అన్యజాతిం పరిత్యజన్ = ఇతర జాతిని విడుచుచు; స్వజాతికులభూషణః = తన జాతికులము(ల)నకు అలంకారమగుచు; స్వకం కులం సంగృహ్ణాన్ = తనకులమును గ్రహించుచున్నది; శుద్ధభిన్నమని చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : ఇతర జాతిని విడుచుచు తన జాతికులము (ల)నకు అలంకారమగుచు తనకులమును గ్రహించుచు ఉన్నది. శుద్ధభిన్నమని చెప్పబడుచున్నది.

అస్యార్థః - అన్యాం జాతిం పరిహరన్ స్వజాతికులభూషితం స్వమూలంతు సంగృహ్ణాన్నితి = ఇతర జాతిని విడుచుచు స్వీయజాతికులాలంకృతమును స్వప్రధానతను గ్రహించు(ను) చుఅని; శుద్ధస్య లక్షణం సమగ్రం భిన్నకైశికస్యాపి విద్యతే = శుద్ధముయొక్క పూర్తిలక్షణము భిన్నకైశికకుకూడ కలదు; తర్హి కో భేదః? = అట్లయిన తేడాఏమి?; గీతికృతోభేదః =గీతికృతమైన భేదము; శుద్ధకైశికో హి శుద్ధగీత్యా గీయతే = శుద్ధకైశిక శుద్ధగీతిచే గానము చేయబడును; భిన్నకైశికస్తు భిన్నగీత్యా గీయతే = భిన్నకైశిక భిన్నగీతిచే గానముచేయబడును; ఏతదుక్తం భవతి = ఇది చెప్పబడినది; యేన సంస్థానేన రాగీయంతే శుద్ధకైశికేన తేన సంస్థానేన భిన్నకైశికే రాగీయత (?) ఇతి = శుద్ధకైశికచేత భిన్నకైశికయందు రాగముగా గానముచేయబడినది; లక్షణం చాస్య యథా - దీనికి లక్షణమెట్లనగా-

ఇతరజాతిని విడుచుచు స్వీయజాతికులాలంకృతమును స్వప్రధానతను గ్రహించు (ను) చుఅని, శుద్ధముయొక్క పూర్తిలక్షణము భిన్నకైశికకు కూడ కలదు. అట్లయిన తేడా ఏమి? గీతికృతమైన భేదము శుద్ధకైశిక శుద్ధగీతిచేగానము చేయబడును. భిన్నకైశిక భిన్నగీతి గానముచేయబడును. ఇది చెప్పబడినది. శుద్ధకైశిక చేత ఏసంస్థానముచే రాగముగా గానముచేయబడుచున్నవో ఆసంస్థానముచేతనే భిన్నకైశికయందు రాగముగా గానముచేయబడినదని, దీనికి లక్షణమెట్లనగా-

**శుద్ధకైశికవత్ రూపస్వరజ్ఞైర్భిన్నకైశికః ।**
**షడ్జాంశః పంచమన్యాసః సంపూర్ణః సప్తభిః స్వరైః ॥** 333

**ప్రతిపదార్థము** : రూపస్వరజ్ఞైః = రూపస్వరజ్ఞానములచే; శుద్ధకైశికవత్ =

శుద్ధకైశికవలె; భిన్నకైశికః = భిన్నకైశికము; షడ్జాంశః = షడ్జాంశము; పంచమన్యాసః = పంచమ న్యాసము; సప్తభిః స్వరైః సంపూర్ణాః = సప్తస్వరములచేతను సంపూర్ణము

**తాత్పర్యము :** రూపస్వరజ్ఞానములచే శుద్ధకైశికవలె భిన్నకైశికము షడ్జాంశము. పంచమన్యాసము. సప్తస్వరములచేతను సంపూర్ణము.

అస్యార్థః - భిన్నకైశికోమధ్యమగ్రామ సంబంధః = భిన్నకైశికము మధ్యమగ్రామికము; కైశికీకార్మారవీ జాత్యుత్పన్నత్వాత్ = కైశికీ కార్మారవిజాతినుండి పుట్టుటవలన; గ్రహోఽ ంశశ్చ షడ్జః = షడ్జగ్రహము అంశమును; పంచమో న్యాసః = పంచమన్యాసము; నిషాదోఽత్ర కాకలిః = ఇందు కాకలినిషాదము; పూర్ణశ్చాయం = ఇది సంపూర్ణము; శుద్ధకైశిక ఉదయం యద్యపి రాగః తథాపి భేదోస్తి = శుద్ధకైశికవలె రాగము ఉదయమగును. కాని భేదము కలదు; మంద్రబహులోఽ యం = ఇది మంద్రబహులము; యేన సంస్థానేన శుద్ధకైశికే స్వరాలాపః క్రియతే, తత్ సంస్థానం విహాయ తైరేవ స్వరైః ఆలాపః కర్తవ్య ఇతి = భిన్నకైశికయందు తారస్వరములచే ఆలాపము చేయదగినది యని; రూపాన్యత్వేన అయం భిద్యంతే = రూపము వేరగుటచే ఇది భేదించుచున్నది; దానవీరే చాస్య వినియోగః =దానవీరమందు దీనికి వినియోగము; వీరరౌద్రాదికో రసః = వీరరౌద్రాదికము రసము; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; వర్ణః సంచారీ = సంచారి వర్ణము; ప్రసన్నాదిరలంకారః = అలంకారము ప్రసన్నాది; దక్షిణే కలా వార్త్తికే కలా చిత్రే కలా = దక్షిణమందు కల వార్తికమందు కల; చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము; సాంప్రతం భిన్నతానస్య లక్షణమాహ= ఇప్పుడు భిన్నతానమునకు లక్షణము చెప్పుచున్నాడు

భిన్నకైశిక మధ్యమగ్రామికము కైశికీ కర్మారవీజాతినుండి పుట్టుట వలన షడ్జగ్రహము అంశమును; పంచమన్యాసము. ఇందు కాకలినిషాదము ఇదిసంపూర్ణము. శుద్ధకైశిక వలె రాగము ఉదయమగును కానిభేదముకలదు. ఇది మంద్రబహులము యే సంస్థానముచే శుద్ధకైశికయందు స్వరాలాపము చేయబడునో ఆ సంస్థానమును విడిచి ఆస్వరములచేతనే ఆలాపము చేయదగినది. భిన్నకైశికయందు తారస్వరములచే ఆలాపము చేయదగినదియని రూపము వేరగుటచే ఇది భేదించుచున్నది. [illegible]

వీరరౌద్రాదికము రసము. షడ్జాది మూర్ఛన సంచారివర్ణము. అలంకారము ప్రసన్నాది. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము. ఇప్పుడు భిన్నతానమునకు లక్షణము చెప్పుచున్నాడు -

**చతుః శ్రుతిస్వరో యత్ర భిన్నో ద్విశ్రుతికేన తు ।**
**గాంధారో ద్విశ్రుతిశ్చైవ శ్రుతిభిన్నః స ఉచ్యతే ॥** 331

**ప్రతిపదార్థము :** చతుఃశ్రుతిస్వరః = చతుఃశ్రుతిస్వరము; ద్విశ్రుతికేన = ద్విశ్రుతికముచే; భిన్నః = భేదమగునో; గాంధారః = గాంధారము; ద్విశ్రుతిశ్చ= ద్విశ్రుతియునగునో; సః =అది; శ్రుతిభిన్నః ఉచ్యతే = శ్రుతిభిన్నమని చెప్పబడుచున్నది

**తాత్పర్యము :** చతుఃశ్రుతిస్వరము, ద్విశ్రుతికముచే భేదమగునో, గాంధారము ద్విశ్రుతియునగునో, అది శ్రుతిభిన్నమని చెప్పబడుచున్నది.

అస్యార్థః - చతుఃశ్రుతేః పంచమస్య యదా శ్రుతిద్వయం గృహ్ణాతి నిషాదః తదాసౌ శ్రుతి భిన్నో అభిధీయతే = చతుః శ్రుతిపంచమమునుండి, నిషాదమెప్పుడుశ్రుతిద్వయమును గ్రహించునో అప్పుడు అదిశ్రుతిభిన్నముగా చెప్పబడుచున్నది; నను మధ్యమగ్రామే పంచమస్య త్రిశ్రుతికత్వాత్ కథం శ్రుతిద్వయం గృహ్ణాతి నిషాదః? = ఓయీ ! మధ్యమ గ్రామమున పంచమమునకు త్రిశ్రుతికమువలన నిషాదమెట్లు శ్రుతిద్వయము గ్రహించును? ఉచ్యతే = చెప్పబడుచున్నది; భూతపూర్వన్యాయేన చతుః శ్రుతిరుచ్యతే = భూతపూర్వ న్యాయముచే చతుః శ్రుతిచెప్పబడినది; యథా భిన్నకైశికరాగే త్రిశ్రుతి పంచమస్య చతుః శ్రుతిత్వమాశ్రిత్యలోపః కృతః షడ్జగ్రామే, ఏవమాత్రాపి భవిష్యతీతి న దోషః = భిన్నకైశికరాగమందు త్రిశ్రుతిపంచమమునకు చతుః శ్రుతిత్వమునాశ్రయించి షడ్జగ్రామమున లోపముచేయబడినది; అట్లే ఇక్కడ కూడ అగునని దోషములేదు, లక్షణం చాస్య తద్యథా = దీనికి లక్షణమెట్లనగా-

చతుఃశ్రుతిపంచమమునుండి నిషాదమెప్పుడు శ్రుతిద్వయమును గ్రహించునో అప్పుడు అదిశ్రుతిభిన్నముగా చెప్పబడుచున్నది. ఓయీ !

మధ్యమగ్రామమున పంచమమునకు త్రిశ్రుతికమువలన నిషాదమెట్లు శ్రుతిద్వయముగ్రహించును? చెప్పబడుచున్నది. భూతపూర్వన్యాయముచే చతుఃశ్రుతి చెప్పబడినది. భిన్నకైశిక రాగమందుత్రిశ్రుతి పచమమునకు చతుఃశ్రుతిత్వమునాశ్రయించి షడ్జగ్రామమున లోపము చేయబడినది. అట్లే ఇక్కడ కూడ అగునని దోషములేదు. దీనికిలక్షణమెట్లనగా -

**తానస్తు మధ్యమన్యాసః పంచమాంశోఽల్పసప్తమః ।**
**మధ్యమాపంచమీజాత్యోః ఋషభేణ తు దుర్బలః ॥** 332

**ప్రతిపదార్థము** : తానః = తానము; మధ్యమన్యాసః = మధ్యమన్యాసము; పంచమాంశః = పంచమాంశము; అల్పసప్తమః= సప్తమస్వర మల్పము; మధ్యమాపంచమీజాత్యోః = మధ్యమపంచమజాతులకు; ఋషభేణ దుర్బలః = రిషభాల్పము

**తాత్పర్యము** : తానము మధ్యమన్యాసము. పంచమాంశము. సప్తమస్వరమల్పము మద్యమపంచమజాతిజనితము. రిషభాల్పము.

అస్యార్థః - భిన్ననాసికా (?) మధ్యమగ్రామసంబంధః = భిన్ననాసిక (తానము) మధ్యమగ్రామసంబంధితము; మధ్యమాపంచమీజాత్యుత్పన్నత్వాత్ = మధ్యమా పంచమజాతులనుండిపుట్టుటవలన; పంచమో గ్రహోంశశ్చ = పంచమ గ్రహము, అంశమును; మధ్యమో న్యాసః = మధ్యమన్యాసము; మధ్యమనిషాదయోరల్పత్వం= మధ్యమనిషాదములకు అల్పత; నిషాదోఽత్ర కాకలీ = ఇందు కాకలీనిషాదము; పూర్ణశ్చాయం = ఇదిసంపూర్ణము; ప్రౌఢకరుణేఽస్య ప్రయోగః = ప్రౌఢకరుణమందు దీనిప్రయోగము; పంచమాది మూర్ఛనా = పంచమాది మూర్ఛన; సంచారీ వర్ణః = వర్ణము సంచారి; ప్రసన్నాదిరలంకారః = అలంకారము ప్రసన్నాది; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము; భిన్నానాం గ్రామవిభాగస్తు కాశ్యపేనోక్తః = భిన్నములకు గ్రామవిభాగము కాశ్యపునిచే చెప్పబడినది; తథాచ -

భిన్ననాసిక(తానము) మధ్యమగ్రామసంబంధితము. మధ్యమపంచమ జాతులనుండి పుట్టుటవలన పంచమగ్రహము, అంశమును; మధ్యమన్యాసము. మధ్యమనిషాదములకు అల్పత. ఇందు కాకలీనిషాదము. ఇది సంపూర్ణము. ప్రౌఢకరుణమందు దీనిప్రయోగము పంచమాది మూర్ఛన. వర్ణము సంచారి. అలంకారములు ప్రసన్నాది. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల స్వరపదగీతమందు చచ్చత్పుటాది తాలము. భిన్నములకు గ్రామవిభాగము. కాశ్యపునిచేచెప్పబడినది. తథాచ-

**భిన్నషడ్జస్తు షడ్జే స్యాత్ భిన్నకైశికమధ్యమః ।**
**పంచమః కైశికస్థానే మధ్యమగ్రామసంశ్రితః ॥**

**ప్రతిపదార్థము :** షడ్జే = షడ్జగ్రామమందు; భిన్నషడ్జః భిన్నకైశిక మధ్యమః స్యాత్= భిన్నషడ్జము, భిన్నకైశికమధ్యమముఅగును; కైశికస్థానే = కైశికస్థానమందు; పంచమః = పంచమము; మధ్యమగ్రామసంశ్రితః = మధ్యమగ్రామము నాశ్రయించియుండునది

**తాత్పర్యము :** షడ్జగ్రామమందు భిన్నషడ్జము, భిన్నకైశిక మధ్యమము అగును. కైశికస్థానమందు పంచమము మధ్యమగ్రామము నాశ్రయించియుండునది.

**ఇతి భిన్నాః సమాఖ్యాతా గౌడకాన్ శృణు సాంప్రతమ్ ।**

ఇతి భిన్నాః సమాఖ్యాతాః = ఈ విధముగా భిన్నములు చెప్పబడినవి; గౌడకాన్ శృణు సాంప్రతం = ఇప్పుడు గౌడకములను వినుము; నను గౌడాః కథం? = ఓయీ ! గౌడము లెట్లు?; ఉచ్యతే గౌడగీతి సంబంధత్వాత్ = గౌడగీతి సంబంధమువలన (అని) చెప్పబడుచున్నది; కిం లక్షణం? = లక్షణమేమి?; ఉచ్యతే తద్యథా = చెప్పబడుచ్నుది అదిఎట్లనగా।

ఈ విధముగా భిన్నములు చెప్పబడినవి. ఇప్పుడు గౌడకములను వినుము. ఓయీ! గౌడములెట్లు? గౌడగీతిసంబంధము వలన (అని) చెప్పబడుచున్నది లక్షణమేమి? చెప్పబడుచున్నది అదిఎట్లనగా -

**ఓహాడీ మంత్రజా(?) + తుప్రయోగైః ద్రుతకంపితైః ॥** 334
**అవిశ్రామేణ త్రిస్థానే గౌడగీతి రుదాహృతా ।**

**ప్రతిపదార్థము** : ఓహోడి మంత్రజా = మంత్రజము ఓహోడి; ధ్రుతకంపితైః ప్రయోగైః = ధ్రుతకంపిత ప్రయోగములచే; త్రిస్థానే = త్రిస్థానము (లం) నందును; అవిశ్రామేణ = విశ్రామము లేకయుండుటవలన; గౌడగీతిఉదాహృతా = గౌడగీతి ఉదహరింపబడినది; గౌడపంచమస్య లక్షణం = గౌడపంచమమునకు లక్షణము-

**తాత్పర్యము** : మంత్రజము ఓహోడి. ధ్రుతకంపిత ప్రయోగములచే త్రిస్థానము (లం)నందును విశ్రామము లేకయుండుటవలన గౌడగీతి ఉదాహరింపబడినది. గౌడపంచమమునకు లక్షణము.

**గౌడపంచమనిష్పత్తౌ ధైవతీషడ్జమధ్యమే ॥** 334
**ధైవతాంశో మధ్యమాంతో రహితః పంచమేనతు ।**

**ప్రతిపదార్థము** : గౌడ పంచమనిష్పత్తౌ = గౌడపంచమ జననమందు; ధైవతీషడ్జమధ్యమే = ధైవతిషడ్జమధ్యమజాతులు (కారణము); ధైవతాంశః = ధైవతాంశము; మధ్యమాంతః = మధ్యమాంతము; పంచమేన రహితః = పంచమరహితము

**తాత్పర్యము** : గౌడపంచమజననమందు, ధైవతిషడ్జమధ్యజాతులు (కారణము) ధైవతాంశము మధ్యమాంతము. పంచమరహితము.

అస్యార్థః - గౌడపంచమః షడ్జగ్రామ సంబంధః = గౌడపంచమము షడ్జగ్రామసంబంధితము; ధైవతీషడ్జమధ్యమజాత్యోః సముత్పన్నత్వాత్ = ధైవతి షడ్జమధ్యమజాతులనుండి పుట్టుటవలన; ధైవతాంశో గ్రహశ్చ = ధైవతాంశము, గ్రహమును; మధ్యమో న్యాసః = మధ్యమన్యాసము; నిషాదగాంధారౌ కాకల్యంతరౌ = నిషాద గాంధారములు కాకలీ అంతరములు; పంచమరహితోఽ యం షట్స్వరః = పంచమము వినా షట్స్వరము; (షాడవము); ఉద్ఘటనాట్యే విప్రలంభశృంగారే చాస్య వినియోగః = ఉద్ఘటనాట్యమున వియోగశృంగారమునందుదీనికి వినియోగము; భీభత్సభయానకౌ రసౌః = భీభత్స భయానకులు రసములు; ధైవతాది మూర్ఛనా = ధైవతాది మూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; ప్రసన్నమధ్యోలంకారః = అలంకారము ప్రసన్నమధ్యము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటతాలః =

స్వర పదగీతియందు చచ్చత్పుటతాళము

గౌడ పంచమము షడ్జగ్రామసంబంధితము. ధైవతిషడ్జమధ్యమజాతులనుండి పుట్టుటవలన ధైవతాంశము, గ్రహమును; మధ్యమన్యాసము, నిషాదగాంధారములు కాకలీ అంతరములు. పంచమము వినా షట్ స్వరము (షాడవము). ఉద్భటనాట్యమున వియోగశృంగారమునందు దీనికి వినియోగము. భీభత్సభయానకములు రసములు. ధైవతాది మూర్ఛన. వర్ణమారోహి. అలంకారము ప్రసన్నమధ్యము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతియందు చచ్చత్పుటతాళము.

**ఉత్పన్నః కైశికీషడ్జమధ్యమాజాతితో మతః ॥** 335
**షడ్జాంశః పంచమన్యాసః సంప్రోక్తో గౌడకైశికః ।**

**ప్రతిపదార్థము :** గౌడకైశికః = గౌడకైశికము; కైశికీషడ్జమధ్యమాజాతితః ఉత్పన్నః = కైశికిషడ్జమధ్యమాజాతులనుండి పుట్టినది; షడ్జాంశ =షడ్జాంశము; పంచమన్యాసః = పంచమన్యాసముగా; సంప్రోక్తః = చెప్పబడినది

**తాత్పర్యము :** గౌడకైశికము కైశికిషడ్జమధ్యమాజాతులనుండి పుట్టినది. షడ్జాంశము పంచమన్యాసముగా చెప్పబడినది.

అస్యార్థః - గౌడకైశికోరాగో మధ్యమగ్రామసంబంధః = గౌడకైశికరాగము మధ్యమగ్రామసంబంధితము; కైశికీషడ్జమధ్యమాభ్యాం జాతః = కైశికీషడ్జమధ్యము ములనుండి పుట్టినది; షడ్జః అస్య గ్రహః అంశశ్చ = షడ్జగ్రహము అంశమును; పంచమో న్యాసః = పంచమన్యాసము; నిషాదోఽత్ర కాకలీ = ఇందుకాకలీ నిషాదము; పూర్ణశ్చాయం = ఇది సంపూర్ణము; తథా ప్రయోగోఽస్తి = అట్లే ప్రయోగముకలదు; త్రిశ్రుతికత్వాత్ పంచమస్య, చతుః శ్రుతికత్వాత్ ధైవతస్య మధ్యమగ్రామసంబంధ ఏవాసౌ రాగః = పంచమమునకు త్రిశ్రుతికము వలనను; ధైవతమునకు చతుః శ్రుతికమువలనను ఈరాగము మధ్యమగ్రామసంబంధము కలదియే; యద్యపి గ్రామద్వయజాతౌ జాతః తథాపి షడ్జోఽస్య గ్రామః న మధ్యమః = ఇదిగ్రామద్వయ జాతమైనప్పటికి దీనికి షడ్జగ్రామమే నిశ్చితము; మధ్యమగ్రామము కాదు; తథా దర్శనాత్ = అట్లే కనబడుటవలన; కరుణే

చాస్య వినియోగః = కరుణమందుదీనికివినియోగము; వీరాదికో రసః = వీరాదికము రసము; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; ప్రసన్నాదిరలంకారః = అలంకారము ప్రసన్నాది; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాది తాలః = స్వరపదగీతియందు చచ్చత్పుటాది తాలము

గౌడకైశిక రాగము మధ్యమగ్రామసంబంధితము. షడ్జము గ్రహము అంశమును, పంచమన్యాసము. ఇందు కాకలీ నిషాదము. ఇది సంపూర్ణము. అట్లే ప్రయోగము కలదు. పంచమమునకు త్రిశ్రుతికము వలనను, ధైవతమునకు చతుః శ్రుతికమువలనను ఈరాగము మధ్యమగ్రామ సంబంధముకలదియే. ఇది గ్రామద్వయ జాతమైనప్పటికి దీనికి షడ్జగ్రామమే నిశ్చితము, మధ్యమగ్రామము కాదు, అట్లే కనబడుటవలన కరుణమందు దీనికి వినియోగము వీరాదికము రసము. షడ్జాది మూర్ఛన, వర్ణమారోహి, అలంకారము ప్రసన్నాది, దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల స్వరపదగీతియందు చచ్చత్పుటాది తాలము.

**షడ్జాంశో మధ్యమన్యాసః షడ్జమధ్యమయా కృతః ॥ 336**
**పరిపూర్ణస్వరః ప్రోక్తో గౌడ కైశికమధ్యమః ।**

**ప్రతిపదార్థము :** గౌడకైశికమధ్యమః = గౌడకైశికమధ్యమరాగము; షడ్జాంశః = షడ్జాంశము; మధ్యమన్యాసః = మధ్యమన్యాసము; షడ్జమధ్యమమయా కృతః = షడ్జమధ్యమాజనితము; పరిపూర్ణస్వరః = సంపూర్ణస్వరములుకలది

**తాత్పర్యము :** గౌడకైశికమధ్యమరాగము, మధ్యమన్యాసము. షడ్జమధ్యమాజనితము. సంపూర్ణస్వరములు కలది.

అస్యార్థః - గౌడకైశికమధ్యమః షడ్జగ్రామసంబంధః = గౌడ కైశికమధ్యమము షడ్జగ్రామసంబంధితము; షడ్జమధ్యమజాతేః జాతత్వాత్ = షడ్జమధ్యమజాతినుండి పుట్టుటవలన; షడ్జోస్య గ్రహోఽ ంశశ్చ = షడ్జగ్రహము అంశమును; మధ్యమో న్యాసః = మధ్యమన్యాసము; నిషాదోఽత్ర కాకలిః = ఇందు కాకలినిషాదము; పూర్ణశ్చాయం = ఇది సంపూర్ణము; భయానకే చాస్య

వినియోగః = భయానకమందు దీనికి వినియోగము; వీరాదికో రసః = వీరాదికము రసము; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; ఆరోహీ వర్ణః = ఆరోహీవర్ణము; ప్రసన్నమధ్యోలంకారః = అలంకారము ప్రసన్నమధ్యము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చుత్పుటాది తాలః = స్వరపదగీతియందు చచ్చుత్పుటాది తాలము; ఇదానీం గౌడానాం గ్రామవిభాగమాహ = ఇప్పుడు గౌడములకు గ్రామ విభాగమును చెప్పుచున్నాడు.

గౌడ కైశికమధ్యమము షడ్జగ్రామ సంబంధితము. షడ్జమధ్యమజాతినుండి పుట్టుటవలన షడ్జగ్రహము అంశమును; మధ్యమన్యాసము. ఇందు కాకలినిషాదము. ఇదిసంపూర్ణము. భయానకమందు దీనికి వినియోగము. వీరాదికము రసము. షడ్జాది మూర్ఛన. ఆరోహీ వర్ణము. అలంకారము ప్రసన్నమధ్యమము. దక్షిణమందు కల వార్తికమందు కల చిత్రమందు కల స్వరపదగీతియందు చచ్చుత్పుటాదితాలము. ఇప్పుడుగౌడములకు గ్రామవిభాగమును చెప్పుచున్నాడు.

**గౌడపంచమకః షడ్జే గౌడకైశికమధ్యమః ॥ 337**
**గౌడకైశికరాగస్తు మధ్యమగ్రామ సంశ్రయః ।**

**త్రయో గౌడాః సమాఖ్యాతాః రాగాన్ వక్ష్యామ్యతః పరమ్ ॥ 338**

**ప్రతిపదార్థము** : షడ్జే = షడ్జగ్రామమందు; గౌడపంచమకః = గౌడపంచమము; గౌడ కైశికమధ్యమః = గౌడకైశిక మధ్యమమును; (కలవు); గౌడకైశికరాగః = గౌడ కైశికరాగము మాత్రము; మధ్యమగ్రామ సంశ్రయః = మధ్యమగ్రామమునాశ్రయించినది; త్రయః గౌడాః సమాఖ్యాతాః = గౌడత్రయము చెప్పబడినది; అతః పరం = ఇటుతరువాత; రాగాన్ వక్ష్యామి= రాగములను చెప్పుదును

**తాత్పర్యము** : షడ్జగ్రామమందు, గౌడపంచమము గౌడకైశికమధ్యమమును (కలవు). గౌడకైశికరాగము మాత్రము మధ్యమగ్రామము నాశ్రయించినది. గౌడత్రయము చెప్పబడినది. ఇటుతరువాత రాగములను చెప్పుదును.

ననుు వేసరాణాం కథం రాగశబ్దః ప్రవర్తతే = ఓయీ ! వేసరములకెట్లు రాగశబ్దము ప్రవర్తించును?; ఆప్తోపదేశాత్ = హితుల ఉపదేశమువలన; తధాచాహాథాకశ్యపః = కశ్యపుడట్లు చెప్పెను

ఓయీ ! వేసరముకెట్లు రాగశబ్దము ప్రవర్తించును? హితుల ఉపదేవమువలన. కశ్యపుడట్లు చెప్పెను.

**"చతుర్ణామపి వర్ణానాం యోగా రాగః + శోభనా ।**
**స సర్వో దృశ్యతే యేన తేన రాగా ఇతిస్మృతాః ॥ "**

**ప్రతిపదార్థము** : చతుర్ణామపి వర్ణానాం = నాల్గువర్ణములకు యోగా(త్) కలయిక వలన; రాగః శోభనా(?) = శుభప్రదమైన రాగము(?); యేన సః సర్వః దృశ్యతే= దేనిచేతను అదిఅంతయు కనబడుచున్నదో; తేన =అందుచే; రాగాః ఇతి స్మృతాః = రాగములనబడుచున్నవి; దుర్గశక్తిమతే రాగా ఏవ వేసరా గణ్యంతే= దుర్గశక్తి మతమందు రాగములే వేసరములుగా లెక్కింపబడుచున్నవి? తథాచాహ దుర్గశక్తిః = దుర్గశక్తి అట్లేచెప్పెను

**తాత్పర్యము** : నాల్గువర్ణములకు యోగా(త్) కలయిక వలన శుభప్రదమైన రాగము దేనిచేతను అదిఅంతయు కనబడుచున్నదో అందుచే రాగములనబడుచున్నవి. దుర్గశక్తిమతమందు రాగములే వేసరములుగా లెక్కింపబడుచున్నవి. దుర్గశక్తి అట్లేచెప్పెను.

**"స్వరాః సరంతి యద్వేగాత్ తస్మాత్ వేసరకాః స్మృతాః ॥"**

**ప్రతిపదార్థము** : యద్వేగాత్ = ఏవేగమువలన; స్వరాః సరంతి = స్వరములు నడచుచున్నవో; తస్మాత్ = అందువలన; వేసరకాః స్మృతాః = వేసరములనబడుచున్నవి; దుర్గశక్తిమతే వేసరషాడబ ఏవ ముఖ్యః = దుర్గశక్తిమతమందు వేసరషాడబమే ముఖ్యము; షాడబత్వేన క్రమాయాతత్వాత్= షాడవత్వచే క్రమముగా గమనమువలన; కశ్యపమతే తు టక్కరాగ ఏవ ముఖ్యః = కశ్యపమతమందు టక్కరాగమే ముఖ్యము; లక్ష్మీప్రీతికరత్వాత్ = లక్ష్మీప్రియకరమగుటవలన; తద్యథా = అదిఎట్లనగా

**తాత్పర్యము** : ఏవేగమువలన స్వరములు నడచుచున్నవో అందువలన

వేసరములనబడుచున్నవి. దుర్గశక్తిమతమందు వేసరషాడబమే ముఖ్యము, షాడవత్వముచే క్రమముగా గమనమువలన కశ్యపమతమందు టక్కరాగమే ముఖ్యము లక్ష్మీప్రియకరముగుటవలన అదిఎట్లనగా,

**షడ్జాంశన్యాససంయుక్తష్టగరాగోఽ ల్పపంచమః ।**
**కారణం చాస్య నిర్దిష్టే ధైవతీషడ్జమధ్యమే ॥ 339**

**ప్రతిపదార్థము** : టగరాగః = టగరాగము; షడ్జాంశన్యాససంయుక్తః = షడ్జాంశన్యాసయుతము; అల్పపంచమః = పంచమము అల్పము; ధైవతీషడ్జమధ్యమే అస్య కారణం నిర్దిష్టే = ధైవతీషడ్జమధ్యమములు దీనికి జనకకారణములుగా నిర్దేశింపబడెను

అస్యార్థః - టక్కరాగః షడ్జగ్రామ సంబంధః = టక్కరాగము షడ్జగ్రామికము; ధైవతీ షడ్జమధ్యమసముత్పన్నత్వాత్ = ధైవతిషడ్జమధ్యముల నుండి పుట్టుటవలన; షడ్జోస్య గ్రహోంశశ్చ న్యాసశ్చ = షడ్జము దీనికి గ్రహము, అంశము న్యాసమును; నిషాదపంచమయోరత్రాల్పత్వం = నిషాదపంచమములకు ఇందు అల్పత; నిషాదగాంధారౌ అత్ర కాకల్యంతరౌ = నిషాదగాంధారములిందు కాకలీ అంతరములు; పూర్ణశ్చాయం = ఇది సంపూర్ణము; శుద్ధవీరే అస్య ప్రయోగః = శుద్ధవీరమందు దీనికి ప్రయోగము; వీరాద్భుతౌ రసౌ = వీరాద్భుతములు రసములు; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; వర్ణః సంచారీ = సంచారి వర్ణము; ప్రసన్నాంతోఽ లంకారః = ప్రసన్నాంతము అలంకారము; దక్షిణే కలా= దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము

**తాత్పర్యము** : టగరాగము షడ్జాంశన్యాసయుతము, పంచమముఅల్పము. ధైవతీషడ్జమధ్యమములు దీనికి జనకకారణములుగా నిర్దేశింపబడెను.

టక్కరాగము షడ్జగ్రామికము. ధైవతీషడ్జమధ్యమములనుండి పుట్టుటవలన షడ్జము దీనికి గ్రహము, అంశము, నాస్యమును, నిషాదపంచమములకు ఇందు అల్పత. నిషాదగాంధారములిందు కాకలీ అంతరములు. ఇదిసంపూర్ణము, శుద్ధవీరమందు దీనికి ప్రయోగము. వీరాద్భుతములు రసములు. షడ్జాది మూర్ఛన. సంచారివర్ణము ప్రసన్నాంతము అలంకారము. దక్షిణమందు కల,

వార్తికమందు కల, చిత్రమందు కల స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము.

**అంశశ్చ షడ్జో న్యాసశ్చ కారణం షడ్జమధ్యమా ।**
**సౌవీరకస్య గాంధారో నిషాదశ్చాపి దుర్బలః ॥** 340

**ప్రతిపదార్థము** : సౌవీరకస్య = సౌవీరకమునకు; షడ్జః అంశః న్యాసశ్చ = షడ్జము అంశము, న్యాసమును; షడ్జమధ్యమా కారణం = షడ్జమధ్యమ జనకము; గాంధారః నిషాదశ్చాపి దుర్బలః = గాంధార నిషాదములు అల్పములు

**తాత్పర్యము** : సౌవీరకమునకు, షడ్జముఅంశము, న్యాసమును; షడ్జమధ్యమ జనకము. గాంధారనిషాదములు అల్పములు

అస్యార్థః - సౌవీరకః షడ్జగ్రామసంబంధః = సౌవీరము షడ్జగ్రామసంబంధితము; షడ్జమధ్యమాజాతేః జాతత్వాత్ = షడ్జమధ్యమజాతినుండి పుట్టుటవలన; షడ్జోఽస్యగ్రహోఽంశో న్యాసశ్చ = షడ్జగ్రహము న్యాసము, అంశమును; గాంధార నిషాదయోరల్పత్వం = గాంధార నిషాదములకు అల్పత; నిషాదః కాకలీ = కాకలీనిషాదము; పూర్ణశ్చాయం = ఇదిసంపూర్ణము; గృహమేధినాం సంయమినాం తాపసానాం చ ప్రవేశాదికే చరితే శాంతరసేవాస్యవినియోగః = గృహస్థులయొక్క, యతులయొక్క, మునులయొక్క ప్రవేశాదికమందు, చరిత్రయందు శాంతరసమందు వినియోగము; వీరాదికో రసః = వీరాదిక రసము; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; ప్రసన్నాదిరలంకారః = అలంకారము ప్రసన్నాది; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటేతాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటతాలము.

సౌవీరము షడ్జగ్రామసంబంధితము. షడ్జమధ్యమజాతినుండి పుట్టుటవలన షడ్జగ్రహము న్యాసము, అంశమును; గాంధార నిషాదములకు అల్పత. కాకలీ నిషాదము. ఇది సంపూర్ణము. గృహస్థులయొక్క,యతులయొక్క, మునులయొక్క, ప్రవేశాదికమందు,చరిత్రయందు శాంతరసమందు వినియోగము. వీరాదికరసము షడ్జాది మూర్ఛన, వర్ణమారోహి, అలంకారము ప్రసన్నాది, దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల,

స్వరపదగీతయందు చచ్చత్పుటతాలము.

**పంచమాంశస్తదంశ్చ పంచమీమధ్యమోద్భవః ।**
**స్వల్పద్విశ్రుతికశ్చైవ జ్ఞేయో మాలవపంచమః ॥** 341

**ప్రతిపదార్థము** : మాలవపంచమః = మాలవపంచమము; పంచమాంశః = పంచమాంశము; తదంతశ్చ = పంచమాంతమును; పంచమీమధ్యమోద్భవః = పంచమీ మధ్యమజనితము; స్వల్పద్విశ్రుతికః = అల్పద్విశ్రుతికముగా; జ్ఞేయః = తెలియదగినది

**తాత్పర్యము** : మాలవపంచమము పంచమాంశము పంచమాంతమును పంచమీ మధ్యమజనితములుఅల్పద్విశ్రుతికముగాతెలియదగినది.

అస్యార్థః - మాలవపంచమో మధ్యమగ్రామసంబంధః = మధ్యమగ్రామ సంబంధితము; మధ్యమాపంచమీసముత్పన్నత్వాత్ = మధ్యమపంచమిలనుండి పుట్టుటవలన; పంచమోంశో గ్రహోన్యాసశ్చ = పంచమము అంశము గ్రహము న్యాసమును; నిషాదోత్ర కాకలీ = ఇందు కాకలీ నిషాదము; పూర్ణస్వరశ్చాయం= ఇది సంపూర్ణము; విప్రలంభశృంగారే కంచుకిప్రవేశే చాస్య వినియోగః = విప్రలంభశృంగారమందును, కంచుకి ప్రవేశమందును దీనికి వినియోగము; పంచమాది మూర్ఛనా = పంచమాది మూర్ఛన; రసౌ శృంగారహాస్యౌ = శృంగారహాస్యరసములు; ఆరోహ్యాది వర్ణః = ఆదివర్ణము ఆరోహి; ప్రసన్నాదిరలంకారః = అలంకారము ప్రసన్నాది; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాది తాలము

మాలవపంచమము మధ్యమగ్రామసంబంధితము మధ్యమాపంచమిల నుండి పుట్టుటవలన పంచమము అంశము గ్రహము న్యాసమును; ఇందు కాకలీ నిషాదము ఇది సంపూర్ణము. విప్రలంభశృంగారమందు, కంచుకిప్రవేశమందును దీనికి వినియోగము పంచమాది మూర్ఛన .శృంగారహాస్యరసములు. ఆదివర్ణము ఆరోహి అలంకారముప్రసన్నాది. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము.

**మధ్యమాంశ స్తథాన్యాసః కారణం షడ్జమధ్యమా ।**
**ద్విశ్రుతిభ్యాం విహీనస్తు భవేత్ వేసరషాడబః ॥** 342

**ప్రతిపదార్థము** : వేసరషాడబః = వేసరషాడవము; మధ్యమాంశః మధ్యమాంశము; తథాన్యాసః = మధ్యమన్యాసము; షడ్జమధ్యమాకారణం = షడ్జమధ్యమాజనితము; ద్విశ్రుతిభ్యాం విహీనః భవేత్ =ద్విశ్రుతులచే రహితమగును

**తాత్పర్యము** : వేసరషావము, మధ్యమాంశము, మధ్యమన్యాసము, షడ్జమధ్యమజనితము. ద్విశ్రుతులచే రహితమగును.

అస్యార్థః - వేసరషాడబః షడ్జగ్రామసంబంధః =వేసరషాడబము షడ్జగ్రామికము; షడ్జమధ్యమాజాతత్వాత్ = షడ్జమధ్యమమునుండిపుట్టుటవలన; మద్యమోంశో గ్రహోన్యాసశ్చ = మధ్యమాంశము గ్రహము న్యాసమును; (గాందారనిషాద యోరల్పత్వం = గాంధారనిషాదములకు అల్పత) గాంధారనిషాదౌ కాకల్యంతరౌ = గాంధార నిషాదములుకాకల్యంతరములు; నిత్యం పూర్ణస్వరశ్చాయం = సదా ఇది పూర్ణస్వరము; శాంతరసేచాస్య ప్రయోగః = శాంతరసమందు దీని వినియోగము; శృంగారహాస్యౌరసౌ = శృంగారహాస్యములు రసములు; మధ్యమాది మూర్ఛనా = మధ్యమాది మూర్ఛన; ఆరోహివర్ణః = వర్ణమారోహి; ప్రసన్నాదిరలంకారః = అలంకారము ప్రసన్నాది; దక్షిణేకలా = దక్షిణమందుకలా; వార్తికేకలా = వార్తికమందుకలా; చిత్రేకలా = చిత్రమందుకలా;స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాది తాలము.

వేసరషాడబము షడ్జమధ్యమము నుండి పుట్టుటవలన మధ్యమాంశము గ్రహము న్యాసమును (గాంధారనిషాదములకు అల్పత) గాంధార నిషాదములు కాకల్యంతరములు. సదా ఇది సంపూర్ణస్వరము. శాంతరసమందు దీని వినియోగము. శృంగారహాస్యములు రసములు. మధ్యమాది మూర్ఛన వర్ణమారోహి. అలంకారము ప్రసన్నాది. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము.

**స్యాత్ షడ్జమధ్యమజాతేః పంచమ్యాశ్చ వినిర్గతః ।**
**బోట్టరాగశ్చ విజ్ఞేయః పంచమోంశోఽంతమధ్యమః ॥** 343

**ప్రతిపదార్థము** : బోట్టరాగః షడ్జమధ్యమజాతేః సముద్భూతః =బోట్టరాగము

షడ్జమధ్యమజాతినుండి జనించినది; పంచమ్యావినిర్గతః = పంచమముచే వినిర్గతము; పంచమః అంశః = పంచమాంశము; మధ్యమాంతః = మధ్యమాంతముగా; విజ్ఞేయః = తెలియదగినది

**తాత్పర్యము** : బోట్టరాగము షడ్జమధ్యమజాతినుండిజనించినది. పంచమముచే వినిర్గితము, పంచమాంశము. మధ్యమాంతముగా తెలియదగినది.

అస్యార్థః - బోట్టరాగః షడ్జగ్రామసంబంధః = బోట్టరాగము షడ్జగ్రామసంబంధితము; షడ్జమధ్యమాపంచమీజాత్యో జాతత్వాత్ = షడ్జమధ్యమాపంచమీజాతులనుండి పుట్టుటవలన; యద్యపి ఉభయగ్రామసంభూతజాతిద్వయసముత్పన్నః = రెండు గ్రామములనుండి పుట్టిన జాతిద్వయమునుండి పుట్టినదయినను; తథాపి పంచమస్య చతుః శ్రుతికత్వాత్ షడ్జగ్రామసంబంధః = పంచమమునకు చతుః శ్రుతికత్వము వలన షడ్జగ్రామసంబంధము; పంచమో గ్రహోఽ ంశశ్చ = పంచమగ్రహము, అంశమును; మధ్యమోన్యాసః = మధ్యమన్యాసము; నిషాదగాంధారమోరల్పత్వం= నిషాదగాంధారములకు అల్పత; నిషాదోఽత్ర కాకలీ = ఇందు నిషాదము కాకలి; పూర్ణస్వరశ్చాయం = ఇది పూర్ణస్వరము; ఉత్సవే చాస్య వినియోగః = ఉత్సవమందు దీనికి వినియోగము; శాంతాదికో రసః= శాంతాదిరసము; పంచమాది మూర్ఛనా = పంచమాది మూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; ప్రసన్నాంతోఽ లంకారః = అలంకారము ప్రసన్నాంతము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము.

బోట్టరాగము షడ్జగ్రామసంబంధితము. షడ్జమధ్యమాపంచమీజాతులనుండి పుట్టుటవలన రెండు గ్రామములనుండి పుట్టిన జాతిద్వయమునుండి పుట్టినదయినను, పంచమమునకు చతుఃశ్రుతికత్వము వలన షడ్జగ్రామసంబంధము. పంచమగ్రహము, అంశమును; మధ్యమన్యాసము నిషాదగాంధారములకు అల్పత. ఇందు నిషాదముకాకలి. ఇది పూర్ణస్వరము. ఉత్సవమందు దీనికి వినియోగము. శాంతాదిరసము పంచమాది మూర్ఛన.

వర్ణమారోహి. అలంకారము ప్రసన్నాంతము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము.

షడ్జాంశన్యాససంయుక్తో ధైవతర్షభవర్జితః ।
ధైవత్యార్షభికాత్యక్తో భిందోలః ప్రేక్షకే భవేత్ ॥ 344

**ప్రతిపదార్థము** : భిందోలః = బిందోలము; షడ్జాంశన్యాససంయుక్తః = షడ్జాంశము న్యాసముతో కూడినది; ధైవతర్షభవర్జితః = ధైవతరిషభ వర్జితము; ధైవత్యార్షభికాత్యక్తః = ధైవతీ ఆర్షభిలచేతను విసర్జితము; ప్రేక్షకే భవేత్ = ప్రేక్షక మందగును

**తాత్పర్యము** : భిందోలము, షడ్జాంశమున్యాసముతో కూడినది; ధైవతరిషభవర్జితము ధైవతీఆర్షభిలచేతను విసర్జితము. ప్రేక్షకమందగును.

అస్యార్థః - భిందోలకో మధ్యమగ్రామసంబంధః = బిందోలకము మధ్యమగ్రామసంబంధితము; ధైవత్యార్షభీరహితః = ధైవత ఆర్షభీరహితము; ఉభయ గ్రామసంబంధశేషస్వరాఖ్యజాతిసముత్పన్నత్వాత్ ఉభయగ్రామికత్వమేవ యుక్తం = ఉభయగ్రామసంబంధ శేషస్వరమనుజాతివలన పుట్టుటచే ఉభయగ్రామసంబంధిత్వమే యోగ్యము; కథం మధ్యమగ్రామాశ్రిత ఇతి = మధ్యమగ్రామాశ్రితము ఎట్లగుచున్నది?; ధైవతర్షభహీనత్వాత్ మధ్యమగ్రామసంబంధ ఏవ = ధైవతరిషభ రాహిత్యమువలన మధ్యమగ్రామమునకు సంబంధించినదియే; భరతకోహలాదిభిః ఆచార్యైః షడ్జగ్రామధైవతర్షభలోపస్యానిష్టత్వాత్ కేచిత్ షడ్జగ్రామాశ్రిత ఏవాయమితి మన్యంతే = భరతకోహలాద్యాచార్యులచే షడ్జగ్రామధైవతర్షభలోపమునకు ఇష్టపడకపోవుటవలన కొందరు ఇది షడ్జగ్రామాశ్రితమనియే తలచుచున్నారు; చతుఃశ్రుతికస్య పంచమస్య అత్ర ఉపలంభాత్ = చతుః శ్రుతికపంచమము ఇక్కడ దొరుకుటవలన; ధైవతస్యచ అనాశిత్వం తానవిషయమేవ ద్రష్టవ్యం న సర్వత్రేతి = ధైవతమునకు నాశరహితత్వము తానవిషయముననే గాని అంతటకాదు అని; ఏతచ్చ అయుక్తం = అది సరియైనది కాదు; ఏవం హి సతి గ్రామమూర్ఛనాభేదో న స్యాదితి = ఇట్లయినచో గ్రామమూర్ఛనా భేదముండదు అని; షడ్జోస్య గ్రహోంశో న్యాసశ్చ = షడ్జము దీనికి గ్రహము అంశము న్యాసమును; నిషాదోత్ర కాకలీ = ఇందు

కాకలి నిషాదము; ధైవతఋషభహీనం ఔడువితం = ధైవతరిషభరహితమైన ఔడువితము; సంభోగశృంగారేఽస్య వినియోగః = సంభోగశృంగారమందు దీనికి వినియోగము; వీరాదిరసః = వీరాది రసము; మూర్ఛనా షడ్జాదిః = షడ్జాది మూర్ఛన; వర్ణఃఆరోహి = ఆరోహి వర్ణము; ప్రసన్నాదిరలంకారః = అలంకారము ప్రసన్నాది; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికేకలా = వార్తికమందు కల; చిత్రేకలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము.

భిందోలకము మధ్యమగ్రామసంబంధితము. ధైవతతీ ఆర్షభీరహితము. ఉభయగ్రామసంబంధ శేషస్వరమను జాతివలన పుట్టుటచే ఉభయ గ్రామసంబంధిత్వమే యోగ్యము. మధ్యమగ్రామాశ్రితము ఎట్లగుచున్నది? ధైవతరిషభరాహిత్యమువలన మధ్యమగ్రామమునకు సంబంధించినదియే. భరతకోహలాద్యాచార్యులచే షడ్జగ్రామధైవతర్షభలోపమునకు ఇష్టపడకపోవుటవలన కొందరు ఇది షడ్జగ్రామాశ్రితమనియే తలచుచున్నారు. చతుః శ్రుతికపంచమము ఇక్కడ దొరుకుటవలన ధైవతమునకు నాశరహితత్వము తాన విషయముననే గాని అంతటకాదు- అని; అది సరియైనది కాదు. ఇట్లయినచో గ్రామమూర్ఛనాభేదముండదుఅని; షడ్జము దీనికి గ్రహము, అంశము, న్యాసమును, ఇందు కాకలి నిషాదము, ధైవతరిషభరహితమైన ఔడువితము. సంభోగశృంగారమందు దీనికి వినియోగము. వీరాదిరసము. షడ్జాది మూర్ఛన. ఆరోహి వర్ణము అలంకారము ప్రసన్నాది. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము.

**ధైవతాంశస్తదంతశ్చ స్వల్పద్విశ్రుతిక స్వరః ।**
**ధైవతీమధ్యమాజాత్యోః సంజాతాష్టక కైశికః ॥ 345**

**ప్రతిపదార్థము :** అట్టకైశికః = అట్టకైశికము, ధైవతాంశః = ధైవతాంశము; తదంతశ్చ = ధైవతాంతమును; స్వల్పద్విశ్రుతికస్వరః = అల్పద్విశ్రుతిస్వరము కలది; ధైవతీమధ్యమాజాత్యోః సంజాతా = ధైవతీమధ్యమాజాతులనుండి ఉద్భవించినది

తాత్పర్యము : అట్టకైశికము ధైవతాంశము, ధైవతాంతమును; అల్పద్విశ్రుతిస్వరము కలది. ధైవతీమధ్యమాజాత్యోః సంజాతా = ధైవతీ మధ్యమాజాతులనుండి ఉద్భవించినది.

అస్యార్థః - ధైవతీమధ్యమాజాత్యోః జాతత్వాత్ అట్టకైశికః షడ్జగ్రామసంబంధః = ధైవతీ మధ్యమాజాతిజనితమగుటవలన అట్టకైశికము షడ్జగ్రామికము; నను ఉభయగ్రామసంబంధిన్యోః జాత్యోః సముత్పన్నోఽయం రాగః షడ్జగ్రామసంబంధ ఇతి కథం వక్తుం యుక్తం? = ఓయీ ! ఉభయగ్రామసంబంధి జాతులనుండి ఈరాగము జనించినది. షడ్జగ్రామసంబంధియని ఎట్లుగా చెప్పవచ్చును?; అస్య ప్రయోగే చతుః శ్రుతిసంబంధః పంచమః ఉపలభ్యతే = దీనిప్రయోగమందు చతుః శ్రుతిపంచమము లభ్యమగుచున్నది; (పంచమే ధైవతేన భిగ్రామయోర్భేద కారణౌ? = పంచమమందు ధైవతముచే భిన్నగ్రమములకు భేదకారణము?) అతః పంచమస్య చతుఃశ్రుతికత్వాత్ షడ్జగ్రామసంబంధ ఏవాయం రాగః = అందువలన పంచమమునకు చతుఃశ్రుతికత్వమువలన ఈరాగము షడ్జగ్రామ సంబంధితమేయగుచున్నది; గ్రహోంశో న్యాసశ్చ ధైవతః = ధైవతము గ్రహము అంశము న్యాసమును; నిషాదగాంధారౌచాత్ర కాకల్యంతరౌ = నిషాదగాంధారములిందు కాకల్యంతరములు; పూర్ణస్వరశ్చాయం = ఇది సంపూర్ణస్వరము; కశ్యపమతే నిషాదగాంధారయోః లోపాత్ అయం ఔడుబితః = కశ్యపమతమందు నిషాదగాంధారములలోపమువలన ఇది ఔడవరాగము; ఉద్భటనాట్యే కామగ్రస్త తత్కంచుకిప్రవేశే చాస్య వినియోగః = ఉద్భటనాట్యమందు కామగ్రస్తమైన కంచుకిప్రవేశమందును దీనికి వినియోగము; బీభత్సాదిరసః = బీభత్సాదిరసము; మధ్యమాది ధైవతా(?) మూర్ఛనా = మధ్యమాది ధైవతము(?) మూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; దక్షిణే కలా వార్త్తికే కలా చిత్రే కలా; = దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము.

ధైవతీమధ్యమాజాతిజనితమగుటవలన అట్టకైశికము షడ్జగ్రామికము. ఓయీ ! ఉభయగ్రామసంబంధిజాతులనుండి ఈరాగము జనించినది. షడ్జగ్రామ

సంబంధియని ఎట్లుగాచెప్పవచ్చును? దీని ప్రయోగమందు చతుః శ్రుతిపంచమము లభ్యమగుచున్నది. (పంచమమందుధైవతముచే భిగ్రామములకు భేదకారణము?) అందువలన పంచమమునకు చతుః శ్రుతికత్వమువలన ఈరాగము షడ్జగ్రామసంబంధితమే యగుచున్నది. ధైవతము గ్రహము, అంశము, న్యాసమును. నిషాదగాంధారములిందు కాకల్యంతరములు. ఇది సంపూర్ణస్వరము. కశ్యపమతమందు నిషాదగాంధారముల లోపమువలన ఇది ఔడవరాగము. ఉద్భటనాట్యమందు, కామగ్రస్తమైన కంచుకిప్రవేశమందును దీనికి వినియోగము. బీభత్సాదిరసము మధ్యమాదిధైవతము(?) మూర్ఛన. వర్ణమారోహి. దక్షిణమందు కల, వార్త్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము.

**కైశికీ జాతిసంభూతిః షడ్జాంశన్యాససంయుతః ।**
**దుర్బలో ధైవతేన స్యాత్ రాగో మాలవకైశికః ॥** 346

**పంచమం కేచిదిచ్ఛంతి హాస్యాద్యా + + కర్మణి ।**
**గాంధారం చ తథా చాన్యే తద్ధిలక్ష్యే న దృశ్యతే ॥** 347

**ప్రతిపదార్థము** : మాలవకైశికః రాగః = మాలవకైశికరాగము; కైశికీజాతిసంభూతిః = కైశికీజాతినుండి పుట్టినది; షడ్జాంశన్యాససంయుతః = షడ్జఅంశము, న్యాసమును కల్గియున్నది; ధైవతేన దుర్బలం స్యాత్ = ధైవతమల్పము; పంచమం కేచిత్ ఇచ్ఛంతి = పంచమమును కొందరు కోరుచున్నారు. హాస్యాద్యాః = హాస్యాదులు; + + కర్మణి = + + కర్మయందు; అన్యే = మరికొందరు; గాంధారం = గాంధారమును; తథా ఇచ్ఛంతి = అట్లే కోరుచున్నారు; తద్ధి= అది; లక్ష్యే = లక్ష్యమందు; న దృశ్యతే = కనబడలేదు

**తాత్పర్యము** : మాలవకైశికరాగము, కైశికీజాతినుండి పుట్టినది. షడ్జఅంశమున్యాసమును కల్గియున్నది. ధైవతమల్పము. పంచమమును కొందరు కోరుచున్నారు. హాస్యాదులు, కర్మయందు మరికొందరు గాంధారమును అట్లే కోరుచున్నారు. అది అక్ష్యమందు కనబడలేదు.

అస్యార్థః - మాలవకైశికో మధ్యమగ్రామసంబంధః = మాలవకైశికము మధ్యమగ్రామ సంబంధితము; కైశికీజాతేః జాతత్వాత్ = కైశికీజాతినుండి

జనించుటవలన; షడ్జోగ్రహోంశోన్యాసశ్చ = షడ్జగ్రాహము అంశము న్యాసమును; ధైవతస్య అల్పత్వం = ధైవతమునకు అల్పత; ప్రయోగో నిషాదోత్రకాకలిః = ఇందుకాకలినిషాదప్రయోగము; పూర్ణస్వరశ్చాయం = ఇది సంపూర్ణస్వరయుతము; విప్రలంభేశృంగారే చాస్యవినియోగః = విప్రలంభశృంగారమందు దీని వినియోగము; వీరాదికోరసః = వీరరసము; షడ్జాదిమూర్ఛనా = షడ్జాదిమూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; అలంకారః ప్రసన్నమధ్యమః = అలంకారము ప్రసన్నమధ్యమము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రేకలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము; ఇదానీ వేసరాణాం గ్రామవిశేషో దృశ్యతే = ఇప్పుడు వేసరములకు గ్రామవిశేషము చూడబడుచున్నది

మాలవకైశికము మధ్యమగ్రామసంబంధితము, కైశికీజాతినుండిజనించుటవలన షడ్జగ్రహము అంశమున్యాసమును; ధైవతమునకు అల్పత. ఇందు కాకలి నిషాదప్రయోగము. ఇది సంపూర్ణస్వరయుతము. విప్రలంభశృంగారమందు దీని వినియోగము. వీరరసము. షడ్జాదిమూర్ఛన వర్ణమారోహి. అలంకారము. ప్రసన్నమధ్యమము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము, ఇప్పుడు వేసరములకు గ్రామవిశేషము చూడబడుచున్నది.

**టక్కరాగశ్చ సౌవీరస్తథా వై టక్కకైశికః ।**
**బోట్టరాగశ్చ షడ్జాఖ్యే భవేత్ వేసరషాడభః ॥** 348

**హిందోలకస్తు విజ్ఞేయో మధ్యమగ్రామసంభవః ।**
**మాలవపంచమశ్చైవ మాలవకైశికస్తథా ॥** 349

**ప్రతిపదార్థము :** టక్కరాగము, సౌవీరము, టక్కకైశికము, బోట్టరాగము, వేసరషాడబము షడ్జాఖ్యే భవేత్ = షడ్జగ్రామమునందగును; హిందోలకము, మాలవపంచమము మాలవకైశికము; మధ్యమగ్రామసంభవః విజ్ఞేయః = మధ్యమగ్రామజనితము (లు) గా తెలియవలెను

**తాత్పర్యము :** టక్కరాగము, సౌవీరము, టక్కకైశికము, బోట్టరాగము,

వేసరషాడబము, షడ్జగ్రామమునందగును. హిందోలకము, మాలవ పంచమము, మాలవకైశికము మధ్యమగ్రామ జనితము (లు)గా తెలియువలెను.

ఇతి వేసరకాఃప్రోక్తాః సర్వే నిశ్చితలక్షణాః ।
స్వరాణాం దృశ్యతే వేగః తేన వేగస్వరాః స్మృతాః ॥ 350

శుద్ధా భిన్నాశ్చ గౌడాశ్చ తథా వేగస్వరాః పరే ।
కథితాః సాంప్రతం వక్ష్యే సప్త సాధారణాంస్తతః ॥ 351

**ప్రతిపదార్థము** : ఇతి = ఈవిధముగా; నిశ్చితలక్షణాః = నిర్ణీతలక్షణములుకల; సర్వే వేసరకాః ప్రోక్తాః = అన్ని వేసరములు చెప్పబడినవి; స్వరాణాం వేగః దృశ్యతే = స్వరములకు వేగము కనబడుచున్నది, తేన వేగస్వరాః స్మృతాః = అందుచే వేగ స్వరములుగా భావింపబడినవి; శుద్ధాః = శుద్ధములు; భిన్నాః = భిన్నములు; గౌడాః = గౌడరాగములు; తథా =అట్లే; వేగస్వరాః = వేసరములు; కథితాః = చెప్పబడినవి; సాంప్రతం = ఇప్పుడు; సప్త సాధారణాన్ వక్ష్యే = ఏడు సాధారణములను చెప్పుచున్నాను

**తాత్పర్యము** : ఈవిధముగా నిర్ణీతలక్షణములుకల అన్నివేసరములు చెప్పబడినవి. స్వరములకు వేగముకనబడుచున్నది. అందుచే వేగస్వరములుగా భావింపబడినవి. శుద్ధములు, భిన్నములు, గౌడరాగములు, అట్లే వేసరములు చెప్పబడినవి. ఇప్పుడు ఏడు సాధారణములను చెప్పుచున్నాను.

ననుసాధారణానాం కథం సాధారణత్వం = ఓయీ ! సాధారణములకెట్లు సాధారణత్వము సిద్ధించినది?; ఉచ్యతే = చెప్పబడుచున్నది; పూర్వోక్తానాం సర్వేషాం రాగాణాం యా గీతయః తాభిః జాయమానత్వాత్ తేషాం సాధారణత్వం = పూర్వముచెప్పబడిన అన్నిరాగములయొక్క యేగీతులున్నవో వాటిచే జనించబడుట వలన వాటికి సాధారణత్వము; ఏతత్ సాధారణగీత్యా గీయమానత్వాత్ = ఇదిసాధారణ గీతిచే గానముచేయబడుట వలన; తథా చాహ కశ్యపః = కశ్యపుడట్లే చెప్పుచున్నాడు -

ఓయీ ! సాధారణములకెట్లు సాధారణత్వము సిద్ధించినది? చెప్పబడుచున్నది. పూర్వముచెప్పబడిన అన్నిరాగములయొక్క యేగీతులున్నవో

వాటిచే జనించబడుటవలన వాటికి సాధారణత్వము. ఇది సాధారణ గీతిచే గానముచేయబడుటవలన;

కశ్యపుడట్లే చెప్పుచున్నాడు -

"పంచ సాధారణాః ప్రోక్తాః సర్వగీతిసమాశ్రయాః ।"

సర్వగీతిసమాశ్రయాః = అన్ని గీతులనాశ్రయించిన; సాధారణాః పంచ ప్రోక్తాః = సాధారణములు పంచవిధములుగా చెప్పబడినవి; నను కాశ్యపమునినా నర్తరాగస్య కిమిత్యాదౌ నిర్దేశః కృతః? = ఓయీ । కాశ్యపమహర్షి చేత నర్తరాగమునకు ఎందువలన మొదట నిర్దేశముచేయబడినది?; ఉచ్యతే = చెప్పబడుచున్నది; ఉద్భటచారిమండలాదౌ వినియుజ్యమానత్వాత్ ముఖ్యత్వమితి కశ్యపమతే = ఉద్భటచారిమండలాదులందువినియోగింపబడుట వలన ముఖ్యత్వమని కశ్యపమతమునందు; దుర్గశక్తిమతే తు షడ్జకైశిక ఏవముఖ్యః = దుర్గశక్తిమతమునమాత్రము షడ్జకైశికయేముఖ్యము; కుతః = ఎందుకు?; షాడబత్వేన క్రమాయతత్వాత్ = షాడవత్వముచే క్రమాగమనమువలన; తద్యథా = అదిఎట్లనగా-

**తాత్పర్యము** : అన్నిగీతులనాశ్రయించిన సాధారణములు పంచవిధములుగా చెప్పబడినవి. ఓయీ । కాశ్యపమహర్షిచేత నర్తకరాగమునకు ఎందువలనమొదట నిర్దేశముచేయబడినది ? చెప్పబడుచున్నది. ఉద్భటచారిమండలాదులందు వినియోగింపబడుటవలన ముఖ్యత్వమని కశ్యపమతమునందు; దుర్గశక్తిమతమునందు మాత్రము షడ్జకైశికయే ముఖ్యము. ఎందుకు? షాడవత్వముచే క్రమాగమనమువలన; అది ఎట్లనగా -

**పంచమాంశో మధ్యమాంతః పంచమీమధ్యమోద్భవః ।**
**నర్తరాగస్తు విజ్ఞేయః స్వల్పద్విశ్రుతికస్వరః ॥** 352

**ప్రతిపదార్థము** : నర్తరాగః = నర్తరాగము; పంచమాంశః = పంచమాంశము; మధ్యమాంతః = మధ్యమాంతము; పంచమీమధ్యమోద్భవః = పంచమీమధ్యమము నుండిపుట్టినది; స్వల్ప ద్విశ్రుతికస్వరః = అల్పద్విశ్రుతిస్వరముకలదిగా; విజ్ఞేయః = తెలియదగినది

**తాత్పర్యము** : నర్తరాగము పంచమాంశము, మధ్యమాంతము, పంచమీమధ్యమము నుండి పుట్టినది. అల్పద్విశ్రుతిస్వరముకలదిగా తెలియదగినది.

అస్యార్థః - నర్తరాగః మధ్యమగ్రామసంబంధః = నర్తరాగము మధ్యమగ్రామ సంబంధము కలది; పంచమీమధ్యమోద్భవత్వాత్ = పంచమీ మధ్యమోద్భవమువలన; పంచమో గ్రహోఽంశశ్చ = పంచమగ్రహము అంశమును; మధ్యమో న్యాసః = మధ్యమన్యాసము; నిషాదగాంధారయోరల్పత్వం = నిసాదగాంధారములకు స్వల్పత; నిషాదోఽత్ర కాకలీ = ఇందు కాకలినిషాదము; ఉద్ఘటాచారిమండలాదౌ చాస్య వినియోగః = ఉద్ఘటాచారిమండలాదులందు వినియోగము; శృంగారాదిరసః = శృంగాదిరసము; పంచమాదిమూర్ఛనా = పంచమాది మూర్ఛన; అలంకారః ప్రసన్నమధ్యమః = అలంకారము ప్రసన్నమధ్యమము; వర్ణః సంచారీ ఇతి కశ్యపమతే = కశ్యపమునిమతము నందువర్ణము సంచారి; దుర్గశక్తిమతే తు అయమేవ రాగః పంచమీ ధైవతీజాత్యోర్జాయతే = దుర్గశక్తిమంతమునందు ఈరాగమే పంచమీ ధైవతీజాతిసముద్భవము; షడ్జగ్రామ సంబంధ ఏవ బోద్ధవ్యః = షడ్జగ్రామసంబంధమనియే తెలియదగిది; కుతః = ఎందుకు?; పంచమస్య చతుః శ్రుతికత్వాత్, ధైవతస్య త్రిశ్రుతికత్వాత్ షడ్జగ్రామసంబంధః = పంచమమునకు చతుః శ్రుతివలనను, ధైవతమునకు త్రిశ్రుతివలనను షడ్జమగ్రామ సంబంధము

నర్తరాగము మధ్యమగ్రామ సంబంధముకలది. పంచమీమధ్యమోద్భవమువలన పంచమగ్రహము అంశమును మధ్యమన్యాసము; నిషాదగాంధారములకు స్వల్పత. ఇందుకాకలినిషాదము. ఉద్ఘటాచారిమండలాదులందు వినియోగము. శృంగారాది రసము. పంచమాదిమూర్ఛన, అలంకారము ప్రసన్నమధ్యమము. కశ్యపముని మతమునందు వర్ణము సంచారి. దుర్గశక్తి మతమునందు ఈరాగమే పంచమీధైవతీ జాతిసముద్భవము. షడ్జగ్రామసంబంధమనియే తెలియదగినది ఎందుకు? పంచమమునకు చతుఃశ్రుతివలనను, ధైవతమునకు త్రిశ్రుతివలనను షడ్జగ్రామసంబంధము.

స్యాత్ షాడ్జీధైవతీజాత్యోః షడ్జన్యాసాంశ సంయుతః ।
దుర్బలః పంచమో యత్ర సశకః పరికీర్తితః ॥ 353

**ప్రతిపదార్థము :** యత్ర = ఎచట; షాడ్జీధైవతీ జాత్యోః = షాడ్జీధైవతీ జాతులనుండి పుట్టినది. షడ్జన్యాసాంశసంయుతః = షడ్జన్యాస అంశయుతము; పంచమః దుర్బలః = పంచమమల్పము; స్యాత్ = అగునో; సఃశకః = శకరాగముగ; పరికీర్తితః = నిషాదము కాకలిగాచెప్పబడినది

**తాత్పర్యము** : ఎచట షాడ్జీధైవతీజాతులనుండి పుట్టినది. షడ్జన్యాస అంశయుతము పంచమల్పము అగునో అది శకరాగముగ చెప్పబడినది.

అస్యార్థః - శకః షడ్జగ్రామసంబంధః = శకము గ్రామికము; షాడ్జీధైవతీ సముత్పన్నత్వాత్ = షాడ్జిధైవతులనుండి పుట్టుటవలన; షడ్జోఽస్య గ్రహోంశోన్యాసశ్చ = షడ్జగ్రహము అంశమున్యాసమును; (పంచమస్యాల్పత్వం= పంచమమునకు అల్పత) నిషాదగాంధారౌ చాత్ర కాకల్యంతరౌ = నిషాదగాంధారములిందు కాకల్యంతరములు; పూర్ణస్వరశ్చాయం = ఇది పూర్ణస్వరముకలది; వీరాద్భుతేహాస్యే నిర్వహణే చాస్య వినియోగః = వీరాద్భుతములందు హాస్యనిర్వహణమందు దీని వినియోగము; వీరాదికో రసః = వీరాదికము రసము; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; ప్రసన్నమధ్యోఽలంకారః = ప్రసన్నమధ్యమలంకారము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము

శకము షడ్జగ్రామికము. షాడ్జిధైవతులనుండి పుట్టుటవలన షడ్జగ్రహము అంశము న్యాసము (పంచమమునకు అల్పత) నిషాదగాంధారములిందు కాకల్యంతరములు. ఇది పూర్ణస్వరముకలది, వీరాద్భుతములందు హాస్యనిర్వహణమందు దీని వినియోగము. వీరాదికము రసము షడ్జాది మూర్ఛన, వర్ణమారోహి. ప్రసన్నమధ్యమాలంకారము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతియందు చచ్చత్పుటాది తాలము.

మధ్యమాపంచమీజాత్యో ర్లైవత్యాశ్చ వినిస్సృతః ।
కకుభః పంచమన్యాసో ధైవతాంశస్తు నిర్మితః ॥ 354

**ప్రతిపదార్థము :** కకుభః = కకుభము; మధ్యమాపంచమీజాత్యోః ధైవత్యాశ్చ = మధ్యమాపంచమీ ధైవతీజాతులనుండి; వినిస్సృతః = జనించినది; పంచమన్యాసః = పంచమన్యాసము; ధైవతాంశః నిర్మితః = ధైవతాంశముగా నిర్మితము

**తాత్పర్యము :** కకుభము మధ్యమాపంచమీ ధైవతీజాతులనుండి జనించినది, పంచమన్యాసము, ధైవతాంశముగా నిర్మితము.

అస్యార్థః - కకుభః షడ్జగ్రామసంబంధః = కకుభము షడ్జగ్రామికము; మధ్యమాపంచమీధైవతీసముత్పన్నోపి షడ్జగ్రామ ఏవ = మధ్యమాపంచమీ ధైవతులనుండి పుట్టినను షడ్జగ్రామమే; కుతః = ఎందుకు?; పంచమస్య చతుః శ్రుతికత్వాత్ = పంచమమునకు చతుః శ్రుతివలనను; ధైవతస్య శ్రుతికత్వాచ్చ= ధైవతమునకు శ్రుతికత్వమువలనను; ధైవతోస్య అంశో గ్రహశ్చ = ధైవతము దీనికి అంశము గ్రహమును; పంచమో న్యాసః = పంచమన్యాసము; పూర్ణస్వరశ్చాయం = ఇది పూర్ణస్వరము; మధ్యమకరణే అస్య వినియోగః = మధ్యమకరణమందు దీని వినియోగము; కరుణోఽస్య రసః = దీనికి కరుణరసము; ధైవతాదిమూర్ఛనా = ధైవతాది మూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; ప్రసన్నమధ్యోలంకారః = అలంకారము ప్రసన్నమధ్యము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము.

కకుభము షడ్జగ్రామికము,మధ్యమాపంచమీధైవతులనుండి పుట్టినను షడ్జగ్రామమే ఎందుకు? పంచమమునకు చతుఃశ్రుతివలనను, ధైవతమునకుశ్రుతికత్వము వలనను, ధైవతము దీనికి అంశముగ్రహమును, పంచమన్యాసము. ఇదిపూర్ణస్వరము. మధ్యమకరణమందు దీని వినియోగము. దీనికి కరుణరసము. ధైవతాది మూర్ఛన, వర్ణమరోహి. అలంకారము ప్రసన్నమధ్యము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము.

షడ్జాంశో మధ్యమన్యాసః స్వల్పద్విశ్రుతికస్వరః ।
శుద్ధమధ్యమికాజాతేర్భవేత్ భమ్మాణపంచమః ॥ 355

**ప్రతిపదార్థము** : భమ్మాణపంచమః = భమ్మాణ పంచమము; షడ్జాంశః = షడ్జాంశము; మధ్యమన్యాసః = మధ్యమన్యాసము; స్వల్పద్విశ్రుతికస్వరః = అల్పద్విశ్రుతిస్వరము; శుద్ధమధ్యమికాజాతేః భవేత్ = శుద్ధమధ్యమికాజాతినుండి ఉద్భవించినది

**తాత్పర్యము** : భమ్మాణపంచమము, షడ్జాంశము, మధ్యమన్యాసము. అల్పద్విశ్రుతిస్వరము. శుద్ధమధ్యమికాజాతినుండి ఉద్భవించినది.

అస్యార్థః - భమ్మాణపంచమో మధ్యమగ్రామసంబంధః = భమ్మాణపంచమము మధ్యమగ్రామసంబంధితము; శుద్ధమధ్యజాతేః సముత్పన్నత్వాత్ = శుద్ధమధ్యమాజాతిజనితము కనుక; షడ్జః = షడ్జము; గ్రహోఽంశశ్చ = గ్రహము అంశమును; మధ్యమో న్యాసః = మధ్యమన్యాసము; నిషాదగాంధారయోరల్పత్వం = నిషాదగాంధారములకు అల్పత; నిషాదోఽత్ర కాకలీ = ఇందు కాకలినిసాదము; పూర్ణస్వరశ్చాయం = ఇది పూర్ణస్వరము; పథి గ్రీష్మేశ్రాంతేష్వరణ్యేషు చాస్య వినియోగః = మార్గమందు, గ్రీష్మమందు, అరణ్యములందలసినపుడు దీని వినియోగము; వీరాదిరసః = వీరాదిరసము; షడ్జాది మూర్ఛనా = షడ్జాది మూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; ప్రసన్నమధ్యోఽలంకారః = ప్రసన్నమధ్యమలంకారము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతేచచ్చత్పుటాది తాలః = స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము

భమ్మాణ పంచమము మధ్యమగ్రామసంబంధితము. శుద్ధమధ్యమాజాతి జనితము కనుక షడ్జము గ్రహము అంశమును, మధ్యమన్యాసము. నిషాదగాంధారములకు అల్పత. ఇందు కాకలి నిషాదము. ఇది పూర్ణస్వరము. మార్గమందు, గ్రీష్మమందు, అరణ్యములందలసినపుడును దీని వినియోగము; వీరాదిరసము, షడ్జాదిమూర్ఛన, వర్ణమారోహి. ప్రసన్నమధ్యమలంకారము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము.

షడ్జమధ్యానిషాదాభ్యాం రూపసాధారితో భవేత్ ।
షడ్జాంశో మధ్యమన్యాసః పంచమర్షభస్వల్పకః ॥ 356

ప్రతిపదార్థము : రూపసాధారితః = రూపసాధారితము; షడ్జమధ్యానిషాదాభ్యాం= షడ్జమధ్యమానిషాదములనుండి; భవేత్ = జనితమగును; షడ్జాంశః = షడ్జాంశము; మధ్యమన్యాసః = మధ్యమన్యాసము; పంచమర్షభస్వల్పకః = పంచమరిషభాల్పము

**తాత్పర్యము** : రూపసాధారితము, షడ్జమధ్యమానిషాదములనుండి జనితమగును. షడ్జాంశము మధ్యమన్యాసము. పంచమరిషభాల్పము.

అస్యార్థః - రూపసాధారితః షడ్జగ్రామసంబంధః = రూపసాధారితము షడ్జగ్రామ సంబంధితము; షడ్జమధ్యమానిషాదసకాశాదుత్పన్న త్వాత్ = షడ్జమధ్యమనిషాదముల నుండి పుట్టుటవలన; షడ్జోస్యగ్రహోంశశ్చ = షడ్జము దీనికి గ్రహము అంశమును; మధ్యమన్యాసః = మధ్యమన్యాస; (పంచమర్షభయోరల్పత్వం = పంచమరిషభములకు అల్పత); నిషాదోత్ర కాకలీ= ఇందు కాకలీ నిషాదము; పూర్ణశ్చాయం = ఇది సంపూర్ణము; వీరకరుణే అస్యప్రయోగః = వీరకరుణమందు దీనికి ప్రయోగము; వీరాదిరసః = వీరాదిరసము; షడ్జాది మూర్ఛనా = షడ్జాదిమూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; అలంకారః ప్రసన్నమధ్యః = ప్రసన్నమధ్యము అలంకారము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము

రూపసాధారితము షడ్జగ్రామసంబంధితము. షడ్జమధ్యమనిషాదములనుండి పుట్టుటవలన షడ్జముదీనికి గ్రహము, అంశమును మధ్యమన్యాసము. (పంచమరిషభములకు అల్పత). ఇందు కాకలీ నిషాదము ఇది సంపూర్ణము. వీరకరుణమందు దీనికి ప్రయోగము. వీరాదిరసము, షడ్జాది మూర్ఛన వర్ణమారోహి, ప్రసన్నమధ్యమఅలంకారము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము.

గాంధారీరక్తగాంధార్యోర్జాతో గాంధారపంచమః ।
గాంధారోఽ స్య భవేదంశో న్యాసో గాంధార ఏవ చ ॥ 357

ప్రతిపదార్థము : గాంధార పంచమః = గాంధారపంచమము; గాంధారీరక్తగాంధార్యోః జాతః = గాంధారీరక్త గాంధారీజనితము; గాంధారః అంశః = గాంధారమంశము; గాంధార ఏవ న్యాసః = గాంధారమే న్యాసము

తాత్పర్యము : గాంధారపంచమము, గాంధారీరక్తగాంధారీజనితము, గాంధరమంశము, గాంధారమే న్యాసము.

అస్యార్థః - గాంధార పంచమో మధ్యమగ్రామ సంబంధః = గాంధారపంచమము మధ్యగ్రామసంబంధితము; గాంధారీ రక్తగాంధారీ సముత్పన్నత్వాత్ = గాంధారీ రక్త గాంధారులనుండి పుట్టుటవలన; యద్యపిదుర్గశక్తిమతే ధైవతీ సముత్పన్నోసౌ= తథాపి పంచమస్య త్రిశ్రుతికత్వాత్ ఉభయగ్రామజాతిజాతోపి మధ్యమసంబంధ ఏవ = దుర్గశక్తిమతమందు ఇది ధైవత్ సముత్పన్నమైనను పంచమమునకు త్రిశ్రుతికత్వమువలన ఉభయగ్రామజాతిజాతమైనను మధ్యమగ్రామ సంబంధితమే; గాంధారోఽ స్య గ్రహోంశో న్యాసశ్చ = గాంధారముదీనికి గ్రహము అంశమున్యాసమును; ప్రయోక్తృప్రేక్షయా గాంధారో ధైవతోభవేత్ = ప్రయోక్త దృష్టిలో గాంధారము ధైవతమగును; నిషాదోత్ర కాకలీ = ఇందుకాకలీ నిషాదము; పూర్ణశ్చాయం = ఇది సంపూర్ణము; అద్భుతే అస్య వినియోగః = అద్భుతే హాస్యే చాస్య వినియోగః = (అద్భుతమునందు) విస్మయమందు హాస్యమందు దీనికి వినియోగము; కరుణో రసః = కరుణరసము; గాంధారాది మూర్ఛనా = గాంధారాది మూర్ఛన; సంచారీ వర్ణః = సంచారివర్ణము; ప్రసన్నమధ్యోఽ లంకారః = ప్రసన్నమధ్యమలంకారము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతమందు చచ్చత్పుటాది తాలము.

గాంధారపంచమము మధ్యమగ్రామసంబంధితము, గాంధారీరక్తగాంధారులనుండి పుట్టుటవలన దుర్గశక్తిమతమందు ఇది ధైవత సముత్పన్నమైనను పంచమమునకు త్రిశ్రుతికత్వమువలన ఉభయగ్రామజాతిజాతమైనను మధ్యమగ్రామ సంబంధితమే. గాంధారము దీనికి గ్రహము, అంశము, న్యాసమును

ప్రయోక్తదృష్టిలో గాంధారము ధైవతమగును. ఇందు కాకలీనిషాదము ఇదిసంపూర్ణము. (అద్భుతమునందు) విస్మయమందు హాస్యమందు దీనికి వినియోగము. కరుణరసము. గాంధారాది మూర్ఛన. సంచారివర్ణము. ప్రసన్నమధ్యమలంకారము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము.

**ధైవత్యార్షభికాజాత్యోర్జాతః పంచమషాడబః ।**
**ఋషభాంశసమాయుక్తో మధ్యమో న్యాస ఏవ చ ॥ 358**

**ప్రతిపదార్థము** : పంచమషాడబః = పంచమషాడబము; ధైవత్యార్షభికాజాత్యోః జాతః = ధైవతీ ఆర్షభీజాతులనుండి పుట్టినది; ఋషభాంశసమాయుక్తః = రిషభాంశయుతము; మధ్యమః న్యాసః = మధ్యమన్యాసము

**తాత్పర్యము** : పంచమషాడబము, ధైవతీఆర్షభీజాతలనుండి పుట్టినది. రిషభాంశయుతము. మధ్యమన్యాసము.

అస్యార్థః - పంచమషాడబః షడ్జగ్రామసంబంధః = పంచమషాడబము షడ్జగ్రామికము; ఋషభోఽ స్య గ్రహోంశశ్చ = రిషభము దీనికి గ్రహము, అంశమును; మధ్యమో న్యాసః = మధ్యమన్యాసము; ప్రయోక్త్రపేక్షయా క్వచిదంశోపి నిషాదోత్ర కాకలీ = ప్రయోక్తృదృష్టిలో ఒక్కొక్కచోట అంశమైనను నిషాదమిందు కాకలి; పూర్ణశ్చాయం = ఇది సంపూర్ణము; ఉద్భటచారిమండలాదౌవినియోగః = ఉద్భటచారిమండలాదులందు వినియోగము; వీరాదిరసః = వీరాదిరసము; ఋషభాదిమూర్ఛనా = రిషభాదిమూర్ఛన; ప్రసన్నాద్యంతోలంకారః = ప్రసన్నాద్యంతము అలంకారము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా= చిత్రమందు కల; స్వరపదగీతేషు చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము.

పంచమషాడబము షడ్జగ్రామికము. రిషభము దీనికి గ్రహము, అంశమును మధ్యమన్యాసము. ప్రయోక్తృదృష్టిలో ఒక్కొక్కచోట అంశమైనను నిషాదమిందు కాకలి. ఇది సంపూర్ణము. ఉద్భటచారిమండలాదులందు వినియోగము.

వీరాదిరసము. రిషభాది మూర్ఛన. ప్రసన్నాద్యంతము అలంకారము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతమందు చచ్చత్పుటాదితాలము.

**ఋషభాంశోమధ్యమాంతః సంపూర్ణస్వరకస్తథా ।**
**ఆర్షభీమధ్యమాజాత్యోః రేవగుప్తః ప్రకీర్తితః ॥** 359

**ప్రతిపదార్థము** : రేవగుప్తః = రేవగుప్తము; ఋషభాంశః = రిషభాంశము; మధ్యమాంతః = మధ్యమాంతము; సంపూర్ణస్వరకః = సంపూర్ణము; ఆర్షభీమధ్యమాజాత్యోః జాతః = ఆర్షభీమధ్యమాజాతిజనితము (ఇదానీం సాధారణానాం గ్రామవిభాగః ప్రదర్శ్యతే = ఇప్పుడు సాధారణమునకు గ్రామ విభాగము చూపబడుచున్నది-)

రేవగుప్తము షడ్జగ్రామసంబంధితము, ఆర్షభీమధ్యమాజాతులనుండి పుట్టినను పంచమము చతుః శ్రుతికమగుటవలన షడ్జగ్రామసంబంధితమైనదియే రిషభము దీనికి గ్రహము, అంశమును, మధ్యమమేన్యాసము. ఇందు కాకలినిషాదము. ఇది పూర్ణము. ఉద్ఘటచారిమండలాదియందు వినియోగము. వీరాదిరసము. రిషభాది మూర్ఛన. ఆరోహివర్ణము. అలంకారము ప్రసన్నాద్యంతము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, చచ్చత్పుటాదితాలము. (ఇప్పుడు సాధారణమునకు గ్రామవిభాగము చూపబడుచున్నది)

**హర్మాణపంచమే జ్ఞేయో మధ్యమగ్రామసంభవః ।**
**గాంధారపంచమో నర్తః షడ్జకైశిక ఏవ చ ॥** 360

**స్యాత్ షాడ్జీధైవతీజాత్యోష్టక్కరాగస్తు సైంధవః ।**
**షడ్జాంశన్యాససంయుక్తం పంచమేన తు దుర్బలః ॥** 361

**ప్రతిపదార్థము** : హర్మాణపంచమః = హర్మాణ పంచమము; గాంధారపంచమః నర్తః = గాంధారపంచమము నర్తరాగము. మధ్యమగ్రామసంభవః = మధ్యమగ్రామసంభవము; షడ్జకైశికః =షడ్జకైశికము; టక్కరాగః సైంధవః = టక్కసైంధవరాగము; షాడ్జీధైవతీజాత్యోః స్యాత్ = షాడ్జీధైవతీ జాతులనుండి పుట్టినది; షడ్జాంశన్యాస సంయుక్తః = షడ్జాంశన్యాసయుతము; పంచమేన దుర్బలః = పంచమాల్పము

**తాత్పర్యము** : హర్మాణపంచమము గాంధారపంచమము నర్తరాగము మధ్యమగ్రామ సంభవము షడ్జకైశికము. టక్కసైంధవవరాగము, షాడ్జీధైవతీ జాతులనుండి పుట్టినది. షడ్జాంశన్యాసయుతము పంచమాల్పము.

అస్యార్థః - టక్కసైంధవరాగః షడ్జగ్రామసంబంధః = టక్కసైంధవరాగము షడ్జగ్రామసంబంధితము; షాడ్జీధైవతీసముత్పన్నత్వాత్ = షాడ్జీధైవతీజాతులనుండి పుట్టుటవలన; షడ్జోఽ స్యగ్రహోఽ ంశో న్యాసశ్చ = షడ్జము దీనికి గ్రహము అంశము న్యాసము; నిషాదగాంధారౌ చాత్ర కాకల్యంతరౌ = నిషాదగాంధారములు ఇందు కాకలి నిషాదములు; పంచమస్య అల్పత్వం = పంచమమునకు అల్పత; పూర్ణస్వరశ్చాయం = ఇది సంపూర్ణము; శుద్ధవీరే అస్య వినియోగః = శుద్ధవీరమందు దీనికి వినియోగము; వీరాదికోరసః = వీరాదికము రసము; షడ్జాదిమూర్ఛనా = షడ్జాదిమూర్ఛన; ఆరోహీ వర్ణః = వర్ణమారోహి; ప్రసన్నాంతోలంకారః = అలంకారము ప్రసన్నాంతము; దక్షిణే కలా = దక్షిణమందు కల; వార్తికే కలా = వార్తికమందు కల; చిత్రే కలా = చిత్రమందు కల; స్వరపదగీతే చచ్చత్పుటాదితాలః = స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము.

ఇదానీం సాధారణానాం గ్రామవిభాగః ప్రదర్శ్యతే = ఇప్పుడు సాధారణములకు గ్రామవిభాగము చూపబడుచున్నది.

టక్కసైంధవరాగము షడ్జగ్రామసంబంధితము. షాడ్జీధైవతీజాతులనుండి పుట్టుటవలన షడ్జము దీనికి గ్రహము అంశము న్యాసము. నిషాదగాంధారములు ఇందుకాకలినిషాదములు. పంచమమునకు అల్పత. ఇది సంపూర్ణము. శుద్ధవీరమందు దీనికి వినియోగము. వీరాదికము రసము. షడ్జాదిమూర్ఛన. వర్ణమారోహి. అలంకారము ప్రసన్నాంతము. దక్షిణమందు కల, వార్తికమందు కల, చిత్రమందు కల, స్వరపదగీతియందు చచ్చత్పుటాదితాలము. ఇప్పుడు సాధారణములకు గ్రామవిభాగము చూపబడుచున్నది.

**భమ్మాణపంచమో జ్ఞేయో మధ్యమగ్రామసంభవః ।**
**గాంధారపంచమో నర్తః షడ్జకైశిక ఏవ చ ॥ 362**

ప్రతిపదార్థము : భమ్మాణ పంచమము, గాంధారపంచమము, నర్తము, షడ్జకైశికము, మధ్యమగ్రామసంభవః విజ్ఞేయః = మధ్యమగ్రామ జనితము(లు)గా తెలియవలెను

తాత్పర్యము : భమ్మాణ పంచమము, గాంధారపంచమము, నర్తము, షడ్జకైశికము, మధ్యమ గ్రామజనితము(లు)గా తెలియవలెను.

**రూపసాధారితో రాగః శకః కకుభ ఏవచ ।**
**రేవగుప్తస్తు షడ్జాఖ్యే జ్ఞేయః పంచమషాడబః ॥** 363

ప్రతిపదార్థము : రూపసాధారితము శకము, కకుభము, రేవగుప్తము, పంచమషాడబము; షడ్జాఖ్యే జ్ఞేయః = షడ్జగ్రామజనితములని తెలియదగినది

తాత్పర్యము : రూపసాధారితము శకము, కకుభము, రేవగుప్తము, పంచమషాడబము, షడ్జగ్రామజనితములని తెలియదగినది.

**సప్త సాధారణాః ప్రోక్తా గ్రామద్వయసమాశ్రయాః ।**

ప్రతిపదార్థము : సప్త సాధారణాః = ఏడువిధములైన సాధారణరాగములు; గ్రామద్వయ సమాశ్రయాః ప్రోక్తాః = గ్రామద్వయాశ్రయములుగ చెప్పబడినవి; ననుపూర్వోక్తానాం మూర్ఛనా విశేషనిర్దేశః కస్మాత్ జాయత ఇతి = ఓయీ ! ముందుచెప్పబడిన వాటికి మూర్ఛనా విశేషనిర్దేశము ఎక్కడినుండి వచ్చినదని?; ఉచ్యతే = చెప్పబడుచున్నది; (ఆప్తవచనాత్ ) మూర్ఛనావిశేషో జాయతే = (హితుల వచనమువలన) మూర్ఛనా విశేషము కల్గుచున్నది; తథాచాహ కాశ్యపః = కాశ్యపుడట్లే చెప్పుచున్నాడు -

తాత్పర్యము : ఏడు విధములైన సాధారణరాగములు గ్రామద్వయాశ్రయములు చెప్పబడినవి. ఓయీ ! ముందుచెప్పబడినవాటికి మూర్ఛనావిశేషనిర్దేశము ఎక్కడినుండి వచ్చినదని? చెప్పబడుచున్నది. (హితులవచనమువలన) మూర్ఛనావిశేషము కల్గుచున్నది, కాశ్యపుడట్లే చెప్పుచున్నాడు-

**"జ్ఞాత్వా జాత్యంశబాహుళ్యం నిర్దేశ్యా మూర్ఛనా బుధైః" ॥**

ప్రతిపదార్థము : "జాత్యంశబహుళ్యం = జాతి అంశముయొక్క అధికత్వము; జ్ఞాత్వా = తెలిసికొనబడి; బుధైః = పండితులచే; మూర్ఛనా నిర్దేశ్యా = మూర్ఛన

నిర్దేశింపదగినది"।

**తాత్పర్యము** : జాతిఅంశముయొక్క అధికత్వము తెలిసికొనబడి పండితులచే మూర్ఛన నిర్దేశింపదగినది.

నను గీతరాగయోః కో భేదః = మరి గీతరాగములకుగల భేదము ఏమిటి?; ఉచ్యతే = చెప్పబడుచున్నది; దశలక్షణలక్షితంగీతం రాగశబ్దాభిధేయం = దశ (10) లక్షణములతోను లక్షితమైన గీతము రాగశబ్దార్థము; గీతం చతురంగోపేతం = చతురంగములతో కూడినది గీతము; ధ్రువాయోగాత్ పంచవిధం = ధ్రువాయోగమువలన పంచవిధము;కుత ఏవ విజ్ఞాయతే? = ఎలా తెలియబడినది?; ఆప్తవచనాత్ = హితవచనమువలన; తథాచాహ్యా కాశ్యపః = కాశ్యపుడట్లుచెప్పుచున్నాడు -

మరి, గీతరాగములకుగల భేదవేమి? చెప్పబడుచున్నది. దశ (10) లక్షణములతోను లక్షితమైన గీతము రాగశబ్దార్థము, చతురంగములతో కూడినది గీతము. ధ్రువాయోగమువలన పంచవిధము. ఎలాతెలియబడినది? హితవచనమువలన. కాశ్యపుడట్లుచెప్పుచున్నాడు-

**క్వచిదంశః క్వచిన్న్యాసః షాడబౌడువితే క్వచిత్ ।**
**అల్పత్వం చ బహుత్వంచ గ్రహోపన్యాససంయుతమ్ ॥**

**మంద్రతారౌ తథా జ్ఞాత్వా యోజనీయం మనీషిభిః ।**
**గ్రామరాగాః ప్రయోక్తవ్యా విధివద్ దశరూపకే ॥**

**ప్రతిపదార్థము** : క్వచిత్ అంశః = ఒకచోట అంశము; క్వచిత్ న్యాసః = ఒకచోట న్యాసము; క్వచిత్ = ఒకచోట; షాడబ ఔడువితా = షాడవౌడువములు; అల్పత్వం = అల్పత; బహుత్వంచ = బహుత్వమును; గ్రహోపన్యాససంయుతం= గ్రహఅపన్యాస యుతముగా; మంద్రతారౌ జ్ఞాత్వా = మంద్రతారములు తెలిసికొనబడి; మనీషిభిః = పండితులచే; యోజనీయం = కూర్చదగినది; దశరూపకే = దశరూపకమందు; విధివత్ = యథాశాస్త్రముగా; గ్రామరాగాః ప్రయోక్తవ్యాః = గ్రామరాగములు ప్రయోగింపదగినవి

**తాత్పర్యము** : ఒకచోట అంశము, ఒకచోట న్యాసము, ఒకచోట

షాడవౌడువములు, అల్పత, బహుత్వమును; గ్రహ అపన్యాసయుతముగా, మంద్రతారములు తెలిసికొనబడి పండితులచే కూర్చదగినది. దశరూపకమందు యథాశాస్త్రముగా గ్రామరాగములు ప్రయోగింపదగినవి.

> ప్రవేశాక్షేప నిష్క్రామప్రాసాదికమథాంతరమ్ ।
> గానం పంచవిధం యత్తద్రాగైరేభిః ప్రయోజయేత్ ॥

**ప్రతిపదార్థము :** ప్రవేశ, ఆక్షేప, నిష్క్రామ,ప్రాసాదిక, అంతరములు అని, యత్ పంచవిధం గానం తత్ = ఏ ఐదువిధాలైన గానము కలదో దానిని; ఏభిఃరాగైః = ఈరాగములచే; ప్రయోజయేత్ = ప్రయోగించవలయును

**తాత్పర్యము :** ప్రవేశ, ఆక్షేప, నిష్క్రామ, ప్రాసాదిక, అంతరములు - అని ఏ అయిదువిధాలైన గానము కలదో దానిని ఈరాగములచే ప్రయోగించవలయును.

> పూర్వరంగే తు శుద్ధా స్యాత్ భిన్నా ప్రస్తావనాశ్రయా ।
> వేసరాముఖయోః కార్యా గర్భే గౌడీ విధీయతే ॥
> సాధారితావమర్శే స్యాత్ + హణే స్యాత్ + సర్వదా ।?

**ప్రతిపదార్థము :** పూర్వరంగే శుద్ధా స్యాత్ = పూర్వరంగమందు శుద్ధరాగము అగును; భిన్నా ప్రస్తావనాశ్రయా = భిన్నప్రభేదము ప్రస్తావనాశ్రయము; వేసరాః ముఖయోః కార్యా = వేసర ముఖ (సంధులు) ములందు చేయదగినది; గర్భే గౌడీ విధీయతే = గర్భ (సంధి) యందు గౌడీరాగము విధింపబడును; అవమర్శే సాధారితా స్యాత్ = అవమర్శమందు సాధారితప్రభేదమగును; +హణే స్యాత్ + సర్వదా

**తాత్పర్యము :** పూర్వరంగమందు శుద్ధరాగము అగును. భిన్నప్రభేదము ప్రస్తావనాశ్రయము. వేసరముఖ(సంధులు)ములందు చేయదగినది. గర్భ(సంధి) యందు గౌడీరాగము విధింపబడును. అవమర్శమందు సాధారిత ప్రభేదమగును.

ఇతి మతంగమునివిరచితబృహద్దేశ్యాం
రాగలక్షణం తృతీయం సమాప్తమ్ ॥



## అథ భాషాలక్షణమ్ ।

గ్రామరాగా మయా సర్వే కథితాః లక్షణాన్వితాః ॥ 364
భాషాణాం తు ప్రవక్ష్యామి లక్షణం చ తతః శృణు ।
భాషా చతుర్విధా ప్రోక్తా మూలసంకీర్ణదేశజాః ॥ 365

ఛాయామాత్రాశ్రయాః ప్రోక్తా గ్రామరాగే వ్యవస్థితాః ।

**ప్రతిపదార్థము** : మయా = నాచేత; సర్వే గ్రామరాగాః కథితాః = గ్రామరాగములన్నియు చెప్పబడినవి; లక్షణాన్వితాః = లక్షణయుతములుగా; తతః = తరువాత; భాషాణాం లక్షణం ప్రవక్ష్యామి = భాషలయొక్క లక్షణమును చెప్పుదును;శృణు = వినుము; గ్రామరాగే వ్యవస్థితాః = గ్రామరాగమందున్నవి; ఛాయామాత్రాశ్రయాః = ఛాయామాత్రాశ్రయములు; మూల, సంకీర్ణ, దేవజములు అని; భాషాః చతుర్విధాః ప్రోక్తాః = భాషలు నాల్గువిధములుగ చెప్పబడినవి; కాశ్యప ఉవాచ = కాశ్యపమహర్షి చెప్పుచున్నాడు-

**తాత్పర్యము** : నాచేత గ్రామరాగములన్నియు చెప్పబడినవి. లక్షణయుతములుగా తరువాత భాషలయొక్క లక్షణమును చెప్పుదును, వినుము. గ్రామరాగమందున్నవి. ఛాయామాత్రాశ్రయములు. మూల, సంకీర్ణ, దేశజములు అని భాషలు నాల్గువిధములుగ చెప్పబడినవి.

కాశ్యపమహర్షి చెప్పుచున్నాడు -
కీదృశీ తు భవేద్భాషా సంకీర్ణా దేశజాంతరే ।
ఛాయామాత్రానుగాః ప్రోక్తాః గ్రహాంశన్యాససంయుతాః ॥
కతమా షాడబా తత్ర కతమౌడుబితా భవేత్ ।
పూర్ణా తు కతమా జ్ఞేయా సాధారణకృతా తు సా ॥

గ్రామరాగేషు కా కుత్ర కీదృశీ గీయతే జనైః ।
కతమా ప్రాప్యతే భాషా విభాషా కతమా భవేత్ ॥

**ప్రతిపదార్థము** : సంకీర్ణాదేశజాంతరే = సంకీర్ణదేశ జాంతరమునందు; భాషా కీదృశీ భవేత్ = భాష ఎట్టిదగును?; గ్రహాంశన్యాససంయుక్తాః చాయామాత్రానుగాః ప్రోక్తాః = గ్రహ, అంశ, న్యాసయుతములైన

ఛాయామాత్రానుగములు చెప్పబడినవి; తత్ర = అందు; షాడబా కతమా = షాడబమెన్నవది?; ఔడుబితా కతమా భవేత్ = ఔడు బితమెన్నవదియగును; సాధారణకృతా సా పూర్ణా కతమా? =సాధారణకృతమైన యాపూర్ణమెన్నవది?; గ్రామరాగేషు = గ్రామరాగములందు; కా = ఏరాగము; కుత్ర = ఎక్కడ, కీదృశీ = ఎట్టిదిగ?; జనైః గీయతే?= జనములచే గానముచేయదగినది?; భాషా కతమా ప్రాప్యతే = ఎట్టి (ఎన్నవ) భాష పొందబడును?; విభాషా కతమా భవేత్ = విభాష ఎట్టిది (ఎన్నవది) యగును?

**తాత్పర్యము** : సంకీర్ణదేశ జాంతరమునందు భాష ఎట్టిదగును? గ్రహ- అంశ-న్యాస యుతములైన ఛాయామాత్రానుగములు చెప్పబడినవి. అందు షాడబమెన్నవది? ఔడుబితమెన్నవదియగును? సాధారణ కృతమైన ఆపూర్ణమెన్నవది? గ్రామరాగములందు ఏరాగము ఎక్కడ ఎట్టిది? జనములచే గానముచేయదగినది. ఎట్టి (ఎన్నవ) భాష పొందబడును? విభాష ఎట్టిది (ఎన్నవది) యగును?

**కతమాంతరభాషా వై కతమా స్యాదనుక్రమాత్ ।**
**ఏతన్మే భ్రూహి తత్త్వేన మహత్ కౌతూహలం హి మే ॥**

**ప్రతిపదార్థము** : అంతరభాషాకతమా = అంతరభాష ఎన్నవది; అనుక్రమాత్ = క్రమమువలన; కతమా స్యాత్ = ఎన్నవది యగును?; ఏతత్ = దీనిని గూర్చి; మే = నాకు; తత్త్వేన = యథార్థముగా; బ్రూహి = చెప్పుము; మే = నాకు; మహత్ కౌతూహలం హి = గొప్ప వేడుకగానున్నది గదా!

యాష్టిక ఉవాచ = యాష్టికుడు చెప్పుచున్నాడు -

**తాత్పర్యము** : అంతర భాష ఎన్నవది? క్రమమువలన ఎన్నవదియగును? దీనిని గూర్చి నాకు యథార్థముగా చెప్పుము.నాకు గొప్పవేడుకగానున్నది గదా!

యాష్టికుడు చెప్పుచున్నాడు-

**శృణుష్వావహితో భూత్వా భాషాలక్షణముత్తమమ్ ।**
**యత్ పృథివ్యాం ప్రయత్నేన గీయతే గీతవేదిభిః ॥**

**ప్రతిపదార్థము** : గీతవేదిభిః = గీతజ్ఞులచే; పృథివ్యాం = భూలోకమునందు;

యత్ ప్రయత్నేన గీయతే = ఏది ప్రయత్నముచేతను గానముచేయబడుచున్నదో; తత్ ఉత్తమం భాషాలక్షణం = ఆ ఉత్తమమైన భాషాలక్షణమును; అవహితః భూత్వా శృణుష్వ = సావధానుడవై వినుము

**తాత్పర్యము** : గీతజ్ఞులచే భూలోకమునందు ఏది ప్రయత్నముచేతను గానముచేయబడుచున్నదో ఆ ఉత్తమమైన భాషాలక్షణమును సావధానుడవై వినుము.

**ప్రకాశం న చ లక్ష్యంతే యత్నహీనైస్తు గాయకైః ।**
**ప్రగీతాస్తు ప్రసిధ్యంతి సుస్వరాణాం విశేషతః ॥**

**ప్రతిపదార్థము** : యత్నహీనైః గాయకైః = ప్రయత్నములేని (చేయని); గాయకైః = గాయకులచే; ప్రకాశం = స్పష్టతను; న చ లక్ష్యంతే = పొందబడవు; (స్పష్టముగా సిద్ధినొందవు) సుస్వరాణాం ప్రగీతాస్తు = సుస్వరములను గానము చేయువాడికి; విశేషతః ప్రసిధ్యంతి = విశేషముగా (అధికముగా) సిద్ధించుచున్నది

**తాత్పర్యము** : ప్రయత్నములేని (చేయని) గాయకులచే స్పష్టతను పొందబడవు, (స్పష్టముగా సిద్ధినొందవు) సుస్వరములనుగానము చేయువాడికి విశేషముగా (అధికముగా) సిద్ధించుచున్నది.

**అహం తే కథయిష్యామి సర్వం తత్త్వేన లక్షణమ్ ।**
**పూర్వం గ్రామద్వయం ప్రోక్తం గ్రామరాగాస్తదుద్భవాః ॥**

**ప్రతిపదార్థము** : అహం = నేను; తత్త్వేన = యథార్థముగా; సర్వం లక్షణం కథయిష్యామి = సమస్తలక్షణమును చెప్పుదును; పూర్వం = ముందు; గ్రామద్వయం ప్రోక్తం = గ్రామద్వయము చెప్పబడినది; గ్రామరాగాః తదుద్భవాః = గ్రామరాగములు వాటినుండి పుట్టినవి

**తాత్పర్యము** : నేను యథార్థముగా సమస్తలక్షణమును చెప్పుదును. ముందు గ్రామద్వయము చెప్పబడినది. గ్రామరాగములు వాటినుండి పుట్టినవి.

**గ్రామరాగోద్భవా భాషా భాషాభ్యశ్చ విభాషికాః ।**
**విభాషాభ్యశ్చ సంజాతాస్తథా చాంతర భాషికాః ॥**

**ప్రతిపదార్థము** : గ్రామరాగోద్భవా భాషా = గ్రామరాగమునుండి భాష జనించినది; భాషాభ్యశ్చ విభాషికాః = భాషలనుండి విభాషలుద్భవించినవి; విభాషాభ్యః అంతరభాషికాఃసంజాతాః = విభాషలనుండి అంతరభాషికములు పుట్టినవి

**తాత్పర్యము** : గ్రామరాగమునుండి భాష జనించినది. బాషలనుండి విభాషలుద్భవించినవి. విభాషలనుండి అంతరభాషికములు పుట్టినవి.

**టక్కరాగే దశ ద్వే చ కేచిదిచ్ఛంతి షోడశ ।**
**తత ఊర్ధ్వం నిగద్యంతే చాష్టౌ మాలవకైశికే ॥**

**ప్రతిపదార్థము** : టక్కరాగే దశ ద్వే = టక్కరాగమందు పన్నెండు (12); కేచిత్ = కొందరు; షోడశ = (16) పదహారును; తత ఊర్ధ్వం = ఆపైని; మాలవకైశికే = మాలవకైశికయందు; అష్టౌ = ఎనిమిది(8); నిగద్యంతే = చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : టక్కరాగమందు పన్నెండు (12) కొందరు పదహారును(16) ఆపైని మాలవకైశికయందు ఎనిమిది (8) చెప్పుచున్నారు.

**కకుభే సప్త వై ప్రోక్తాః పంచ హిందోలకే స్మృతాః ।**
**పంచమే దశ విఖ్యాతాః భిన్నషడ్జే నవ స్మృతాః ॥**

**ప్రతిపదార్థము** : కకుభే సప్త ప్రోక్తాః = కకుభమందు (7) ఏడుచెప్పబడినవి; హిందోలకే పంచ స్మృతాః = హిందోలకమందు (5) ఐదుచెప్పబడినవి; పంచమే దశ విఖ్యాతాః = పంచమమందు (10) పది ప్రసిద్ధములు; భిన్నషడ్జే నవ స్మృతాః = భిన్నషడ్జమందు (9) తొమ్మిది చెప్పబడినవి

**తాత్పర్యము** : కకుభమందు(7) ఏడు చెప్పబడినవి. హిందోలకమందు (5) ఐదు చెప్పబడినవి. పంచమమందు (10) పది ప్రసిద్ధములు, భిన్నషడ్జమందు (9) తొమ్మిది చెప్పబడినవి.

**సౌవీరకే చతస్రస్తు చతస్రో భిన్నపంచమే ।**
**బోట్టరాగే తథాప్యేకా తథా మాలవపంచమే ॥**

**ప్రతిపదార్థము** : సౌవీరకే చతస్రః = సౌవీరకమందు నాల్గు; భిన్నపంచమే చతస్రః =

భిన్నపంచమమందు నాల్గును; బోట్టరాగే ఏకా = బోట్టరాగమందొకటి; తథా = అట్లే; మాలవపంచమేపి ఏకా = మాలవపంచమందు కూడ ఒకటి

**తాత్పర్యము** : సౌవీరకమందు నాల్గు, భిన్నపంచమమందు నాల్గును, బోట్టరాగమందొకటి, అట్లే మాలవపంచమందు కూడ ఒకటి.

**టక్కకైశికజాస్త్రిస్రః ద్వే చ వేసరషాడబే ।**
**భిన్నతానే తథాహ్యేకా చైకా గాంధార పంచమే ॥**
**పంచమషాడబే హ్యేకా ఇత్యేతాస్తు సమాసతః ।**
**భాషా విభాషాః కథితాస్త్ర్యధికా సప్తతిర్బుధైః ॥**

**ప్రతిపదార్థము** : టక్కకైశికజాః తిస్రః = టక్కకైశికరాగజములు మూడు(3); వేసరషాడబే ద్వే = వేసరషాడబమందు రెండును; భిన్నతానే ఏకా = భిన్నతానమందు ఒకటి; గాంధారపంచమే ఏకా = గాంధార పంచమమందు ఒకటి; పంచషాడబే ఏకా = పంచమ షాడబమందొకటియు; ఇతి = అని; ఏతాః = ఇవి; సమాసతః = సంగ్రహముగా; భాషా విభాషాః = భాషలు, విభాషలు; త్ర్యధికాః సప్తతిః కథితాః = 73 డెబ్బదిమూడు చెప్పబడినవి

**తాత్పర్యము** : టక్కకైశిక రాగజములుమూడు (3) వేసరషాడబమందు రెండును, భిన్నతానమందు ఒకటి, గాంధార పంచమమందు ఒకటి, పంచమషాడమందొకటియు, అని ఇవి సంగ్రహముగా భాషలు, విభాషలు 73 డెబ్బదిమూడు చెప్పబడినవి.

**భాషాణాం చైవ నామాని లక్షణం చ నిబోధత ।**
**ప్రథమా శ్రవణా జ్ఞేయా ద్వితీయా శ్రవణోద్భవా ॥**

**ప్రతిపదార్థము** : భాషాణాం నామాని = భాషల నామములు; లక్షణంచ = లక్షణమును; నిబోధత = తెలిసికొనుము; ప్రథమా = మొదటిది; శ్రవణా జ్ఞేయా = శ్రవణగ తెలియదగినది; శ్రవణోద్భవా ద్వితీయా = శ్రవణోద్భవ రెండవది

**తాత్పర్యము** : భాషల నామములు లక్షణమును తెలిసికొనుము. మొదటిది శ్రవణగ తెలియదగినది. శ్రవణోద్భవ రెండవది.

**వేరంజికా తృతీయా తు ఛేవాటీ చ చతుర్థికా ।**
**మాలవేసరికా తత్ర ప్రయోక్తవ్యా తు పంచమీ ॥**

**ప్రతిపదార్థము** : వేరంజికా తృతీయా = మూడవది వేరంజిక; చతుర్థికా ఛేవాటీ= నాల్గవది ఛేవాటి; పంచమీ మాలవేసరికా = ఐదవది మాలవేసరిక

**తాత్పర్యము** : మూడవది వేరంజిక. నాల్గవది ఛేవాటి, ఐదవది మాలవేసరిక.

**షష్ఠీ చ గూర్జరీ జ్ఞేయా సౌరాష్ట్రీ సప్తమీ తథా ।**
**అష్టమీ సైంధవీ చైవ వేసరీ నవమీ తథా ॥**

**ప్రతిపదార్థము** : షష్ఠీ గూర్జరీ = ఆరవది గూర్జరి; సప్తమీ సౌరాష్ట్రీ = ఏడవది సౌరాష్ట్రి; అష్టమీ సైంధవీ = ఎనిమిదవది సైంధవి; నవమీ వేసరీ = తొమ్మిదవది వేసరి; దశమీ పంచమాఖ్యా = పదవది పంచమ

**తాత్పర్యము** : ఆరవది గూర్జరి, ఏడవది సౌరాష్ట్రి, ఎనిమిదవది సైంధవి, తొమ్మిదవది వేసరి, పదవది పంచమ.

**పంచమాఖ్యా తు దశమీ రవిచంద్రా తథా భవేత్ ।**
**అంబాహీరీ తు లలితా స్మృతా కోలాహలీ తతః ॥**

**మధ్యమగ్రామదేశా చ తథా గాంధార పంచమీ ।**
**ఇత్యేతాః ప్రకటా భాషాష్టక్కరాగస్య షోడశ ॥**

**ప్రతిపదార్థము** : రవిచంద్రా, అంబాహీరీ, లలితా, కోలాహలీ, మధ్యమగ్రామదేశా, గాంధారపంచమీ, ఇత్యేతాః =అని ఇవి; టక్కరాగస్య షోడశ రాగాః ప్రకటాః = టక్కరాగముయొక్క (16) పదహారు రాగములు స్పష్టములైనవి

**తాత్పర్యము** : రవిచంద్ర, అంబాహీరి, లలిత, కోలాహలి, మధ్యమగ్రామదేశ, గాంధార పంచమి, అని ఇవి టక్కరాగముయొక్క (16) పదహారు రాగములు స్పష్టములైనవి.

**శుద్ధా తు ప్రథమా జ్ఞేయా చాద్యవేసరికా తతః ।**
**హర్షపుత్రీ తృతీయా తు మాంగాలీ చ చతుర్థికా ॥**

**పంచమీ సైంధవీ జ్ఞేయా ఆభీరీ షష్ఠికా మతా ।**

**ఖంజరీ గుంజరీ చైవమష్టౌ మాలవకైశికే ॥**

**ప్రతిపదార్థము :** మాలవకైశికయందు; శుద్ధ ఆద్యవేసరికా, హర్షపుత్రీ, మాంగాలీ, సైంధవీ, ఆభీరీ, ఖంజరీ, గుంజరీ, అని అష్టౌ = ఎనిమిది విధములు; కాంభోజా ప్రథమాజ్ఞేయా మధ్యమాగ్రామికా మతా ।

**తాత్పర్యము :** మాలవకైశియందు, శుద్ధ, ఆద్యవేసరిక, హర్షపుత్రి, మాంగాలి, సైంధవి, ఆభీరి, ఖంజరి, గుంజరి అని ఎనిమిది విధములు.

**కాంబోజా ప్రథమా జ్ఞేయా మధ్యమగ్రామికా మతా ।**

**సాలవాహానికా చైవ తదంతే భాగవర్ధనీ ।**
**పంచమీ ముహరీ జ్ఞేయా షష్ఠీ చ శకమిశ్రితా ॥**

**ప్రయోక్తవ్యా ప్రయత్నేన సప్తమీ భిన్నపంచమీ ।**
**ఏతాస్తు కకుభే సప్త భాషా జ్ఞేయా మనోహరాః ॥**

**ప్రతిపదార్థము :** కాంబోజా, మధ్యమగ్రామికా, సాలవాహానికా, భాగవర్ధనీ, ముహరీ, శకమిశ్రితా, భిన్నపంచమీ, ప్రయత్నేన ప్రయోక్తవ్యా = ప్రయత్నముచే ప్రయోగింపదగినది; ఏతాః మనోహరాః సప్త భాషాః = ఈఅందములైన ఏడు భాషలు; కకుభే జ్ఞేయాః = కకుభమందలివని తెలియవలెను

**తాత్పర్యము :** కాంభోజ, మధ్యమగ్రామిక, సాలవాహానిక, భాగవర్ధని, ముహరి, శకమిశ్రిత, బిన్నపంచమి, ప్రయత్నముచే ప్రయోగింపదగినది. ఈఅందములైన ఏడు భాషలు కకుభమందలివని తెలియవలెను.

**ప్రథమా వేసరీ జ్ఞేయా ద్వితీయా చైవ మంజరీ ।**
**తతః కార్యా చ ఛేవాటీ చతుర్థీ షడ్జమధ్యమా ॥**
**పంచమీ మధురీ జ్ఞేయా పంచ హిందోలకోద్భవాః ॥**

**ప్రతిపదార్థము :** వేసరీ, మంజరీ, ఛేవాటీ, షడ్జమధ్యమా, మధురీ, పంచ = ఈ ఐదును; హిందోలకోద్భవాః జ్ఞేయాః = హిందోలక రాగోద్భవములని తెలియదగినవి

**తాత్పర్యము :** వేసరి, మంజరి, ఛేవాటి, షడ్జమధ్యమ, మధురి ఈఐదును

హిందోలక రాగోద్భవములని తెలియదగినవి,

ఆభీరీ భావినీ చైవ మాంగాలీ సైంధవీ తథా ।
గూర్జరీ దాక్షిణాత్యాచ అంధ్రీత్వన్నోద్భవా పరా ॥

నవమీ త్రావణీ జ్ఞేయా కైశికీ దశమీ స్మృతా ।
ఏతా భాషాస్తు విజ్ఞేయా గాయకైః పంచమోద్భవాః ॥

ప్రతిపదార్థము : ఆభరీ,భావినీ, మాంగాలీ, సైంధవీ, గూర్జరీ, దాక్షిణాత్యా, అంధ్రీ, అన్నోద్భవా, త్రావణీ, కైశికీ, ఏతాః భాషాః = ఈభాషలు; పంచమోద్భవాః విజ్ఞేయాః = పంచమజనితములుగా తెలియవలెను

తాత్పర్యము : ఆభరి, భావిని, మాంగాలి, సైంధవి, గూర్జరి, దాక్షిణాత్య, అంధ్రి, అన్నోద్భవ, త్రావణి, కైశికి, ఈభాషలు పంచమజనితములుగా తెలియవలెను.

విశుద్ధా దక్షిణాన్యా గాంధారీ తదనంతరమ్ ।
శ్రీకంఠీ చైవ పౌరాలీ మాంగాలీ సైంధవీ తథా ॥
కాలిందీ చ పులిందీ చ భిన్నషడ్జోద్భవా నవ ।

ప్రతిపదార్థము : విశుద్ధా, దక్షిణాన్యా, గాంధారీ, శ్రీకంఠీ, పౌరాలీ, మాంగాలీ, సైంధవీ, కాలిందీ, పులిందీ, ఏతే నవ = ఈతొమ్మిది; భిన్నషడ్జోద్భవాః = భిన్నషడ్జజనితములు

తాత్పర్యము : విశుద్ధ, దక్షిణాన్య, గాంధారి, శ్రీకంఠి, పౌరాలి, మాంగాలి, సైంధవి, కాలింది, పులింది ఈతొమ్మిది భిన్నషడ్జజనితములు

సౌవీరీ ప్రథమా జ్ఞేయా ద్వితీయా వేగమధ్యమా ।
సాధారితా తృతీయా తు గాంధారీ చ చతుర్థికా ।
భాషా సైంధవికీ జ్ఞేయా జ్ఞేయాః సౌవీరకోద్భవాః ॥

ప్రతిపదార్థము : సౌవీరీ, వేగమధ్యమా, సాధారితా, గాంధారీ, సైంధవికీ భాషా జ్ఞేయాః = భాషలుగా తెలియదగినవి; సౌవీరకోద్భవాః జ్ఞేయాః = సౌవీరక జనితములుగా తెలియదగినవి

తాత్పర్యము : సౌవీరి, వేగమధ్యమ, సాధారిత, గాంధారి, సైంధవికి భాషలుగా

తెలియదగినవి. సౌవీరక జనితములుగా తెలియదగినవి.

**శుద్ధా భిన్నా తు వారాహీ తథా ధైవత భూషితా ।**
**వరాటీ చ తతః ప్రోక్తా భిన్నపంచమసంభవాః ॥**

**ప్రతిపదార్థము :** శుద్ధా, భిన్నా, వారాహీ, ధైవతభూషితా, వరాటీ అని భిన్నపంచమ సంభవాః ప్రోక్తాః = భిన్నసంభవజనితములుగా చెప్పబడినవి

**తాత్పర్యము :** శుద్ధ, భిన్న, వారాహి, ధైవతభూషిత, వరాటి అని భిన్నసంభవ జనితములుగా చెప్పబడినవి.

**మాలవపంచమే జాతా భావినీ లోకభావినీ ।**
**మంగల్యాఖ్యా తు యా భాషా బోట్టరాగోద్భవా తు సా ॥**

**ప్రతిపదార్థము :** మాలవపంచమే = మాలవపంచమందు; లోకభావినీ = లోకభావినియైన; భావినీ జాతా = బావిని జనించినది; మాంగల్యాఖ్యా భాషా= మాంగలీభాష; బోట్టరాగోద్భవా = బోట్టరాగజనితము

**తాత్పర్యము :** మాలవపంచమందు, లోకభావినియైన భావిని జనించినది. మాంగలీభాష బోట్టరాగజనితము.

**టక్కకైశికిజా జ్ఞేయా తృతీయా వేగమధ్యమా ।**
**మాలవా బిన్నబాలికా + + + + + ++ + ॥**

**ప్రతిపదార్థము :** తృతీయా వేగమధ్యమా టక్కకైశికజా జ్ఞేయా = మూడవదైన వేగమధ్యమ టక్కకైశికజనితముగా తెలియవలెను, మాలవా, భిన్నబాలికా, + + + ++ + + + +

**తాత్పర్యము :** మూడవదైన వేగమధ్యమ టక్కకైశిక జనితముగా తెలియవలెను.

**తృతీయా ద్రావిడీ తత్ర భాషా లక్షితలక్షణా ।**
**బాహ్యాషాడనదాఖ్య +జాతావేసరషాడబే ॥**

**ప్రతిపదార్థము :** తత్ర = అందు; లక్షణలక్షితా తృతీయా ద్రావిడీ = మూడవదైన ద్రావిడి లక్షణాలక్షితమైనది; వేసరషాడబే = వేసర షాడబమందు;

బాహ్యాషాడనాదాఖ్య జాతా = బాహ్యాషాడనాదము జనించినది

**తాత్పర్యము** : అందు మూడవదైన ద్రావిడిలక్షణలక్షితమైనది. వేసర షాడబమందు బాహ్యాషాడనాదము జనించినది.

**తానోద్భవా తు విజ్ఞేయా భిన్నతానే వ్యవస్థితా ।**
**గాంధారపంచమేహ్యేకా భాషా + + + + + ++ ॥**

**ప్రతిపదార్థము** : భిన్నతానే వ్యవస్థితా =భిన్నతానమునందు వ్యవస్థితము; తానోద్భవా విజ్ఞేయా = తానజనితమని తెలియనగును; గాంధారపంచమే ఏకా భాషా = గాంధార పంచమమందొక భాష + + + +

**తాత్పర్యము** : భిన్నతానమునందువ్యవస్థితము తానజనితమని తెలియనగును. గాంధార పంచమమందొక భాష.

**గాందారీ + + + + + పంచ + లోకరంజికా ।**
**రేవగుప్తే శకాఖ్యైకా ప్రోక్తా షాడబపంచమే ॥**

**ప్రతిపదార్థము** : గాంధారీ +++++ పంచ+ లోక రంజికా; రేవగుప్తే = రేవగుప్తయందు; శకాఖ్యే = శకమందు; షాడబపంచమే = షాడబపంచమమందు; ఏకా ప్రోక్తా = ఒకటి చెప్పబడినది

**తాత్పర్యము** : గాంధారీ + + + + +పంచ+ లోక రంజికా, రేవగుప్తయందు, శకమందు, షాడబపంచమమందు ఒకటి చెప్పబడినది.

**ఇత్యేతాః ప్రకటా భాషా ప్రజాయంతే హ్యనేకశః ।**
**సోదాహరణమేతాసాం లక్షణం చాధునా శృణు ॥**

**ప్రతిపదార్థము** : ఇత్యేతాః ప్రకటాః భాషాః = ఈమొదలుగా ప్రకటించిన భాషలు; అనేకశః ప్రజాయంతే = అనేకములుగా పుట్టుచున్నవి; అధునా ఏతాసాం లక్షణం సోదాహరణం శృణు = వీటి లక్షణము ఇప్పుడు ఉదాహరణపూర్వకముగా వినుము

**తాత్పర్యము** : ఈమొదలుగా ప్రకటించిన భాషలు, అనేకములుగా పుట్టుచున్నవి. వీటిలక్షణము ఇప్పుడు ఉదాహరణపూర్వకముగా వినుము.

**మధ్యమాంశాతు షడ్జాతా పంచమేన వివర్జితా ।**
**ధైవతస్య నిషాదస్య షడ్జస్యేవ తయోస్తథా ॥**

**పరస్పరం తు గమనం దృశ్యతేఽ త్ర పునః పునః ।**
**స్యాదియం షాడబా జ్ఞేయా మూలాఖ్యా త్రవణా భవేత్ ॥**

**ప్రతిపదార్థము** : మూలఖ్యా త్రవణా = మూలాఖ్యత్రవణ (త్రిపణ)ము; మధ్యమాంశా = మధ్యమాంశము; షడ్జాతా = షడ్జగ్రామసంభవము; పంచమేన వివర్జితా = పంచమరహితము; ధైవతస్య నిషాదస్య = ధైవతమునకు నిషాదమునకు; షడ్జస్య ఇవ = షడ్జమునకువలె; తయోః = ఆరెండింటికి; పరస్పరం = అన్యోన్యము; అత్ర = ఇందు; పునఃపునః = మాటిమాటికి; గమనం దృశ్యతే = గమనము కనబడును; ఇయం షాడబా జ్ఞేయా = ఇది షాడబముగా నెఱుగవలెను

**తాత్పర్యము** : మూలాఖ్యత్రవణ (త్రిపణ)ము మధ్యమాంశము, షడ్జగ్రామసంభవము, పంచమరహితము, ధైవతమునకు నిషాదమునకు, షడ్జమునకువలె ఆరెండింటికి అన్యోన్యము. ఇందు మాటిమాటికి గమనము కనబడును. ఇది షాడబముగా నెఱుగవలెను.

ఉదాహరణం :- మాసాసాసాసానిధానిధానీధాగాసాసా । ధానిసామాగాగాగామా సాసా తథా (అట్లే) సాసాసాసాగామాధానీధాధామారీగారీరీమరిగాసాసానిధాసాసా। నీధగాసాసానిధనిమామానిధాసాసానిధాసగమాగాసానీధనీసా । త్రిపణా ।

**షడ్జాతా మధ్యమాంశా వై గాంధారబహులా సదా ।**
**పంచమేన విహీనా తు ముహరీ షడ్జధైవతః ॥**
**సంకీర్ణేయం సదా జ్ఞేయా షాడబా త్రవణోద్భవా ।**

**ప్రతిపదార్థము** : త్రవణోద్భవా = త్రవణోద్భవ; షడ్జాతా = షడ్జాతము; మధ్యమాంశా = మధ్యమాంశము; సదా గాంధారబహులా = సర్వదా గాంధారబహులము; పంచమేన విహీనా = పంచమరహితము; ముహరీ షడ్జధైవతః, సదా అయం సంకీర్ణః= ఇది ఎల్లప్పుడు సంకీర్ణము; షాడబా = షాడవరాగము

**తాత్పర్యము** : త్రవణోద్భవ మధ్యమాంశము. సర్వదా గాంధారబహులము పంచమరహితము. ఇది ఎల్లప్పుడు సంకీర్ణము షాడవరాగము.

ఉదాహరణం :- మానీనీనీసాస । సారీరీరీగాగాగమామ। మామారీ। గదినినిధా। ధాధామామగారిగా। సామాగారీ। సనినిగాగానినిధాసరిగారీమా। గామామానీనీససా। త్రవణోద్భవా ।

**వేరంజికా తు విజ్ఞేయా గాంధారాంశాల్పపంచమా ।**
**షడ్జన్యాసా తు కర్తవ్యా షడ్జధైవతయోస్తథా ॥**

**గమనం సంప్రయుజ్యాతు (?) గాంధారర్షభయోస్తథా ।**
**ఏవం భాషా తు విజ్ఞేయా షాడబా తు నిగద్యతే ॥**

**ప్రతిపదార్థము** : వేరంజికా భాషా = వేరంజిక బాష; గాంధారాంశః = గాంధారాంశము; అల్పపంచమః = పంచమమల్పము; షడ్జన్యాసా = షడ్జన్యాసము; షడ్జధైవతయోః = షడ్జధైవతములకు; తథా =అట్లే, గాంధారర్షభయోః = గాంధారరిషభములకు; గమనం సంప్రయుజ్యా = గమనము ప్రయోగింపదగినది; షాడబా = షాడవము; ఏవం భాషా విజ్ఞేయా = ఇట్లు భాషను తెలియవలెను

**తాత్పర్యము** : వేరంజిక బాష, గాంధారాంశము, పంచమమల్పము, షడ్జన్యాసము, షడ్జధైవతములకు. అట్లే గాంధారరిషభములకు గమనము ప్రయోగింపదగినది. షాడబము ఇట్లు భాషను తెలియవలెను.

ఉదాహరణ :- గానిగాగాధరిమామాగామామాగారీగానసాసానిగారీనినిధాధానిగారీ మాగారిననీధనీ । సాసాగమామాధాసానంగనిగానిగానిగధరీగరీరిగాదిరీగమమమధ మమమధరీగసాసాసాసనీగారీగానినిధామాధానిధాసనీగారీమమరిసానిధానిసాసా। వేరంజికా ॥

**షడ్జాద్యంతసమాయుక్తా సంపూర్ణా మధ్యమోజ్వలా ।**
**షడ్జమధ్యమసంవాదో ద్విశ్రుతీనాం పరస్పరమ్ ॥**
**మూకభాషా తు విజ్ఞేయా ఛోహారీ గేయవేదిభిః ।**

**ప్రతిపదార్థము :** ఛోహారి = ఛోహారి; షడ్జాద్యంతసమాయుక్తా = షడ్జాంద్యంత యుతమును; సంపూర్ణా = సంపూర్ణమును;మధ్యవెూజ్వలా = మధ్యమప్రకాశితము; షడ్జమద్యమసంవాదః = షడ్జమధ్యమములకు సంవాదియు; ద్విశ్రుతీనాం = ద్విశ్రుతులకు (గాంధారనిషాదములకు) పరస్పరం = అన్యోన్యము; మూకభాషా = సంజ్ఞాభాషయు; విజ్ఞేయా = తెలియదగినది

**తాత్పర్యము :** ఛోహారి, షడ్జాంద్యంతయుతమును, సంపూర్ణమును, మధ్యమప్రకాశితము. షడ్జమధ్యమములకు సంవాదియు ద్విశ్రుతులకు (గాంధారనిషాదములకు) అన్యోన్యము సంజ్ఞాభాషయు తెలియదగినది.

ఉదాహరణం :- సాగాగపా । వామబామగామామారాగసాసాసస।మాగపాపా। పాధనీధా। మవాపామాపామామామగాససారిధానిసాసానధానీగారీగామా వాగనిసానీగారీని సాసా। నిధావామాగారీగాసా। మానీధనీధాసా। ఛేవాటీ॥

**షడ్జన్యాసా నిషాదాంశా దుర్బలా పంచమేన తు ।**
**షడ్జగమారసంవాదః షడ్జమధ్యయోస్తథా ॥**
**భాషేయం షాడవా జ్ఞేయా మూలాఖ్యా మాలవేసరీ ।**

**ప్రతిపదార్థము :** మూలాఖ్యా మాలవేసరీ = మూలాఖ్యమైన మాలవేసరి; షడ్జన్యాసా = షడ్జన్యాసము; నిషాదాంశా = నిషాదాంశము; పంచమేన దుర్బలా = పంచమాల్పము; షడ్జగమారసంవాదః = షడ్జగాంధారమధ్యమరిషభసంవాదము; తథా = అట్లే; షడ్జమధ్యమయోః = షడ్జమధ్యమములకు సంవాదము (గమనము) ఇయం భాషా షాడబా = ఈ భాష షాడవము

**తాత్పర్యము :** మూలాఖ్యమైన మాలవేసరి, షడ్జన్యాసము, నిషాదాంశము, పంచమాల్పము. షడ్జగాంధారమధ్యమరిషభసంవాదము. అట్లే షడ్జమధ్యమములకు సంవాదము (గమనము) ఈ భాష షాడవము.

ఉదాహరణం :- నిధానినీసదిసాసాగామాగాధారిసమామాసాగాసారిసాసాగధరిసా। గామాధామామాగాధాగా। సాసాసా। మాలవేసరీ।

**నిషాదర్షభషడ్జాంతా సంపూర్ణా షడ్జమధ్యమా ।**
**సంగ+తత్ర విజ్ఞేయా పంచమర్షభయోస్తథా ॥**
**దేశభాషాత్ర విఖ్యాతా గూర్జరీ పరమోజ్జ్వలా ।**

**ప్రతిపదార్థము** : పరమోజ్జ్వలా = మిక్కిలి ప్రకాశవంతమైన; దేశభాషా విఖ్యాతా= దేశభాషగా ప్రసిద్ధమైన; గూర్జరీ = గూర్జరి; నిసాదర్షభషడ్జాన్తా = నిషాద రిషభషడ్జాంతము; సంపూర్ణా = సంపూర్ణము; షడ్జమధ్యమా సంగతిః = షడ్జమధ్యమ సంయోగము; అత్ర విజ్ఞేయా = ఇందు తెలియదగినది; తథా = అట్లే; పంచమర్షభయోః = పంచమరిషభములకును (సంగతి) తెలియనగును

**తాత్పర్యము** : మిక్కిలి ప్రకాశవంతమైన దేశభాషగా ప్రసిద్ధమైన గూర్జరి నిషాదరిషభషడ్జాంతము సంపూర్ణము. షడ్జమధ్యమసంయోగము ఇందు తెలియదగినది. అట్లే పంచమరిషభములకును (సంగతి) తెలియనగును.

ఉదాహరణం :- నిసాసానిపాపానీధానీనీసానీసాసా। సారిసీరిరి। సామాగా। రిరి। నీనీనీ। పాపాపా। నిధాని। నీగాసా। గూర్జరీ॥

**నిషాదాంశా తు షడ్జాంతా సంపూర్ణా నిత్యమేవ హి ।**
**సౌరాష్ట్రికా తు భాషేయం దేశ్యాఖ్యా గీయతే జనైః ॥**

**ప్రతిపదార్థము** : దేశాఖ్యా సౌరాష్ట్రికా ఇయం భాషా = దేశీయ ఈసౌరాష్ట్రిక భాష; నిషాదాంశా = నిషాదాంశము; షడ్జాంతా = షడ్జాంతము; నిత్యమేవ సంపూర్ణా = నిత్యముగా సంపూర్ణము

**తాత్పర్యము** : దేశీయ ఈ సౌరాష్ట్రిక భాష నిషాదాంశము. షడ్జాంతము. నిత్యముగా సంపూర్ణము.

ఉదాహరణం :- నినిధానిదేసాసానిరిగాసాసాసాగాగా సాధనినినిధామామానినినిని ధాసాసాగా సాసాగాసాసధానిధానిధామామామారిగాసాసాగాసనీసాసాసా। సౌరాష్ట్రీ (పసైవమీ మధ్యమా?)

**సైంధవీ మధ్యమాంశా తు షడ్జాంతా ధైవతోజ్జ్వలా ।**
**సుసంపూర్ణస్వరా హ్యేషా షడ్జధైవతయోస్తథా ॥**

**గామారమధ్యమానాం తు గమకం దృశ్యతే ఘనమ్ ।**
**దేశభాషా తు దేశాఖ్యా సైంధవీ టక్కరాగజా ॥**

**ప్రతిపదార్థము** : సైంధవీ = సైంధవి, టక్కరాగజా = టక్కరాగజనితము;

దేశాఖ్యా దేశభాషా = దేశాఖ్య దేశభాష; మధ్యమాంశా = మధ్యమాంశము; షడ్జాంతా = షడ్జాంతము; ధైవతోజ్జ్వలా = ధైవతప్రకాశితము; సుసంపూర్ణస్వరా= సంపూర్ణము; షడ్జధైవతయోః = షడ్జధైవతములకు; తథా = అట్లే; గామారమధ్యమానాం తు = గామారమధ్యమములకు, ఘనం గమకం దృశ్యతే = ఘనమైన గమకము కనబడుచున్నది

**తాత్పర్యము :** సైంధవి, టక్కరాగజనితము, దేశాఖ్యదేశభాష మధ్యమాంశము, షడ్జాంతము, ధైవతప్రకాశితము, సంపూర్ణము, షడ్జధైవతములకు అట్లే గామారమధ్యమములకు ఘనమైన గమకము కనబడుచున్నది.

ఉదాహరణం :- సాసాసాసా। సనీనీనీనీ ధాధాసరిసానీధాధాధరినిధాధా। ధానిసా। గారీమామామా। గమాగామాసాధాసారీమామామాసారిగామాపాపాధానిపధా పామాగారీరీనిరినిధాధాధనిసారీగామామాగామామాగామామా మాసాసా। సైంధవీ।

**షడ్జాద్యంత సమాయుక్తా పంచమేన వివర్జితా ।**
**ధైవతనిషాదయోశ్చ షడ్జధైవతయోస్తథా ॥**

**పరస్పరంతు గమనం దృశ్యతే చ క్షణే క్షణే ।**
**భాషేయం షాడబా జ్ఞేయా వేసరీకా ప్రయోక్తృభిః ॥**

**ప్రతిపదార్థము :** ఇయం భాషా వేసరికా = ఈవేసరికానామక భాష; షడ్జాద్యస్తసమాయుక్తా = షడ్జఆదిఅంతయుతము; పంచమేన వివర్జితా = పంచమరహితము; ధైవతనిషాదయోః = ధైవతనిషాదములకు; షడ్జధైవతయోః = షడ్జధైవతములకు; పరస్పరం గమనం = అన్యోన్యగమనము; క్షణే క్షణే దృశ్యతే= ప్రతిక్షణమందును కనబడును; ఇయం షాడబా = ఇది షాడవముగా; విజ్ఞేయా= తెలియదగినది

**తాత్పర్యము :** ఈవేసరికానామక భాష, షడ్జఆదిఅంతయుతము. పంచమరహితము ధైవతనిషాదములకు షడ్జధైవతములకు అన్యోన్యగమనము ప్రతిక్షణమందును కనబడును. ఇది షాడవముగా తెలియదగినది.

ఉదాహరణం :- సాసా। సధాని। ధాసాసాసావమావమాగావమాగావమా సాధామాగారీసాసాసా। వేసరికా ।

**పంచమాంశా తు షడ్జాంతా సంపూర్ణా లోకరంజికా ।**
**పంచమర్షభసంవాదః షడ్జమధ్యమయోస్తథా ॥**
**భాషేయం పంచమాఖ్యాతు సంపూర్ణా సముదాహృతా ॥**

**ప్రతిపదార్థము :** ఇయం భాషా పంచామాఖ్యా సంపూర్ణా = ఈసంపూర్ణ పంచమాఖ్యభాష; పంచమాంశ = పంచమాంశము; షడ్జాంతా = షడ్జాంతము; సంపూర్ణా = సంపూర్ణము; లోకరంజికా = ప్రజారంజకము; పంచమర్షభయోః సంవాదః= పంచమరిషభములకు సంవాదము; తథా షడ్జమధ్యమయోః = అట్లే, షడ్జమధ్యమ ములకును (సంవాదము)

**తాత్పర్యము :** ఈసంపూర్ణ పంచమాఖ్యభాష పంచమాంశము, షడ్జాంతము, సంపూర్ణము. ప్రజారంజకము. పంచమరిషభములకు సంవాదము. అట్లే షడ్జమధ్యమములకును (సంవాదము)

ఉదాహరణం :- పాపాపారిపా - రిపాపాపాపమాపాపామపమాసాసాసారీరీరి । నిధాధపాపా। పసామామాగిరీగగరిరిసపాసపావగారిసాగారిసారిపాపాపారిరిగరి। గాధామాగారిరి ధవరిగసాసా। పంచమాఖ్యా। రద్ధి చ ।

**మధ్యమంద్రా తు షడ్జాతా గాంధారాంశాల్పసప్తమా ।**
**+ ర్షగాంధారయోస్తు+ షడ్జమధ్యమయోస్తథా ॥**

**పరస్పరం తు గమనం యత్ర తత్ సంప్రయోజయేత్ ।**
**సా సంకీర్ణాదయో జ్ఞేయా భాషారవిచంద్రికా ॥**

**టక్కరాగజా ।**

**ప్రతిపదార్థము :** సా రవిచంద్రికాభాషా = ఆ రవిచంద్రికా భాష; టక్కరాగజా= టక్కరాగజనితము; సంకీర్ణాదయః జ్ఞేయా = సంకీర్ణాదిగాతెలియవలెను; మధ్యమంద్రా = మధ్యమంద్రము; షడ్జాంతా = షడ్జాంతము; గాంధారాంశా = గాంధారాంశము; అల్పసప్తమా = నిషాదాల్పము; +ర్షగాంధారయోః = +ర్షగాంధారములకు; తథా = అట్లే; షడ్జమధ్యమయోః = షడ్జమధ్యములకు; యత్ర పరస్పరం గమనం = ఎక్కడ అన్యోన్యము గమనమో; తత్ సంప్రయోజయేత్ = దానిని ప్రయోగించవలెను

**తాత్పర్యము** : ఆ రవిచంద్రకా భాష టక్కరాగజనితము. సంకీర్ణాదిగా తెలియవలెను. మధ్యమంద్రము షడ్జాంతము గాంధారాంశము నిషాదాల్పము +ర్షగాంధారములకు అట్లే షడ్జమధ్యములకు ఎక్కడ అన్యోన్యము గమనమో దానిని ప్రయోగించవలెను.

ఉదాహరణం :- మాగాగామా । సాసా। మాగామామాగామాసాసాసా। గాగాధానిసాసాగా ధనిసాధాధామారీమాగారీగసాసాసాసామాసారీధాధాధాధా ధమాగరీగాగాధారీసాసాసా। మాగామామాగా। మాసాసామాగాధాధాధా పరీగమరీగమసాసాసామాగారీధాధమ గరిగమధనీ । సాసాగాధానిసాసా। రవిచంద్రా ।

> **మధ్యమాంశా తు షడ్జాంతా బాహుగాంధారధైవతా ।**
> **అసంపూర్ణస్వరా నిత్యమంబాహేరీ ప్రకీర్తితా ॥**
> **భాషేయంకై++ న్నిత్యం దేశాఖ్యా సంప్రకీర్తితా ॥**

**ప్రతిపదార్థము** : ఇయం భాషా అంబాహేరీ = ఈ అంబాహేరి భాష; నిత్యం అసంపూర్ణస్వరా ప్రకీర్తితా = సర్వదా అసంపూర్ణస్వరముగా చెప్పబడినది; కైశ్చిత్= కొందరిచే; దేశాఖ్యా నిత్యం ప్రకీర్తితా = దేశాఖ్యము నిత్యమని చెప్పబడినది; ఇయం = ఇది; మధ్యమాంశా = మధ్యమాంశము; షడ్జాంతా = షడ్జాంతము; బాహుగాంధార ధైవతా = గాంధార ధైవతములకు బాహుళ్యము

**తాత్పర్యము** : ఈ అంబాహేరిభాష సర్వదా అసంపూర్ణస్వరముగా చెప్పబడినది. కొందరిచే దేశాఖ్యమునిత్యమని చెప్పబడినది. ఇది మధ్యమాంశము, షడ్జాంతము, గాంధార ధైవతములకు బాహుళ్యము.

ఉదాహరణ :- సాసాసా। నీనీ। నిధాధనీ తథాని। ధానిధాధానీ। సాగాగారీ। సనీసనీధా। నిధానిగాగామాగాని సాసాని। సాధానీగాగానిసాసా। సానినీసనీధాధామానీ మాధాసనినీ। నీసాధానీ మాధాధామాగాసానిసానిధా। మాధాధా। సాధానీధానీ సాసా। మామాధాసాసా। మామాగారీమాగాసాసా। మాసామామాగారీమాగాసాసా। మాసానీనిని మానిధాధానిధామాగా। సానీమాధా । సాసనీధా ధనిసాధాధా। ధనిధానీసా। అంబాహేరీ।

షడ్జాద్యంతసమాయుక్తా బాహులాద్యమధైవతా ।
విశ్రుతిభ్యాం తు గమనం హీనత్వమృషభేణతు ॥
భాషౌడుబితా హ్యేషా సంకీర్ణా లలితా భవేత్ ।

**ప్రతిపదార్థము** : ఏషా లలితా బాషా = ఈలలితా నామక భాష; సంకీర్ణా = సంకీర్ణము; ఔడుబితా = ఔడువితము; షడ్జాద్యంతసమాయుక్తా = షడ్జము ఆద్యన్తములనుండునది; బాహులాద్యమధైవతా = షడ్జమధ్యమ ధైవతములకు బాహుల్యము; విశ్రుతిభ్యాం గమనం = విశ్రుతులతో గమనము. ఋషభేణ హీనత్వం = రిషభరహితము

**తాత్పర్యము** : ఈలలితానామకభాష సంకీర్ణము, ఔడువితము, షడ్జము ఆద్యన్తముల నుండునది. షడ్జమధ్యమధైవతములకు బాహుల్యము. విశ్రుతులతో గమనము. రిషభరహితము.

ఉదాహరణం :- సాగాగాధాగామామాగా। ధమధానీసాసా। నిధాగాగా। సాసాసామాపాధానీ ధాపామాసా సాధాపాధానీధాధాసానీధాగారీగాధనీ సరసా లలితా।

షడ్జాద్యంత సమాయుక్తా పంచమేన వివర్జితా ।
వినిహితా సప్తమేన తు షడ్జే మధ్యమసంగతా ॥

భాషౌడువితా+ + సంకీర్ణా టక్కరాగజా ।
కోలాహలీ తు విఖ్యాతా గీయతే గానవేదిభిః ॥

**ప్రతిపదార్థము** : టక్కరాగజా = టక్కరాగజనితమైన; సంకీర్ణా = సంకీర్ణమును; ఔడువితా = ఔడువితమును అయిన; కోలాహలీ = కోలాహలి; భాష షడ్జాద్యన్త సమాయుక్తా = షడ్జ ఆద్యాంతములు కలదియు; పంచమేన వివర్జితా = పంచమరహితము, సప్తమేన వినిహితా = నిషాదనిహితమును; షడ్జమధ్యమసంగతా = షడ్జమధ్యమసంగతికలదై; గీయతే = గానము చేయబడుచున్నది

**తాత్పర్యము** : టక్కరాగజనితమైన సంకీర్ణమును ఔడువితమును అయిన కోలాహలి షడ్జఆద్యాంతములు కలదియు పంచమరహితము

నిషాదనిహితమును షడ్జమధ్యమ సంగతికలదై గానము చేయబడుచున్నది.

ఉదాహరణం :- సామాసామా। మామాగాధామాగారిసాసా। ధాసాగాగారిసాసా। మాధసాసారిరీరిగాగామామాగారీగాధామారీసాసా। ధానీసాసామా ధనీమాధనీనీ ధాపాగరీగాసాసాసామాగారీసాసాగారీమాగారీసాధాధామాగారీసా । కోలాహలీ ।

**మధ్యమాంశా తు షడ్జాంతా షడ్జమధ్యమసంగతా ।**
**అసంపూరాస్మృతా నిత్యం మధ్యమగ్రామికామతా ॥**
**సంకీర్ణేయం సదా భిన్నటక్కరాగే వ్యవస్థితా ।**

**ప్రతిపదార్థము** : మధ్యమాంశా = మధ్యమాంశము; షడ్జాంతా = షడ్జాంతము; షడ్జమధ్యమసంగతా = షడ్జమధ్యములకు సంగతి; నిత్యం అసంపూర్ణా స్మృతా= సదా అసంపూర్ణము; మధ్యమగ్రామికా మతా = మధ్యమగ్రామసంబధితముగా సమ్మతము; ఇయం సదా సంకీర్ణా = ఇది ఎల్లప్పుడు సంకీర్ణము; టక్కరాగే వ్యవస్థితా = టక్కరాగమందున్నది

**తాత్పర్యము** : మధ్యమాంశము, షడ్జాంతము, షడ్జమధ్యమములకు సంగతి. సదా అసంపూర్ణము. మధ్యమగ్రామసంబంధితముగా సమ్మతము. ఇది ఎల్లప్పుడు సంకీర్ణము టక్కరాగమందున్నది.

ఉదాహరణం :- మాధానీ। గాధానీ। సానీధా। మామామాధానీమాధానీ సాసామాధానీ। మా। ధానీనీ। ధాపాగారీ గాసాసా। గాసాసా। నీనీసానీ। ధాధా। నిధామామామా ధానీధామామా ధనీమాధానీసాసా। ఆలాపకం మధ్యమదేహా (?)।

**ధైవతాంశా తు షడ్జాంతా గాంధారస్వరభూషితా ।**
**గాంధార పంచమీ జ్ఞేయా షడ్జమధ్యమసంయుతా ॥**
**పూర్ణాచ + + సంకీర్ణా గీయతే పాలకిన్నరైః ।**

**ప్రతిపదార్థము** : గాంధారపంచమీ, ధైవతాంశా = గాంధారపంచమి ధైవతాంశము; షడ్జాంతా = షడ్జాంతము; గాంధారస్వరభూషితా = గాంధారస్వరాలంకృతము; షడ్జమధ్యమసంయుతా = షడ్జమధ్యమములకు సంగతి; పూర్ణా = సంపూర్ణము;+ + సంకీర్ణా గీయతే = సంకీర్ణముగా గానము చేయబడుచున్నది

**తాత్పర్యము** : గాంధారపంచమీ, ధైవతాంశము, షడ్జాంతము, గాంధార

స్వరాలంకృతము, షడ్జమధ్యమములకు సంగతి సంపూర్ణము. సంకీర్ణముగా గానముచేయబడుచున్నది.

ఉదాహరణం :- పధాపాపాధామామా। ధాపామామా ధాపామాగారీ । గాగా। ధాపమాగాసా। సామాసానీ ధాధా। మాధానీసాసా। సాగాగసాగాగధరిధామామా ధారీగాగామాధాపామాగా సానీధానీ సాసాపాసా। గాంధారపంచమీకా।

**ఏతాశ్చ యాష్టికే ప్రోక్తాః టక్కరాగస్య షోడశ ।**
**అతః పరం ప్రవక్ష్యామి లక్షణం చ సమాసతః ॥**

**పంచమాంశా తు షడ్జాంతా శుద్ధా మధ్యమభూషితా ।**
**విభాషా టక్కరాగోత్థా భాషాంతేషు చ గీయతే ॥**

**ప్రతిపదార్థము :** ఏతాః టక్కరాగస్య షోడశ యాష్టికే ప్రోక్తాః = ఈటక్కరాగషోడశ ప్రబేధములు యాష్టికునిచే చెప్పబడినవి; అతః పరం = ఇటు తరువాత; సమాసతః = సంగ్రహముగా; లక్షణం ప్రవక్ష్యామి = లక్షణమునుచెప్పుదును; శుద్ధా = శుద్ధవిభాష; పంచమాంశా = పంచమాంశము; షడ్జాంతా = షడ్జాంతము; మధ్యమభూషితా = మధ్యమాలంకృతము; టక్కరాగోత్థా ఏషా విభాషా = టక్కరాగజనితమైన ఈవిభాష; బాషాంతేషు గీయతే = భాషాంతములందు గానముచేయబడుచున్నది

**తాత్పర్యము :** ఈ టక్కరాగషోడశప్రబేధములు యాష్టికునిచే చెప్పబడినవి. ఇటుతరువాత సంగ్రహముగా లక్షణమును చెప్పుదును. శుద్ధవిభాష పంచమాంశము, షడ్జాంతము, మధ్యమాలంకృతము, టక్కరాగజనితమైన ఈవిభాష, భాషాంతరములందు గానము చేయబడుచున్నది.

ఉదాహరణం :- పాపానీసాసానీసారీమాధారీధాపాపామాగాగా ।

అథ మాలవకైశికే = తరువాత మాలవ కైశికయందు -

**షడ్జాద్యంతసమాయుక్తా బహులౌ షడ్జమధ్యమౌ ।**
**+సంపూర్ణస్వరా జ్ఞేయా సౌరాలీ దేశసంభవా ॥**
**భాషేయం ప్రథమా జ్ఞేయా మధ్యమా మాలకైశికే ।**

**ప్రతిపదార్థము :** ఇయం సౌరాలీ భాషా = ఈసౌరాలీయను భాష;

మధ్యమామాలకైశికే = మధ్యమామాలకైశికయందు; ప్రథమా జ్ఞేయా = మొదటిదిగా తెలియవలెను; షడ్జాద్యంతసమాయుక్తా = షడ్జాద్యంతయుతము; షడ్జమధ్యమే బహులౌ = షడ్జమధ్యములధికములు; ఇయం= ఇది; దేశసంభవా= దేశజనితము; సంపూర్ణస్వరా = సంపూర్ణము

**తాత్పర్యము :** ఈ పౌరాలీయను భాష మధ్యమామాలకైశికయందు మొదటిదిగా తెలియవలెను. షడ్జాద్యంతయుతము షడ్జమధ్యములధికములు. ఇది దేశజనితము. సంపూర్ణము.

ఉదాహరణం :- సాగాసాగాగాధరిగరిహరిమా। మమమగ। గరిసానీధాధాసాగాగా। గారీగారీ। సాసాగామానీధాధాపామారీసాసాగానీధానీ సాసాపాసా। శుద్ధాః గమా। గాగాగాగాపాపా। మామాగాగా। పామామామా। మామా। మామారీరీ। రిగాగారీసాసాసారీ। మగసాసామాగారీ సానీ। సాసా। పౌరాలీ ।

**మధ్యమాంశా తు షడ్జాంతా విభాషా పూర్ణసుస్వరా ।**
**గీయతేర్ష+ సంయుక్తా శుద్ధమాలవకైశికే ॥**

**ప్రతిపదార్థము :** శుద్ధమాలవకైశికే = శుద్ధమాలవకైశికమందు; మధ్యమాంశా = మధ్యమాంశము; షడ్జాంతా = షడ్జాంతము; విభాషా = విభాష; పూర్ణసుస్వరా= సంపూర్ణసుస్వరయుతము; ఋషభ+సంయుక్తా గీయతే = రిషభయుతముగా గానముచేయబడును

**తాత్పర్యము :** శుద్ధమాలవకైశికమందు మధ్యమాంశము, షడ్జాంతము విభాష, సంపూర్ణసుస్వరయుతము. రిషభయుతముగా గానముచేయబడును.

ఉదాహరణం :- మామాధాసాగారీసాసా। నిధాసాసాధానిమామాధానీసా। రిగామాసా। సాధామాగారిగాసాసా। శుద్ధా ।

**మధ్యమాంశా తు షడ్జాంతసంపూర్ణా చాద్యవేసరీ ।**
**దుర్బలా చ నిషాదేన బహులౌ షడ్జమధ్యమౌ ॥**
**సంకీర్ణేయం యదా జ్ఞేయా భాషా గాంధార్వ వేదిభిః ।**

**ప్రతిపదార్థము :** ఇయం సంకీర్ణా అద్యవేసరీ భాషా= ఈసంకీర్ణమైన అద్యవేసరీ

భాషా; అద్యవేసరీభాష మధ్యమాంశా = మధ్యమాంశము; షడ్జాంతసంపూర్ణా = షడ్జాంత (ము) సంపూర్ణము; నిషాదేన దుర్బలా = నిషాదాల్పము; షడ్జమధ్యమౌ బహులౌ = షడ్జమధ్యములు బహుళములు

**తాత్పర్యము :** ఈ సంకీర్ణమైన అద్యవేసరీ భాష మధ్యమాంశము. షడ్జాంత(ము). సంపూర్ణము. నిషాదాల్పము, షడ్జమధ్యములు బహుళములు.

ఉదాహరణం :- మామాగామాసాసా। సామాపాపాధాసాధా। పాపామామా। గమగమాగ। సాసాసాసా। గామాపాపాధపాపాధమ్మపామా। గమగమగారీసా ధాసాసాగాగధరి। మామాగరి। సాధాసాసా। సారిరిరిగాగారీ। సాసాసధామమగా ససపాస। సాసాధాధాపాపా సపాపంచమధాధాపంచసాసాధాధాధాపా। పమాగాసా। సాసాగారీగారీ గాధాసాసా । అద్యవేసరీ।

> **షడ్జాద్యంతసమాయుక్తా మధ్యమర్షభసంగతా ।**
> **ద్విశ్రుతిభ్యాం తు రూఢా తు కాకల్యంతరసంకరః ॥**
> **సాధారణకృతా హ్యేషా దేశాఖ్యా హర్షపూరితా ।**

**ప్రతిపదార్థము :** ఏషా హర్షపూరితా = ఈహర్షపురి; దేశాఖ్యా = దేశ్యము; సాధారణకృతా = సాధారణజనితము; షడ్జాద్యంతసమాయుక్తా = షడ్జాద్యంతయుతము; మధ్యమర్షభసంగతా = మధ్యమరిషభ సంగతము; ద్విశ్రుతిభ్యాం రూఢా = ద్విశ్రుతులతో రూఢము; కాకల్యంతరసంకరః = కాకలీనిషాదఅంతరగాంధారసంకీర్ణము

**తాత్పర్యము :** ఈహర్షపురి దేశ్యము. సాధారణజనితము. షడ్జాద్యంతయుతము మధ్యమరిషభసంగతము. ద్విశ్రుతులతో రూఢము. కాకలీనిషాద అంతర గాంధారసంకీర్ణము.

ఉదాహరణం :- సానీధానీసాసామాపా। మాగాధామా। గాసాసాగా। గధానీ। సాసాధాసా। నీధాపాపాగగామగామసాసానీధాసాసా। పామాగాధామాగాసాసా। పామాపాపాసరిసా సాసామాగా। గపాపానిధా। సరినీపామాగాగానిధాసాసాసరీసరీ। సాసారిధాపాపా। మాగారిసాసా సాపామాగారిసాగగ। సరిమాగారీసానీససా। హర్షపూరీ ।

సారీసాసాసాసమా। గమాగమాగమాగపాపామాగారీసరీసాసా ।

**మాంగాలీ మధ్యమాంశా తు షడ్జాతా మధ్యమోజ్జ్వలా ।**
**మధ్యమర్షభసంపూర్ణా + + +లోకరంజికా ॥**
**ఏషా భాషా తు విజ్ఞేయా మాంగాలీ గేయవేదిభిః ॥**

**ప్రతిపదార్థము** : మాంగాలీ ఏషాభాషా = ఈమాంగాలీ భాష: మధ్యమాంశా = మధ్యమాంశము; షడ్జాతా = షడ్జాతము; మధ్యమోజ్జ్వలా = మధ్యమప్రకాశితము; మధ్యమర్షభసంపూర్ణా = మధ్యమరిషభ సంపూర్ణము; + + +లోకరంజికా విజ్ఞేయా = లోకరంజకముగా తెలియదగినది

**తాత్పర్యము** : ఈమాంగాలీ భాష మధ్యమాంశము షడ్జాతము, మధ్యమప్రకాశితము, మధ్యమరిషభసంపూర్ణము లోకరంజకముగా తెలియదగినది.

ఉదాహరణం :- మాగామా । గాసామాపమా। గమపాపాసనిసాసానీపాపాపామ । గమమగగమామా। సగమపాపానీసానిసాసానీసాసానీపాపా. . . . .పామ । పాపామగా। పమగాపమగా। మామామగ। సాసాగమాపాపాసనీరీరీ। మాగారీ। సనిససా। మాంగాలీ।

**సైంధవీ చైవ కర్తవ్యా షడ్జాద్యంతవిభూషితా ।**
**షడ్జమధ్యమబహులా నిషాదర్షభయోస్తథా ॥**
**సబంధువిషయసంభూతా దేశాఖ్యాం సైంధవీం విదుః ॥**

**ప్రతిపదార్థము** : సైంధవీ = సైంధవి; షడ్జాద్యంతవిభూషితా కర్తవ్యా = షడ్జాద్యంత విభూషితము; షడ్జమధ్యమబహులా = షడ్జమధ్యమబహుళము; తథా = అట్లే; నిషాదర్షభయోః = నిషాదరిషభములకును; సబంధువిషయసంభూతా = స బంధు విషయోద్భవము; దేశాఖ్యాం సైంధవీం విదుః = దేశనామకముగా సైంధవీభాషను తెలియుదురు

**తాత్పర్యము** : సైంధవి షడ్జాద్యంత విభూషితము, షడ్జమధ్యమ బహుళము. అట్లే నిషాదరిషభములకును; సబంధు విషయోద్భవము. దేశనామకముగా సైంధవీభాషను తెలియుదురు.

ఉదాహరణం - సారీ । మామా । మాధాపాపాపాగా। పామాగారీ। పామాగారీ। సనీ। సాధాసారీ మరీమా । మామాధాపాపా। పాధమాపాధాపామాగారీసనీసాసా। సైంధవీ।

**షడ్జాద్యంతసమాయుక్తా సంపూర్ణదేశసంభవా ।**
**+ + +షడ్జా సంవాదో ద్విశ్రుతిచాల్పరూపిణౌ ॥**
**సాధారణకృతా హ్యేషా ఆభీరీ గీయతే జనైః ॥**

**ప్రతిపదార్థము** : షడ్జాద్యంతసమాయుక్తా = షడ్జమధ్యంతములందు కలది; సంపూర్ణదేశ సంభవా = సంపూర్ణ(ము) దేశజనితము; + + + షడ్జా సంవాదః = + + + షడ్జసంవాదము; ద్విశ్రుతిచాల్పరూపిణౌ = ద్విశ్రుతి (గాంధార నిషాదములు) అల్పములు; సాధారణకృతా = సాధారణ కృతమైన; ఏషా ఆభీరీ = ఈ ఆభీరి; జనైఃగీయతే = జనులచే గానము చేయబడుచున్నది

**తాత్పర్యము** : షడ్జమధ్యంతములందు కలది. సంపూర్ణ (ము) దేశజనితము షడ్జసంవాదము ద్విశ్రుతి (గాంధార నిషాదములు) అల్పములు, సాధారణకృతమైన, ఈ ఆభీరి జనులచే గానము చేయబడుచున్నది.

ఉదాహరణం - సాసారీరీ। సాసారీరీ। సాసారీసారీ। సాసానీసాసారీ । సారీసారీసాసానీ సరీరీగారీగారీ । సనిసాసా। గారీరీ । గామాగరీ । గపాపగారీ। సనిసాసా। సనీసాసాధారీ గగమాసా। పమాగారీ। సనీసాసా । ధనీధానీ। సాధనిసా। రిరిగామా। గామారిరి। గాపామాపా। మాగారీరీ। సాసారిసారీ। సాసానీసారీ। రీరీసాసాసానిరీరిగారి। రిగాగిరి। సని। సాసాగారీరి। గామగారీ। సాని। గారీరీ। మాగాగారీ। గాపాగారీ। సనీసాసాసనీ। సాసా। రిగగమాసా। పమాగారీ। గాపామాపా। మపమా। మగారిరీ। మపాగారి। సనిసాసా। ఆభీరీ।

సనిససా। సధనిసాసా। సనిధానిధాధనిసారీరీ। గామాగమారిరీ।

**ఖండనీ పంచమాంశా తు షడ్జాంతా ధైవతోజ్ఝితా ।**
**షడ్జనిషాదసంవాదో మధ్యమర్షభయోస్తథా ॥**
**సంకీర్ణా షాడబా జ్ఞేయా సర్వలోకస్య రంజికా ।**

**ప్రతిపదార్థము** : ఖండనీ, పంచమాంశా = ఖండని పంచమాంశము; షడ్జాంతా= షడ్జాంతము; ధైవతోజ్ఝితా = ధైవతరహితము; షడ్జనిషాదసంవాదః = షడ్జనిషాదములకు సంవాదత్వము; తథా = అట్లే; మధ్యమర్షభయోః = మధ్యమరిషభములకును; సంకీర్ణా = సంకీర్ణము; షాడబా = షాడవము; సర్వలోకస్య రంజికా జ్ఞేయా = సర్వలోక రంజకమైనదిగా తెలియవలెను

**తాత్పర్యము** : ఖండనీ, పంచమాంశము, షడ్జాంతము, ధైవతరహితము, షడ్జనిషాదములకు సంవాదత్వము అట్లే మధ్యమరిషభములకును సంకీర్ణము షాడవము; సర్వలోకరంజకమైనదిగా తెలియవలెను.

ఉదాహరణం - పానీమారీసరి । సాసాసరీరి । సని। రిరీ। సనిసని। రి। పాపాపాని। సరిసని। సగససా। సనిరీసనీరీరీ। మాగారిగమా। నీపాపానీసనీపాపామగ। పాపా। ని। నిమనిసరిసగసాసా। ఖండనీ।

**నిషాదాంశాతు షడ్జాంతా గూర్జరీదేశసంభవా ।**
**నిషాదర్షభసంయోగో మధ్యమర్షభయోస్తథా ॥**
**సంపూర్ణా చైవ విజ్ఞేయా షాడబా గేయవేదిభిః ।**

**ప్రతిపదార్థము** : షాడబా, నిషాదాంశా = నిషాదాంశము; షడ్జాంతా = షడ్జాంతము; గూర్జరీదేశసంభవా = గూర్జరీదేశోద్భవము; నిషాదర్షభసంయోగః = నిషాదరిషభములకు సంగతి; తథా =అట్లే; మధ్యమర్షభయోః = మధ్యమరిషభములకును సంగతి; సంపూర్ణా విజ్ఞేయా = సంపూర్ణముగా తెలియదగినది

**తాత్పర్యము** : షాడబా, నిషాదాంశము, షడ్జాంతము, గూర్జరీదేశోద్భవము, నిషాదరిషభములకు సంగతి. అట్లే మధ్యమరిషభములకును సంగతి, సంపూర్ణముగా తెలియదగినది.

ఉదాహరణం - నిధానీనీ । రిగానిధా। నిసాసాధని। ధాగ। రి। సాగరీ। సానిధానీ। గధాసారీ। గారీమాగారీ। సనిధాధానిధాసరిగారీ। సనీసాసా। నిధాసానీగరీ। మగరి। మగారి। పాపాగారీమామా। రిధానిధానిధాసరి। గరిసానీ సాసానీధాసరీరి । నిధాసాసా। ధనీసాగా। గారిమగరీమగరి। మాపాగరి। మగరిసనీ। ధాధానిధాసరిగరి।

సనిసాసా। ఏతా యాష్టికేన ప్రయుక్తాః = ఇవి యాష్టికునిచే ప్రయోగింపబడినవి, అథ కకుభే = తరువాత కకుభమందు ।

**ధైవతాద్యంతసంయుక్తా కాంబోజా పూర్ణసుస్వరా ।**
**షడ్జధైవతసంవాదః పంచమర్ష భయోస్తథా ॥**
**ఏషా భాషా తు దేశాఖ్యా ప్రథమా కకుభోద్భవా ।**

**ప్రతిపదార్థము** : కాంబోజా, కకుభోద్భవా = కకుభజనితము; ఏషా దేశాఖ్యా భాషా = ఇది దేశ్యభాష; ధైవతాద్యంత సంయుక్తా = ధైవత ఆది, అంతయుతము; పూర్ణసుస్వరా = పూర్ణస్వరయుతము; షడ్జధైవతసంవాదః = షడ్జధైవతములకు సంవాదత్వము; తథా = అట్లే; పంచమర్షభయోః = పంచరిషభములకును సంవాదము

**తాత్పర్యము** : కాంబోజ, కకుభజనితము, ఇది దేశభాష. ధైవత ఆది, అంతయుతము. పూర్ణస్వరయుతము, షడ్జధైవతములకు సంవాదత్వము. అట్లే పంచమరిషభతములకును సంవాదము.

ఉదాహరణం - ధాసాగాగా। మాగారీసా సాసనిసాసా। ధాపాపా। ధామాసారిగా। మాగారీసాసా। సనిధాధాపాపామధానిరిసనిధాధా ।

**మధ్యమాంశా ధైవతాంతా పూర్వమధ్యమగ్రామికా ।**
**పరస్పరం తు దృశ్యేత సహితౌ వృషభధైవతౌ ॥**
**ఏషా భాషా చ సంకీర్ణా రమ్యా కకుభసంభవా ।**

**ప్రతిపదార్థము** : పూర్వమధ్యమగ్రామికా, మధ్యమాంశా = పూర్వమధ్యగ్రామిక మధ్యమాంశము; ధైవతాంతా = ధైవతాంతము; పరస్పరం = అన్యోన్యము; ఋషభధైవతౌ సహితౌ దృశ్యేత = రిషభధైవతములు సంగతములుగా కనబడును; ఏషా భాషా సంకీర్ణా = ఈ భాష సంకీర్ణము; కకుభసంభవా = కకుభజనితము; రమ్యా = సుందరమైనది

**తాత్పర్యము** : పూర్వమధ్యమగ్రామికా, మధ్యమాంశము ధైవతాంతము, అన్యోన్యము రిషభధైవతములు సంగతములుగా కనబడును. ఈ భాష సంకీర్ణము, కకుభజనితము. సుందరమైనది.

ఉదాహరణం - మామా। గరిధా సారీసామా। నిగరి సనిసానిధా। సాధాసాధనిరిసా। ధనిరిరి। మాపాపమాగా। రిరిరిరి। గామ। గామ। ధాధామాపామాగారీసా సాధా ధధధ। మధ్యమగ్రామికా ।

**ఋషభాంశా ధైవతాంతా విజ్ఞేయా సాతవాహినీ ।**
**పరస్పరం తు దృశ్యంతే మధ్యమర్షభసంగతౌ ॥**
**సప్తమం కించిదిచ్ఛంతి కేచిత్ తేనైవ దుర్బలమ్ ।**

**ప్రతిపదార్థము :** సాతవాహనీ, ఋషభాంశా = రిషభాంశము; ధైవతాంతా = ధైవతాంతము; పరస్పరం = అన్యోన్యము; మధ్యమర్ష భసంగతౌ దృశ్యన్తే = మధ్యమరిషభ సంగతములుగా కనబడుచున్నవి; సప్తమం కించిత్ ఇచ్ఛంతి = సప్తమము (నిషాదము) ను కొంచెము (అల్పము) గాకోరుచున్నారు; కేచిత్ = కొందరు; తేనైవ = దానిచేతనే; దుర్బలం ఇచ్ఛంతి = అల్పతనిష్టపడుచున్నారు

**తాత్పర్యము :** సాతవాహనీ, రిషభాంశము ధైవతాంతము, అన్యోన్యము మధ్యమరిషభ సంగతములుగా కనబడుచున్నవి. సప్తమము (నిషాదము) ను కొంచెము (అల్పము) గా కోరుచున్నారు. కొందరు దానిచేతనే అల్పతనిష్టపడుచున్నారు.

ఉదాహరణం - గధరిరిమా । మామానిమాధాదధాధాపమపమ మరిమమాసరి। మామపపామపపాపాపాపమరిమరిమామాసరి। పాపపససాని। ధాధారి। సాసాసాసా రీమనిధాధాధాపధాసాధపాధాపమపాపా మరిమామాసారిమాపాపామాసానిధాధా। సాతవాహినీ ।

**మధ్యమాంశా నిషాదాంతా ఋషభేణ తు దుర్బలా ।**
**సంగతిర్దృశ్యతే యత్ర ద్విశ్రుత్యోః పంచమస్య చ ।**
**భాషేయం షాడబా జ్ఞేయా కకుభే భోగవర్ధనీ ॥**

**ప్రతిపదార్థము :** ఇయం భోగవర్ధనీ భాషా = ఈ భోగవర్ధని భాష; కకుభే = కకుభమందు జనితము; షాడబా = షాడవము; ద్విశ్రుత్యోః = గాంధార నిషాదములకు; పంచమస్య చ = పంచమమునకు; సంగతిః దృశ్యతే = సంయోగము కనబడుచున్నది; మధ్యమాంశా = మధ్యమాంశము; నిషాదాంతా= నిషాదాంతము; ఋషభేణ దుర్బలా = రిషభాల్పము

**తాత్పర్యము** : ఈ భోగవర్ధని భాష, కకుభమందు జనితము. షాడవము, గాంధార నిషాదములకు పంచమమునకు సంయోగము కనబడుచున్నది. మధ్యమాంశము నిషాదాంతము. రిషభాల్పము.

ఉదాహరణం - నినీ। గగమా। పామాపమా। ధాధా। ససిససి। ధపధాధపమాపామ। గగగగ। మపధాధానీ। ససససి। మాగసానిధాధాధా। భోగవర్ధనీ।

**పంచమాంశా తేన బహులా+ + మధుకరీ శుభా।**
**పరస్పరం తు సంవాదో గాంధారే పంచమస్య చ॥**

**ధైవత+ నిషాద+ సంయోగో దృశ్యతే యతః।**
**ఏషా పూర్ణా చ సంకీర్ణా భాషా కకుభసంభవా॥**

**ప్రతిపదార్థము** : మధుకరీ, శుభా = మధుకరి మంగళప్రదమైనది; పంచమాంశా= పంచమాంశము; తేన బహులా = పంచమాధిక్యము; గాంధారే = గాంధారమందు; పంచమస్య = పంచమమునకు; పరస్పరం సంవాదః = అన్యోన్యము సంవాదము; ధైవత నిషాదసంయోగః దృశ్యతే = ధైవతనిషాదసంగతి కనబడుచున్నది; ఏషా భాషా = ఈభాష; పూర్ణా = సంపూర్ణము; సంకీర్ణా చ= సంకీర్ణమును; కకుభసంభవా = కకుభోద్భవము

**తాత్పర్యము** : మధుకరి, మంగళప్రదమైనది. పంచమాంశము పంచమాధిక్యము. గాంధారమందు, పంచమమునకు అన్యోన్యము సంవాదము, ధైవతనిషాద సంగతి కనబడుచున్నది. ఈ భాష సంపూర్ణము సంకీర్ణమును; కకుభోద్భవము.

ఉదాహరణం- నినినినిపధపాధనిసాసనిసని। సపధానిధాధపాధరిసాసాగరిమగరి ససమ। గరిసానినినిధపాపాసాగా। పాపామాధా। మాధాధామా। నీసాసాధాధా। మధుకరీ।

**నిషాదాంశా తు షడ్జాంతా + + + + + + ++।**
**నిషాదపంచమానాం తు సంవాదః స్యాత్తు ధైవతే॥**
**మజువత్యంశజా ఛాయా ఛాయా శకవిమిశ్రితా।**

**ప్రతిపదార్థము :** శకవిమిశ్రితా = శకమిశ్రిత; ఛాయా = ఛాయ; మజువత్యంశజా = మజువత్యంశోద్భవము; నిషాదాంశా = నిషాదాంశము; షడ్జాంతా = షడ్జాంతము; ఋషభహీనా = రిషభరహితము; ధైవతే = ధైవతమందు; నిషాద పంచమానాం సంవాదః = నిషాద పంచమములకు సంవాదత్వము

**తాత్పర్యము :** శకమిశ్రిత ఛాయ, మజువత్యంశోద్భవము. నిషాదాంశము షడ్జాంతము. రిషభరహితము. ధైవతమందు నిషాద పంచమములకు సంవాదత్వము

ఉదాహరణం - నీసాని గధ మాగారిరినినిని సాధాధానిధాగమా మామ పాసాసనిసా సాధాధామనీధాధా మానీధాపామాధానీసాసాసానీసాసాసారిగా రీసానీసానీ సా నిధాధామాసానీమాగారీరి । శకమిశ్రితా ।

**ధైవతాంశా మధ్యమాంశా విజ్ఞేయా భిన్నపంచమీ ।**
**నిషాదః కాకలీ భూయో ధైవతేన విమిశ్రితః ॥**

**సంయోగో దృశ్యతే యత్ర కాకల్యా ధైవతస్య చ ।**
**పంచమర్ష భ సంవాదో యత్రైవ సంప్రయోజయేత్ ॥**
**సాధారణకృతా హ్యేషా పూర్ణా ఛాయా చ కాకలీ ।**

**ప్రతిపదార్థము :** భిన్నపంచమీ; ధైవతాంశా మధ్యమాంశా = భిన్నపంచమి ధైవత మధ్యమాంశములు గలది; భూయః = అధికముగా; నిషాదః కాకలీ = నిషాదము కాకలీ; ధైవతేన విమిశ్రితః = ధైవతముతో సంగతియగును; కాకల్యా = కాకలిచే; ధైవతస్య = ధైవతమునకు; యత్ర సంయోగః దృశ్యతే = ఎక్కడ సంయోగము కనబడునో; యత్ర = ఎక్కడ; పంచమర్షభయోః సంవాదః సంప్రయోజయేత్= పంచమరిషభ ములకు సంవాదము ప్రయోగింపబడునో; తత్ర = అక్కడ; ఏషా = ఈ భిన్నపంచమి; సాధారణకృతా ఛాయా = సాధారణకృతమైన ఛాయ; పూర్ణా = పూర్ణము; కాకలీ చ = కాకలియును

**తాత్పర్యము :** భిన్నపంచమి ధైవతమధ్యమాంశములు కలది. అధికముగా నిషాదము కాకలీ ధైవతముతో సంగతియగును. కాకలిచే ధైవతమునకు ఎక్కడ సంయోగము కనబడునో ఎక్కడ పంచమరిషభములకు సంవాదము

ప్రయోగింపబడునో, అక్కడ ఈ భిన్నపంచమి సాధారణకృతమైన ఛాయ పూర్ణము కాకలి.

ఉదాహరణం - ధనిధాధానిధాపాపామరి పాపాపపమాధాధాపాసా సని సాసనిరిరిసారీ। ధాధా। పరిమాపాపా। పమధాధామానీధాపాపాపరీధాపాపాపా ధాధాసనిధా । భిన్నపంచమీ ।

**ఏతా భాషాస్సముద్దిష్టా అథ భిందోలకే + + ।**
**షడ్జాంశన్యాససంయుక్తా ధైవతేన చ దుర్బలా ॥**
**షడ్జగాంధార సంచాంస్తత్ర యోజ్యః ప్రయోక్తృభిః ।**

**ప్రతిపదార్థము** : ఏతాః భాషాః సముద్దిష్టాః = ఈ భాషలుద్దేశింపబడినవి; అథ = తరువాత; భిందోలకే = భిందోలకమందు; షడ్జాంశన్యాససంయుక్తా = షడ్జాంశన్యాసయుతము; ధైవతేన దుర్బలా = ధైవతాల్పము; షడ్జగాంధారసంచారః = షడ్జగాంధారగమనము; తత్ర = ఆ భిందోలకమునందు; యోజ్యః = కూర్చదగినది

**తాత్పర్యము** : ఈ భాషలుద్దేశింపబడినవి. తరువాత భిందోలకమందు షడ్జాంశన్యాసయుతము. ధైవతాల్పము. షడ్జగాంధారగమనము ఆ భిందోలకమునందు కూర్చదగినది.

ఉదాహరణం - సాసాగాసాసనిపాని । మాధామాగాసమాసాసాసా । సమగా సపమరిగాసానినిమాసాగాసాసా। ధనిపాపాపనిసాగా।

**గాంధారస్య ప్రయోగేణ భాషేయం తస్య వైసరీ ।**
**పంచమాంశా ఋషభహీనా షడ్జాంతా షాడబా భవేత్ ॥**

**షడ్జపంచమసంచారో ద్విశ్రుతీనాం తథైవ చ ।**
**భాషాభిందోలకే హ్యేషా కథితా ప్రథమమంజరీ ॥**

**ప్రతిపదార్థము** : ఇయం భాషా = ఈ భాష; గాంధారస్య ప్రయోగేణ = గాంధార ప్రయోగముచే; తస్య =దానికి; వైసరీ = వేసర సంబంధి; పంచమాంశా = పంచమాంశము; ఋషభహీనా = రిషభరహితము; షడ్జాంతా = షడ్జాంతము;

షాడబా = షాడవము; షడ్జపంచమ సంచారః = షడ్జ పంచమములకు గమనము; తథైవ = అట్లే; ద్విశ్రుతీనాం = ద్విశ్రుతులకును గమనము; ఏషా ప్రథమమంజరీ= ఈ ప్రథమ మంజరి; భిందోలకే కథితా = భిందోలకమునందు చెప్పబడినది

**తాత్పర్యము** : ఈ భాష గాంధార ప్రయోగముచే దానికి వేసర సంబంధి. పంచమాంశము రిషభరహితము. షడ్జాంతము. షాడవము. షడ్జపంచమములకు గమనము, అట్లే ద్విశ్రుతులకును గమనము. ఈ ప్రథమమంజరి భిందోలకమునందు చెప్పబడినది.

ఉదాహరణం - పాపాపాపాధమపానీసాపంచమపాధని ధాసాసాపాపనిసాసాగా సాపాగామానిసనిపాపానిసాపానిసాగానిసానిసాసా ప్రథమమంజరీ ।

**షడ్జాంశన్యాససంయుక్తా సంపూర్ణా ధేన దుర్బలా ।**
**సంవాదశ్చైవ కర్తవ్యః షడ్జమధ్యమయోస్తథా ॥**
**షడ్జగాంధారయోః నిత్యం చేవాటీ సంప్రకీర్తితా ।**

**ప్రతిపదార్థము** : చేవాటీ, షడ్జాంశన్యాససంయుక్తా = చేవాటి షడ్జాంశ న్యాసయుతము; సంపూర్ణా = సంపూర్ణస్వరము; ధేన దుర్బలా = ధైవతముచే అల్పము; షడ్జమధ్యమయోః = షడ్జమధ్యమములకు; తథా = అట్లే; షడ్జగాంధారయోః = షడ్జగాంధారములకు; నిత్యం = ఎల్లప్పుడు; సంవాదః కర్తవ్యః = సంవాదముచేయదగినది; సా చేవాటీ సంప్రకీర్తితా = అది చేవాటిగా చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : చేవాటి, షడ్జాంశ న్యాసయుతము, సంపూర్ణ స్వరము. ధైవతము అల్పము. షడ్జమధ్యమములకు అట్లే షడ్జగాంధారములకు ఎల్లప్పుడు సంవాదము చేయదగినది. అది చేవాటిగా చెప్పబడుచున్నది.

ఉదాహరణం - సాసాసా । మాగాసాసాగామనిమాపామాసాసామామా నీమామానీమామా నీమామాపాపాగామా సాసాసాగాసనీ । సాగాసానీసని ధామధామా పాపాపాధామామాధమపమగరిసాసానీనీనీ సాగారీమామారీనీసాసా। ఛేవాటి ।

**షడ్జాంశా మధ్యమాంతా చ నిషాదర్షభదుర్బలా ।**
**షడ్జమధ్యమసంవాదస్తథా గాంధారపంచమే ॥**
**షాడవౌడుబితా జ్ఞేయా ప్రకృత్యా షడ్జమధ్యమా ।**
**ఏషా భాషా తు కథితా కిన్నరైరపి గీయతే ॥**

**ప్రతిపదార్థము :** షడ్జమధ్యమా, షడ్జాంశా = షడ్జాంశము; మధ్యమాంతా = మధ్యమాంతము; నిషాదర్షభదుర్బలా = నిషాదరిషభాల్పము; షడ్జమధ్యమ సంవాదః = షడ్జమధ్యమములందును; ప్రకృత్యా = స్వభావముచే; షడ్జమధ్యమా, షాడవౌడుబితా = షాడబత్వ ఔడుబితత్వములుకలది; ఏషా భాషా కిన్నరైః అపి గీయతే = ఈ భాష కిన్నరులచేతనుకూడ గానము చేయబడుచున్నది

**తాత్పర్యము :** షడ్జమధ్యమ, షడ్జాంశము. మధ్యమాంతము. నిషాదరిషభాల్పము. షడ్జమధ్యమములందును స్వభావముచే షడ్జమధ్యమా షాడబత్వ ఔడుబితత్వములు కలది. ఈ భాష కిన్నరులచేతను కూడ గానము చేయబడుచున్నది.

ఉదాహరణం - సాపాపాధామామాపాగామగాపధాధాపాగమాగాపాపాపా ధాపాసాసాపాధాపమగామామాగామసాసాసాగాగామాగామామా। షడ్జ+ + + ।

**మధ్యమాంశా తు షడ్జాంతా దుర్బలా పంచమేన తు ।**
**ధైవతనిషాదబాహుల్యం షడ్జధైవతయోస్తథా ॥**
**భాషేయం షాడబా జ్ఞేయా ప్రేక్షకే మధుకరీ భవేత్ ।**

**ప్రతిపదార్థము :** ఇయం భాషా మధుకరీ షాడబా భవేత్ = ఈమధుకరీ భాష షాడబ మగును; ప్రేక్షకే జ్ఞేయా = ప్రేక్షకమందగును; మధ్యమాంశా = మధ్యమాంశము; షడ్జాంతా = షడ్జాంతము; పంచమేన దుర్బలా = పంచమాల్పము; ధైవతనిషాద బాహుల్యం = ధైవతనిషాద బహుత్వము; తథా= అట్లే; షడ్జధైవతయోః = షడ్జధైవతములకును

**తాత్పర్యము :** ఈ మధుకరీ భాష షాడబమగును. ప్రేక్షకమందగును. మధ్యమాంశము షడ్జాంతము. పంచమాల్పము. ధైవతనిషాద బహుత్వము అట్లే షడ్జధైవతములకును.

ఉదాహరణం - మాపాపాధాధామాధనినిపాననిధసాసామపాధని సనిసాసామాపానిసాసారిరీగమగారీసాసానిధాపాపాపాధనిధాసాసారిరీగమాగరిసాసా। మధు(క)రీ।

**ఇతి హిందోలకే భాషా సమాప్తా**



**అతః పరం ప్రవక్ష్యామి పంచమషాడబే భాషాః।**
**పంచమాంశా తదంతా చ నిషాదబాహులా సదా॥**

**పరస్పరం తు దృశ్యేత షడ్జధైవతసంగతిః।**
**పూర్ణపంచమజా హ్యేషా ఆభీరీదేశసంభవా।**
**ఏషా భాషా తు విజ్ఞేయా ప్రథమా పంచమోద్భవా॥**

**ప్రతిపదార్థము** : అతః పరం = ఇటు తరువాత; పంచమషాడబే భాషాః ప్రవక్ష్యామి = పంచమ షాడబమందు భాషలను చెప్పుదును; ఆభీరీ, పంచమాంశా = ఆభీరి పంచమాంశము; తదంతా = పంచమాంతము; సదా నిషాదబహులా = సర్వదా నిషాదబహులము; పరస్పరం = అన్యోన్యము; షడ్జధైవతసంగతిః దృశ్యేత = షడ్జధైవతసంయోగము కనబడుచున్నది; ఏషా= ఇది; దేశసంభవా = దేశ్యజము; పూర్ణపంచమజా = పూర్ణ పంచమోద్భవము; ప్రథమా పంచమోద్భవా విజ్ఞేయా = ప్రథమ పంచమజనితముగా తెలియదగినది

**తాత్పర్యము** : ఇటుతరువాత పంచమ షాడబమందు భాషలను చెప్పుదును. ఆభీరి, పంచమాంశము, పంచమాంతము, సర్వదా నిషాదబహులము అన్యోన్యము. షడ్జధైవత సంయోగము కనబడుచున్నది. ఇది దేశ్యజము. పూర్ణ పంచమోద్భవము ప్రథమ పంచమజనితముగా తెలియదగినది.

ఉదాహరణం - పాధామాధనిధాపాపాపాపధనిధామామాధానిసాసానిధని సధానిసానిధాసాధరిమామాధానినిధాపాపాపమమధనిసాసాననినిసాసా సనిగరిమమమాగరిససధనిపాధామామాసరిమాధారిమపాపా ।ఆభీరీ।

**భావినీ పంచమన్యాసా గాంధారాంశాల్పధైవతా।**
**మధ్యమపంచమయోర్యత్ర గమనం దృశ్యతే ఘనమ్॥**

**భాషా తు భావినీ జ్ఞేయా పూర్ణా గాంధర్వవేదిభిః ॥**

**ప్రతిపదార్థము** : భావినీ భాషా = భావిని, పూర్ణా = సంపూర్ణము; పంచమన్యాసా= పంచమన్యాసము; గాంధారాంశా = గాంధారాంశము; అల్పధైవతా =ధైవతము అల్పము; యత్ర = ఎక్కడ; మధ్యమపంచమయోః = మధ్యమపంచమములకు; ఘనం = ఘనమైన; (గొప్పదైన) గమనం దృశ్యతే = గమనము కనబడునో; సా భావినీ జ్ఞేయా = ఆభాష భావినిగా తెలియదగినది

**తాత్పర్యము** : భావిని సంపూర్ణము. పంచమ న్యాసము, గాంధారాంశము. ధైవతముఅల్పము ఎక్కడ మధ్యమపంచమములకు ఘనమైన (గొప్పదైన) గమనము కనబడునో, ఆ భాష భావినిగా తెలియదగినది.

ఉదాహరణం - గామాపాగమపానిధా । గమపామాగాగారీరీగానీధాపాపాపాపా। మామాగామాపాపామాపాపామాధారీసగగమాపామాగారీరీపాపా। భావినీ ।

**మాంగాలీ పంచమాంతా చ ధైవతాంశా ప్రకీర్తితా ।**
**షడ్జధైవతసంవాదో మధ్యమర్ష భయోస్తథా ॥**

**సంకీర్ణా చ మతా నిత్యం జ్ఞేయా వైదేశసంభవా ।**
**ఏషా భాషా చ గీతజ్ఞైః ఉక్తా పంచమసంభవా ॥**

**ప్రతిపదార్థము** : మాంగాలీ, పంచమాంతా = మాంగాలి పంచమాంతము; ధైవతాంశా = ధైవతాంశము; షడ్జధైవతయోః సంవాదః = షడ్జధైవతములకు సంవాదము; తథా = అట్లే; మధ్యమర్ష భయోః = మధ్యమరిషభములకును సంవాదము; నిత్యం సంకీర్ణా = సదా సంకీర్ణము; వైదేశసంభవా = విదేశజనితము; ఏషా భాషా = ఈ భాష; పంచమ సంభవా ఉక్తా = పంచమసంభవముగా చెప్పబడినది

**తాత్పర్యము** : మాంగాలి, పంచమాంతము, ధైవతాంశము, షడ్జధైవతములకు సంవాదము. అట్లే మధ్యమరిషభములకును సంవాదము. సదా సంకీర్ణము. విదేశజనితము. ఈ భాష పంచమసంభవముగా చెప్పబడినది.

ఉదాహరణం - సాసాసానధాసారిరిధాసారిరిధాసాధాసాధాసాసారి మారిమామామధ మధపాపాపాధామపాపామసాసానిధసారిరిమాగరిసా

సారిమారిమామమధ మపపాపాపామాపాపమసాసానిధససారిరిగారిమారీసా ధాసాసాధమాసాసాసా సామ। పమామాపాపా। మాంగాలీ ।

**పంచమాంశా తదంతా చ సంపూర్ణా పంచమోజ్జ్వలా ।**
**సైంధవీ షడ్జ సంభూతాం విభాషాం సైంధవీం విదుః ॥**
**షడ్జపంచమసంవాదో దృశ్యతే చ ముహుర్ముహుః ।**

**ప్రతిపదార్థము** : సైంధవీ, పంచమాంశా = పంచమాంశము; తదంతాచ = పంచమాంతమును; సంపూర్ణా = సంపూర్ణము; పంచమోజ్జ్వలా = పంచమోజ్జ్వలము; షడ్జసంభూతాం = షడ్జ జనితముగను; విభాషాం విదుః = విభాషగను తెలిసికొనుచున్నారు; ముహుర్ముహుః = మాటిమాటికి; షడ్జపంచమసంవాదః దృశ్యతే = షడ్జపంచమసంవాదము కనబడుచున్నది

**తాత్పర్యము** : సైంధవి, పంచమాంశము, పంచమాంతమును. సంపూర్ణము. పంచమోజ్జ్వలము షడ్జజనితముగను విభాషగను తెలియవలెను. మాటిమాటికి షడ్జపంచమ సంవాదము కనబడుచున్నది.

ఉదాహరణం - పాపాధసారిగాగాగరిమారి। ససానిధాధాసనిధాధామసరిగా గాగరిసాధాధపాపాధాపాధసారిగారిపపారిగాగారిరీసాధాసాధాపామాపాపాధాపాధా పామామామాపాధాధాసారీరిసాధాపామాపాపా। సైంధవీ ।

**గూర్జరీ పంచమాంతా చ గాంధారాంశాల్పమధ్యమా ।**
**షడ్జమధ్యమసంవాదః సంపూర్ణా నిత్యమేవ హి ॥**
**విభాషేయం సమాఖ్యాతా సంపూర్ణా పంచమోద్భవా ।**

**ప్రతిపదార్థము** : గూర్జరీ, పంచమాంతా = గూర్జరి పంచమాంతము; గాంధారాంశా = గాంధారాంశము; అల్పమధ్యమా = మధ్యమము అల్పము; షడ్జమధ్యమసంవాదః = షడ్జమధ్యమములకు సంవాదత్వము; నిత్యమేవ సంపూర్ణా = సదా సంపూర్ణము; ఇయం విభాషా = ఇది విభాష; పంచమోద్భవా = పంచమజనితము

**తాత్పర్యము** : గూర్జరి, పంచమాంతము, గాంధారాంశము, మధ్యమము అల్పము. షడ్జమధ్యమములకు సంవాదత్వము. సదా సంపూర్ణము. ఇది విభాష. పంచమజనితము.

ఉదాహరణం - గరీమామామధానిధాపాపాధాధానీధా మామామాధాగా రీరీసరిగరిమా ధామాపాధపధనిధాధధపరీరీసారిమాగారి మామామాధానీధరి పధానీధాపాపానీధా మామామధమధ మగారిరీమామారీసాసాగారీమామా పాధానీసనీసనీధామపాపా । గూర్జరీ।

**పంచమాద్యన్తసంయుక్తా దాక్షిణాత్యా మనోరమా ।**

**సంపూర్ణ రా+ +హ్యేషా జాతా పంచమే ।**
**విభాషేయం సదా జ్ఞేయా దేశాఖ్యా పంచమోద్భవా ॥**

**ప్రతిపదార్థము :** దాక్షిణాత్యా, మనోరమా = అందమైనది; పంచమాద్యంతసంయుక్తా = పంచమాది అంతమును; ఏషా సంపూర్ణరాగా = ఇది సంపూర్ణ రాగము; గాంధార పంచమే జాతా = గాంధారపంచమజాతము; ఇయం సదా విభాషా జ్ఞేయా = ఇది సర్వదా విభాష; దేశాఖ్యా పంచమోద్భవా= దేశాఖ్యము; పంచమ జనితము

**తాత్పర్యము :** దాక్షిణాత్య, అందమైనది. పంచమాది అంతమును. ఇది సంపూర్ణ రాగము. గాంధార పంచమ జాతము. ఇది సర్వదా విభాష. దేశాఖ్యము పంచమ జనితము.

ఉదాహరణం - పాపానీరీ । నిరిగారిగరిమామరిరినినిరి। ధాపాపాపపానిరి రిగరిగరిమగరిరిరి। ధనిధధనిధాధనిధాపాపా నిరిరిగా రిగా ధామాగారిరిసానిరి గామాగారీ నిధాపాపా । దాక్షిణాత్యా ।

**ఋషభాంగా పంచమాంతా విజ్ఞేయా షడ్జదుర్బలా ।**
**నిషాదకాకలీరూపా కర్తవ్యా సా తు నిత్యశః ॥**

**సాధారణకృతా హ్యేషా విభాషా గీతవేదిభిః ।**
**అమాలీ విశ్రుతా లోకే కిన్నరాణాం చ వల్లభా ॥**

**ప్రతిపదార్థము :** అమాలీ = అంధాలీ; ఋషభాంగా = రిషభాంగము; పంచమాంతా = పంచమాంతము; షడ్జదుర్బలా = షడ్జాల్పము; సాధారణకృతా= సాధారణకృతము; ఏషా విభాషా = ఇది విభాష; కిన్నరాణాం వల్లభా = కిన్నరులకు ప్రియమైనది; లోకే విశ్రుతా = లోకమందు ప్రసిద్ధమైనది

**తాత్పర్యము** : అంధాలీ రిషభాంగము, పంచమాంతము, షడ్జాల్పము, సాధారణకృతము. ఇది విభాష. కిన్నరులకు ప్రియమైనది. లోకమందు ప్రసిద్ధమైనది.

ఉదాహరణం - రీమాపాపాధాధాధాధాపాధాధాసాపాపాపాధానిని పాపాసాపాధాపాపా మరిమరిరిధాధాపధపసాధాధాపాపాధధపధపాపాధాపాపా మారిరిసాధాపాధాపా పామపధమమారిరిధాధపపాప। మామాధపపాప మమరిరిమపాపాధపాపాపధపధ సాసారిగరిధపాపాపా। అంధాలీ ।

**మధ్యమాంశాల్పఋషభా పంచమన్యాససంయుతా ।**
**మధ్యమధైవతసంవాదస్తుల్యం స్యాత్ పంచమస్య తు ॥**
**సంపూర్ణషాడబా చేయం భాషా తానోద్భవా భవేత్ ।**

**ప్రతిపదార్థము** : తానోద్భవా, సంపూర్ణషాడబా = తానోద్భవ సంపూర్ణషాడవము; మధ్యమాంశా = మధ్యమాంశము; అల్పఋషభా = రిషభాల్పము; పంచమన్యాస సంయుతా = పంచమన్యాస సహితము; మధ్యమధైవతసంవాదః = మధ్యమధైవతములకు సంవాదము; పంచమస్య తుల్యం స్యాత్ = పంచమమునకు సమానమగును

**తాత్పర్యము** : తానోద్భవ, సంపూర్ణషాడవము, మధ్యమాంశము, రిషభాల్పము, పంచన్యాససహితము, మధ్యమధైవతములకు సంవాదము పంచమమునకు సమానమగును.

ఉదాహరణం - మామామగా సారిరినిసాగరి। సానినిగాగాగసానిపాపాపా సానిసాసాసానిసానినిధధనినిసాగరిసాసాసానినిసాధానిపాపాధాని నిగగసాసాసాసాగాసానీధామాపాపా।

**త్రావణీ పంచమన్యాసా పంచమర్షభ దుర్బలా ।**
**ద్విశ్రుతీనాం తు రూపేణ గమనం తత్ ప్రయోక్తృభిః ॥**

**షడ్జమధ్యమ బాహుల్యం పంచమర్షభయోస్తథా ।**
**సాధారణ కృతాహ్యేషా త్రావణీ దేశసంభవా ॥**

**ప్రతిపదార్థము** : త్రావణీ; పంచమన్యాసా = త్రావణి పంచమన్యాసము; పంచమర్షభదుర్బలా = పంచమరిషభఅల్పము; ద్విశ్రుతీనాం రూపేణ గమనం=

ద్విశ్రుతుల రూపవముగా గమనవము; షడ్జమధ్యమ బాహుల్యం = షడ్జమధ్యమములకు బహుళత; తథా = అట్లే; పంచమర్షభయోః = పంచమరిషభములకును; ఏషా సాధారణకృతా = ఇది సాధారణకృతము; త్రాపణీ దేశసంభవా = త్రాపణి దేశోదితము

**తాత్పర్యము** : త్రావణివంచమన్యాము. వంచమరిషభ అల్పము. ద్విశ్రుతులరూపముగా గమనము. షడ్జమధ్యమములకు బహుళత. అట్లే పంచమరిషభములకును ఇది సాధారణకృతము. త్రాపణి దేశోదితము.

ఉదాహరణం - సాసాసాపాపాపాధాధాధాధానీనీనీసాసానిధానిధాధారిసాసానీ ధానీధాసామమరిమారిమాగాగారిసాసనిసపాపాపానిధానిసాసనిసనిమధధస నిధావూగావూధానీసాసాధానీసావుధావూగావూధానీసాన। సనిసాసానిగాసనిధామా మామాధారీసాసాసధానీధాపా । త్రాపణీ ।

**కైశికీ పంచమన్యాసా మధ్యమాంశా నిదుర్బలా ।**
**మధ్యమధైవతమాత్రం బాహుల్యం పంచమస్య తు ॥**
**ఏషా భాషా తు సంకీర్ణా నిత్యం పంచమసంభవా ।**

**ప్రతిపదార్థము** : కైశికీ, పంచమన్యాసా = కైశికి పంచమన్యాసము; మధ్యమాంశా = మధ్యమాంశము; నిదుర్బలా = నిషాదాల్పము; మధ్యమధైవతమాత్రం బాహుల్యం = మధ్యమ ధైవత్రమాత్రము బహులత; పంచమస్యతు = పంచమమునకును; ఏషాభాషా సంకీర్ణా = ఇది సంకీర్ణభాష; నిత్యం పంచమసంభవా = సదా పంచమోద్భవము

**తాత్పర్యము** : కైశికి, పంచమన్యాసము, మధ్యమాంశము, నిషాదాల్పము, మధ్యమధైవతమాత్రము బహులత, పంచమమునకును ఇదిసంకీర్ణభాష, సదా పంచమోద్భవము.

ఉదాహరణం - పామాధాని ధాపాపాపాధానీధాధాధామామామా ధామాధాధానీ సాసారి రీపాపామాధామాధమధధమామాధానిరిపాపా । కైశికీ ।

**ఏషా వార్ష్టికనిర్దిష్టా ఏకాదశ చ పంచమే ।**
**అతః పరం ప్రవక్ష్యామి భాషా వై భిన్నషడ్జకే ॥**
**ధైవతాంశా తదంతా చ పంచమర్షభవర్జితా ।**

షడ్జగాంధారసంచారా పంచమస్య ప్రయోక్తృభిః ॥
ఏషా విశుద్ధా విజ్ఞేయా షడ్జహీనౌడుబాభవేత్ ।

**ప్రతిపదార్థము** : పంచమే = పంచమమందు; ఏకాదశ = పదకొండు; వార్ష్టికనిర్దిష్టా = వార్ష్టికనిర్దిష్టము; అతః పరం = ఇటు తరువాత; భిన్నషడ్జకే భాషా ప్రవక్ష్యామి = భిన్నషడ్జమందు భాషనుచెప్పుచున్నాను; ధైవతాంశా = ధైవతాంశము; తదంతా = ధైవతాంతము; పంచమర్షభవర్జితా = పంచమరిషభరహితము; పంచమస్య = పంచమమునకు; షడ్జగాంధారసంచారా= షడ్జగాంధారగమనము కలది; ఏషా విశుద్ధా = ఈ విశుద్ధదాక్షిణాత్యము; షడ్జహీనా ఔడుబాభవేత్ = షడ్జరహిత ఔడుబితమగును

**తాత్పర్యము** : పంచమమందు పదకొండు వార్ష్టిక నిర్దిష్టము. ఇటుతరువాత భిన్నషమందు భాషను చెప్పుచున్నాను. ధైవతాంశము ధైవతాంతము పంచరిషభరహితము. పంచమమునకు షడ్జగాంధారగమనము కలది. ఈ విశుద్ధదాక్షిణాత్యము షడ్జరహిత ఔడుబితమగును.

ఉదాహరణం - ధాధాసాసాగధరిగారిసాగని రీసాసాధాసానీనీనీనీ । ధాధాధానిధా పాపామా ధాసాధానినిధాధాపాగాగాధారి ధామామాధానిని ధాధా । దాక్షిణాత్యా।

ధైవతాద్యంతసంయుక్తా గాంధారస్వరభూషితా ।
గాంధారో ధైవతశ్చాత్ర గమనం దృశ్యతే ఘనమ్ ॥
భాషాహో + తు సంకీర్ణా గాంధారీ సముదాహృతా ।

**ప్రతిపదార్థము** : గాంధారీ, ధైవతాద్యంత సంయుక్తా = గాంధారిధైవతము ఆద్యంతములుగా కలదియు; గాంధారస్వరభూషితా = గాంధారస్వరాలంకృతమును; గాంధారః ధైవతశ్చ = గాంధారము ధైవతమును; అత్ర = ఇందు; ఘనం = ఘనముగా; గమనం దృశ్యతే = గమనమగపడును; భాషాహో + తు సంకీర్ణా సముదాహృతా = ఈ గాంధారీ భాష సంకీర్ణమని ఉదహరింపబడుచున్నది

**తాత్పర్యము** : గాంధారి, ధైవతము ఆద్యంతములుగా కలదియు, గాంధార స్వరాలంకృతమును. గాంధారము ధైవతమును ఇందు ఘనముగా

గమనమగుపడును. ఈ గాంధారీ భాష సంకీర్ణమని ఉదహరింపబడుచున్నది.

ఉదాహరణం - ధాధాగాగాగారిరిగమగామాధారిరిరిరిగామాపామా । మాపామాపామాపాసగారిరిగాగాగాధాపాధాగాగారీసాసాసా। నిసాసానిగామాపా సాసానీగారీమాగమాగామామామామా నినినిని। మధాధాధాధా। గాంధారీ ।

**ధైవతాద్యంత సంయుక్తా షాడబా పంచమా హితా ।**
**మధ్యమర్షభసంవాదో ద్విశ్రుతీనాం చ గీయతే ॥**

**విభాషా చైవ శ్రీంకఠే ప్రయోగే లలితాస్తుతే ।**

**ప్రతిపదార్థము :** శ్రీకంఠే = శ్రీకంఠము; లలితాస్తుతే = లలితాస్తుతియందు; ప్రయోగే = ప్రయోగమునందు; విభాషా = విభాష; ధైవతాద్యంతసంయుక్తా= ధైవతాది అంతములతో కూడినది; షాడబా = షాడబము; పంచమా హితా = పంచమ హితము (పంచమసహితము); ద్విశ్రుతీనాం = ద్విశ్రుతులకు; మధ్యమర్షభసంవాదః = మధ్యమరిషభములకు సంవాదము; గీయతే = గానముచేయబడుచున్నది

**తాత్పర్యము :** శ్రీకంఠము లలితాస్తుతియందు ప్రయోగమునందు విభాష ధైవతాది అంతములతో కూడినది. షాడబము పంచమ హితము (పంచమసహితము) ద్విశ్రుతులకు మధ్యమరిషభములకు సంవాదము గానముచేయబడుచున్నది.

ఉదాహరణం - ధానిమాగాగాధారిమాగాగాధారి మాగరిగారిరిగా రిరిగామాగారిగా ధారిరిరీనిసానినిధాధా । శ్రీకంఠీ ॥

**మధ్యమాంశా ధైవతాంతా ఋషభేణ తు దుర్బలా ।**
**మధ్యమర్షభపంచమగమనం దృశ్యతే ఘనమ్ ॥**

**ఏషా విభాషా పౌరాలీ రమ్యా చాతిమనోహరా ।**
**గీయతే నాగలోకేన గబ్జైర్మధురస్వరా ॥**

**ప్రతిపదార్థము :** పౌరాలీ, ఏషా = పౌరాలి ఇది; విభాషా = విభాష; రమ్యా = అందమైనది; అతిమనోహరా = మిక్కిలి మనోరంజకమైనది; గబ్జైః మధురస్వరా =

**ప్రతిపదార్థము** : యః = ఏది; తాలద్వయోపేత = తాలద్వయముతో కూడినదియు; పదపాటవిరాజితః = పదపాటలచే ప్రకాశితమో; ప్రశ్నోత్తరసమాయుక్తః = ప్రశ్నోత్తరములతో కూడియుండునో; సః = అది; సదా = ఎల్లప్పుడు; శుక సారితః ఉక్తః = శుకసారితముగా చెప్పబడినది

**తాత్పర్యము** : ఏది తాలద్వయముతో కూడినదియు పదపాటలచే ప్రకాశితమో ప్రశ్నోత్తరములతో కూడియుండునో అది ఎల్లప్పుడు శుకసారితముగా చెప్పబడినది.

**+ +కర్ణాట భాషాయామథవా మిశ్రితా యది ।**
**సంవాదకపదోపేతః స భవేత్ శుకశారికః ॥** 411

**అర్ధం యత్ర స్వరైర్గీత్వా యత్యాస్తురగలీలయా ।**
**గీయతే విరుదైరర్ధం హయలీలేతి సా స్మృతా ॥** 412

**ప్రతిపదార్థము** : అథవా = లేక; + +కర్ణాట భాషాయాం = + + కర్ణాటభాషయందు; మిశ్రితా యది =కలసినయెడల; సంవాదకపదోపేతః = సంవాదకపదయుతమును అయినచో; సః = అది; శుకశారికః భవేత్ = శుకశారిక మగును; అర్ధం = సగము; స్వరైః = స్వరములచే; గీత్వా = పాడి; విరుదైః = విరుదములతో; అర్ధం గీయతే = సగము పాడబడునో; యత్యాతురగలీలయాచ= తురగలీలాయతిచేతను కూడినదగునో; సా = అది; హయలీలా ఇతి స్మృతా= హయలీల యని భావింపబడుచున్నది

**తాత్పర్యము** : లేక + +కర్ణాట భాషయందు కలసినయెడల సంవాకపదయుతమును అయినచో అది శుకశారిక మగును. సగము స్వరములచే పాడి విరుదములతో సగము పాడబడునో తురగలీలాయతిచేతను కూడినదగునో, అది హయలీలయని భావింప బడుచున్నది.

**గజలీలాకృతం సర్వం తాలోపి గజలీలకః ।**
**క్రియతే యత్ర సా జ్ఞేయా గజలీలేతి నామతః ॥**

**ప్రతిపదార్థము** : సర్వం గజలీలాకృతం = సమస్తము గజలీలాకృతమును; తాలోపి= తాలము కూడా; గజలీలకః = గజలీలకము; సా = అది; నామతః గజలీలా జ్ఞేయా = పేరు చేతను గజలీలగా తెలియదగినది

**తాత్పర్యము** : సమస్తము గజలీలాకృతమును తాలముకూడా గజలీలకము అది పేరుచేతను గజలీలగాతెలియదగినది.

ఛందసా సింహలీలేతి స్వరాతేన తసంయుతః ।
గీయతే యస్తు విరుదైః స భవేత్ సింహలీలకః ॥ 414

స్వరపాటైర్నిబద్ధం చ భవేత్ యత్ర పదాష్టకమ్ ।
మతః శరభలీలోఽసౌ రాగతాలాష్టకాన్వితః ॥ 415

ఆదౌ రాగః సగమకస్తాలేన తు సమన్వితః ।
స్వరపాటప్రగీతస్తు నానాదేశాదిభాషయా ॥ 416
గీయతే యః స ఉద్దిష్టః శుకచంచుర్జనప్రియః ।

**ప్రతిపదార్థము** : సింహలీలేతి చందసా = సింహలీలా ఛందస్సు చేత; స్వరాంతే= స్వరములంతమందు; నతసంయుతః = నతయుతమును; (నగణతగణములు) యః = ఏది; విరుతైః =విరుతములచేతను; గీయతే = గానముచేయబడునో; సః సింహలీలకః = అది సింహలీల

యత్ర = ఎక్కడ; స్వరపాటైః నిబద్ధం = స్వరపాటబద్ధమో; పదాష్టకం = 8 పదములుకలదో; రాగతాలాష్టకాన్వితః సః = రాగతాలాష్టకయుతమైనది; శరభలీలః మతః = శరభలీలగానంగీకృతము; ఆదౌ = మొదట; రాగః = రాగము; సగమకః = గమకయుతమును; తాలేన సమన్వితః = తాలముకలదియు; నానాదేశాదిభాషయా = అనేకదేశాదిభాషచే; స్వరపాటప్రగీతః = స్వరపాటములు పాడబడునో; సః = అది; జనప్రియః = జనరంజకమైన; శుకచంచుః ఉద్దిష్టః = శుకచంచువుగ నిర్దిష్టము

**తాత్పర్యము** : సింహలీలా ఛందస్సు చేత స్వరములంతమందు నతయుతమును (నగణతగణములు) ఏది విరుతములచేతను గానముచేయబడునో అదిసింహలీల. ఎక్కడ స్వరపాటబద్ధమో 8 పదములుకలదో రాగతాలాష్టకయుతమైనది. శరభలీలగానంగీకృతము. మొదట రాగము గమకయుతమున తాలముకలదియు అనేకదేశాదిభాషచే స్వరపాటములు పాడబడునో అది జనరంజకమైన శుకచంచువుగా నిర్దిష్టము.

**అనేకదేశభాషాభిః పాదైర్బిరుదతేనకైః ॥** 417
**చిత్రితః స్వరతాలైశ్చ విచిత్ర ఇతి కీర్తితః ।**

**ప్రతిపదార్థము** : అనేకదేశభాషాబిః = అనేక దేశభాషలచేతను; పాదైః = పాదములచేతను; బిరుదదేనకైః = విరుదతేనకములచేతను; స్వరతాలైశ్చ = స్వరతాలములచేతను; చిత్రితః = చిత్రించబడినది; విచిత్ర ఇతికీర్తితః = విచిత్రమని పేర్కొనబడినది

**తాత్పర్యము** : అనేక దేశభాషలచేతను, పాదములచేతను, విరుదతేనకములచేతను, స్వరతాలములచేతను చిత్రించబడినది. విచిత్రమని పేర్కొనబడినది.

**పదైః స్వరైస్తథా పాదైర్వృత్తత్రయపదేన చ ॥** 418
**తాలత్రయవిమిశ్రేణ త్రిభంగిరభిధీయతే ।**

**ప్రతిపదార్థము** : పదైః = పదములచేతను, స్వరైః = స్వరములచేతను; పాదైః = పాదములచేతను; వృత్తత్రయపదేన చ = వృత్తత్రయపదముచేతను; తాలత్రయ విమిశ్రేణ = తాలత్రమిశ్రణచేతను; త్రిభంగిః అభిధీయతే = త్రిభంగి చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : పదములచేతను, స్వరములచేతను, పాదములచేతను, వృత్తత్రయపదముచేతను, తాలత్రమిశ్రణ చేతను, త్రిభంగి చెప్పబడుచున్నది.

**రాగతాలచతుష్కేణ యత్ర భాషా చతుష్టయమ్ ॥** 419
**గీయతే గీతచతురైః చతురంగః స ఉచ్యతే ।**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; భాషాచతుష్టయం = బాషాచతుష్కము; రాగతాలచతుష్కేణ = రాగతాలచతుష్కముతో; గీయతే = గానముచేయబడునో; సః చతురంగః ఉచ్యతే = అది చతురంగమనబడును

**తాత్పర్యము** : ఎక్కడ భాషాచతుష్కము, రాగతాలచతుష్కముతో గానముచేయబడునో అది చతురంగమనబడును.

**జయమాలాపదైర్యుక్త + +స్తు విజయో జయః ॥** 420
**జయార్థం గీయతే యత్ర జ్ఞేయోఽ సౌ జయవర్ధనః ।**

**ప్రతిపదార్థము** : జయమాలాపదైః యుక్తః = జయమాలాపదయుతమై; విజయః జయః = జయముకొఱకు పాడబడునో; అసౌ = ఇది; జయవర్ధనః జ్ఞేయః = జయవర్ధనముగా తెలియవలెను

**తాత్పర్యము** : జయమాలాపదయుతమై జయముకొఱకు పాడబడునో ఇది జయవర్ధనముగా తెలియవలెను.

**ఆదితాలేన సంయుక్తం యత్ర ఖండచతుష్టయమ్ ॥** 421
**పదపాదాష్టకం స స్యాత్ సింహవిక్రాంతసంజ్ఞకః ।**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; ఆదితాలేన సంయుక్తం = ఆదితాలముతో కూడియుండునో; ఖండచతుష్టయం = ఖండచతుష్కమో; పదపాదాష్టకం = పదపాదాష్టకమగునో; సః = అది; సింహవిశ్రాంతసంజ్ఞకః స్యాత్ = సింహవిక్రాంతనామకమగును

**తాత్పర్యము** : ఎక్కడ ఆదితాలముతో కూడియుండునో ఖండచతుష్కమో, పదపాదాష్టకమగునో అది సింహ విక్రాంతనామకమగును.

**ఏకం పాదం పురో గీత్వా గీయంతే చ స్వరాస్తతః ॥** 422
**ఝుంపాదితాలసంయుక్తః స భవేత్ కలహంసకః ।**

**ప్రతిపదార్థము** : ఏకం పాదం = ఒక పాదమును; పురః గీత్వా = ముందుపాడి; తతః = తరువాత; స్వరాః గీయంతే = స్వరములు పాడబడును; ఝుంపాది తాలసంయుక్తః = ఝుంపాది తాలయుతమగు; సః = అది; కలహంసకః భవేత్= కలహంసమగును

**తాత్పర్యము** : ఒక పాదమును ముందుపాడి తరువాత స్వరములు పాడబడును. ఝుంపాదితాలయుతమగు అది కలహంసమగును.

**యత్రార్థం తేంతకోపేతద్విపదీవత్ భవేద్దలః ॥** 423
**పదమంత్యం గృహీత్వా తు యమకస్థితిభూషితః ।**

**ఆవృత్త్యా గీయతే యోఽసౌ చక్రవాలః ప్రకీర్తితః ॥** 424

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; అర్ధం = సగము; తేంతకోపేతః =

తేంతయుతమగునో; అలః = అలము; ద్విపదీవత్ భవేత్ = ద్విపదివలె నగును; అంత్యం పదం గృహీత్వా= అంత పదమును గ్రహించి; యమకస్థితిభూషితః = యమక స్థిత్యలంకృతమును; ఆవృత్త్యా యః గీయతే = ఆవృత్తిచేనేది గానముచేయబడునో; అసౌ చక్రవాలః ప్రకీర్తితః = అది చక్రవాలముగా చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : ఎక్కడ సగము తేంతయుతమగునో అలము ద్విపదివలె నగును. అంతపదమును గ్రహించి యమకస్థిత్యలంకృతమును ఆవృత్తిచేనేది గానముచేయబడునో అది చక్రవాలముగా చెప్పబడుచున్నది.

**తాలేన యేన కేనాపి విరుతైః కేవలైరపి ।**
**యద్యదాపి తథా భూతా యా వృత్త్యా గీయతే ద్విధా ॥ 425**
**తాలేన కరణస్యైవ స్వరైః సమురజాక్షరైః ।**
**గంధర్వైర్గీయతే యత్తు తత్ బంధకరణం పునః ॥ 426**

**ప్రతిపదార్థము** : యేన కేనాపి తాలేన = ఏదోఒక తాలముచేతను; కేవలైః విరుతైః అపి = కేవలము విరుతములచేతను; యద్యదాపి = ఏదెప్పుడైనను (ఏదిఎట్లయినను) తథాభూతా = అటువంటిది; యా వృత్త్యా = ఏది వృత్తిచేత; ద్విధా గీయతే = రెండు విధములుగా గానముచేయబడునో; కరణస్యైవ = కరణముయొక్క; తాలేన = తాలముచేతను; సమురజాక్షరైః స్వరైః = మురజాక్షరసహిత స్వరములచేతను; యత్ = ఏది; గంధర్వైః గీయతే = గంధర్వులచేత గానముచేయబడునో; తత్ = అది; బంధకరణం = బంధకరణము, పునః = మరల -

**తాత్పర్యము** : ఏదోఒక తాలముచేతను కేవలము విరుతలముచేతను ఏదెప్పుడైనను (ఏదిఎట్లయినను) అటువంటిది ఏది వృత్తిచేత రెండు విధములుగా గానముచేయబడునో, కరణముయొక్క తాలముచేతను మురజాక్షరసహితస్వరములచేతను ఏది గంధర్వులచేత గానముచేయబడునో అది బంధకరణము. మరల -

**పాదాఖ్యం కరణం ప్రోక్తం హస్తపాట స్వరాన్వితమ్ ।**
**అక్షరైర్గీయతే సమ్యక్ పాటైరేవ హి కేవలైః ॥ 427**

**కైవాట ఇతి స జ్ఞేయో గంధర్వైస్తాలసంయుతః ।**
**యా స్యాత్ కరణతాలేన ద్విపదీవృత్తసంగతా ॥** 428
**సా భవేత్ ద్విపదీ నామ ప్రోక్తా వస్తువిచక్షణైః ।**

**ప్రతిపదార్థము** : హస్తపాట స్వరాన్వితం = హస్తపాటస్వరములతో కూడినది; పాదాఖ్యం కరణం ప్రోక్తం = పాదకరణమనబడినది; కేవలైః పాటైః ఏవ = కేవలపాటములగు; అక్షరైః = అక్షరములచేత; తాలసంయుతః గంధర్వైః సమ్యక్ గీయతే = తాలయుతముగా గంధర్వులచే బాగుగ పాడబడునో; సః కైవాట ఇతిజ్ఞేయః = అది కైవాటకరణమని చెప్పబడునది; కరణతాలేన = కరణతాలముచేత; ద్విపదీవృత్త సంగతా = ద్విపదీవృత్తముతో కూడియున్నది; యా స్యాత్ = ఏది అగునో; సా ద్విపదీ నామప్రోక్తా = అది ద్విపదిగా చెప్పబడినది

**తాత్పర్యము** : హస్తపాటస్వరములతో కూడినది పాదకరణమనబడినది. కేవల పాటములగు అక్షరములచేత తాలయుతముగా గంధర్వులచే బాగుగ పాడబడునో అది కైవాటకరణమని చెప్పబడునది. కరణతాలముచేత ద్విపదీవృత్తముతో కూడియున్నది ఏదిఅగునో అది ద్విపదిగా చెప్పబడినది.

**గ్రహస్త్వభిమతోయత్ర న్యాసశ్చాంశేన కేవలమ్ ॥** 429
**వర్ణనీయస్య గాతుస్తు తస్యాద్వామప్రప్రవేశ్యతే । (?)**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ, అంశేన = అంశముచేత; కేవల = కేవలముగా; న్యాసః = న్యాసమో; తత్ర = అక్కడ; గ్రహః = గ్రహము; వర్ణనీయస్య గాతుః = వర్ణనీయమునకు గాయకునియొక్క; వామప్రప్రవేశ్యతే (?)

**తాత్పర్యము** : ఎక్కడ అంశముచేత కేవలముగా న్యాసమో అక్కడ గ్రహము వర్ణనీయమును గాయకునియొక్క

**కంకాలః ప్రతితాలశ్చ ద్రుతమఠః కుటుక్కకమ్ ॥** 430
**విహాయ గీయతే యా తు స్వరైః సా వర్తనీమతా ।**

**ప్రతిపదార్థము** : కంకాలః = కంకాలము; ప్రతితాలశ్చ = ప్రతితాలమును; ద్రుతమఠః = ద్రుత(మఠ)మును; కుటుక్కకం = కుటుక్కకమును; విహాయ = విడిచి; యా = ఏది; స్వరైః = స్వరములచే; గీయతే = గానము చేయబడునో; సా = అది; వర్తనీ మతా = వర్తనిగా సమ్మతము

**తాత్పర్యము :** కంకాలము ప్రతితాలమును ద్రుత (మఠ) మును కుటుక్కకమును విడిచి ఏది స్వరములచే గానముచేయబడునో అది వర్తనిగా సమ్మతము.

**ఆద్యంపాదద్వయం యత్ర స్యాదనుప్రాసవర్జితమ్ ॥** 431

**అనుప్రాసాస్తృతీయేఽ పి చతుర్థే వాథగీయతే ।**
**త+ + +  + + + +సానుప్రాసశ్చ పంచమః ॥** 432

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ; ఆద్యం పాదద్వయం = మొదటి పాదద్వయము; అనుప్రాసవర్జితం స్యాత్ = అనుప్రాసరహితముగానగును; తృతీయే చతుర్థే అపి = మూడవ, నాల్గవ పాదమందు గాని; అనుప్రాసాః = అనుప్రాసలు; గీయతే = పాడబడును; త+ + ++ ++, సానుప్రాసశ్చ పంచమః = అనుప్రాససహితపంచమము

**తాత్పర్యము :** ఎక్కడ మొదటిపాదద్వయము అనుప్రాసరహితముగానగును. మూడవ, నాల్గవ దానియందుకూడా అనుప్రాసలు నాల్గవ పాదమందుగాని పాడబడును. అనుప్రాససహితపంచమము.

**చతస్రో గీతయో యత్ర పాదే పాదే భవంతి చ ।**
**గీత్వా తదీయపాదార్ధమనుప్రాసో విధీయతే ॥** 433

**త్యాగసౌభాగ్యసౌందర్యశౌర్యధైర్యాదివర్ణనా ।**
**యస్యాం భవతి గీతజ్ఞాస్తామేలాం సంప్రచక్షతే ॥** 434

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ; చతస్రః గీతయః = నాల్గు గీతులు; పాదేపాదే= ప్రతిపాదమందును; భవంతి = అగుచున్నవో; తదీయ పాదార్ధం= దాని పాదార్ధము; గీత్వా = గానముచేయబడి; అనుప్రాసఃవిధీయతే = అనుప్రాస విధింపబడునో; త్యాగ సౌభాగ్యసౌందర్య శౌర్యధైర్యాదివర్ణనా = త్యాగము, సౌభాగ్యము, సౌందర్యము, శౌర్యము, ధైర్యము మొదలగునవి వర్ణించుట; యస్యాం భవతి = ఎందు అగునో; తాం ఏలాం సంప్రచక్షతే = దానిని ఏలగా చెప్పుచున్నారు

**తాత్పర్యము :** ఎక్కడ నాల్గుగీతులు ప్రతిపాదమందును అగుచున్నవో దాని పాదార్ధము గానముచేయబడి అనుప్రాస విధింపబడునో త్యాగము, సౌభాగ్యము, సౌందర్యము, శౌర్యము, ధైర్యము మొదలగునవి వర్ణించుట ఎందుఅగునో దానిని ఏలగా చెప్పుచున్నారు.

**స + + వహిగాతవ్యా గీతజ్ఞైః గీతవస్తుషు ।**
**మట్టేనాథ ద్వితీయేన కంకాలేన తథైవ చ ॥** 435

**సంయుక్తా ప్రతితాలేన కర్తవ్యైలా మనీషిభిః ।**
**వర్ణనీయస్య గాతుశ్చ సా తునామాంకితా భవేత్ ॥** 436

**ప్రతిపదార్థము :** ద్వితీయేన అథ మట్టేన = ద్వితీయతాలముచేతను మరియు; మట్టతాలముచేతను; తథైవ = అట్లే; కంకాలేన = కంకాలముచేతను; ప్రతితాలేన సంయుక్తా = ప్రతితాలముతోను కలసినదై; ఏలా కర్తవ్యా = ఏలాప్రబంధము చేయదగినది; వర్ణనీయస్య = వర్ణ్యమునకు; గాతుశ్చ = గాయకునకు; సా = అది; నామాంకితా భవేత్ = నామచిహ్నితమగును

**తాత్పర్యము :** ద్వితీయతాలముచేతను మరియు, మట్టతాలముచేతను అట్లే కంకాలముచేతను ప్రతితాలముతోను కలసినదై ఏలాప్రబంధముచేయదగినది. వర్ణ్యమునకు, గాయకునకు అది నామచిహ్నితమగును.

**వర్ణనీయసమాయుక్తా మతే కేషాంచిదిష్యతే ।**
**రమ్యగీతగుణై ర్యుక్తా ఛందోగణసమన్వితా ॥** 437

**అలంకారరసోపేతా కర్తవ్యైలా మనీషిభిః ।**
**ఆదౌ నాదవతీ ప్రోక్తా తతో హంసవతీ మతా ॥** 438

**నందావతీ తృతీయా చ తుర్యా భద్రావతీ స్మృతా ।**
**ఋగ్వేదాదిసముద్భూతా విచిత్రధ్వనిరంజితా ॥** 439

**ఇత్యేలా గణమార్గేణ బుధైరుక్తా చతుర్విధా ।**

**ప్రతిపదార్థము :** కేషాంచిత్ మతే = కొందరిమతమందు; వర్ణనీయసమాయుక్తా= వర్ణనీయ సహితముగా; ఇష్యతే = ఇష్టమగుచున్నది; రమ్యగీత గుణైః యుక్తా=

అందములైన గీతగుణసహితమును; ఛందోగణసమన్వితా = ఛందోగణములతో కూడినదియు; అలంకారరసోపేతా = అలంకాములు, రసములతో కూడినదియు అగు; ఏలా = ఏలాప్రబంధము; కర్తవ్యా = చేయదగినది; ఆదౌ నాదవతీ, హంసవతీ, నందావతీ, భద్రావతీ, ఋగ్వేదాదిసముద్భూతా = నాదవతి, హంసవతి, నందవతి, భద్రావతి ఋగ్వేదాదులనుండి పుట్టినది; విచిత్రధ్వనిరంజితా = విచిత్రమైన ధ్వనిచే రంజితము; ఇతి = ఈవిధముగా; ఏలా గణమార్గేణ = ఏల గణ (సముదాయ)మార్గముచే; చతుర్విధా ఉక్తా = నాల్గువిధములుగా చెప్పబడినది

**తాత్పర్యము :** కొందరి మతమందు వర్ణనీయసహితముగా ఇష్టమగుచున్నది. అందములైన గీతగుణసహితమును ఛందోగణములతో కూడినదియు అలంకారములు, రసములతో కూడినదియు, ఏలాప్రబంధము చేయదగినది. నాదవతి, హంసవతి, నందావతి, భద్రావతి ఋగ్వేదాదులనుండి పుట్టినది. విచిత్రమైన ధ్వనిచే రంజితము. ఈవిధముగా ఏల. గణ (సముదాయ) మార్గముచే నాల్గువిధములుగా చెప్పబడినది.

**ఏలా నాదవతీ రమ్యా వర్ణాలంకారశోభితా ॥ 440**

**గీయతే మట్టతాలేన నాదయుక్తా పదేపదే ।**
**టక్కరాగో భవేత్తత్ర సర్వేషామనురంజకః ॥ 441**

**శ్వేతో వర్ణశ్చ విజ్ఞేయః శృంగారః కథితో రసః ।**
**కైశికే వృత్తిరాఖ్యాతా పాంచాలీ రీతిరిష్యతే ॥ 442**

**భారతీ దేవతా తస్యా బ్రాహ్మణానాం కులం తథా ।**
**యత్ర చంద్రగణాః పంచ స్వర్గణైకేన సంయుతా ॥ 443**

**ఏలా నాదవతీ నామ సా స్మృతా పూర్వసూరిభిః ।**

**ప్రతిపదార్థము :** నాదవతీ ఏలా = నాదవతి ఏలాప్రభేదము; రమ్యా = సుందరమైనది; వర్ణాంలంకారశోభితా = వర్ణాలంకారమండితము; మట్టతాలేన = మట్టతాలముతో; నాదయుక్తా =నాదయుతముగా; పదే పదే గీయతే = మాటిమాటికి గానము చేయబడును; తత్ర టక్కరాగః భవేత్ = అక్కడ

టక్కరాగమగును; సర్వేషాం అనురంజకః = అందరికిని రంజింపజేయునదగును; శ్వేతవర్ణః = తెల్లని రంగుకలది; శృంగారః రసః కథితః = శృంగారరసము చెప్పబడినది; కైశికీ వృత్తిః ఆఖ్యాతా = కైశికీ వృత్తి చెప్పబడినది; పాంచాలీ రీతిః ఇష్యతే = పాంచాలీరీతి సమ్మతము; తస్యాః = ఆనాదవతికి; భారతీదేవతా= సరస్వతి దేవత; యత్ర = ఎక్కడ; బ్రాహ్మణానాం కులం = బ్రాహ్మణకులము; చంద్రగణాః పంచ= చంద్రగణములైదు; ఏకేన స్వర్గణ సంయుతా = ఒక స్వర్గణము దేవతాతో కూడినదియు అగునో; సా = అది; నాదవతీఏలా = నాదవతీనామక ఏలాప్రభేదముగా; పూర్వసూరిభిః స్మృతా = పూర్వపు పండితులచే భావింపబడినది

**తాత్పర్యము :** నాదవతి ఏలాప్రభేదము, సుందరమైనది. వర్ణాలంకారమండితము. మట్టతాలముతో నాదయుతముగా మాటిమాటికి గానముచేయబడును. టక్కరాగమగును. అందరికిని రంజింపజేయునదగును. తెల్లనిరంగుకలది. శృంగారరసము చెప్పబడినది. కైశికీ వృత్తి చెప్పబడినది. పాంచాలీరీతి సమ్మతము. ఆనాదవతికిసరస్వతీదేవత ఎక్కడ బ్రాహ్మణకులము చంద్రగణములైదు, ఒకస్వర్గణము దేవతతో కూడినదియు అగునో అది నాదవతీనామక ఏలాప్రభేదముగా పూర్వపు పండితులచే భావింపబడినది.

**హంసస్యేవ గతిం కా సా నాదేన చ పదేన చ ॥ 444**

**సమం ప్రవర్తతే యస్మాత్ తతో హంసవతీ స్మృతా ।**
**తాలో ద్వితీయకస్తత్ర హిందోలేన తు గీయతే ॥ 445**

**రక్తో వర్ణః సమాఖ్యాతః చండికా దేవతా భవేత్ ।**
**వృత్తిరారభటీ ప్రోక్తా లాటీయా రీతిరిష్యతే ॥ 446**

**క్షత్రియాణాం కులం చైవ రసో రౌద్రః ప్రకీర్తితః ।**
**యత్రానలగణాః పంచ షష్ఠో వాయుగణస్తథా ॥ 447**

**ఏలా హంసవతీహంతీ సా స్మృతా గీతపారగైః ।**
**లఘుభిః గమకైర్యుక్తా రాగా మాలవకైశికే ॥ 448**

**ప్రతిపదార్థము :** నాదేన =నాదముచేతను; పదేన = పదముచేతను;హంసస్యేవ= హంసకు సమానమైన; గతిం = గమనము; యస్మాత్ ప్రవర్తతే = ప్రవర్తించునో; తతః = అందువలన; సా =అది; హంసవతీ స్మృతా = హంసవతిగా భావింపబడినది; తత్ర = అందు;తాలః ద్వితీయకః = ద్వితీయతాలము; హిందోలేన గీయతే = హిందోలముచే గానముచేయబడును; వర్ణః రక్తః = రంగు ఎఱుపు; చండికా దేవతా = దేవత చండిక; ఆరభటీ వృత్తిః = ఆరభటీ వృత్తి; లాటీయా రీతిః = లాటీరీతి; క్షత్రియాణాం కులం = క్షత్రియకులము; రసః రౌద్రః = రౌద్రరసము; యత్ర = ఎందు; అనలగణాః పంచ = అగ్నిగణము లైదు; తథా షష్ఠః వాయుగణః = అట్లే ఆరవది వాయుగణమో; గీతపారగైః = గాంధర్వవిదులచే; సా హంసవతీ ఏలా స్మృతా = అది హంసవతీ ప్రభేదముగా తలవబడినది; మాలవకైశికే = మాలవకైశికయందు; లఘుభిః గమకైః యుక్తా= లఘుగమకసహితమైన; రాగా = రాగముకలది

**తాత్పర్యము :** నాదముచేతను, పదముచేతను, హంసకు సమానమైన గమనము ప్రవర్తించునో అందువలన అది హంసవతిగా భావింపబడినది. అందు ద్వితీయతాలము హిందోలముచే గానముచేయబడును. రంగు ఎఱుపు. దేవత చండి. ఆరభటీవృత్తి. లాటీ రీతి. క్షత్రియకులము, రౌద్రరసము. ఎందు అగ్నిగణములైదు, ఆరవది వాయుగణమో అది గాంధర్వవిదులచే హంసవతీ ప్రభేదముగా తలవబడినది. మాలవకైశికయందు లఘుగమకసహితమైన రాగముకలది.

**ఏలా నందావతీ నామ ప్రతితాలేన గీయతే ।**
**ఇంద్రాణీ దేవతావృత్తిః సాత్వతీ తత్ర కీర్తితా ॥** 449

**గాడీ యాకథ్యతే రీతిః పీతో వర్ణః స్మృతో బుధైః ।**
**రసో వీరః సమాఖ్యాతః వైశ్యానాం కులసంభవః ॥** 450

**నాదావత్యామివ సర్వం కర్తవ్యం రాగపూర్వకమ్ ।**
**యత్రాంబరగణాః పంచ మార్తాండగణ సంయుతాః ॥** 451

**ఏలా నందావతీ సా తు విజ్ఞేయా గీతవేదిభిః ।**

**ప్రతిపదార్థము** : నందావతీ ఏలా = ఏలాప్రభేదమైన నందావతి; ప్రతితాలేన గీయతే = ప్రతితాలముచే గానముచేయబడును; ఇంద్రాణీ దేవతా = దేవత ఇంద్రాణి (శచీదేవి); వృత్తిః సాత్త్వతీ = సాత్త్వతీవృత్తి; గౌడీయా రీతిః = గౌడీరీతి; పీతః వర్ణః = పసుపురంగు; రసః వీరః = వీరరసము; వైశ్యకులసంభవః = వైశ్యజాతిజము; నాదావత్యామివ = నాదావతియందువలె; సర్వం రాగపూర్వకం= రాగయుతముగా; కర్తవ్యం = చేయదగినది; యత్ర = ఎక్కడ; మార్తాండ గణసంయుతాః = సూర్యగణయుతములైన; అంబరగణాః పంచ = ఆకాశగణములైదు; సమాఖ్యాతాః = చెప్పబడినవో; సా = అది; ఏలా నందావతీ= ఏలానందావతిగా; విజ్ఞేయా = తెలియదగినది

**తాత్పర్యము** : ఏలాప్రభేదమైననందావతి ప్రతితాలముచే గానముచేయబడును. దేవత ఇంద్రాణి (శచీదేవి). సాత్త్వతీవృత్తి. గౌడీరీతి. పసుపురంగు. వీరరసము. వైశ్యజాతిజము. నాదావతియందువలె రాగయుతముగా చేయదగినది. ఎక్కడ సూర్యగణయుతములైన ఆకాశగణములైదు చెప్పబడినవో అది ఏలానందావతిగా తెలియదగినది.

**ఏకైకపదసంయుక్తా మూర్ఛనా ధ్వనిసంకులా ॥** 452

**కంకాలతాలసంబంధా కకుభేన ప్రగీయతే ।**
**ఏలా భద్రావతీ నామ శూద్రజాతిసముద్భవా ॥** 453

**కృష్ణవర్ణా చ విజ్ఞేయా వైదర్భీరీతిశోభితా ।**
**భారతీవృత్తియుక్తా చ బీభత్సరసభూషితా ॥** 454

**వారాహీదేవతోపేతా కథితా గీతకోవిదైః ।**
**యత్రభూమిగణాః పంచషష్ఠో జలగణస్తథా ॥** 455

**భద్రావతీతి విఖ్యాతా సా స్మృతా పుటపుంగవైః ।**
**త్రిపదం పాదసంఖ్యానమూర్ఛనాబిందుసంకులమ్ ॥** 456

**యత్స్థితం గమకం కుర్యాదేతదేలాను లక్షణమ్ ।**
**తతశ్చ వర్ణ్యమానస్య నామ సవ్యత్ (?) ప్రవేశయేత్ ॥** 457

**లలితా రససంయుక్తా స్వాభిధానమతః పరమ్ ।**

ప్రతిపదార్థము : ఏకైకపదసంయుక్తా = ఒక్కొక్కపదసహితమును; మూర్ఛనా ధ్వనిసంకులా = మూర్ఛనా ధ్వనులచే వ్యాకులమైనదియు; కంకాలతాల సంబంధా = కంకాలతాలసంబంధితమును; కకుభేన ప్రగీయతే = కకుభముచే గానముచేయబడునో; ఏలా భద్రావతీ (సా) = ఏలాప్రబంధప్రభేదమైన (ఆ)భద్రావతి; శూద్రజాతిసముద్భవా = శూద్రజాతిజము; కృష్ణవర్ణా = నల్లనిరంగుకలది; వైదర్భీరీతిశోభితా = వైదర్భీరీతిచే ప్రకాశించునది; భారతీవృత్తియుక్తా = భారతీవృత్తియుతము; బీభత్సరసభూషితా = భీభత్సరసముచే నలంకృతము; వారాహీ దేవతా = దేవత వారాహి; యత్ర = ఎక్కడ; భూమిగణాః = భూగణములైదు; షష్ఠః జలగణః = ఆరవది జలగణము; సా భద్రావతీ = అది భద్రావతి; త్రిపదం= త్రిపదమును; పాదసంఖ్యానమూర్ఛనాబిందుసంకులం = పాదసంఖ్యా, మూర్ఛన, బిందుసమ్మర్ధమైన; గమకం కుర్యాత్ = గమకమును చేయవలెను; తత్ ఏలాసు లక్షణం = అది ఏల యందు లక్షణము; తతశ్చ = తరువాత; వర్ణ్యమానస్య నామ = వర్ణనీయముయొక్కనామము; సమ్యక్ ప్రవేశయేత్ = సమీచీనముగా ప్రవేశపెట్టవలెను; అతః పరం = అటుతరువాత; స్వ అభిదానం = తన నామము; రససంయుక్తా లలితా = రసయుతమైన లలిత (ము)

తాత్పర్యము : ఒక్కొక్క పదసహితమును మూర్ఛనా ధ్వనులచే వ్యాకులమైనదియు, కంకాలతాలసంబంధితమును కకుభముచే గానముచేయబడును. ఏలాప్రబంధప్రభేదమైన భద్రావతి, శూద్రజాతిజము, నల్లనిరంగుకలది వైదర్భీరీతిచే ప్రకాశించునది. భారతీవృత్తియుతము. బీభత్సరసముచే నలంకృతము. దేవత వారాహి. ఎక్కడ భూగణములైదు, ఆరవది జలగణము అది భద్రావతి. త్రిపదమును పాదసంఖ్యా, మూర్ఛన, బిందుసమ్మర్ధమైన, గమకమును చేయవలెను. అది ఏలలయందు లక్షణము. తరువాత వర్ణనీయముయొక్క నామము సమీచీనముగా ప్రవేశపెట్టవలెను. అటుతరువాత తననామము రసయుతమైన లలిత (ము)

**ఇతి గణైలాచతుష్టయమ్**



తృతీయపాదవత్ పాదశ్చతుర్థో యది వర్ధతే ॥ 458

ఏలా సంకరతామేతి మతంగమునిభాషితమ్ ।
పంచమీద్వితయం సంకరనామ్నీ ఏలా + + + ॥ 459

**ప్రతిపదార్థము** : తృతీయపాదవత్ = తృతీయపాదమువలె; చతుర్థః పాదః యది వర్ధతే = నాల్గవ పాదము వృద్ధిపొందినచో; ఏలాసంకరతాం ఏతి ఇతి = ఏలసంకరత్వమును పొందునని; మతంగముని భాషితం = మతంగమహర్షి భాషణము; పంచమీద్వితయం = పంచమీద్వయము, సంకరనామ్నీ ఏలా = సంకరనామక ఏలా; + ++

**తాత్పర్యము** : తృతీయపాదమువలె నాల్గవపాదము వృద్ధిపొందినచో ఏలసంకరత్వమును పొందునని మతంగమహర్షి బాషణము. పంచమీద్వయము సంకరనామక ఏలా

రతిలేఖా కామలేఖా బాణలేఖా తథైవచ ।
కథ్యతే చంద్రలేఖా చ మాత్రైలామాహ వల్లభః ॥ 460

**ప్రతిపదార్థము** : రతిలేఖ, కామలేఖ, బాణలేఖ, చంద్రలేఖ, ఇతి =అని; మాత్రైలాం= మాత్రా ఏలను; వల్లభః ఆహ = వల్లభాచార్యుడు చెప్పెను

**తాత్పర్యము** : రతిలేఖ, కామలేఖ, బాణలేఖ, చంద్రలేఖ అని మాత్రాఏలను వల్లభాచార్యుడు చెప్పెను.

యస్యామంఘ్రిద్వయే మాత్రా రుద్రసంఖ్యాస్తృతీయకే ।
రుద్రహస్తసమాశ్చైవ రత్యాఖ్యా గణసమ్మితా ॥ 461

భవంతీతి యతస్తజ్జైః ధాతుసన్మాతృభాభి చ ।
కథితా గీతశాస్త్రజ్ఞైః రతిలేఖేతి నామతః ॥ 462

**ప్రతిపదార్థము** : యస్యాం = దేనియందు; అంఘ్రిద్వయే = పాదద్వయమందు; రుద్రసంఖ్యాః మాత్రాః = రుద్రసంఖ్య (11) మాత్రలును; తృతీయకే = మూడవపాదమున; రుద్రహస్తసమాః = రుద్రహస్తలతుల్యములైన (22) మాత్రలును; రత్యాఖ్యగణసమ్మితాః = రతినామక గణయుతములునై; భవంతి

ఇతి = అగుచున్నవని; యతః = ఎందునుండి; ధాతుసన్మాతృకాభిశ్చ = ధాతుసన్మాతృకలచేతను; నామతః రతిలేఖేతి కథితా = రతిలేఖయని చెప్పబడినది

**తాత్పర్యము** : దేనియందు పాదద్వయమందు రుద్రసంఖ్య (11) మాత్రలును మూడవపాదమున రుద్రహస్తలతుల్యములైన (22) మాత్రలును రతినామక గణయుతములునై అగుచున్నవని ఎందునుండి ధాతుసన్మాతృకలచేతను రతిలేఖయని చెప్పబడినది.

**ద్విగుణితరుద్రాః ప్రథమే మాత్రా యుజి సంభవంతి తా ఏకః ।**
**వింశతిర్విషమే(?) చరమే యస్యాః సా కామలేఖేతి ॥ 463**

**ద్విగుణితకలా యది స్యుః మాత్రాః పాదద్వయేపి విశిష్టమ్ ।**
**. . . . . .బాణగణోపేతం యస్యాం సా బాణలేఖేతి ॥ 464**

**ప్రతిపదార్థము** : ప్రథమే ద్విగుణితరుద్రాః మాత్రాః = మొదటిపాదమున 22 మాత్రలు; యుజి తా ఏకః సంభవంతి = రెండవ పాదమందు వాటిలో ఒకటి (11) మాత్రలును; విషమే వింశతిః = మూడవ పాదమందు ఇరువది అగునో; సా కామలేఖా ఇతి స్యాత్ = కామలేఖయగును; పాదద్వయే అపి = రెండు పాదములందును; విశిష్టం = ప్రత్యేకముగా; మాత్రాః = మాత్రలు; ద్విగుణితకలాః స్యుః యది = కళలు రెండు రెట్లయినచో; బాణగణో పేతం = బాణగణసహితమును; యస్యాం = దేనియందగునో; సా బాణలేఖా ఇతిస్యాత్= అది బాణలేఖయగును

**తాత్పర్యము** : మొదటిపాదమున 22 మాత్రలు, రెండవపాదమందు వాటిలో ఒకటి (11) మాత్రలును, మూడవపాదమందు ఇరువది (20) అగునో అది కామలేఖయగును. రెండుపాదములందును ప్రత్యేకముగా మాత్రలు కళలు రెండురెట్లయినచో బాణగణ సహితమును దేనియందగునో అది బాణలేఖయగును.

**చత్వారింశత్ త్ర్యధికమాత్రా సంఖ్యాంఘ్రియుగ్మేషు ।**
**ఏకోనా సా విషమే యస్యాం సా చంద్రలేఖేతి ॥ 465**

**ప్రతిపదార్థము** : అంఘ్రియుగ్మేషు = పాదద్వయమందు; చత్వారింశత్ త్ర్యధికమాత్రా సంఖ్యా = 43మాత్రలు; విషమే = విషమపాదమందు; ఏకోనా= ఒకటి తక్కువగను (42); యస్యాం = దేనియందుండునో; సా = అది; చంద్రలేఖా ఇతి = చంద్రలేఖయని

**తాత్పర్యము** : పాదద్వయమందు 43 మాత్రలు, విషమపాదమందు ఒకటితక్కువగను (42) దేనియందుండునో అది చంద్రలేఖయని.

**ఇతి మాత్రైలాచతుష్టయమ్**

* * *

**నైవాత్ర తాలనియమో రసనియమో రాగనియమస్తు ।**
**భవతి + +వర్ణనియమో వర్ణైలా కథ్యతే తస్మాత్ ॥ 466**

**ప్రతిపదార్థము** : అత్ర = ఇందు; తాలనియమః న = తాలనియమములేదు; రసనియమః న = రసనియమములేదు; రాగనియమః న = రాగనియమములేదు; వర్ణనియమః భవతి = వర్ణనియమముకలదు; తస్మాత్ = అందువలన; వర్ణైలకథ్యతే = వర్ణైలాయని చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : ఇందు తాలనియమములేదు. రసనియమములేదు. రాగనియమములేదు. వర్ణనియమముకలదు. అందువలన వర్ణైలయని చెప్పబడుచున్నది.

**మదనవతీ శశిలేఖా ప్రభావతీ మాలతీ చ తథా ।**
**హేమవతి కుసుమవతీ వర్ణనిబంధాభవన్తి సప్తైలాః ॥ 467**

**ప్రతిపదార్థము** : మదనవతీ, శశిలేఖా, ప్రభావతీ, మాలతీ, హేమవతీ, కుసుమవతీ, వర్ణనిబంధాః = వర్ణనిబంధములు; సప్త ఏలాః = ఏడు ఏలలు

**తాత్పర్యము** : మదనవతీ, శశిలేఖా, ప్రభావతీ, మాలతీ, హేమవతీ, కుసుమవతీ, వర్ణనిబంధములు ఏడుఏలలు.

**ఏకాదశాదివర్ణైః సప్తదశాంతైః క్రమేణ సప్తైతాః ।**
**గీయంతే గంధర్వైః లలితపదైర్జగతి సన్నాదైః ॥ 468**

ప్రతిపదార్థము : ఏకాదశాదివర్ణైః = ఏకాదశాదివర్ణములచేత; సప్త దశాంతైః = సప్తదశాంతములైన; (11-17) క్రమేణ = క్రమముగా; ఏతాః సప్త = ఈఏడును; సన్నాదైః = నాదయుతములైన; లలితపదైః = మృదుపదములచే; జగతి = లోకమునందు; గంధర్వైః గీయంతే = గంధర్వులచే గానముచేయబడుచున్నవి

తాత్పర్యము : ఏకాదశాది వర్ణములచేత సప్తదశాంతములైన (11-17) క్రమముగా ఈ ఏడును నాదయుతములైన మృదుపదములచే లోకమునందు గంధర్వులచే గానము చేయబడుచున్నవి.

**అలలితనామోపేతా మదనవతీ లఘుగణేన శశిలేఖా ।**
**గురుగణబహులా ప్రభావతీ . . . . .భవతి రమ్యతరా ॥ 469 ॥**

ప్రతిపదార్థము : అలలితనామోపేతా = అలలితమైన నామసహితము; మదనవతీ, లఘుగణేన = మదనవతి లఘుగణముచే; శశిలేఖా , గురుగణబహులా = గురుగణములతో అధికమైనది; ప్రభావతీ . . . . రమ్యతరా భవతి = ప్రభావతి రమ్యతర(మిక్కిలి అందమైనది)మగుచున్నది

తాత్పర్యము : అలలితమైన నామసహితము మదనవతి, లఘుగణముచే శవిలేఖ, గురుగణములతో నధికమైనది ప్రభావతి, రమ్యతర (మిక్కిలిఅందమైనది) మగుచున్నది.

**ఏలా గురులఘురచితా మధురధ్వనిశోభితా తథాసరసా ।**
**బహుగమకాలంకారా రమణీయా మాలతీ భవతి ॥ 470**

ప్రతిపదార్థము : మాలతీ ఏలా, గురులఘురచితా = మాలతీఏల గురులఘువులచే నిర్మితము; మధురధ్వని శోభితా = మధురమైన ధ్వనిశోభితమును; సరసా = రసయుతమును; బహుగమకాలంకారా = అనేక గమకములతోను అలంకారములతోను కూడియున్నదియు; రమణీయా భవతి= రమ్యమైనదగుచున్నది

తాత్పర్యము : మాలతీ ఏలా, గురులఘువులచే నిర్మితము,. మధురమైన ధ్వనిశోభితమును రసయుతమును, అనేక గమకములతోను, అలంకారములతోను కూడియున్నదియు రమ్యమైనదగుచున్నది.

గాతవ్యా గాంధార్వైర్లలితా లలితేన వర్ణనియమేన ।
ప్రథమమివ చరణయుగలం సయమకమథబిందుమూర్ఛనాయుక్తమ్॥

ప్రతిపదార్థము : ప్రథమమివ చరణయుగలం = మొదటిదానివలె చరణద్వయమును; సయమకం = యమకసహితమును, అథ = తరువాత; బిందుమూర్ఛనాయుక్తం = బిందుమూర్ఛనాసహితముగను; లలితేన వర్ణనియమేన = లలితమైన వర్ణనియమముతో; లలితా, గాంధార్వైః గాతవ్యా = లలిత గంధర్వులచే గానముచేయదగినది

తాత్పర్యము : మొదటిదానివలె చరణద్వయమును యమకసహితమును తరువాత బిందుమూర్ఛనా సహితముగను లలితమైన వర్ణనియమముతో లలిత గంధర్వులచే గానము చేయదగినది.

లలితపదం విరుతాం కథం (?) తథాచ యతిసంస్థితం గమకమ్ ।
చరణయుగత్రయమేవం నామ తతో భవతి వర్ణనీయస్య ॥ 472

ప్రతిపదార్థము : లలితపదం = లలితపదము; విరుతాం కథం = విరుతములకు ఎట్లు; తథాచ = అట్లే; గమకం యతిసంస్థితం = యతియందున్న గమకమును; చరణయుగత్రయం ఏవం నామ = చరణద్వయముత్రయము కూడనిట్లే; తతః= తరువాత, వర్ణనీయస్య భవతి = వర్ణ్యమునకగుచున్నది

తాత్పర్యము : లలితపదము విరుతములకు ఎట్లు అట్లే యతియందున్న గమకమును చరణద్వయము, త్రయము కూడానిట్లే. తరువాత వర్ణ్యమునకగుచున్నది.

లఘువర్ణపదనిబద్ధం తత్ పునరపి గీయతే గీత్వా ।
గాతృజననామధేయం వీరవిలాసాదివర్ణనాపూర్వమ్ ॥ 473

యస్యాం వర్ణై లా సా కథితా క్రమతో మతంగేన ।
ప్రతాపోత్సాహధైర్యాదివర్ణనా గుణగౌరవమ్ ॥ 474

క్రమశో దృశ్యతే యస్యాం వర్ణైలా సా ప్రకీర్తితా ।
మట్టద్వితీయకం కాలప్రతితాలేన గీయతే ॥ 475

**ప్రతిపదార్థము** : లఘువర్ణపదనిబద్ధం గీత్వా = లఘువర్ణపదనిబద్ధమును పాడబడి; తత్ = అది; పునరపి = మరల; గాత్పజననామధేయం = గాయకులపేరుగా; వీరవిలాసాది వర్ణనాపూర్వం = వీరము, విలాసము, మొదలగు వానివర్ణనాపూర్వకముగా; యస్యాం గాయతే= దేనియందు గానము చేయబడునో; సా = అది; క్రమతః = వరుసగా; మతంగేన = మతంగమునిచే; వర్ణఏలా కథితా = వర్ణైలచెప్పబడినది; యస్యాం = దేనియందు; ప్రతాప ఉత్సాహ ధైర్యఆది వర్ణనాగుణగౌరవం, క్రమశః = క్రమముగా; దృశ్యతే = కనబడునో; సా వర్ణైలా ప్రకీర్తితా = అది వర్ణఏలగా చెప్పబడుచున్నది; మట్టద్వితీయకం కాలప్రతితాలేన = మట్టద్వితీయ, కాల, ప్రతితాలముచే; గీయతే = గానము చేయబడుచున్నది

**తాత్పర్యము** : లఘువర్ణపదనిబద్ధము పాడబడి అది మరల గాయకుపేరుగా వీరము, విలాసముమొదలగు వానివర్ణనాపూర్వకముగా దేనియందు గానముచేయబడునో అది వరుసగా మతంగమునిచే వర్ణైల చెప్పబడినది. దేనియందు ప్రతాప ఉత్సాహధైర్యఆది వర్ణనాగుణగౌరవం క్రమముగా కనబడునో అది వర్ణఏలా చెప్పబడుచున్నది. మట్టద్వితీయ, కాల, ప్రతితాలముచే గానము చేయబడుచున్నది.

**ప్రకారేణైకేన కథితా యేనాధునా స్ఫుటమ్ ।**
**కథ్యతే తు సమరసేన వర్ణైలాసప్తకం పునః ॥ 476 ॥**
**రమణీ చంద్రికా లక్ష్మీః పద్మినీ రంజినీ తథా ।**
**మాలతీ మోహినీ చేతివర్ణైలా సప్తకం తథా ॥ 477 ॥**

**ప్రతిపదార్థము** : యేన ఏకేన ప్రకారేణ = యే ఒకవిధముగా; కథితా = చెప్పబడినదో; పునః = మరల; స్ఫుటం = స్పష్టముగా; అధునా = ఇప్పుడు; సమరసం = సామరస్యముగా, (సమరసముతో) వర్ణఏలాసప్తకం కథ్యతే = వర్ణఏలా సప్తకముచెప్పబడుచున్నది; రమణీ, చంద్రిక, లక్ష్మి,పద్మినీ, రంజనీ, మాలతీ, మోహిని, ఇతి= అని, వర్ణైలా సప్తకం = ఏలావర్ణసప్తకము

**తాత్పర్యము** : యే ఒకవిధముగా చెప్పబడినదో మరల స్పష్టముగా ఇప్పుడు సామరస్యముగా (సమరసముతో) వర్ణఏలాసప్తకముచెప్పబడుచున్నది. రమణి, చంద్రిక, లక్ష్మి, పద్మిని, రంజని, మాలతి, మోహిని అని ఏలావర్ణసప్తకము

**సమా యత్ర యతిః పాదే ప్రథమే ద్వినిద్వితీయకే (?) ।**
**పాదే పాదేచ నాద్యాఢ్యా షట్పదీ రమణీతి సా ॥** 478

**ప్రతిపదార్థము** : ప్రథమేపాదే, ద్వితీయకే చ = మొదటిపాదమందు రెండవపాదమందు; యత్రయతిః సమా = ఎక్కడ యతి సమానమో; పాదే పాదే చ = ప్రతిపాదమందును; న ఆదిఆఢ్యా = ఆది సంపన్నముకాదో; (దృఢము); షట్పదీ = షట్పది; రమణీ సా = అది రమణీ వర్ణైలా

**తాత్పర్యము** : మొదటిపాదమందు, రెండవపాదమందును, ఎక్కడ యతి సమానమో ప్రతిపాదమందును అది సంపన్నము కాదో (దృఢము) షట్పది అది రమణీవర్ణైలా.

**స్రోతోగతాసమా చైవ యత్ర పాదద్వయే భవేత్ ।**
**బిందుభిర్గమకైర్యుక్తా చంద్రిణీతి ప్రకీర్తితా ॥** 479

**ప్రతిపదార్థము** : యత్రపాదద్వయే = దేని పాదద్వంద్వమందు; స్రోతోగతా సమా చ భవేత్ = స్రోతోగతము, సమమును అగునో; బిందుభిః = బిందువులతోను; గమకైః యుక్తాః = గమకములతోను కూడియుండునో; సా చంద్రిణీతి ప్రకీర్తితా = అది చంద్రిణి (చంద్రిక)యని చెప్పబడును

**తాత్పర్యము** : దేనిపాదద్వంద్వమందు స్రోతోగతము, సమమును అగునో బిందువులతోను, గమకములతోను కూడియుండునో అది చంద్రిణి (చంద్రిక)యని చెప్పబడును.

**గోపుచ్ఛా చ సమాస్రోతా యత్ర పాదత్రయేపిచ ।**
**మూర్ఛనా నాదసహితా సైలా లక్ష్మీరితిస్మృతా ॥** 480
**ఆద్యేపాదే ద్వితీయేచ తృతీయేచ చతుర్థకే ।**
**వర్ణధ్వనిసమాయుక్తా పద్మిన్యేలా నిగద్యతే ॥** 481
**ప్రథమే చ సమా స్రోతా ద్వితీయేచ తృతీయకే ।**
**గోపుచ్ఛా గమకాఢ్యా చ రంజికా నామ సా భవేత్ ॥** 482
**లఘుభిర్గురుభిర్వర్ణైః యా తు ప్రాసైర్వినిర్మితా ।**
**యదిష్టకా (?) చతుష్పాదా సా చైలా మాలతీ మతా ॥** 483

**ప్రతిపదార్థము** : యత్ర పాదత్రయే అపి = ఎక్కడ పాదత్రయమందుకూడ; గోపుచ్ఛా, సమా, స్రోతా, మూర్ఛనానాదసహితా = గోపుచ్ఛ, సమ, స్రోత మూర్ఛనా నాదసహితముగానగునో; సా ఏలా లక్ష్మీః స్మృతా = ఆ ఏలలక్ష్మియనబడును; ఆద్యే ద్వితీయే తృతీయే చతుర్థకే చ పాదే = ఒకటవ, రెండవ, మూడవ, నాల్గవ పాదములందును; వర్ణధ్వని సమాయుక్తా = వర్ణధ్వని యుతమైనది; పద్మినీ ఏలా నిగద్యతే = పద్మినీ ఏలగా చెప్పబడుచున్నది; ప్రథమే = ప్రథమపాదమున; సమా, స్రోతా, ద్వితీయే తృతీయకే = సమ, స్రోత రెండు మూడు పాదములందు; గోపుచ్ఛా, గమకాఢ్యా చ = గోపుచ్ఛము గమక సమృద్ధియు నగునో; సా = అది; రంజనీ భవేత్ = రంజని యగును; లఘుభిః = లఘువులచేతను; గురుభిః = గురువులచేతను; ప్రాసైః వర్ణైః = ప్రాసవర్ణములచేతను; వినిర్మితా = సృష్టించబడినది; చతుష్పాదా = నాల్గుపాదములు కల్గినదిఅయిన; సాఏలా మాలతీ మతా = ఆఏల మాలతిగానిష్టము

**తాత్పర్యము** : ఎక్కడ పాదత్రయమందుకూడ, గోపుచ్ఛా, సమా, స్రోతా, మూర్ఛనానాదసహితముగా నగునో, ఆ ఏలలక్ష్మి యనబడును. ఒకటి, రెండు, మూడు, నాల్గుపాదములందును వర్ణధ్వని యుతమైనది పద్మినీఏలగా చెప్పబడుచున్నది. ప్రథమపాదమున, సమా, స్రోతా, రెండుమూడు పాదములందు గోపుచ్ఛా, గమక సమృద్ధియునగునో అది రంజనీయగును. లఘువులచేతను, గురువులచేతను, ప్రాసవర్ణములచేతను సృష్టించబడినది నాల్గు పాదములుకల్గినది అయిన ఆ ఏల మాలతిగానిష్టము.

**పంచపాదసమాయుక్తా మూర్ఛనా గమకాన్వితా ।**
**మోహినీ నామసా జ్ఞేయా వర్ణైలా సప్తమీ శుభా ॥** 484

**లోకదుష్టంశాస్త్ర శాస్త్ర + + + పంచ వర్జయేత్ ।**
**+ గోదుష్టం తథా గ్రామ్యం గతక్రమమపార్థకమ్ ॥** 485

**పదం కావ్యమసందిగ్ధం కలా చాభ్యంచి భక్తకమ్ ।**
**ప్రకారేణ తతశ్చోక్తా వర్ణే తాలచతుష్టయమ్ ॥** 486

**ప్రతిపదార్థము :** పంచపాదసమాయుక్తా = (5) ఐదుపాదములతో కూడినదియు; మూర్ఛనా గమకాన్వితా = మూర్ఛనా గమకములతో కూడినదియు; శుభా = మంగళకరమైన; సా వర్ణఏలా సప్తమీ మోహినీ జ్ఞేయా = ఆఏడవ వర్ణఏల మోహినిగా గమనించ వలయును; లోకదుష్టం = లోకమునకు దుష్టమైన; శాస్త్రశాస్త్ర + + +, పంచ = ఐదు; వర్జయేత్ = విడువవలెను; + గోదుష్టం = గోదుష్టము; గ్రామ్యం = గ్రామ్యము; గతక్రమం = గతక్రమము; అపార్థకం = అపార్థకము; పదంకాప్యమసందిగ్ధం = ఒకానొక అసందిగ్ధవాక్యము; కలాచ అభ్యంచి భక్తకం = సమ్యగ్విభక్తముకానికలయు; ప్రకారేణ = పద్ధతిగా; తతః = తరువాత; వర్ణే = వర్ణమందు; తాలచతుష్టయం ఉక్తా = తాలచతుష్టయయుక్తమైనది

**తాత్పర్యము :** (5) ఐదుపాదములతో కూడినదియు, మూర్ఛనా గమకములతో కూడినదియు, మంగళకరమైన ఆఏడవ వర్ణఏల మోహినిగా గమనించవలయును. లోకమునకు దుష్టమైన ఐదు విడువ వలెను. గోదుష్టము గ్రామ్యము గతక్రమము అపార్థకము. ఒకానొక అసందిగ్ధ వాక్యము సమ్యగ్విభక్తముకాని- కలయు పద్ధతిగా తరువాత వర్ణమందు తాలచతుష్టయముక్తమైనది.

**లాటకర్ణాటగౌడాంధ్రద్రవిడానాం స్వభాషయా ।**
**పృథక్ పృథక్ భవంత్యేలా మార్గయుక్తా మనోహరాః ॥** 487

**ప్రతిపదార్థము :** లాట, కర్ణాట, గౌడ,ఆంధ్ర, ద్రవిడుల; స్వభాషయా = తమ భాషచే; పృథక్ పృథక్ = వేరువేరుగా; మనోహరాః ఏలాః = అందములైన ఏలలు; మార్గయుక్తాః భవంతి = మార్గయుతములగుచున్నది

**తాత్పర్యము :** లాట, కర్ణాట, గౌడ, ఆంధ్ర, ద్రవిడుల తమభాషచే వేరువేరుగా అందములైన ఏలలు మార్గయుతములగుచున్నది.

**అతః ప్రాససమాయుక్తా మధ్యాదిప్రాసవర్జితా ।**
**రసైర్భావైశ్చ సంయుక్తా లాటైలా పరికీర్తితా ॥** 488

**ప్రతిపదార్థము :** అతః = అందువలన; ప్రాససమాయుక్తా =ప్రాసయుతమును;

మధ్యాది ప్రాసవర్జితా = మధ్యాది ప్రాసరహితమును; రసైః భావైశ్చ సంయుక్తా= రసభావసహితమును అయినది; లాటైలా పరికీర్తితా = లాట ఏలగాచెప్పబడుచున్నది

**తాత్పర్యము** : అందువలన ప్రాసయుతమును మధ్యాదిప్రాసరహితమును రసభావసహితమును అయినది లాట ఏలగా చెప్పబడుచున్నది.

**ప్రాసైర్మనోహరైర్దివ్యైః ఆదిమధ్యాంతగోచరైః ।**
**ఏలా కర్ణాటకా ప్రోక్తా లలితధ్వనిసంయుతా ॥** 489

**ప్రతిపదార్థము** : ఆదిమధ్యాంత గోచరైః = ఆదిమధ్యఅంతములందు కనబడు, మనోహరైః = రమ్యములైన; దివ్యైః = అపురూపములైన; ప్రాసైః = ప్రాసలనుకల్గియున్నదియు; లలితధ్వనిసంయుతా = మృదువైన శబ్దముతో కూడియున్నది; కర్ణాటకా ఏలా ప్రోక్తా = కర్ణాటైలగా చెప్పబడినది

**తాత్పర్యము** : ఆది, మధ్య, అంతములందు కనబడు రమ్యములైన అపురూపములైన ప్రాసలను కల్గియున్నదియు, మృదువైనశబ్దముతో కూడియున్నది కర్ణాటైలగా చెప్పబడినది.

**సర్వత్ర ప్రాససహితా గమకైశ్చ వివర్జితా ।**
**నాదబిందురసోపేతా ఏలా సా గౌడదేశజా ॥** 490

**ప్రతిపదార్థము** : సర్వత్ర ప్రాససహితా = అంతట ప్రాసకలదియు; గమకైః వివర్జితా = గమకవిసర్జితము; నాదబిందు రసోపేతా = నాదబిందు రససహితమునుఅయినది; గౌడదేశజా ఏలా = గౌడదేశజనిత ఏల

**తాత్పర్యము** : అంతట ప్రాసకలదియు గమకవిసర్జితము నాదబిందు రససహితమును అయినది గౌడదేశజనిత ఏల.

**అనేక గమకాకీర్ణాం అనేక ధ్వనిమిశ్రితామ్ ।**
**అనేక రాగసంకీర్ణాం ఏలామాంధ్రీం విదుర్బుధాః ॥** 491

**ప్రతిపదార్థము** : అనేక గమకాకీర్ణాం = అధికములైన గమకసహితమైనదియు, అనేక ధ్వనిమిశ్రితాం = అనేక శబ్దములతో కూడినదియు; అనేక రాగసంకీర్ణా=

అనేక రాగములతో మిశ్రితమైనట్టి, తాం = దానిని; ఆంధ్రీం ఏలాం విదుః = ఆంధ్రీఏలనుగా తెలియుదురు

**తాత్పర్యము** : అధికములైన గమకసహితమైనదియు, అనేక శబ్దములతో కూడినదియు అనేక రాగములతో మిశ్రితమైనట్టి దానిని ఆంధ్రీఏలనుగా తెలియుదురు.

**భావాభినయతాలాఢ్యా విచిత్రధ్వనిరంజితా ।**
**ప్రాసహీనా రసస్థా చ ఏలా ద్రవిడదేశజా ॥** 492

**ప్రతిపదార్థము** : భావాభినయతాలాఢ్యా = భావము, అభినయము, తాలములచే సంపన్నమును; విచిత్రధ్వనిరంజితా = విచిత్రములైన ధ్వనులచే రంజితమును; ప్రాసహీనా = ప్రాసలేనిదియు; రసస్థాచ = రసముండునదియు అయిన; ఏలా= ఏల; ద్రవిడదేశజా = ద్రవిడదేశోద్భవము

**తాత్పర్యము** : భావము, అభినయము, తాలములచే సంపన్నమును విచిత్రములైన ధ్వనులచే రంజితమును, ప్రాసలేనిదియును, రసముండునదియుఅయిన ఏల ద్రవిడదేశోద్భవము.

**ఇతి దేశాఖ్యైలాపంచకమ్**

* * *

**గణైలా తు చతుర్ధోక్తా పంచమీ సంకరాత్మికా ।**
**మాత్రైలా చ చతుర్భేదైః కథితా గీతకోవిదైః ॥** 493

**చతుర్దశవిభేదేన వర్ణైలా పరిగీయతే ।**
**పంచధా దేశభేదేన దేశైలాః సముదీరితాః ॥** 494

**ఏకత్ర మిలితాస్త్వేతా అష్టావింశతిసంఖ్యయా ।**
**విజ్ఞాతా గీతశాస్త్రజ్ఞైః స్వస్వలక్షణసంయుతాః ॥** 495

**ప్రతిపదార్థము** : గణైలా, చతుర్ధా ఉక్తా = గణైల నాల్గువిధములుగా చెప్పబడినది; పంచమీ సంకరాత్మికా = ఐదవది సంకరము; మాత్రైలా, చతుర్భేదైః = మాత్రైలా నాల్గువిధములుగాచెప్పబడినది; వర్ణైలా చతుర్దశ విభేదేన పరిగీయతే = వర్ణైల

పద్నాల్గు విధములుగా చెప్పబడినవి; దేశైలాః దేశభేదేన పంచధా సముదీరితాః = దేశభేదముచే దేశైలలు ఐదువిధములు; ఏకత్ర మిలితాః ఏతాః = ఒకచోట కలసిన ఈఏలలు; అష్టావింశతి సంఖ్యయా స్వస్వలక్షణ సంయుతాః విజ్ఞాతాః = తమతమలక్షణములతో కలసినవై (28) ఇరువది ఎనిమిదిగా తెలియబడుచున్నవి

**తాత్పర్యము** : గద్యైలా, నాల్గువిధములుగా చెప్పబడినది. ఐదవది సంకరము. మాత్రైలా నాల్గువిధములుగా చెప్పబడినది. వర్ణైల పద్నాల్గు. దేశైలలు ఐదువిధములు. ఒకచోట కలసిన ఈఏలలు తమ తమ లక్షణములతో కలసినవై (28) ఇరువది ఎనిమిదిగా తెలియబడుచున్నవి.

**ఆవృత్త్యా యత్ర పాదార్ధం గీత్వా తదనుగీయతే ।**
**అర్ధం ద్వితీయపాదస్య ప్రాసస్తు స్యాత్ ద్వయోరపి ॥ 496**

**ఏవమేవ ద్వితీయోపి అస్య పాదః ప్రగీయతే ।**
**ఏవం తృతీయపాదశ్చ పాదో యశ్చ చతుర్థకః ॥ 497**

**ప్రత్యేకం సర్వపాదానాం అంతేఽసౌ యత్రగీయతే ।**
**స తురెఝాంబడకో నామ గీతజ్ఞైరభిధీయతే ॥ 498**

**ప్రతిపదార్థము** : యత్ర = ఎక్కడ; ఆవృత్త్యా = ఆవృత్తిచేత; పాదార్ధం గీత్వా = పాదార్ధమును పాడి; తదను = తరువాత; ద్వితీయపాదస్య అర్ధం గీయతే = రెండవ పాదార్ధము పాడబడునో; ద్వయోరపి = రెండింటికి కూడ; ప్రాసః స్యాత్ = ప్రాస ఉండునో; ఏవమేవ = ఇట్లే; ద్వితీయోపి = రెండవదికూడ; అస్య పాదః ప్రగీయతే = దీని పాదము గానము చేయబడునో; ఏవం = ఇట్లే; తృతీయపాదశ్చ = మూడవపాదమును; యశ్చ చతుర్థకః = నాల్గవపాదమును; ప్రత్యేకం = ప్రత్యేకముగా; సర్వపాదానాం అంతే = అన్నిపాదములచివర; యత్ర= ఎక్కడ; గీయతే = గానముచేయబడునో; సః = అది; ఝోంబడః నామ అభిధీయతే = ఝోంబడముగా ఉక్తమైనది

**తాత్పర్యము** : ఎక్కడ ఆవృత్తిచేత పాదార్ధమును పాడి తరువాత రెండవ పాదార్ధము పాడబడునో, రెండింటికి కూడ ప్రాస ఉండునో, ఇట్లే రెండవది కూడ దీనిపాదముగానముచేయబడునో, ఇట్లే మూడవపాదమును

నాల్గవపాదమును ప్రత్యేకముగా అన్నిపాదములచివం ఎక్కడ గానముచేయబడునో అది ఝోంబడముగా ఉక్తమైనది.

**కంకాలో నామ తారశ్చ నైవ ఝోంబడకో భవేత్ ।**
**అన్యే తు దేశీసంబంధాస్తాలాః సర్వే భవంతిహి ॥ 499**

**ప్రతిపదార్థము** : కంకాలో నామ తాలః = కంకాలమనుతాళము; తారశ్చ = తారమును; నైవ ఝోంబడకః భవేత్ = ఝోంబడకము (నందు) ఉండదు; అన్యే దేశీసంబంధాః తాలాః సర్వేభవంతి హి = మిగిలిన దేశీసంబంధములైన తాళము లన్నియు అగుచున్నవిగదా

**తాత్పర్యము** : కంకాలమనుతాళము, తారమును ఝోంబడకము (నందు) ఉండదు. మిగిలిన దేశీసంబంధములైన తాలములన్నియు అగుచున్నవిగదా.

**తానా+లంకృతా భేదా ఝోంబడేస్య భవంతి హి ।**
**మాత్రా సమా ధ్వనిశ్చాత్ర విరామోనంతరం క్వచిత్ ॥ 500**

**అస్యైవ యది తాలోసౌ తదా సా ధ్వనికుట్టనీ ।**
**స్వేచ్ఛయా గృహ్యతే యత్ర నాదోఽ క్షరసమన్వితః ॥ 501**

**ప్రతిపదార్థము** : తానాలంకృతాః భేదాః = తానములచే నలంకృతమైన భేదములు; ఝోంబడే = ఝోంబడమందు; అస్య = దీనికి; భవంతి = అగుచున్నవి; మాత్రా సమాః = మాత్రలు సమానములు; అత్ర= ఇందు; క్వచిత్= ఒక్కొక్కచోట; విరామః = విరామము; అనంతరం ధ్వనిశ్చ = తరువాత ధ్వనియు; అస్యైవ = దీనికే; అసౌ తాలః యది= ఈతాలమైన యెడల; తదా సా = అప్పుడది; ధ్వనికుట్టనీ నాదోఽ క్షరసమన్వితః = ధ్వనికుట్టని అక్షరసహితనాదము, స్వేచ్ఛయా గృహ్యతే = యథేచ్ఛగా గ్రహింపబడుచున్నది

**తాత్పర్యము** : తానములచే నలంకృతమైన భేదములు ఝోంబడమందు దీనికి అగుచున్నవి. మాత్రలు సమానములు ఇందు ఒక్కొక్కచోట విరామము తరువాత ధ్వనియు. దీనికే ఈతాలమైన యెడల అప్పుడది ధ్వనికుట్టని అక్షరసహితనాదము యథేచ్ఛగా గ్రహింపబడుచున్నది.

**తాలశూన్యస్తతస్తాలో డేంగికా సా ప్రకీర్తితా ।**
**నిరంతరమనుప్రాసో యతిర్యత్ర ద్రుతే ద్రుతే ॥ 502 ॥**
**క్రియతే గీతతత్వజ్ఞైః సా స్మృతా త్వేకతాలికా ॥**

**ప్రతిపదార్థము** : తాలశూన్యః = తాలరహితమును; తతః =తరువాత; తాలః = తాలముండునో; సా = అది; డేంగికా ప్రకీర్తితా = డేంగికయని చెప్పబడెను; నిరంతరం= సదా; అనుప్రాసః = అనుప్రాసయు; ద్రుతేద్రుతే = ద్రుతద్రుతమందును; యత్ర = ఎక్కడ; యతిః = యతి; క్రియతే = చేయబడుచున్నదో; సా = అది; ఏకతాలికా స్మృతా = ఏకతాలికయని భావింపబడినది

**తాత్పర్యము** : తాలరహితమును, తరువాత తాలముండునో అది డేంగికయని చెప్పబడును.సదా అనుప్రాసయు, ద్రుతద్రుతమందును, ఎక్కడ యతి చేయబడుచున్నదో అది ఏకతాలికయని భావింపబడినది.

**ఆదాయ గీయతే యస్మాత్ ఏకైకం మాతృకాక్షరమ్ ॥ 503**
**ఇష్టేనార్థేన సంయోజ్య మాతృకా సా ప్రకీర్తితా ।**

**ప్రతిపదార్థము** : యస్మాత్ = దేనినుండి; ఏకైకం మాతృకాక్షరం ఆదాయ = ఒక్కొక్కమాతృకాక్షరమును గ్రహించి; ఇష్టార్థేన సంయోజ్య = ఇష్టార్థముతో కలిపి; గీయతే = పాడబడునో; సామాతృకా ప్రకీర్తితా = అది మాతృకయని చెప్పబడుచున్నది

**తాత్పర్యము** : దేనినుండి ఒక్కొక్కమాతృకాక్షరమును గ్రహించి ఇష్టార్థముతో కలిపి పాడబడునో అది మాతృకయని చెప్పబడుచున్నది.

**నిరంతరం స్వరైరేవ యత్ర ఖండద్వయం భవేత్ ॥ 505**

**తదత్ర కారణం ప్రోక్తం యత్యా తు కారణాఖ్యయా ।**
**నిబంధో హస్తపాటైర్యః సంయుక్తైస్తేనకైః పునః ॥ 506**

**స్వరైః పదైశ్చ పాటైశ్చ తేంతకైశ్చ సమన్వితః ।**
**గీయతే తాలయుక్తో యః స వర్ణాసరకః స్మృతః ॥ 507**

**ప్రతిపదార్థము** : కారణాఖ్యయా యత్యా = కారణాఖ్యయతిచే; నిరంతరం = సర్వదా; స్వరైః ఏవ = స్వరములచేతనే; యత్ర = ఎక్కడ; ఖండద్వయం భవేత్ = ఖండద్వమగునో; అత్ర = ఇక్కడ; తత్ =అది; కారణం ప్రోక్తం = కారణముగా ఉక్తమైనది; యః = ఏది; హస్తపాటైః నిబంధః = హస్తపాట (ము)లతో నిబంధితమో; పునః = మరల; తేనకైఃసంయుక్తైః = తేనకయుతములైన; స్వరైః = స్వరములతోను;పదైః = పదములతోను; పాటైః = పాట(ము)లతోను; తేంతకైః చ సమన్వితః = తేంతకములతోను కూడియుండునో; తాలయుక్తః గీయతే = తాలసహితముగా గానముచేయబడునో; సః వర్ణాసరకః స్మృతః = అది వర్ణాసరకమని తలవబడెను

**తాత్పర్యము** : కారణాఖ్యయతిచే సర్వదా స్వరములచేతనే ఎక్కడ ఖండద్వమగునో ఇక్కడ అది కారణముగా ఉక్తమైనది. ఏది హస్తపాట(ము)లతో నిబంధితమో మరల తేనకయుతములైన, స్వరములతోను, పదములతోను, పాట(ము)లతోను, తేంతకములతోను కూడియుండునో, తాలసహితముగా గానము చేయబడునో అది వర్ణాసరకమని తలవబడెను.

**దేశీకారపదై రమ్యైః సానుప్రాసైః ప్రగీయతే ।**
**నామానువర్ణనీయస్య సా ముక్తావలిసంజ్ఞితా ॥** 508

**ప్రతిపదార్థము** : వర్ణనీయస్య = వర్ణింపదగినదానికి; దేశీకారపదైః = దేశీకారపదములచేతను; రమ్యైః = సుందరములైన; సానుప్రాసైః = అనుప్రాస సహితములుగా; యా ప్రగీయతే = ఏది గానముచేయబడునో; సా = అది

**తాత్పర్యము** : వర్ణింపదగినదానికి దేశీకారపదములచేతను సుందరములైన అనుప్రాససహితములుగా ఏదిగానముచేయబడునో అది

**ప్రతాపవర్ధనో నామ ప్రబంధః పరికీర్తితః ।**
**అష్టాభిరధికా రమ్యాశ్చత్వారింశదితి స్ఫుటమ్ ॥** 510

**ప్రతిపదార్థము** : ప్రతాపవర్ధనో నామప్రబంధః పరికీర్తితః = ప్రతాపవర్ధనమను ప్రబంధకముగా నిగదితము; అష్టాభిః అధికాః చత్వారింశత్ రమ్యాః = 48 అందములైన ప్రబంధములు; ఇతి = అని; స్ఫుటం = స్పష్టములైనవి.

**తాత్పర్యము :** ప్రతాపవర్ధనమును ప్రబంధకముగానిగదితము. 48 అందములైన ప్రబంధములు అని స్పష్టములైనవి.

**విబుధానాం వినోదాయ ప్రబంధాః కథితా మయా ।**
**ఇదానీం కథయిష్యామి వాద్యస్య నిర్ణయో యథా ॥** 511

**ప్రతిపదార్థము :** విబుధానాం వినోదాయ = పండితుల ఆనందముకొఱకు; మయా = నాచేత; ప్రబంధాః కథితాః = ప్రబంధములు చెప్పబడినవి; ఇదానీం= ఇప్పుడు; వాద్యస్య నిర్ణయః = వాద్యమునకు సంబంధించి నిర్ణయము; కథయిష్యామి = చెప్పుదును; యథా = ఎట్లనగా-

**తాత్పర్యము :** పండితుల ఆనందముకొఱకు నాచేతన ప్రబంధములు చెవ్పబడినవి. ఇవ్పుడు వాద్యమునకు సంబంధించి నిర్ణయుము చెప్పుదునుఎట్లనగా -

ఇతి మతంగమునివిరచితబృహద్దేశ్యాం
**ప్రబంధాధ్యాయః షష్ఠః**
శుభం భూయాత్

**ప్రథమశ్చ ద్వితీయశ్చ తృతీయశ్చ చతుర్థకః ।**
**మంద్రః కుష్టో హ్యతిస్వరా ఏతాన్ కుర్వంతి సామగాః ॥**

**యః సామగానాం ప్రథమః స వేణోః మధ్యమస్వరః ।**
**యో ద్వితీయః సగాంధారః తృతీయస్త్వృషభస్స్మృతః ॥**

**చతుర్థః షడ్జ ఇత్యాహుః పంచమో ధైవతో భవేత్ ।**
**షష్ఠో నిషాదో విజ్ఞేయః సప్తమః పంచమః స్మృతః ॥**

**అంగుష్ఠస్యోత్తమే రుష్ట (?) అంగుష్ఠే ప్రథమస్వరః ।**
**ప్రదేశిన్యా తు గాంధార ఋషభస్తదనంతరమ్ ॥**

**అనామికాయా షడ్జస్తు కనిష్ఠాయాస్తు ధైవతః ।**
**తస్మాదధస్తాదన్యోస్తు (?) నిషాదం తత్ర నిర్దిశేత్ ॥**
**ఏతావానంశో మాతృకాంత ఉపలబ్ధః ।**

**తాత్పర్యము** : ప్రథమము, ద్వితీయము, తృతీయము, చతుర్థము, మంద్రము కుష్టము, అతిస్వరము, ఈస్వరములను సామగములుగాచేయుచున్నవి. సామగములలో ఏది ప్రథమమో అది వేణువుయొక్క మధ్యమస్వరము. ఏది రెండవదో అది గాంధారము. మూడవది రిషభము. నాల్గవది షడ్జము. ఐదవది ధైవతము. ఆరవది నిషాదము; ఏడవది పంచమము. అంగుష్ఠమందు మొదటిస్వరము. చూపుడువ్రేలు (ప్రదేశిని)చే గాంధారము,. తరువాదితి రిషభము. అనామికచే షడ్జము. కనిష్ఠికచే ధైవతము. దానికంటె క్రిందుదిగాని మరియొకటిగాని అక్కడ నిషాదమును నిర్దేశింపవలెను. ఇంతమాత్రమైన విషయమే మాతృకాంతము లభ్యమైనది.



| | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | స | | | రి | | గ | గ | | మ | మ | | ప | | ప | | ధ | ధ | | ని |
| | | స | | | రి | | గ | గ | | మ | మ | | ప | | ప | | ధ | ధ | | ని | |
| | స | | | రి | | గ | గ | | మ | మ | | ప | | ప | | ధ | ధ | | ని | | |
| స | | | రి | | గ | గ | | మ | మ | | ప | | ప | | ధ | ధ | | ని | | | |

పట్టిక అపెండిక్స్ B

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| రి | | | | | మ | |
| | | | | | | ప |
| | | | | | | |
| | | | | | | |
| | | | | | | ధ |
| | | | | | | |
| స | | | | | ని | |

పట్టిక అపెండిక్స్ C

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | ధ | | ని | | |
| | | | | | | |
| | | | | | | స |
| ప | | | | | | |
| | | | | | | రి |
| | మ | | | | గ | |
| | | | | | | |

## పట్టిక అపెండిక్స్ F

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| గ . | | | | మ | | |
| గ . | | | | | | మ |
| ని | | | | | | ని |
| ధ | | | | | | ధ |

## పట్టిక అపెండిక్స్ G

| స | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | స | | | | | | | | | |
| | | | | | | | స | | | |
| | | | | | | | ని | ప | | |
| | | | | | | | | | | |

న్మ

తణి

హూనిని

## పట్టిక అపెండిక్స్ H

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | | | | | నిస |
| ప | | | | | | |
| | | | | | | రిప |
| | | | | | | |
| రి | మ | స | | | గరి | |

## పట్టిక అపెండిక్స్ I

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | | | ని | |
| | | | | | |
| ఋ | | | | | ధ |
| | | | | | |
| | | | | | |
| | మ | | | గరి | |

## పట్టిక అపెండిక్స్ J

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ని | ధ | ప | మ | గ | రి | స |
| ధ | ప | మ | గ | రి | స | ని |
| ప | మ | గ | రి | స | ని | ధ |
| మ | గ | రి | స | ని | ధ | ప |
| గ | రి | స | ని | ధ | ప | మ |
| రి | స | ని | ధ | ప | మ | గ |
| స | ని | ధ | ప | మ | గ | రి |

ని

## పట్టిక అపెండిక్స్ K

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | |
| గ | రి | స | ని | ధ | ప | మ | | |
| రి | స | ని | ధ | ప | మ | గ | | |
| స | ని | ధ | ప | మ | గ | రి | | |
| ని | ధ | ప | మ | గ | రి | స | | |
| ధ | ప | మ | గ | రి | స | ని | | |
| ప | మ | గ | రి | స | ని | ధ | | |
| మ | గ | రి | స | ని | ధ | ప | | |
| | | | | | | | | |